ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్

కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,

రాజమహేంద్రవరం - 533101.

# భగవతామృత కలశం

- శ్రీమతి పవని నిర్మల ప్రభావతి

# మన కోసం ఈ అమృతకలశం

ఆధ్యాత్మిక పరిమళాలు వెదజల్లే ఉత్తమ గ్రంథాలకు పెద్దల చేత పరిచయ వాక్యాలు రాయించడం పరిపాటి అయితే నా మీద వుండే అపారమైన వాత్సల్యంతో పుణ్యదంపతులు **పవని శ్రీధరరావు గారు, నిర్మల ప్రభావతి గారు** నన్ను - ఒక పామరుణ్ణి - ఈ నాలుగుముక్కలూ రాయమని కోరారు. ఇది నా అదృష్టంగా భావిస్తున్నాను.

నిఖిల ప్రపంచం చీకటిలో కొట్టు మిట్టాడుతున్నపుడు అనేక రంగాలలో మానవాళికి దారిచూపిన దేశం మన భారతావని ఋషులు క్రాంతదర్శులూ, సార్వజనీన సార్వకాలిక సత్యాలను లోకానికి అందచేసిన ద్రష్టలూ. భారత భాగవత రామాయణాలు, భగవద్గీత ఉపనిషత్తులు-వీటిసారం గ్రహించాలంటే సామాన్యులకు ఒక జీవితకాలం చాలదు ఎందరో మహానుభావులు ఈమహా గ్రంథాలకు వ్యాఖ్యానాలు రాసి ఆస్తిక జనావళిని తరింపచేసారు, వాళ్ళు తరించారు.

భాగవతకథా నాయకుడు అనంత సౌందర్య మూర్తి శ్రీకృష్ణుడు లోకరక్షకుడు, లీలామానుష విగ్రహుడు, పురుషోత్తముడు, కాళీయమర్దనం, గోపికావస్త్రాపహరణం మొదలైన ఘట్టాలకు సామాన్యార్థాలు వొకటైతే ఆధ్యాత్మికపరంగా చెప్పుకునే తాత్పర్యం వేరు. ఆ కథల పరమార్థం వేరు. గోపికలు ఎవరోకాదు మన జీవాత్మలే ఆ విశ్వవిభుడికోసమే మన నిరంతర గవేషణ. ఆ అన్వేషణే అనేక భాగవతకథల్లో చెప్పబడింది.

మన పుణ్యం కొద్దీ పోతనామాత్యుడు భాగవతాన్ని తెనిగించి దోసిళ్లతో తాత్విక మధువును మనకు అందించాడు. పోతన గారి భాగవత కథలను దృష్టిలో పెట్టుకుని ప్రఖ్యాత రచయిత్రి శ్రీమతి పవని నిర్మల ప్రభావతిగారు భాగవతామృత కలశాన్ని ఆస్తిక మహాజనులకు అందించారు. వారులబ్ధ ప్రతిష్ఠులు. గతంలో అనేక కథలూ, నవలలూ రాసి తెలుగువారి అభిమానాన్ని చూరగొన్నారు. ఇప్పుడు ఈ విదుషీమణి మధురమైన, మార్దవమైన, మానసానందకరమైన వచనంలో భాగవత కథలను మన ముందు వుంచారు.

ప్రకాశం జిల్లా కందుకూరి మండలంలోని మొగిలిచర్లలో దత్తాత్రేయ స్వామి దేవాలయాన్ని నిర్మించడమే కాదు, ఒక ఆసుపత్రి కూడా ప్రారంభించి మానవసేవచేస్తున్న ఈ దంపతులు ఆదర్శమూర్తులు.

నిర్మల ప్రభావతి గారు సమర్పిస్తున్న ఈ అమృతకలశం భక్త జనుల పాలిటి వర ప్రసాదం. ఈ కలశంలోని అమృతాన్ని యథాశక్తి ఆస్వాదించి మనం చరితార్థులమయ్యెదము గాక! తథాస్తు.

గోపాల చక్రవర్తి
ఐ జె - 3
7 సెప్టెంబరు 1992 ఇర్రంమంజిల్ కాలనీ
హైదరాబాదు.

"భాగవతామృతకలశం"

# అంకితం

శ్రీ మాల్యాద్రి లక్ష్మీ నృసింహస్వామి

పాదారవిందములకు

భక్తిప్రపత్తులతో— అంకితం

# నా మనవి

ఈ "స్పీడు" యుగంలో పోతన భాగవతాన్ని ఆమూలాగ్రం చదవలేని జిజ్ఞాసువులైన పాఠక మహాశయుల కోసం వ్రాసినదీ "భాగవతామృత కలశం" సహృదయంతో స్వీకరించ ప్రార్థన.

రామాయణ, భారత, భాగవత గ్రంథాలు మన దేశానికి మహర్షులు ప్రసాదించిన మహత్తరవరాలు. ఒక్కొక్క గ్రంథం ఒక్కొక్క విధంగా మానవ జీవితాన్ని ధర్మపథాన కొనసాగించేందుకు నిర్దేశించారు ఆమహర్షులు రామాయణ కావ్యం మహర్షి వాల్మీకి విరచితమై ఆది కావ్యమై అలరారింది నాటికీ నేటికీ మరేనాటికీ "భారతం" వేదవ్యాస మహర్షి తన స్వంత వంశ చరిత్రలోని వ్యక్తులనూ, వారి గుణ గుణాలనూ, దేశ, కాల, పరిస్థితుల,

సాంఘిక, రాజకీయ నైతిక, ధార్మిక, భక్తి యుక్తుల మేళవింపుతో, తానే రచించి, తరతరాలకూ అందించారు చిత్త శుద్ధితో, నిష్కల్మషచిత్తంతో అందుకే అది "పంచమ వేదంగా" మారింది. తన పుట్టుకలోని రహస్యం మొదలు తన మునిమనవళ్ళ తరం వరకూ, ఏ ఒక్కటీ దాచకుండా, ప్రపంచం ముందుంచిన ఆ మహర్షినిమించిన మానవతావాదీ, హేతువాదీ ఎవరున్నారు? ఆతన వంశంలోని మంచి చెడులను విశ్లేషించి ఏది ధర్మమో, ఏది అధర్మమో ఏది ఎప్పుడు, ఏ సమయంలో రాజకీయ, సాంఘిక, దైవసమ్మతమైన నీతి అనేది మనల్ని తెల్చుకోమన్నాడు. వాటిలో మంచిని వదిలి, చెడు మాత్రమే తీసుకొని, మనకి మనం వక్రభాష్యాలు చెప్పతుంటే అది మనలోని కుసంస్కారమేగానీ, ఆ మహాత్ముల కావ్యాలలో తప్పుకానేకాదు. ఇక ఉపనిషత్తులలోని సారాన్నంతటినీ "భగవద్గీత" గా రూపొందించి, భారతకథలో ఒకానొక ఘట్టానికి సమన్వయపరచి, జీవిపుట్టుక మొదలు, జీవి పరిణామదశ మొదలు, జీవి మృత్యువు వరకూ గల ఏన్నో కర్తవ్యాలను స్పష్టంగా మానవాళికి అందజేసాడు వ్యాస మహర్షి! భగవద్గీతాసారాన్ని సంయమనంతో అర్థంచేసుకుని. ఆచరించేమనుష్యులు, మృత్యుంజయులు. జీవితంలో ఎలాటి పరిస్థితులెదురైనా మనోనిబ్బరంతో ఎదుర్కొనె ఆత్మ స్థైర్యమే మృత్యుంజయత్వం అంటే! అది ప్రసాదించే గురు బోధ భగవద్గీత! "ప్చ్! గీతలో ఏముంది? నా తలరాత!" అని పెదవి విరిచే వారికి, నచ్చచెప్పటం కంటే, నమస్కారం పెట్టి తప్పుకోవటమే విజ్ఞులు చేసేపని. వాదన వేదనకూ, తర్కం తగవుకు దారితీస్తుందేతప్ప, అలాటి వారిని ఒప్పించలేదు.

సర్వశాస్త్రాలసారాన్ని మధించిన వేద వ్యాసమహర్షికి తృప్తి కలగలేదు శాంతి దొరకలేదు. తాను రచించిన వేదశాస్త్ర సార గ్రంధాలు కేవలం "రచనకే" అనిపించాయే తప్ప, ''మాస్టర్ పీస్" అనిపించలేదు. ఆ ఆవేదనలో

ఆయన కొట్టు మిట్టాడుతుండగా, నారద మహర్షి బోధతో "భాగవతం" ఒక్కటి తనకు మనశ్శాంతి, తనతోబాటు అశేషభక్తకోటికీ, మానవాళికీ శాంతి ప్రసాదించగలదని భాగవతాన్ని రచించి తృప్తి చెందాడు ఆ మహనీయుడు.

భక్తులకూ, భగవంతునికీ మధ్యవుండే అనుబంధం, భక్తిలోని వివిధ మార్గాలు, భక్తి పరాకాష్ఠలో, భక్తుడు అనుభవించే మానసిక అనుభూతుల వర్ణనే భాగవతంలోని ప్రత్యక్ష్యరమూను. నిజంగా కృష్ణుడు పూతనను చంపాడా బండినితన్నాడా? కుబ్జను అందగత్తెగా మార్చాడా? గజేంద్రుని రక్షించాడా? ప్రహ్లాదుని కథ నిజంగా జరిగిందా? నృసింహావతారం అంటూ ఒకటుందా?" ఇలా ప్రశ్నించేవారి కోసం కాదు భాగవతం. భక్తి అన్నది ఎంతటి "మత్తు మందో" అది మనసారా గ్రోలినవారికి ఇక ప్రపంచంలోని ఏ సంపద, సుఖమూ అవసరం లేదనిపిస్తాయో, భగవంతుని శరణాగతికి ఆభక్తి తప్ప మరేమార్గమూ "షార్ట్ కట్" "మనీ ప్రభావం" ఎలాలేవో ఏ భక్తునికాభక్తుడు దైవం తన ఒక్కరి స్వంతంగా భావించి తనని తాను ఆత్మార్పణ చేసుకున్నపుడు, ఆ భగవంతుని అవతారాలూ, లీలలూ, ఆ భక్తుని మనోనేత్రాలతో వీక్షించగలిగి నపుడు పై ప్రశ్నలకూ, ఆలోచనలకూ తావే లేదు వుండదు. అదీ భాగవతం. తనని అవమానించిన వాడినైనా భగవంతుడు క్షమిస్తాడుగానీ, ప్రాపంచిక సుఖాలన్నిటినీ తృణప్రాయంగా ఎంచి, తననే సర్వసంపదగా, సర్వస్వంగా భావించే భక్తులను అవమానించినా, బాధించినా, శోధించినా, వారికితగిన గుణపాఠం దైవం చెప్పి తీరుతాడన్నదే ఆయా అవతారాల ఆవిర్భావ వర్ణనలోని రహస్యం.

IV

వేదవ్యాస మహర్షి భాగవతాన్ని రచించి - "ఇక నావని అయిపోయిం దని" హాయిగా నిట్టూర్చాడు. తెలుగులో పోతన మహాకవి. సంస్కృత భాగవతాన్ని, తన ఇష్టదైవమైన శ్రీరామచంద్రుని ఆజ్ఞమేరకు తేట తెను గులో అనువదించాడు అదే "శ్రీమదాంధ్ర మహాభాగవతము." స్వయంగా దైవమే అనుగ్రహించి ఆదేశించిన వ్యక్తికి ఘంటం ఒక సాధనం, తాటాకులు ఆ అక్షరాలను పొందుపరచే బంగారు రేకులు! సహజంగా కవి అయిన పోతనా మాత్యుడు, వేదవ్యాస విరచిత సంస్కృత భాగవతాన్ని తెనిగించటలో తనని తాను మరచిపోయాడు భగవంతుని పాదరేణువుగా మారిన ఆయన ఘంటం లోనుంచి అక్షరరూపంలో పద్యాలు, గద్యము, తేనెల సోనలై ప్రవహించింది. భక్త్యావేశమూ, భక్తిపరాకాష్ఠలలో యతులు, ప్రాసలు, అక్షరాలు తమకి తామే పోటీపడి, ఒకదానినొకటి తోసుకుంటూ, ఒరుసుకుంటూపరవళ్ళ గోదావరిలా పరుగులుతీశాయి, అవి చదివే పాఠకుడినీ పరవశింపజేసి భక్తి అనే గంగా ఝరిలో మునకలు వేయించాయి! ఆయన జీవిత సంఘటనలూ భాగవతానికి సమాంతరంగా నడవటంతో ఆయన "నిధా? రాముని సన్నిధా?" అనే త్యాగరాజు ప్రశ్నలానే, తాను ప్రశ్నించుకుని-"భగవంతుని సన్నిధే పెన్నిధి" అనే జవాబు ఇచ్చాడు నిర్ద్వంద్వంగా!

భాగవతం మొదలు పెట్టింది మొదలు, చివర పూర్తి చేసేవరకూ, ప్రతి పద్యమూ ఒక తేనె సోన! ఒక వెన్నెలవాన, ఒక భక్తిరసావేశ ఝరి, ప్రతి పద్యం కంఠస్థం అయితే బావుండుననిపిస్తుంది అందులో లీనమైనవాళ్ళకి అంతటి ధారణ ఏ కొద్ది మంది అదృష్టవంతులకోగదా? రామాయణంలోని "సుందరకాండ" భారతంలోని "భగవద్గీత" లానే భాగవతంలోని దశమ స్కంధం, "శ్రీకృష్ణలీలలు" ఆ గ్రంథానికే హృదయంలాటివి! పోతన

మహానుభావుడు, సంస్కృత భాగవతంలోని ఎల్లలను చెరిపివేసి, తన భక్త్యావేశములో మూలంలోని భావం చెడకుండా, ఈశ్వరుని ఆనందనాట్యంలా శివతాండవంలా, పరమేశ్వరి నృత్యహేలలా నర్తింపజేసాడు పద్యాలని. తాను నర్తించాడా భక్తిలో. పోతన భాగవతంలో ఎందరో కవులు తమ కలాలకు పదును దిద్దుకున్నారు, దిద్దుకుంటూనేవున్నారు. నా పరిమిత జ్ఞానంతో పోతన భాగవతామృతాన్ని, పాఠకులకు నా చేతనైనంత వరకూ పంచుదామనే సదాశయంతో "భాగవతామృతకలశం" వ్రాశాను. "జాగృతి" వార పత్రికలో ఈ వ్యాసాలు వరుసగా (సీరియల్‌గా) ప్రచురితమయ్యాయి. "జాగృతి" వారపత్రిక వారికి నా కృతజ్ఞతాభివందనములు. నేను భాగవతంలోని "రాసలీల" ఘట్టాన్ని అసలు వ్రాయదల్చుకోలేదు. "మధుర భక్తి" కి పరాకాష్ఠ అయిన రాసలీలను కొందరు బాబాలూ, స్వామీజీలూ, వక్రభాష్యం, వక్రమార్గం పట్టించారు. అందుకే ఆ మహాద్భుత ఘట్టాని పోతన భాగవతంలోనే చదివి అర్థం చేసుకుంటారు భక్తులనే ఉద్దేశ్యంతో. అట్లాగే వేదవ్యాస మహర్షి తన మునిమనవడైన పరీక్షిత్తు - తన కుమారుడైన శుకమహర్షి చేత భాగవతకథను పలికించగా, "శ్రీకృష్ణ నిర్యాణ ఘట్టం" నుండి ప్రారంభమౌతుంది అసలు కథ, నేనా ఘట్టం స్పృశించదల్చుకోలేదు. "భగవంతుడు లేడు" "నిర్యాణం చెందాడు" అనే దుర్వార్త విని ధర్మరాజు ఎలాకృంగిపోయాడోగానీ, నేను మాత్రం ఆభావాన్ని నామనసులోనికి రానివ్వలేను, రానిస్తే నేను నా ఉనికినీ, వ్యక్తిత్వాన్ని కోల్పోతాను. అందువే శ్రీకృష్ణ నిర్యాణ ఘట్టమూ నేను వ్రాయలేదు.

నాశక్తి మేరకు "భాగవతామృత కలశాన్ని" సహృదయులైన పాఠకులకు అందించాను. పండితులు నా అజ్ఞానం వలన దొర్లిన తప్పులను

క్షమించి నా రచనలోని మంచికి ఆశీస్సులివ్వగలరని తలుస్తాను నా ఈ పుస్తకానికి ఆర్థిక సాయం అందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారికి హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనములు. ముందుమాట వ్రాసిమ్మని కోరగానే, తమదైనశైలిలో వ్రాసిచ్చి, నన్ను ఆశీర్వదించిన సోదరతుల్యులు, సహజకవి, పండితులు, మహోన్నత వ్యక్తిత్వంగలిగి సాహిత్యరంగంలో గోపాల చక్రవర్తిగా ప్రసిద్ధిగాంచిన శ్రీ N.V. గోపాలశాస్త్రిగారికి నా కృతజ్ఞతాభివందనములు. సాధ్యమైనతంవరకూ అచ్చు తప్పులు లేకుండా "ప్రూఫ్ రీడింగ్" చేసి ఇచ్చిన. శ్రీమతి వఝ్ఝల వసంతలక్ష్మికి నా శుభాశీస్సులు. నా అనారోగ్య కారణంగా వ్యాసాలు వ్రాయులేక, డిక్టేట్‌చేస్తుంటే, వ్రాసిఇచ్చిన నాకు మనవడి వరస అయిన చిరంజీవి పవని నరసింహారావుకు నా శుభాశీస్సులు ఈ పుస్తకం చదివి సద్విమర్శ చేసే పాఠకులందరికీ, భక్తులకదరికి నా నమస్సుమాంజలులు.

రచయిత్రి

పవని నిర్మల ప్రభావతి

# ఇదీ ప్రారంభం;

ఆదికవి వాల్మీకిమహర్షి ఈలోకంలో మానవోత్తముడు ఎవరు? మానవ జాతికి ఆదర్శప్రాయుడైన వ్యక్తి ఎవరు? సకల సద్గుణాలు రాశీభూతమై, మానవుడే మాధవుడుగా నిరూపించగలిగిన పురుషుడంటూ వున్నాడా? అనే మీమాంసంలో వుండగా నారదమహర్షి వాల్మీకిమహర్షి సందేహ నివృత్తి చేస్తూ 'ఆ గుణగణాలన్నీ మూర్తీభవించిన పురుషుడు రాముడుఅని రామాయణ కావ్యారంభానికి, కథానాయకుని గురించి ఆ దివ్యచరిత్రను గురించి సంక్షిప్తంగా చెబుతాడు. తను కరకుబోయుగావున్నప్పుడు శ్రీరామనామతారక మంత్రాన్ని ఉపదేశించి తనలోని అజ్ఞానాన్ని పారద్రోలి, జ్ఞాన జ్యోతి వెలిగించి, ఆ రామనామ తారకంతో తననో మహర్షిగా మలచిన దివ్యగురువు నారదుని మాటలనే నెమరువేసుకుంటూ, తమసానదికి శిష్యసమేతుడై స్నానానికి వెళ్ళిన వాల్మీకి మహర్షి, అక్కడ క్రౌంచ మిథునంలోని మగపక్షిని పరమ కిరాతకంగా చంపిన నిషాధుని క్రూర చర్యతో క్రౌంచ మిథునంలోని ఆడపక్షి విలాపం, మగపక్షి మరణం హృదయాన్ని కలచివేయుగా, అప్రయత్నంగా, "మానిషాద ప్రతిష్ఠా త్వామగమ శాశ్వతీసమా" అంటూ శాపరూపమూ, శోకరూపమూ అయిన శ్లోకం పెల్లుబికి వచ్చింది. ఆశ్లోకాన్నే పదే పదే ఆలోచిస్తున్న మహర్షిని బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై, అలాటి అత్యద్భుత కవితా ఝరితోనే రామాయణాన్ని (శ్రీరామ చరితను) రచించమని, అదే లోకంలో ఆది కావ్యమౌతుందనీ, ఆచంద్రార్కం రామాయణ కావ్యం నిలచి వెలుగుతుందనీ ఆదేశిసాడు. ఆశీర్వదిసాడు.

గురుదీవెనతో, బ్రహ్మ ఆశీర్వాదబలంతో, వాల్మీకి మహర్షి రామాయణ కావ్యాన్ని రచించారు. అయితే దాని ప్రచారానికి, ఎవరు అర్హులా? అనేది మరో సమస్య అయిందాయనకు. అప్పుడే శ్రీరామునికి ప్రతిబింబాలు, సీతా రాముల రూప, గుణగణాలు పుణికి పుచ్చుకొన్నవారూ అయిన "కుశలవులు" మహర్షికి ప్రణమిల్లారు. మహర్షి ఇక వీరిద్దరే ఆ రామాయణ కావ్య గానానికి అర్హులని నిశ్చయించి, వారికి రామాయణ కావ్యాన్ని క్షుణ్ణంగా బోధించాడు.

రాజసూయయాగం జరుగుతూండగా, అయోధ్యలోని జనపదాలలో రాజమార్గాలలో. వీధులలో కుశలవులు రామాయణ కావ్యాన్ని అద్భుతంగా గానం చేయసాగారు ఋషులు మొదలు, పాటకజనం వరకూ ఆ కావ్యానికి, గానానికి, ముఖ్యంగా సీతారాముల కథకూ ముగ్ధులైపోయారు.

ఏ అయోధ్యా నగరంలో శ్రీరాముడు జన్మించాడో, సీతారాములు వన వాసానికి తరలి వెళ్ళారో, తిరిగి పట్టాభిషిక్తులైనారో, మరలా సీతాదేవికి లోకాపవాదు కలిగిందో, ఆ అయోధ్యానగరమూ, ఆ ప్రజలే వరవశులై, పశ్చాత్తప్తులై, పోయారా కావ్యానికీ, ఆగానానికీ, రాజసూయ యాగానంత రం, భరతునిద్వారా ఆ బాలకుల గానం, కావ్యం గురించి విన్న శ్రీరాముడు కుశలవులను తనవద్దకు పిలిపించి, సభలో వారిని ఆ కావ్యం గానం చేయ వలసిందిగా కోరాడు శ్రీరాముడు. తన ప్రతిబింబాలయిన బిడ్డలద్వారా తన ఇల్లాలయిన సీతాసాధ్వి చరిత్ర వింటూ నిశ్చేష్టుడైపోయాడు

ఇట్లా ఆదికవి రామాయణం ఆసేతు హిమాచలం గాలిలో, నీటిలో, నేల లో, నిప్పులో, ఆకాశంలో తరంగాలుగా వ్యాపించి ఈ దేశపు మూలమూలకు వ్యాపించి చిరంజీవత్వం పొందింది.

ఇక భారతం విషయానికివస్తే, వ్యాసమహర్షి, వేదాలను విభజిస్తూ, 'పంచమ వేదంగా' భారతాన్ని వ్రాశాడు ఉపనిషత్తులలోని సారం, రాజరికపు ధర్మాలు, సామాజిక ధర్మాలు, స్త్రీ ధర్మాలు, ఒకటేమిటి? భారతంలో అటు ఇహమూ। పరమూకూడా మేళవించి రచించాడా మహర్షి. ఆ భారతాన్ని వ్యాప్తిలోనికి తేవటానికి, శిష్యులకు బోధించాడు. భారతంలోని పాత్రలన్నీ వేదవ్యాసునికి సంబంధించినవే వేదవ్యాసునికీ, అంబిక, అంబాలికలకు జన్మించినవారే ధృతరాష్ట్ర, పాండు రాజులు. వేదవ్యాసునికీ, దాసీకి జన్మిం చినవాడే విదురుడు. మహాజ్ఞాని, ఇక ధృతరాష్ట్ర పాండురాజులకు గాంధారి, కుంతి, మాద్రిల వలన జన్మించినవారే కౌరవులు, పాండవులు. ఇట్లా భారతకథ వేదవ్యాస మహర్షి మనుమల, మునిమనుమల పరంపరగా సాగింది.

శ్రీకృష్ణుడు భారత కథలో ఎక్కువగా మానవాతీత శక్తులు గలిగిన అద్భుత రాజకీయవేత్త, యోధుడు, సారధి, ఆలోచనా పరుడు.

పాండవులకు ఎప్పటికప్పుడు నైతిక బలాన్ని, ఆత్మ విశ్వాసాన్ని, మార్గదర్శకత్వాన్ని ఇచ్చే సచివుడు, ఆత్మీయుడు, ఆత్మబంధువు, ఏప్పుడో తప్ప శ్రీకృష్ణుని దైవంగా భావించలేదెవరూ. ఆ భారత కథను వ్యాస మహర్షి మునిమనువడి మనవడైన "జనమేజయుడు" సర్పయాగం చేశాక ఎందరో మహర్షులు హితైషులు సర్పయాగం ఆపించగా, ఆ తర్వాత తన వంశకర్తలూ, అజేయ పరాక్రములూ, భారత కథకు మూల పురుషులూ అయిన 'పాండవులు' (తన తాత ముత్తాతలు) వారివారి ప్రతాపాలూ, కురుక్షేత్ర సంగ్రామానికి దారితీసిన పరిస్థితులు వివరించవలసిందిగా కుతూహలంతో, వినయంగా. భారత కథ రచించిన వేదవ్యాస మహర్షిని కోరుతాడు జనమేజయ మహారాజు.

వేదవ్యాసుడు ఆ కథ చెప్పటంలో అద్భుత ప్రతిభగలిగిన వైశంపాయను డనే తన శిష్యుడిని ఆ కథ చెప్పమంటాడు. జనమేజయుని కోరికపై వైశంపాయన మహర్షి భారత కథను యథావిధిగా చెబుతాడు. అట్లా వేదవ్యాస మహర్షి అష్టాదశ పురాణాలను, వేద వేదాంగాలనూ, ఉపనిషత్తులనూ రచించి, పంచమ వేదంగా భారతాన్ని పేర్కొని, అందులో ఉపనిషత్తులనూ రచించి పంచమ వేదంగా భారతాన్ని పేర్కొని అందులో ఉపనిషత్తుల సారమైన "భగవద్గీతను" పొందుపరచి, ఆసేతు హిమాచలం భారతాన్ని ఆచంద్రార్కం చిరంజీవత్వం కలిగించాడు.

రామాయణం మానవజాతికి సంస్కారం, సంస్కృతి తెలిపే కావ్యం అయితే భారతం మానవజాతి మనుగడకు సంబంధించిన ధర్మా ధర్మాల సంఘర్షణకు సంబంధించినది.

ఇక భాగవతం ప్రత్యేకమైనది.

అష్టాదశ పురాణాలని రచించి, వేదవేదాంగాలకు వ్యాఖ్యలు వ్రాసి, భారతం నెపంగా మానవ ధర్మా ధర్మాలు విశ్లేషించి చూపిన వేదవ్యాస మహర్షికి ఇంకా తన కర్తవ్యం ఏదో మిగిలి వున్నట్లే అనిపించసాగింది. అన్నీ వ్రాసినా, వ్రాయవలసిందేదో వ్రాయలేదన్న అశాంతి మొదలైందా మహర్షి హృదయంలో, మరేం వ్రాయాలో, ఏం చేస్తే ఆ అశాంతి హృదయానికి తొలగుతుందో బోధపడలేదాయనకు ఆ సమయంలోనే నారదమహర్షి ప్రత్యక్ష మైనాడు. వ్యాసమహర్షి హృదయావేదన గుర్తించాడు.

"మానవ ధర్మాలను, ఉపనిషత్తులను, వేదాలను ఎంతగా మధించి వ్రాసినా, నీలో అశాంతి తీరకపోవటానికి కారణం ఒక్కటే: మానవ జీవితానికి ఒక్క మానవులకేకాదు సర్వ ప్రాణికోటికి హృదయాంతరాళలలో చిరు దివ్వెలా వెలిగే పరమాత్మునిపై భక్తి నీకింకా ధృఢతరం కాలేదు ఆ భక్తి ఎంత ముఖ్యమో, ఆభక్తి ఒక్కటే జీవిని తరింపజేయగల మార్గం భక్తికి మాత్రమే భగవంతుడు వశ్యుడౌతాడనీ, నీవు ఘంటాపథంగా చెప్పలేక పోయావు. "విష్ణువు" సకల చరాచర జగత్తుకు దివ్యజ్యోతి, ఆ విష్ణు కథలను నీవు "భాగవత" రూపంలో రచించి మానవాళికి ప్రసాదించు అని బోధించాడు ఆదివ్యబోధ దివ్యౌషధంలా పనిచేసింది. వెంటనే భారత కథలో తాను కేవలం మానవాతీత శక్తులుగల వ్యక్తిగా చూపిన శ్రీకృష్ణుని (విష్ణుని) కథలు, భక్తుల కథలు భాగవతంగా మలిచాడు వేదవ్యాస మహర్షి.

భాగవతంలో భగవంతుడికి–భాగవతునికీ (భక్తునికి) మధ్యగల అవినా భావ సంబంధం అణువణువునా ద్యోతకమౌతుంది. భగవంతుడిని నిర్లక్ష్యం చేసినా, అవమానించినా ఆయన సహిస్తాడు కానీ, భాగవతులను (భక్తులను) ఎవరేనా అవమాన పరిచినా, బాధించినా భగవంతుడు సహించడనీ, ఆ భాగ వతుల పక్షం తాను వహించి తీరుతాననీ క్షణం క్షణం నిరూపిస్తాడు. విష్ణు కథలద్వారా, వేదవ్యాస మహర్షి అలాగే భాగవతులలో వారివారి భక్త్యావేశం లో తరతమ భేధాలు, వారివారి హృదయ గతసంస్కార పరిపక్వత, అపరి పక్వత అనుసరించి వారివారి మార్గాలలో వారెలా భగవంతుడికి చేరువయ్యే

అవకాశం వుందో బోధించాడు వేదవ్యాస మహర్షి ఒకసారి భాగవతాన్ని మనస్ఫూర్తిగా పఠించిన వ్యక్తి వైరాగ్యంవేపు, భక్తి వేపు అడుగువేస్తాడు. అదే భాగవతపఠనానికి ప్రాప్యమూ గమ్యమూ అయితే సంస్కృత భాగవతం అందరికీ అవగాహన కాలేదు. భక్తి, వేదాంతం, వైరాగ్యం అనేవి పండితులకు మాత్రమే పరిమితమై పోయాయి. వేదాంత వైరాగ్యం భక్తి అన్నవి చాలా గహనమైనవి. తలనొప్పి కలిగించేవిగా కూడా అభిప్రాయం ఏర్పడింది.

అప్పుడే ఆంధ్రుల జన్మజన్మల అదృష్టఫలంగా "పోతన భాగవతం" ఆవిర్భవించింది.

వేదవ్యాసుని భాగవతం గురించి తెలియనివారూ, వేదవ్యాస మహర్షి వ్రాసిన భాగవతమే పోతన భాగవతానికి మూలమని తెలియనివారూ తెలుగు నేలపై వుండచ్చుగానీ, పోతన భాగవతంలోని తేటతెనుగు భక్తిరస పద్యాలు ఒకటైనా విననివారూ మనసులో తలచనివారూ, ఏదో ఒక సన్నివేశంలో పోతన భాగవతంలోని భక్తుల, భగవంతుని చరిత్రలను మననం చేసుకొని వారూ ఒక్కరైనా వుండరుగాక వుండరు.

"రుక్మిణీ కళ్యాణం" "గజేంద్ర మోక్షం" "ప్రహ్లాద చరిత్ర "అంబరీ షోపాఖ్యానం" "కుచేలో పాఖ్యానం" 'వామనావతారం' 'శ్రీకృష్ణలీలలు' "గోపికా గీతాలు' 'గోపికా వస్త్రాపహరణం' "కంసవధ" ఇలా భాగవతంలోని ప్రతి ఘట్టం, ప్రతి సంఘటనా ఒకో భక్తుని లేక భక్తురాలి భక్త్యావేశానికి, భగవంతుని అపారలీలా విశేషాలకూ, అపార కరుణకూ సంబంధించినవి కావటంతో ఆబాల గోపాలం ఆయా కథలు కంఠస్థం అయి ఆ పద్యాలు మననం చేసుకుంటూనే వున్నారు. ఆదికవి రామాయణ కావ్యంలా, వేదవ్యాసుని భారతంలా, పోతన భాగవతమూ- ఆవిర్భవించి షుమారు ఐదు శతాబ్దాలే అయినప్పటికీ, ఆ చంద్రార్కం నిలచి పోతుందనటంలో సందేహమూలేదు.

అందుక్కారణం పోతన అది ఒక కావ్యరచన అని భావించలేదు. ఆయనలోని భక్త్యావేశం పద్యగద్య రూపంలో సహజ పాండిత్య ఝరిలో

అశేషాంధ్ర ప్రజల హృదయాలనూ ముంచేత్తి వేశాయి. పోతనమహాకవి తెని గించిన శ్రీ మహాభాగవతాన్ని గురించి ముచ్చటించు కుందామా:

"దేవుడున్నాడా? లేడా? లేనేలేడు లేడుగాకలేడు" అని వాదోపవాద లు చేసే నాస్తికులకైనా "దేవుడున్నాడు ఉన్నాడు-ఉన్నాడు" అని ఘంటా పదంగా వాదించే ఆస్తికులకుగానీ

'కలడు కలండనేడివాడు కలడో? లేడో?' అని సంశయాందోళిత హృద యాలకు గానీ, పోతన మహాకవి భాగవతం వాదాతీతంగా జవాబు చెబుతుంది వాదాతీతంగానేగాక, నాగతీతంగా కూడా పోతన భాగవత పద్యాలు హృద యంలో కదలాడుతూ, కంఠంలో సుడులు తిరుగుతూ, అప్రయత్నంగా నాలుకమీద నరి సాయి.

పోతన భక్త్యావేశం తప్ప, భాగవతానికి మార్గదర్శనం మరొకటి లేదు. అందుకే వ్యాసమహర్షి రచించిన సంస్కృత భాగవతం ఘట్టాలలో ఎక్కువ భాగం పోతన మహాకవి స్వేచ్ఛానువాదం చేశాడు. కొన్నిటిని, తన హృద యం భక్తి భావ లహరిలో కొట్టుకుపోయినంతమేరా, మూల కథతో, మూల భావాలతో సంబంధం లేకుండా, పెంచుకోంటూపొయాడు. మరి కొన్ని ఘట్టా లలో తన భక్త్యావేశపు ఝరికి అడ్డువస్తాయనిపించిన మూల భాగాలను కుదించి, అసలు తీసివేసి వ్రాశాడు. ఎక్కడ ఏ పాత్రద్వారా విష్ణు స్వరూ పాన్ని ప్రార్థించే సన్నివేశం, అవకాశం వచ్చినా ఆయాపాత్రలలో తాను స్వయంగా తాదాత్మ్యం చెంది, ఎల్లలులేని భక్తిలోనుంచి జాలువారిన సహజ కవితా మాధుర్యంతో పద్యాలు పరవళ్ళు తొక్కించాడు ఆపద్యాలు అత్యంత కమనీయంగా, శబ్దాలంకారాలుగా, అంత్యప్రాసలుగా, అత్యద్భుతరీతిలో మరెవరూ అనుకరించలేని విధంగా రూపుదిద్దుకొని పోతన మహాకవినీ ఆయన విరచిత భాగనతాన్నీ కూడా చిరంజీవులను చేసివేశాయి.

"పలికెడిది భాగవతమట, పలికించెడి విభుడు రామభద్రుండట, నే పలికిన భవహరమగునట, పలికెద వేరొండుగాథ పలుకగనేల?"

అని ఆ కవిత్వం వ్రాస్తున్నది తాను కాదనీ, తన ఇష్టదైవమైన శ్రీరామ చంద్రుడనీ, తద్వారా తన భవబంధాలు తెగిపోతాయని, ఆత్మార్పణ భావంతో మంచి చేసుకున్నాడు ఆ మహాకవి. కాసిన్ని కవితలు, కథలు, నాలుగు నవలలు వ్రాయగానే- తామే సర్వ సృష్టి స్థితిలయాలకూ కారణ భూతులమనే కొనే ఎందరో ఆధునిక కవులు రచయితలు, రచయిత్రులు పై మహానుభావుని వినయాన్నీ, ఆత్మార్పణనూ ఎన్ని జన్మాలకు అలవర్చుకో గలరో ఆలోచిద్దామా ఒక్కక్షణం!)

వాల్మీకి మహర్షికి, నారద మహర్షి ద్వారా రామనామతారక మంత్రం బోధింపబడి తిరిగి ఆ నారద మహర్షి ప్రోత్సాహంతోనే ఆదికావ్యమైన "రామాయణా" నికి ఆలోచన ప్రారంభమైంది. బ్రహ్మ సాక్షాత్కారంతో ఆ ఆలోచన ఆచరణలోనికి వచ్చి, రామాయణ కావ్యం అజరామరమైంది.

ఇక వ్యాసమహర్షికి, తాను వ్రాసిన వేద వేదాంగాల, ఉపనిషత్తుల అష్టాదశ పురాణాల రచన శాంతి నివ్వకపోగా, నారదమహర్షి బోధతో భాగవతం రచించి శాంతినీ, తృప్తినీ, జీవితధ్యేయాన్నీ సాధించుకున్నాడా మహర్షి.

ఇక పోతన మహాకవి, తల్లి లక్కమాంబ, తండ్రి కేసనమంత్రి, తల్లిదండ్రులు, సోదరుడైన తిప్పన శైవ భక్తులు. పోతన తాతలు కూడా శైవ భక్తులే, కానీ తల్లితండ్రులలో, తన సోదరుడైన తిప్పనలా పోతన కేవలం శైవభక్తి తత్పరుడు కాలేదు. పోతన ఇష్టదైవం శ్రీరామచంద్రుడు. భక్తితాత్పర్యాలు విష్ణు కథలు, విష్ణుభక్తికి సంబంధించినవి. అంటే శ్రీవైష్ణవ శివకేశవులకు భేదం లేదనే చాటాడు పోతన. కానీ ఆయనహృదయం మాత్రం వైష్ణవభక్తి పరిపూర్ణమైపోయింది.

ఒక నిండుపౌర్ణమి నాటి రాత్రి, పోతన గోదావరి నదిలో సుస్నాతుడై నీటి ఒడ్డునగల మందిరంలో 'మహేశ్వర ధ్యానంలో' లీనమైపోయాడు. ఒకానొక సమాధి స్థితి సాధించిన ఆ భక్తాగ్రేసరుడి హృదయపీఠం మీద సీతా సమేతుడై శ్రీరామచంద్రమూర్తి సాక్షాత్కరించాడు.

"నాకు అంకితంగా భాగవతాన్ని తెనుగుతో అనువదించి భవబంధం విముక్తుడవు కావలసిందిగా ఆనతిచ్చాడు, ఆశీర్వదించాడు బహుశా ఆసమయంలో ఆయన హృదయ కుహరంలోనుండి దివ్యవాణి పద్యరూపంలో వుబికి వచ్చింది,

పలికెడిది భాగవతమట - పలికించెడి విభుండు రామభద్రుండట

నే పలికిన భవహరమగునట, అంటూ పక్షి మరణంచూచిన వాల్మీకి మహర్షి హృదయం లోతులలోనుంచి వచ్చినట్లే అప్పుడే మిగతా పురాణాలు తెలుగుచేయబడ్డాయన్నది గుర్తొచ్చి పోతనలో మలయ మారుతంలా తాకి ఆత్మార్పణ భావానికి అద్దం పట్టింది. అంతేకాదు,

మ॥ 'ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీ యుర్విం, బురాణావళుల్,
తెనుగుల్ సేయుచు, మత్పురాకృత, శుభాధిక్యంబు దానెట్టిదో!
తెనుగుంజేయరు, మున్ను భాగవతమున్, దీనిన్ తెనింగించి, నా
జననంబున్ సఫలంబు, చేసెద బునర్జన్మంబులేకుండగన్!"

అని అదోవరంగా, తపస్సుగా భావించి భావగతం తెనిగించాడా మహాకవి.

పోతన మహాకవి అయన యవ్వన, కౌమార దశలలో "భోగినీదండకం" "వీరభద్ర విజయం" అనే మరికొన్ని శతకాలు, రచనలు చేశాడని ఆధారాలు న్నాయి. అలాగే అవి ఆనాటి మహారాజులకు అంకితంగా ఇచ్చాడనే ఆధారాలు వున్నాయన్న వాదమూవుంది. ఎటొచ్చి ఈ వాదోపవాదాలు పండితులకూ, పరిశోధకులకూ వదిలివేద్దాం. భాగవతం అనువదించే నాటికి పోతన మహాకవి తనువూ, మనసూ పరితప్త స్థితికి చేరుకున్నాయి. జీవితంలోని ఆటుపోట్లు అశాశ్వతమైన సుఖ, భోగాలపట్ల విరక్తి. మహారాజుల 'క్షణం చిత్తం, క్షణం మాయ' అన్నట్లుండే ఆగ్రహానుగ్రహాలు, సన్మాన అవమానాలు తాలూకు

అనుభవాల పాఠాలు, ఆయన హృదయాన్ని మథించి, భక్తి, భగవంతుడే నిత్యం, సత్యం అన్న స్థిరనిశ్చయానికి చేర్చాయి. అంచేత

ఉ॥ "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్,
సొమ్ములు గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి, కాలుచే
సమ్మెట వ్రేటులంబడక, సమ్మతితో శ్రీహరి కిచ్చి చెప్పె, నీ
బమ్మెర పోతరాజొకడు, భాగవతంబు జగద్ధితంబుగన్."

అంటూ తన నిర్ద్వంద్వ భక్తి ప్రవత్తులనేగాక, భావితరాల కవులకుకూడా, ఆత్మాభిమానం తాలూకు పరోక్ష హెచ్చరిక చేశాడు. అలాగే,

"కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల ఏడ్చెదో
కైటభదైత్యమర్ధనుని గాదిలి కోడల యోముదంబ! యో
హాటక గర్భురాణి! నిను నాకటికిన్ గొనిపోయి, యల్ల క
ర్ణాట కిరాట కీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ"

అని తన కవితా కాన్యను, తన కన్నతల్లి అయిన దివ్యరచనను భోగ భాగ్యాల ప్రలోభాలకు, తుచ్ఛమైన రాజుల అహంకార పూరిత సన్మాన అవమానాలకూ బలిచేయనని ఢంకా బజాయించి చెప్పాడా మహాకవి.

కావ్యారంభంలో అందరు కవులలానే పోతన కూడా పూర్వ కవులకూ, వర్తమాన కవులకూ వినయంగా మ్రొక్కాడు. మరిలా భావితరాల కవులకూ సన్మానాలు పలికిన ఘనత, హృదయ వైశాల్యం పోతన ఒక్కడే దక్కించుకున్నాడు.

ప్రతి మనిషిజీవితంలోనూ ఒకానొక అత్యద్భుత మలుపు, ఆధ్యాత్మిక ద్వారా కవాటాలను తెరుస్తుంది. ఆవ్యక్తి స్త్రీ అయినా, పురుషుడయినా. వయసులో చిన్నలైనా, వయోవృద్ధులైనా, పై అనుభవానికీ, అనుభూతికీ అతీతులుకారు. ఆస్తికులైనా, నాస్తికులైనా, వారివారి జీవితానుభవాలలోని

ఒకానొక సంఘటన వారివారి హృదయాలని వూపివేసిన క్షణంలో భగవంతుని పట్ల విశ్వాసం, భక్తిపట్ల ఆసక్తి ప్రారంభ మౌతుంది. సాధారణంగా విషాదంలో నుంచే భక్తి బాట ఏర్పడు తుంటుంది. అది పలాయన వాదమో, పిరికి తనమోగానీ, నిజమైన భక్తి వైరాగ్యాలుగా రూపొందినపుడే ఆ వ్యక్తి పరిపూర్ణుడు, చిరంజీవి అవుతారు. "నేనెవర్ని? ఈ లోకంలోకి ఎందుకొచ్చాను? అసలు మానవ జీవిత ధ్యేయం ఏమిటి? ఇందాక నేనేంచేశాను! ఇక శేషజీవితం లో ఏంచెయ్యాలి? మరణం తర్వాత ఏమిటి? మరణాన్ని శాంతంగానూ స్వాభావికంగాను, నిశ్చలంగాను ఎదుర్కొనే మనఃస్థితి ఎలా సాధించాలి? ఇలాంటి ప్రశ్నలు మొదలైనపుడే ఆత్మ విమర్శ, అంతర్మథనం ప్రారంభ మౌతాయి, అప్పుడే భాగవతం అవసరం. ఆస్థితికి వచ్చినవాంకే భాగవతం అర్థమౌతుంది. ఆస్థితి లేని వారికి, రానివారికీ, భాగవతం "శబ్దాడంబర పద విన్యాసము", 'పద్యాల శ్రావ్యత' తప్ప మరేమి లేని తలగడలాంటి పుస్తకం మాత్రమే!

అంచేత భాగవతంలో వర్ణింపబడిన దైవభక్తులు, పరిణీత భక్తులు, అపరిణీత భక్తులు తామస, రాజస, సాత్వికభక్తులు వారివారి అనుభూతులు ఎవరివో కావు, మనలో ప్రతి ఒక్కరిదీ! మనందరిదీ! అచంచల విశ్వాసం ఒక్కటే మానవుడిని ముందుకు నడిపించగల దివ్వె! ఏ అంతరిక్ష (ఆధునిక) పరిశోధకులకైనా, అణు పరిశోధకులకైనా, భూ, ఖగోళ, జలాంతర్గతపరిశోధకులకైనా, 'ఇది నేనుసాధించి తీరుతాను' అనే పట్టుదల, ఆత్మవిశ్వాసాలే వారివారి విజయ సాధనాలు.

'భగవంతుడున్నాడు, దీనులఎడ, బాధితులఎడ, మానవ, దానవ, జంతు క్రిమికీటకాది సకల ప్రాణికోటి ఎడల ఆ భగవంతుడున్నాడు. ఆనాడూ, ఈనాడూ, మరేనాడు, వున్నాడు, వున్నాడు, వున్నాడు' అని ఎలుగెత్తి చాటిదే భాగవతం ఆవిశ్వాసం కలిగించేదే భాగవతం. ఆధ్యేయానికి నడిపించేదే భాగవతం.

మొండిగా వాదించే వారికి వినయంగా నమస్కరించి వారి తర్కాన్ని వారికే వదిలి, పరిమిత కొంతయినా మనసుకి కలిగిన పాఠకులకు మనసారా నమస్కరించి ... పోతనలాంటి మహాకవికి జన్మనిచ్చిన మనదేశానికీ, మనతెలుగు నేలకీ, మన తరతరాల మహోన్నత సంస్కారానికీ శతకోటి నమస్కారాలు చేసి-

'ఈ దేశం మాకేమిచ్చింది?' అని ఆవేశంతో పదేపదే ప్రశ్నించే కొందరు ఆధునికులకు,

జవాబుగా రామాయణ రసవాహిని, భాగవతామృత కలశం లాంటి అనర్ఘ రత్నాలెన్నిటినో ఈ రత్నగర్భ పుంఖాను పుంఖలుగా పంచి ఇచ్చిందనీ, ఇస్తోందనీ గుర్తు చేస్తూ,

పోతన మహాకవి తెనుగు భాగవతాన్ని పరిశీలిద్దాం. అందులో నిక్షిప్తమైవున్న భాగవత కథలనూ, భగవంతుని లీలలనూ, మననం చేసుకుందాం.

పండితులకు మాత్రమే అర్థమయ్యే రీతిలో వున్న వేదాంతాన్ని, వేదాంత సారాన్ని పండితులకే వదలివేద్దాం. కావ్య లక్షణం కాబట్టి, పోతన మహాకవి కావ్య లక్షణాలన్నిటినీ అనుసరించాడు. మన హృదయ సంస్కారం-మేధ. బిజీయుగంలో మనం త్వరత్వరగా తెలుసుకోగలిగిన కొద్దిపాటి సమయం అనుసరించి మనం భాగవత విశ్లేషణ చేసుకుందాం.

"శ్రీ కైవల్యపదంబు జేరుటకునై చింతించెదన్, లోకర
క్షైకారంభకు, భక్తపాలన కళాసంరంభకున్, దానవో
ద్రేకస్తంభకు, గేళిలోల విలసదృగ్జాల, సంభూత, నా
నాకం జాత భవాండ కుంభకు, మహానందాంగనాడింభకున్!"

అని తనకు శ్రీహరి, శ్రీకైవల్యం మాత్రమే ప్రాధాన్యమైనవని తెలుపుకున్న పోతన మహాకవి భాగవతాన్ని ఒక్కసారి జీవితంలో ఒక్కసారి మనసారా క్షుణ్ణంగా చదివి తెలుసుకొని శ్రీకైవల్యపు బాటలోకి అడుగెడుదామా?

వ్యాసమహర్షి భాగవతం రచించిన తరువాత, ఆ భాగవత కథావ్యాప్తి కొరకు దానిని తన కుమారుడు, అవధూత, (దిగంబరుడు) అయిన శుకయోగికి ఉపదేశించాడు. మిగతా వేదములను తన శిష్యులైన పైలుడు (ఋగ్వేదం) జైమినీ (సామవేదం) యజుర్వేదం, వైశంపాయనుడు (ఈ వైశంపాయనుడే భారత కథ జనమేజయ మహారాజుకు చెబుతాడు) సుమంతుడు అథర్వణ వేదం పఠించగా మిగతా పంచమ వేదమనబడే పురాణాలన్నీ "రోమహర్షణుడు" (ఇతడే సూతుని తండ్రి) కంఠస్థం చేసుకుంటారు. ఇక- ఒకసారి చదివినంత మాత్రాన, మనసువుండి విన్నంత మాత్రాన సర్వ పాపములు నశించిపోయే భక్తిరస గ్రంథం అయిన భాగవతాన్ని వేదవ్యాసుడు స్వయంగా తన కుమారుడైన శుక యోగికి మాత్రమే బోధించాడు. ఆ శుకయోగీంద్రుడు ప్రాయోపవేశుడై వైరాగ్యసిద్ధి కోరివున్న పరీక్షిన్మహారాజుకు బోధించాడు.

పాండవులలోని అర్జునుడి కొడుకు అభిమన్యుని భార్య ఉత్తర. ఉత్తర గర్భిణిగావున్న సమయంలో కురుక్షేత్ర సంగ్రామం జరిగి, అభిమన్యుడందులో మరణించాడు. పంచ పాండవులకు ద్రౌపది ద్వారా కలిగిన ఐదుగురు ఉప పాండవులనే బాలకులను, గాఢనిద్రలో వున్న సమయంలో అశ్వద్ధామ (ద్రోణాచార్యుని కొడుకు) కిరాతంగా చంపివేస్తాడు, దానితో "అపాండవం" అయిందని భావిస్తాడు. అశ్వద్ధామను పట్టితెచ్చి, పాంచాలి కరుణించగా, అవమానించి వదలి వేస్తాడు అర్జునుడు. అలా అవమానం పాలయిన అశ్వద్ధామ తన క్రోధంతీరక, ఉత్తరా గర్భస్థుడైవున్న పరీక్షిత్తుమీద బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ప్రయోగిస్తాడు. గర్భ విచ్ఛిత్తి జరగాలని.

అప్పుడు ఉత్తర శ్రీకృష్ణుని పలువిధాల స్తోత్రంచేయగా శ్రీకృష్ణుడు తన మహాద్భుత లీలలతో తన గధాయుధాన్ని ఉత్తర గర్భస్థ శిశువుకు అడ్డుగా నిలిపి, బ్రహ్మ శిరోనామకాస్త్రాన్ని వారించి, ఆబిడ్డకు ఏ ఆపదా కలగ కుండా రక్షిస్తాడు, తను తల్లి గర్భంలో వుండగా, చతుర్భుజుడైన మహాను భావుడు శంఖ, చక్ర, గదాభయ హస్తాలతో తనని రక్షించటం చూచిన ఆ శిశువు ఆ మహానుభావుడెవరో? ఎక్కడున్నాడో అని దిశలన్నీ పరికించి చూస్తూండటంవల్ల అతనికి "పరీక్షిత్తు" అనీ- తల్లి గర్భంలోనే శోధింపబడిన వాడవటంవల్ల 'పరీక్షిత్తు' అని పేర్లు వచ్చాయి. ఈ పరీక్షిన్మహారాజునే తమ వారసునిగా రాజ్యాభిషేకంచేసి, పాండవులు మహాప్రస్థానానికి వెళ్ళారు సకల జన మనోభిరంజకంగా పరిపాలన చేస్తున్న పరీక్షిత్తు, కలి పురుషుడు ధర్మ మనే గో, వృషభరూప (గోవు, గోవత్సం) అశక్తులను నిష్కారణంగా దండిం చటం చూచి, కలిని నిగ్రహించి ధర్మదేవతలను వూండించి, ధర్మాన్ని ప్రతిష్ఠిస్తాడు.

అయితే విధి బలీయం, ఐశ్వర్యము, అధికారము, ఒక్కోసారి ఇంగిత జ్ఞానాన్ని మింగివేస్తాయి. వేటకోసం అడవిలో తిరిగి, ఓ మృగంవెంట పరు గెడుతూ అలసిపోయి దాహంతో శమీక మహాముని ఆశ్రమానికి వచ్చిన పరీక్షిత్తు మహారాజు, ఆ మహర్షి సమాధిస్థితిలోవుండి మౌనంవహించి ఉండ టాన్ని, కేవలం దురహంకారంగా భావించి విధి ప్రేరేపితుడై నిర్జీవ సర్ప కళేబరాన్ని ఆ మహర్షి మెడలోవేసి, రాజధానికి తిరిగి వెళతాడు. శమీక మహర్షి కుమారుడైన "శృంగి" తండ్రికి జరిగిన అవమానాన్ని చూచి, సహించలేక, ఆ అవమానం చేసిన వ్యక్తి నేటికి ఏడవనాడు "తక్షక" మహా విషసర్ప విషానలానికి గురై మరణించుగాక, అని తిరుగులేని శాపం ఇస్తాడు తరువాత శమీక మహర్షి కొడుకైన శృంగిని మందలించి, పరీక్షిత్తుకి కబురు తెలియజేసాడు.

మరణం ఎప్పుడో వస్తుందని ప్రతి మనిషికీ తెలుసు. అది ఏరూపంలో వస్తుందో, ఏక్షణాన వస్తుందో ఏ మనిషికీ తెలియదు గనుక, మరణాన్ని

గురించి పదేపదే ఆలోచించడు మనిషి, అలాగే ఆందోళన చెందడు. ఈ జీవితం శాశ్వతం అనే భ్రమలోనే వుంటాడు. కానీ మరణమన్నది ఖచ్చితంగా ఫలాన రూపంలో, ఫలాన సమయంలో వచ్చితీరుతుందన్నది తెలిసిన మనిషికిక ప్రత్యక్ష నరకం అంటూ వేరే వుండదు. ఉరిశిక్ష వేయబడిన నేరస్తులు, రకరకాల మరణశిక్షలకు గురికాబడే నేరస్తులు- ప్రాకరణంగా చిత్రహింసల పాలై మరణానికి దగ్గరగా త్రోయబడే నిర్భాగ్యులు-వీరంతా అనుభవించే మానసికవ్యధ ఏ భాషకూ, ఏ భావాలకూ అందనిది- తెలిసితెలిసి ఒస్తున్న మృత్యువు కలిగించే క్షోభ భయం అది. అయితే శాస్త్రంత వివేకమూ, జ్ఞానం వున్న వ్యక్తుల మనఃస్థితివేరు, ఎలాగూ మరణం రాబోతున్నది గనుక, ఇక ఈ ఇహసంబంధమైన బంధాలు వదులుకొని, దైవంమీద మనసు నిలిపి, వైరాగ్యం అలవర్చుకొని చివరి క్షణాలు ఆదైవంమీద దృష్టి కేంద్రీకరిస్తామని భావిస్తారు. జ్ఞానదీపం లోపల వున్నవారు. సరిగ్గా పరీక్షిత్తు అపనేచేశాడు అశాశ్వతమైన భోగభాగ్యాలు ఇక తన వెంటరావు రాజ్యాధికారాన్ని తన కుమారుడైన జనమేజయునికి అప్పగించాడు కాంతా కనకాలేవీ తనకిక మోక్షగాములు కావనే ధృఢ వైరాగ్యంతో గంగాతీరాన ప్రాయోపవిష్టుడైనాడు. అక్కడికి వ్యాస, అత్రి, విశ్వామిత్ర, భరద్వాజ, వశిష్ట, భరగు, పరశురామ, గౌతమ, మైత్రేయ, నారదాది మహర్షులెందరో వచ్చి పరామర్శించారు. పరీక్షితుకూడా, వారందరికీ మ్రొక్కి, తనకి ఏడురోజులలోగా నిజమైన, విరక్తి, భగవచ్చరణారవిందములమీద తొలగిపోని అంతర్ దృష్టి ప్రసాదించే మార్గం చెప్పమని వేడుకుంటాడు. నారాయణ కథా శ్రవణం ప్రసాదించమనీ కోరుతాడు. ఈ సమయంలోనే పరీక్షితు పూర్వపుణ్యవశాన శుకయోగీంద్రుడక్కడికి వస్తాడు.

ఒకరు మరణ సమయం తెలుసుకొని వైరాగ్యనిధికోరే మహారాజు, మరొకరు ముక్తసంగుడై జన్మించి, స్త్రీ, బాల, వృద్ధ భేధభావముల కతీతమైన మానసిక స్థితితో దిగంబరుడు, ఉపదూతఅయి-ముక్తిని కరతలామలకం చేసుకున్న నిస్సంగ మహర్షి, ఇంకేంకావాలి? పరీక్షితు శుకయోగిని తనకు ముక్తిచూరగొనే మార్గం, ఏ జప నిధిద్వారా, ఏకథా శ్రవణంద్వారా వస్తుందో తెలుపమని కోరుతాడు.

వేదవ్యాసుడు (తండ్రి) తనకు బోధించిన భాగవతాన్ని - శుకయోగి ఈ సమయంలో పరీక్షిత్తుకు ఉపదేశిస్తాడు పరీక్షిత్తు పరిణిత హృదయుడై వున్న విద్యార్థి, శుకయోగీ ఆ పరిణితి తెలుసుకొని బోదించే గురువు ఒకరు భోగభాగ్యాలన్నీ అనుభవించి వైరాగ్యంకోరే వ్యక్తి మరొకరు జన్మతః ప్రాపంచిక విషయాలకతీతుడైన మహర్షి పశ్చాత్తాపమూ, ఆత్మార్పణ భావమూ, వైరాగ్యమూ, ముప్పిరిగొన్న పరీక్షిత్తుకు వైరాగ్యమూ, శాంతి, బ్రహ్మవిద్యను సమయస్ఫూర్తితో బోధించే గురువైన శుకయోగి భాగవత కధను సాకల్యంగా చెప్పటం ప్రారంభిస్తాడు,

ఇలా ప్రారంభమవుతుంది భాగవతం.

ఎక్కడ నిజమైన వైరాగ్య ఆసక్తి, విష్ణుకధలయందు శ్రద్ధ, అచంచల విశ్వాసం భగవంతునిమీద వుంటయో, అక్కడకు నిజమైన బోధ గురువు వెతుక్కుంటూ వస్తాడు.

ఇక పోతనలాంటి మహాభక్తుడు, శ్రీరామ పాదభక్త పరమాణువు, ఘంటం నుండి భక్తిరసం జాలువారింది పద్యరూపంలో గద్యరూపంలో, అన్ని భాషలలోనూ భాగవతం అనువదింపబడినా (వివిధ భాషా కవులద్వారా. పోతన భాగవతానికున్న ప్రాచుర్యం,కమ్మదనం అవి సంతరించుకోలేవేమో)

శుకయోగింద్రుడు, పరీక్షిన్మహారాజుకు, మునుముందుగా, "ఖట్వాంగుడనే" రాజు కధ ఉపోద్ఘాతంగా చెబుతాడు.

"ఖట్వాంగు" డనే మహారాజు మహాపరాక్రమశాలి. రాక్షసుల బాధ పడలేక, ఇంద్రాదిదేవతలు, తమకు సాయపడవలసిందిగా, ఖట్వాంగుడిని కోరుతారు. ఖట్వాంగ మహారాజు, అపరిమిత ధైర్యసాహసాలు ప్రదర్శించి రాక్షసులను సంహరించి, దేవతలకు సంతోషం కలిగిస్తాడు. దేవతలతగాడిని ఏదేనా

వరం కోరుకొమ్మంటారు. ఖట్వాంగుడు తన ఆయుర్దాయం ఎంతో చెప్పమంటాడు. అందుకు వారు కేవలం ఒక ముహూర్తకాలం మాత్రమే వుందని చెప్తారు.

వెంటనే ఖట్వాంగుడు గగనమార్గంలో భువికి దిగివచ్చి, తనందాకా ప్రాణాధికంగా ప్రేమించిన భార్యలనూ, పుత్రులనూ, భోగభాగ్యాలనూ, క్షణకాలంలో గాఢ వైరాగ్యంతో విడనాడి, గోవిందనామ స్మరణచేస్తూ, మనస్సు ఆ గోవిందుని చరణ కమలాల మీద లగ్నం చేసి, మిగిలివున్న రెండు గడియల లోనే, ముక్తి చెందుతాడు.

ఈ కథ చెప్పటంలో శుకయోగి ఉద్దేశ్యం, అంతటి ప్రగాఢ వైరాగ్యం, అప్పటి కప్పుడు కలిగిన పశ్చాత్తాపంతో రెండుగడియలలోనే మోక్షం సాధించ గలుగగా, ఏడురోజుల గడువుండగా కలత చెందక మోక్షాయత్తుడవు కమ్మని అటు పరీక్షిత్తునకూ, ఇటు సామాన్య మానవులందరికీ బోధించాడు. ఈనాటి సామాజిక, ఆర్థిక, రాజకీయ వాతావరణంలో వృధా వ్యసనాలలో తల మునకలై జీవితకాలమంతా వ్యర్థం చేసుకోకుండా, దైవభక్తిని అలవరుచు కోవటం శ్రేయస్కరమనే హెచ్చరికా నిండివున్నాయి.

అదే పోతన కాలంనుండి తేనె, మీగడ, చక్కెర, చెరుకురసం లాటి వివిధ తీపి రుచులలో ..

సీ॥ కమనీయభూమి భాగములు లేకునవే?
పడియుండుటకు దూది పరుపులేల?
సహజంబులగు కరాంజలులు లేకున్నవే,
భోజన భాజన పుంజమేల?
వల్కలాజినకు శావకులు లేకున్నవే?
కట్టదుకూల సంఘంబులేల?
గొనకొనివసియింప గుహలులేకున్నవే?
ప్రాసాదసౌధాది పటలమేల?

తే॥ ఫలరసాదులు గురియవే, పాదపములు?
స్వాదు జలముల నుండవేఁ సకల నదులు?
బొసగ భిక్షము వెట్టరే పుణ్య సతులు?
ధనమదాంధుల కొలువేల, తాపసులకు?

అనే సీసపద్యంతో తేనెలు కురుస్తూ హెచ్చరిస్తోందీనాటి మానవాళిని? అందరూ సన్యాసులు కాలేరు. మోక్షం అంటూ ముక్కు మూసుక్కూర్చొని కర్తవ్యాలనీ, బాధ్యతలనీ విస్మరించమని కాదు. కానీ నేటి "స్పీడ్" యుగంలో "ఈజీమనీ" ప్రలోభంలో మనిషి పరుగు ఎంతకీ జీవితావసరాలూ, అవి ఒనకూడాక, సుఖలాల సతవేపు పోటీ పడుతుంది. దాని ఫలితమే, రకరకాల వంచనలు, ఆత్మవంచనలు, పరవంచనలు, ఈజీ మనీకోసం దేశవిదేశాల వేపు వెర్రి పరుగులు, ఇంకా కారు, బంగళా, మూడు తరాలకు సరిపడా డబ్బు, బంగారం, సాధించాకకూడా కలగని సంతృప్తి, పెరిగే అశాంతి. ఈ పరుగు పోటీలో మనిషి తాను జారవిడుచుకుంటున్న విలువైన కాలం ఆయుర్దాయం తనకి చేరువౌతున్న మృత్యువు, తాను దూరమౌతున్న భగవాత్పాదాలు గుర్తించలేక పోతున్నాడు. అలాంటి వారికి హెచ్చరిక పై పద్యం ఏ మంత్రి గారినో, అధికారినో స్తోత్రంచేసి తమతమ కార్యాలు సానుకూలం చేసు కోవాలని చూసే ప్రతి ఒక్కరికీ,

క॥ రక్షకులులేని వారల-రక్షించెద
ననుచు జక్రిరాజై యుండన్,
రక్షింపుమనుచు నొకనరు-నక్షము
ప్రార్థింపనేల యాత్మజ్ఞులకున్.

అని చెర్నాకోలతో ఒక దెబ్బవేశాడు మహాకవి కంద పద్యంతో. అంతే కాదు అలాటి వారందరికీ మరో మాత్ర వేస్తూ వారివారి హృదయగత మాలిన్యాలు తొలగటానికి, కాస్తంతభయం, భక్తి కలగటానికి వీలుగా-

మ॥ "హరిఁ జింతింపక మత్తుఁడై విషయ చింతాయత్తుఁడై చిక్కి వా
సరముల్ ద్రోసెడు వాడు కింకర గదా సంతాడితోరస్కుఁడై
ధరణీశోత్తమః దండ భృన్నివసన ద్వారోపకంఠోగ్రవై
తరణీవహ్ని శిఖా పరంపరలచే దగ్ధుండు గాకుండునే"?

అని "మత్తెభాన్ని" పురికొల్పాడు అలా జీవితాంతం భగవద్భక్తి వాసన అంటనీయని వారిని.

క॥ మొత్తుదురు గదల, మంటలకెత్తుదు,
రడ్డంబు, దేహమింతింతలుగా
నొత్తుదురసి పత్రికలను–హత్తుదురు
కృతాంతభటులు హరివిర హితులన్.

అని కందంలో అందంగా చెప్పాడు మహాత్ముడు. అంచేత-ఎన్ని వ్యాపకాలున్నా, ఎంతలేసి సిరులున్నా, ఎంత పాండిత్యమున్నా మరణం అనివార్యమైన మానవజీవితం-మానవ శరీరమొక్కటే మోక్షసాధనకు చక్కని సాధనం గనుక మరణించాక మన వెంటరాని వస్తువులెన్నిటినో పోగుచేసుకోవటంలోనూ, ఆవస్తువులకోసం మనలాటి సాటి మానవులని దేవిరించటం, వంచించటంలాటి నీచపు పనులలోనూ ఆయుర్దాయం చెల్లించి వేసుకోకుండా,

రోజూ మన విరామసమయంలో ఒక్క ముప్ఫై నిమిషాలు మనకిష్టదైవం అయిన భగవంతుని మూర్తిమీద (ఆ మూర్తి కృష్ణుడయినా, క్రీస్తు అయినా, అంబ అయినా అల్లా అయినా ఎవరయినా ఒక్కటే.) మనసు కేంద్రీకరించగలిగితే ఆదే గొప్ప సాధన అవుతుందీ కలియుగంలో ఆదే గొప్ప ముక్తిబాట అవుతుంది స్పీడు యుగంలో అదే గొప్ప శాంతి నిస్తుంది. నిత్యజీవిత సమస్యలలో పేకాటలూ, క్లబ్‌లూ, సినిమాలూ, వీడియోలూ, పనికిమాలిన కబుర్లతో ఖర్చుచేసే కాలంలో ఒకే ఒక్క అరగంట తీరదా? చాలదా? పోతన కవితాఝురిలో జాలువారినా, శుకయోగీంద్రుని తత్వబోధలో పొందుపరచబడినా అసత్యమేః అసత్యమేః అవునా?

# "నారద మహర్షి"

నారద మహర్షి పేరులేని పురాణం అంటూ లేదు అలాగే భక్తికి సంబం ధించిన ఏకథలో అయినా నారద మహర్షి ప్రసక్తి, ఉనిక ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వుండితీరుతాయి ఆదికవి వాల్మీకికి రామనామం బోధించి, పునర్జన్మ నిచ్చిన మహనీయుడు నారద మహర్షి. వ్యాసమహర్షిని భాగవత రచనకు ప్రోత్సహించినవాడు నారద మహర్షి. తల్లి గర్భంలో వుండగానే ప్రహ్లాదునికి అష్టాక్షరీ మంత్రోపదేశం చేసి, విష్ణుకథలు వినిపించి, తద్వారా పుట్టుకతోనే ప్రహ్లాదుని విష్ణుభక్తులలో అగ్రగణ్యునిగా రూపొందించి లోకకంట కుడైన హిరణ్యకశిపుని అంతమొందింపజేసి, శ్రీహరి నృసింహావాతారానికి అవతారిక సిద్ధం చేసినవాడు నారదమహర్షి. నక్షత్రమండలంలో ధృవతారగా ఆచంద్రార్కం నిలిచిపోయిన ధృవునికి శ్రీమన్నారాయణ మంత్రం ఉపదే శించి, అనుపమాన వున్నత పధాన్ని ప్రసాదించటంలో మార్గదర్శకుడు నారదమహర్షి. శ్రీరామ శబ్దం వున్నచోట ఆంజనేయుడున్నట్లే, విష్ణునామం వినిపించిన చోటల్లా. నారదుడుండి తీరుతాడు.

ఇక కథలలో నాటకాలలో నాదదుని పాత్ర తక్కువైనదేమీకాదు. కలహ ప్రియుడు, కలహభోజనుడు అయిన నారదుడు తన సహజ చమత్కార, చాడీకోరు మనస్తత్వంతో మాటలతో, దేవుళ్ళకూ, దేవేరిలకు మధ్య, దేవతలకూ రాక్షసులకూ మధ్య తగవులు సృష్టించి, చివరకు దుష్టశిక్షణ, శిష్టరక్షణ జరిగేట్లుగా సన్నివేశాలు ఏర్పాటుచేసి తన సహజ కలహప్రియత్వం లోకోప కారానికేగానీ, లోకాపకారానికి కాదు అని ఋజువు చేస్తూనే వుంటాడు. అలాగే నారదుని రూపంకూడా ప్రతి పామర పండిత హృదయాలలోనూ ఒక్కలానే ముద్రించుకు పోయింది. తలమీద చక్కగా వేసినముడి, ముడిచుట్టురా పూల చెండు, విశాలమైన నుదురుమీద గోవిందనామం, ముంజేతులపై భాగాన పూలదండలు, దంజంలా వ్రేలాడే "మహతి" వీణ కుడిచేతితో చిరుతలు మ్రో గిస్తూ, శ్రీమన్నారాయణ నామం ఆలాపన చేస్తూ, పరవశత్వంతో మధ్యమధ్య "నారాయణ! నారాయణ!" అంటూ గంధర్వగానంతో శ్రీమన్నారాయణ అవ తార కథలు పాడుతూ గగనంలో నిర్విరామంగా విహరిస్తుండే దివ్యమూర్తి రూపం అది. ఆ రూపానికి మార్పులేదు.

అలాటి నారదుడు తన జన్మ వృత్తాంతాన్ని తానే స్వయంగా వేదవ్యాసునికి చెప్పుకుంటాడు భాగవత ప్రథమంలో.

ఒక దాసీ పుత్రుడు నారదుడు. తల్లి కలవారింట చాకిరిచేసి ఈ బిడ్డను పోషిస్తుంది. తనకుకలిగినంతలో ముద్దుగా ఆఇంటివారు పంపగా చాతుర్మాస్య వ్రతంచేస్తున్న కొందరు యోగులకు పరిచర్యచెసే పనిలో నిమగ్నమౌతారు.

శా॥ వారల్ కృష్ణచరిత్రముల్ చదువగా వర్ణింపగా బాడగా
నారావంబు సుధారస ప్రతిమమై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణమైన మదిసంతోషించి నేనంతటన్
బారంభించితి విష్ణుసేవ కితర ప్రారంభ దూరుండనై!

అంటూ, అట్లా బాల్యంలోనే హృదయంలో నాటిన విష్ణుసేవా తత్పరతతో, ఆయోగులకు నిష్కపటంగా సేవచెయుటంతో, వారు ప్రసన్నులై, విష్ణు భక్తి, వైరాగ్యము హృదయంలో నిలిచిపోయేటట్లు జ్ఞానం ప్రసాదించారు. ఆ యోగులు వెళ్ళిపోయాక కూడా ఈ బాలుడాజ్ఞాన బోధను అనుష్ఠానం చేసూనే వున్నాడు. అలా వుండగా అతని తల్లి, తన యజమానుల సేవలో భాగంగా, రాత్రివేళ ఆవుపాలు పితకటానికి వెళ్ళి, ప్రమాదవశాత్తూ పాము కాటుకుగురై మరణిస్తుంది, తల్లిమరణం ఆబాలునిలో దుఃఖం కలిగించకపోగా వైరాగ్యం ఆవరించుకొనివున్న అతని హృదయంలో ఆ బంధం అలా వదలి పోయిందన్న వూరటను కలిగిస్తుంది. తల్లి మరణిస్తే బిడ్డ సంతోషించాడనే అపార్ధంగాక, అశాశ్వతమైన ఇహబంధాలకంటే, శాశ్వతమైన పరమార్ధం వేపు ఆ పిల్లవాని హృదయం ఆకర్షితమై వుందన్నదే దీనిభావం. తల్లి మరణంతో ఏకాకి, బంధరహితుడు అయిన ఆ బాలుడు అరణ్యానికి వెళ్ళి.నిశ్చల బుద్ధితో శ్రీహరిగూర్చి తపస్సు ప్రారంభించాడు. అతడి హృదయంలోనే పరమాత్మ రూపం సాక్షాత్కరించింది క్షణకాలం. అరూపాన్నే మరల మరల చూడాలని ప్రయత్నించాడు. కానీ అదివ్యరూపం అదృశ్యమై, నాగగోచరుడైన శ్రీహరి అస్పృశ్యరూపంలో "నాయనా! ఈ జన్మలోనీవు మరలనన్ను కనుగొనలేవు. ఈ శరీరం పతనమయ్యాక, నీవు నన్ను చూడగలవు విష్ణుభక్తి జన్మ జన్మాంతరాలకు కలసివస్తుంది. వూరకపోదు." అని అతనిని వూరడిస్తాడు ఆ అశరీరవాణి.

క॥ నాయందు గలుగునీమది, వాయదు
జన్మాంతరమున, బాలక నీవీ
కాయంబు విడిచి మీదట, మాయనుమతిఁ
బుట్టగలవు మద్భృడక్తుడవై !

అని పలికి ౨కా-అనీ వరం ప్రసాదిస్తుంది శ్రీహరి కంఠస్వరంగా.

మ॥ విను మీ సృష్టిలయంబు నొంది యుగముల్ వేయైన కాలంబు యా
మినియై పోయెడిఁ బోవగా గలుగుఁ జూ మీదంబున సృష్టి, యం
దు నిరూఢ స్మృతితోడఁ బుట్టెదవు, నిర్దోషుండవై నాకృపన్
ఘనతం జెందెదు, శుద్ధ సాత్త్వికులలో, గణ్యుండవై, యర్భకా !

అట్లా ఆజన్మ అంతా విష్ణు సంకీర్తనతో, పరమ వైరాగ్యంతో, గడిపి సహజ మరణానికి తలవంచి, భాగవత దేహముదాల్చి (దివ్య తేజస్సు రూపంలో) వుండగా ప్రళయ కాలం వచ్చింది. ఆ తమస్సులో ఆ జలరాశి మధ్య శ్రీమన్నారాయణ మూర్తిలో లీనమై నిద్రబోదలచిన బ్రహ్మదేవుని నిశ్వాసంద్వారా, ఆయనలోపల ప్రవేశించిందా దివ్యతేజస్సు. తర్వాత సహస్ర యుగములు గడిచి, బ్రహ్మ నిద్ర మేలుకొని, పునఃసృష్టి ప్రారంభించబోతూ ఆవులించగా, మరీచి ముఖ్యులగు మునులతో బాటు, నారదుడు జన్మించాడు.

సహజ బ్రహ్మచర్యం, నిరంతర విష్ణునామ సంకీర్తన, తనంతతానుగా సప్తస్వరములు పలికే "మహతి" అనే మహా మహిమాన్వితమైన వీణతో శ్రీ మన్నారాయణ కథాగానం చేసే గంధర్వగానం, సుస్వర కంఠస్వరాలతో, అన్నింటికీమించి శ్రీహరి అపార కరుణతో, ముల్లోకాలలోనూ గగన గమనం కలిగిన నారదుడు భాగవత శ్రేష్ఠులలో అగ్రగణ్యుడయ్యాడు. మహర్షులకు జ్ఞానబోధ చేయగలిగిన మహాగురువు అయ్యాడు.

చ॥ ఎఱిగినవాఁడు కర్మచయ మెల్లను మాని, హరిస్వరూపమున్
నెఱయ నెఱుంగుచుండును, మదినేరుపుఁజూపు గుణాను రక్తుడై
తెఱకువ లేక క్రుమ్మరుచు దేహధనాద్యభిమాన యుక్తుఁడై
యెఱుఁగని వానికిం దెలియ, నీశ్వరలీల మునీంద్ర! చెప్పవే.

అని వ్యాసమహర్షికి కర్తవ్యం బోధించి, భాగవత రచనకు ప్రోత్స హించాడు నారదమహర్షి.

శ్రీరామ భక్తుల హృదయంలో ఆంజనేయ రూపంలానే, విష్ణుభక్తులైన వారికీ, కానివారికీ స్త్రీ బాలవృద్ధులందరికీ నారదుని రూపం ఆ సేతు హిమాచలం ఒకటే రకంగా గుర్తుంటుంది ఏనాటికీ. అది

క॥ "చేతుల ద్రాళములొత్తుచు జేతోమోదంబుతోడ,
సిగముడి వీడన్ బాతరలాడుచు మింటను,
గీతము నారదుడు వాడె గృష్ణా యనుచున్!"

## పరిణిత భక్తురాలు కుంతీదేవి

పాండవుల తల్లి కుంతి. ఆమె జీవితమంతా కష్టాల కొలిమిలోనే కాగిపోయింది. భోజమహారాజు కుమార్తె అయిన కుంతీదేవి బాల్యంలో తనతండ్రి ఇంటికి అతిథిగా వచ్చిన దుర్వాస మహర్షిని అతి భక్తి శ్రద్ధలతో పూజించి, సేవలు చేసింది. ఆ సేవలకామహర్షి మెచ్చి, ఒక మంత్రం ఉపదేశించి ఆ మంత్రం జపిస్తూ ఏ దేవతను ఆహ్వానిస్తే, ఆ దేవత స్వయంగా ప్రత్యక్షమై ఆమెకు తనకు సమానమయిన పుత్రుని అనుగ్రహిస్తాడనీ-కానీ అనవసరంగా మంత్రాన్ని జపించకూడదనీ వరం అనుగ్రహించి వెళ్ళిపోతాడు. యవ్వనం లోకి అడుగెట్టిన కుంతి, అటు పూర్తిగా వదలని బాల్యచాపల్యం, ఇటు

యవ్వన కుతూహలంతో దుర్వాసముని మంత్రం పరీక్షించదలచి సూర్యుణ్ణి మంత్రోచ్చారణతో ఆవాహన చేస్తుంది. తక్షణం సూర్యుడు ప్రత్యక్షమై పుత్ర సంతానం ప్రసాదిస్తాడు. ఆ బాలుడే సహజ కవచ కుండలధారి, సూర్యసమాన తేజో నిధి అయిన కర్ణుడు. కుంతీదేవి ప్రార్థనతో, సూర్యుడామె కన్యాత్వం చెడని విధంగా వరమిస్తాడు. కానీ లోకాపవాదుకు భయపడి కుంతి ఆ బిడ్డను ఒక పెట్టెలో పెట్టి, నదిలో విడిచి పెట్టి-తన మాతృ హృదయపు వేదనను అణచి పెట్టుకుంటుంది. (ఈనాటి ఎందరో అవివాహిత తల్లులకూ, అనాథ బిడ్డలకూ ప్రతిబింబాలు ఆనాటి కుంతి, కర్ణులు)

ఆ తర్వాత ఆమె పాండురాజు పత్నిగా మారుతుంది. అక్కడా ఆమెకు కష్టాలే! శాపవశాన పాండురాజు సంతానానికి అనర్హుడౌతాడు. కుంతి, కుంతి సవతిఅయిన మాద్రికి ఆసరికి బిడ్డలు కలుగలేదు. కుంతీదేవి భర్తతో, దుర్వాస మహర్షి మంత్రోపదేశం గురించి చెప్పి, ఆయన అనుమతితో తాను యమ, వాయు, ఇంద్రుల వలన, ధర్మరాజు, భీముడు, అర్జునుడు అనే పుత్రులను పొందుతుంది. తన సవతి అయిన మాద్రి పట్లగల స్నేహభావం, జాలితో ఆమెకుకూడా అశ్వనీ దేవతలిద్దరి వలన నకుల, సహదేవులనే ఇద్దరు కుమారులు కలిగేటట్లు చేస్తుంది. దుర్వాసమహర్షి మంత్రం గురించి భర్తతో చెప్పగలిగి ఆయా దేవతల వలన బిడ్డలు పొంద గలిగిన కుంతీదేవి, స్త్రీ సహజమైన భయంతో, వివాహానికి ముందే తాను కర్ణునికి తల్లిఅయిందన్న నిజం చెప్పకోలేక పోతుంది. బహుశా అలా కాలుజారిన తల్లులకు కలిగే ఆత్మ సంకోచ భావమో, లేక భర్త తనను "జారిణి"గా భావిస్తాడేమోననే భయమో కావచ్చు.

పాండురాజు మరణంతో, ఆమరణానికి కారకురాలైన మాద్రికూడా ఆయనతో పాటు సహగమనం చేయగా, కుంతి అపార మాతృహృదయంతో, కర్తవ్య నిష్ఠతో పాండవులు ఐదుగురినీ సమహృదయంతో పెంచే బాధ్యత వహిస్తుంది. ఇక ఆమె కష్టాలు పరిపాకాన పడ్డాయి పెరుగుతున్న పాండవులకు, కౌరవులైన దుర్యోధనాదుల వలన అనుక్షణమూ అపాయాలూ, ప్రమాదాలే! ఎప్పటికప్పుడే ప్రమాదాలు దైవాధీనంగా తప్పిపోతున్నాయి, ధృతరాష్ట్రుడు,

గాంధారి రాచరికపు భోగాలూ, పెద్దరికపు హోదాలూ అనుభవిస్తుండగా, వారి పిల్లలైన దుర్యోధనాదులు యువరాజు హోదాలు; భోగాలు అనుభవిస్తుండగా వారి పడగనీడలో, పిల్లలు అనుక్షణం ప్రాణహానికి భయపడ్తూ, బాధపడ్తూ, తమని రక్షించగల దైవాన్ని ప్రార్థిస్తూ, దినదినగండంగా గడిపిందాతల్లి. రాజ్యభాగం ఈయవలసి వస్తుందన్న దుర్బుద్ధితో దుర్యోధనుడు చేయించే అఘాయిత్యాలనూ, తన కొడుకుల క్రౌర్యం తెలిసీ, బుద్ధిచెప్పని బావగారి మౌనం, అక్కగారి తటస్థ విధానంతో కడగండ్లపాలైందా తల్లి! మత్స్యయంత్రాన్ని బేధించి, అర్జునుడు ద్రౌపదిని గెల్చుకున్న వేళ (ఏకచక్రపురంలో) "అందరూ సమంగా పంచుకోనండి!" అని చెప్పి, తన మాటకు అనృతదోషం అంటుతుందన్నట్లుగా ద్రౌపదిని "పాంచాలి"గా చేసిందా వివేకవంతురాలైన రాజనీతిజ్ఞురాలైన తల్లి! తన బిడ్డలకు శౌర్యసాహసాలు మాత్రమే ఐశ్వర్యం! అవేవారి తిరుగులేని ఆయుధాలు. వారు ఐకమత్యంగా వుండగలిగితేనే కౌరవులను ఎదుర్కొనగలరు. కౌరవులను జయించితేగానీ తమ రాజ్యభాగం తమకు రాదు. ఇంతటి దూరాలోచనగల ఆతల్లి, ఒకస్త్రీ (ద్రౌపది) మూలంగా అన్నదమ్ములలో అసూయ, ద్వేషం పొడచూపకూడదన్న నిర్ణయంతో ద్రౌపదిని పాంచాలిగా మార్చి, కొడుకులందరినీ మానసికంగా సమాధానపరచి ఐకమత్యం కాపాడింది. రెండవమారు మరలా పాండవులు ద్రౌపదీ సమేతులై అరణ్యవాసం, అజ్ఞాతవాసం చేస్తున్నప్పుడూ, పాంచాలీ పరాభవ సమయంలో ఆ కన్నతల్లి-ధృతరాష్ట్రుని కొలువులో ఆయన పోషణలోనే, అంతఃపురంలో వుండి పోయింది. ఆమె శరీరం హస్తినాపురంలో వుంది. మనసు బిడ్డలవెంట వుంది. ఆమెతన కళ్ళతో అనుదినం కౌరవుల భోగభాగ్యాలు, ధృతరాష్ట్ర గాంధారీల వికృతనీతి చూస్తూ సహిస్తోంది. మనసులో తన బిడ్డల అరణ్య, అజ్ఞాతవాసాల కథలు మననం చేసుకుంటోంది. ఎంతటి సంయమనం కావాలి ఆ హృదయానికి? ఎంతటి ఆత్మ నిగ్రహం కావాలి ఆ స్థితి తట్టుకోవటానికి? ఆమె ఆ కష్టాల కొలిమిలో కాగి కాగి పరమాత్ముని శ్రీ చరణాలను శరణాగతి చెందింది. ఆ పరమాత్ముడు మరెవరోకాదు శ్రీకృష్ణుడని ఆమె గుర్తించింది. అచంచల భక్తి విశ్వాసాలే ఆమెకు ఊరట కలిగించే సాధనాలు. ఆమె సాధన అంతా కఠోర తపస్సు.

అంచేత కుంతి హృదయతప్తమై కాష్ఠంలా మారి – కురుక్షేత్ర సంగ్రామం తర్వాత, ఉత్తర గర్భస్థ శిశువును, శ్రీకృష్ణుడు కాపాడిన వేళ, భక్తిరసం పొంగులువారి, మనసా, వాచా, కర్మణా, శ్రీకృష్ణుని స్తుతించింది.

ఆ కుంతీస్తుతిని వ్యాసమహర్షి ఎలా వర్ణించాడో గానీ, పోతన మాత్రం తానే కుంతీ హృదయంలోనికి పరకాయ ప్రవేశంచేసి, రెండుచేతులూ ఎత్తి, మొక్కుతూ,

క॥ జననము నైశ్వర్యంబును ధనమును
విద్యయును గల మదచ్ఛన్నులకిం
చన గోచరుడగు నిన్నున్, వినుతింపగ
లేరు నిఖిల విబుధస్తుత్యా!

అంటూ,

మ॥ "నినుఁ జూతింజింతుఁ బాడుచుం బొగడుచున్ నీదివ్యచారిత్రముల్
వినుచుం జూతురు గాక, లోకులిత రాన్వేషంబులం జూతురే?
ఘన దుర్జన్మ పరంపరా హరణ దక్షంబై, మహాయోగి వా
గ్వినుతంబైన భవత్పదాబ్జ యుగమున్, విశ్వేశ! విశ్వంభరా!

ఉ॥ "యాదవులందు బాండుసుతులందు నధీశ్వర! నాకు మోహ, వి
చ్ఛేదము సేయుమయ్య! ఘనసింధువుఁ జేరెడిగంగభంగి, నీ
పాదసరోజ చింతనముపై ననిశంబు మదీయబుద్ధి, న
త్యాదర వృత్తితోఁగదియునట్లుగ జేయుగదయ్య యీశ్వరా!"

ఆ వృద్ధురాలు జీవితంలో ఆటుపోట్లకు అలసిపోయి, తనదైన కర్తవ్య నిర్వహణలో కృతకృత్యురాలై, ఆ విజయాన్నికూడా నిర్వికారంగా గ్రహించే వైరాగ్యస్థితికి చేరుకున్న ఆ కఠోర తపస్విని, ఇక చివరి కర్తవ్యంగా మోక్షగామిగా యాదవులందు తన బిడ్డలైన పాండుసుతులందు కూడా ఇక తనకు మోహం వద్దనీ, కేవలం శ్రీమన్నారాయణుని చరణారవిందముల మీద ఏకాగ్రచిత్త కుదిరేలా అనుగ్రహించమనీ మనసారా కోరుకుంది.

చివరగా

శ్రీ॥ శ్రీకృష్ణా యదుభూషణా! నరసఖా శృంగార రత్నాకరా
లోకద్రోహి నరేంద్ర వంశదహనా! లోకేశ్వరా, దేవతా
నీక బ్రాహ్మణ గోగణార్తి హరణా! నిర్వాణ సంధాయకా!
నీకున్ మ్రొక్కెద ద్రుంపవే! భవలతల్ నిత్యాను కంపానిధీ!

అని ఆత్మార్పణ చేసుకుంది. పోతనామాత్యుడు హృదయమూ అదే స్థాయిలో వుండబట్టే ఆ భక్త్యావేశపు ఝరి పద్యరూపంలో అలా వెలువడి ఈనాటికీ ఇంటింటా ఆడ, మగ, వృద్ధుల హృదయాలలో నాలుకమీద నాట్యం చేస్తోంది. ఈనాటి వేలాది కర్తవ్య నిష్ఠాపరులైన ఉద్యోగినులు, భర్తృపరిత్యక్తలు, భర్తృవిహీనులు అయిన స్త్రీలు స్పీడ్ యుగంలో తమశక్తియుక్తులన్నీ కుటుంబ పోషణకూ, పిల్లల్ని పై చదువులు చదివించి, జీవితంలో స్థిరపరిచేందుకూ వినియోగించి, చివరి దశలో ఆ బిడ్డలే "మీరు మాకు భారం, మీదారి మీరు చూచుకొనండి!" అని చెబుతున్న సామాజిక ఆర్థిక, నైతిక, రాజకీయ వ్యవస్థలోని పురుషులూ మనశ్శాంతి వెదుక్కొనే మార్గంలో పై పద్యాలే, పై పద్యాల భావార్థమే మననం చేసుకుంటున్నారనటంలో సందేహం ఏమైన వున్నదా?.

## పవౌన తపస్విని ద్రౌపది

కుంతీదేవికి అన్నివిధాలా తగిన కోడలు ద్రౌపది. మత్స్యయంత్రం ఛేదించిన మహావీరుడు అర్జునుడనీ తెలిసి ఆమె ఆనందానికి అవధులులేవు. కానీ ఒకానొక ధర్మపాశంలో ఆమె "పాంచాలి" గా పంచభర్తృకగా మారింది ఎన్ని ధర్మసూత్రాలు వల్లెవేసినా ఎంతగా సమర్థించినా సాటివారిలో ఆమె అప్పుడప్పుడూ ఆతాలూకు అవహేళనను రుచి చూస్తూనేవుంది ఇక అసహాయ శూరులైన ఐదుగురు భర్తలుండీః వారి ధర్మ బద్దత కారణంగా నిండు సభలో అవమానానికి గురై, అసహాయ స్థితిలో తాను నమ్మిన దైవాన్ని శరణాగతి చెంది-ఆపద గట్టెక్కిన ఇల్లాలు.

ఇక ఆమె జీవితం ఏనాడూ పూలపాన్పు కాలేదు. భర్తల వెంట అరణ్య వాసం, అజ్ఞాతవాసం ఆమె మహారాజ్ఞిత్వానికి కానుక లయ్యాయి కష్టాలు, కడగండ్లె ఆమెకు ఆభరణాలూ, అందాలూ అయ్యాయి,

భీముడు హిడింబిని పెళ్ళాడినా తనకంటూ ఘటోత్కచుడనే పుత్రుని కన్నా, తన ప్రాణసమానుడైన అర్జునుడు తీర్థయాత్రా సందర్భముగా సుభద్రను పరిణయమాడి తెచ్చి-తనకంటూ అభిమన్యునికన్నా ఆమె తనని తాను సంయమనంతో సర్దుకోవలసిందే తప్ప, భర్తలనిగానీ, సవతులుగానీ అయిష్టతతో దూరం పెసేందుకు వీలులేదు. అత్తగారైన కుంతీదేవిలానే ఇల్లాలు అయినా తాను ఆ అన్నదమ్ముల ఐకమత్యాన్ని తద్వారా భావి కురుక్షేత్ర సంగ్రామంలో వారి జయాన్ని ఆకాంక్షించటమే తప్ప మార్గంతరంలేదు. ఇక దుర్యోధనుని ఘోషయాత్ర వందర్భంగా బందీగా చిక్కిన దుర్యోదనుని విడిపించటానికి పరోక్షకారకురాలిగా మారి తనదైన విశాల హృదయం ముఖ్యంగా సాటిస్త్రీ అయిన(భానుమతి దుర్యోదనువిభార్య`పట్ల ప్రదర్శించు కుంది. ఇక కీచకుడు తనని అవమానపరచిన సందర్భంలో కీచకవధ ఘట్టం లోనూ వీరపత్ని అవతారం ఎత్తి తనలో అణచి పెట్టబడియున్న బాధనూ, వీరత్వాన్ని ప్రదర్శించింది.

కురుక్షేత్ర యుద్ధ సందర్భంగా ఆమె తను నమ్మిన దైవం సోదరుడు అయిన శ్రీకృష్ణునితో, తన భర్తలకు పరోక్ష హెచ్చరికగానూ, తన అవమా నాగ్నికి ప్రతీకారంగానూ, దుశ్శాశనుడి చేతులతో ఈడ్చుకురాబడి, అపవిత్ర మై, అందాక ముడివేయని తన కేశ పాశాలను చూపిస్తుంది. కురుక్షేత్ర సం గ్రామం తర్వాత అశ్వద్దామ నిద్రపోతున్న తన ఐదుగురు బిడ్డలను హత్య చేయటంతో, ఆమెకు "తనదంటూ" ప్రత్యేకంగా ఏమీ మిగలని శూన్యం ఏర్ప డింది, కషాల కొలిమిలో కాగికాగి, ఎన్నో చేదు అనుభవాల సమ్మెట పోట్లకు గురౌతూ, ఆత్మ విశ్వాసాన్ని కోల్పోక, కుంతికి సమానంగా కర్తవ్యపాలన చేసిన ద్రౌపదికి చివరకు తన బిడ్డలంటూ కూడా ఎవరూ దక్కలేదు. ఆ మన స్థితి వర్ణనాతీతం! తనబిడ్డలను క్రూరంగా హత్యచేసిన అశ్వద్ధామను శ్రీకృష్ణుడు

సారథిగా, అర్జునుడు బంధించి తెస్తాడు. మరో స్త్రీ అయితే "ఆ శిశుహంతను ఇంకా ప్రాణాలతో ఎందుకు తెచ్చావు? ఖండఖండాలుగా నరికి కాకులకూ గద్దల కూ వేయలేక పోయావా? ఇప్పుడైనా మించిపోయిందిలేదు, నా కళ్ళముందు కత్తికో కండగా నరికివెయ్యి, బిడ్డల అసహజ, అకాల క్రూర మరణంతో తల్లడిల్లి పోతున్న నా హృదయం ఆదృశ్యం చూచి ఆనందిస్తుంది, శాంతిస్తుంది. అని చెబుతుంది. చెప్పవలసిన ఘట్టమే అది.

కానీ ద్రౌపది ఓరకంగా తపస్సమాధిస్థితికి చేరుకున్న కర్తవ్య నిష్ఠా గరిష్ఠురాలైన ఇల్లాలు కష్టల కొలిమిలో ఆమె వివేకం వేయిరెట్లు పెరిగింది. ఆపదల తోరణాలలో ఆమె హృదయం ప్రతిక్షణం భగవంతుని శ్రీచరణాలకు చేరువయ్యింది. ఒక్కో జీవితానుభవం ఆమెని అపార ఆత్మసంయమనానికీ భగవంతునిపట్ల ఆత్మార్పణకూ నడిపించుకు పోయాయి. సోదర బాంధవ్యం గల శ్రీకృష్ణుడామెకు సాక్షాత్తూ దేవుడే! వైరాగ్యం ఆమె హృదయంలో ఒక్కో అణువణువే ఆక్రమించుకుంటూ, సదసద్వివేచన అనే జ్యోతిని వెలిగించింది. అపారమైన కరుణ, ఎదుటివారి మానసిక వేదనను అర్థం చేసుకోగల దూర దృష్టి, అంతర్దృష్టి ఆమెలో స్థిరంగా నిలిచాయి, ఇది జీవితాన్ని తపస్సులా ప్రాప్తమైన దానిని సంతోషంగా స్వీకరించే మనస్సును అయిత్తవరచుకొన్న వారికే సాధ్యమౌతుంది, అలాటి వారినే దైవం వెంటవుంటాడు. కాపాడు తూంది.

అశ్వత్థామ సిగ్గుతో, అవమానంతో, ప్రాణభీతితో నిల్చునివున్నాడు. ద్రౌపది ఆజ్ఞ అయితే అతడిని ఆమె కళ్ళముందు ఖండ ఖండాలుగా నరక టానికి అర్జునుడు సిద్ధంగా వున్నాడు. ఆ సమయంలో ఆమెకు తన భర్తల గురువైన ద్రోణాచార్యుడు గుర్తుకొచ్చాడు, అయిన ప్రతిబింబం అన్నట్లున్న అశ్వత్థామ గురుపుత్రునిగా మాత్రమే దృగ్గోచరుడైనాడు. గౌరవభావంతో అతనికి మ్రొక్కింది,

మ॥ పరగన్ మా మగవారలందఱుసుమున్ బాణ ప్రయోగోప, సం
హరణాద్యాయుధ విద్యలన్నియును, ద్రోణాచార్యుచే, నభ్యసిం
చిరి, పుత్రాకృతినున్న ద్రోణుడవు, నీచిత్తంబులో లేశమున్
గరుణాసంగములేక, శిష్య సుతులన్ ఖండింపగా బాడియే?

అంది మృదువుగా!

క॥ భూసురుడవు, బుద్ధిదయా-భాసురుఁడవు, శుద్ధ వీరభట సందోహా
గ్రేసురుఁడవు, శిశు మారణ-మాసురకృత్యంబు, ధర్మమగునేతం

అని ఆశ్చర్యంగా ప్రశ్నించింది అంతటితో ఆగక,

శా॥ * ద్రేకంబునరారు శస్త్రధరులై, యుద్ధావనిన్ లేరు, కిం
చి ద్ద్రోహంబును నీకు జేయరు బలోత్సేకంబుతోఁ జీకటిన్
భద్రాకారుల, చిన్న పాపల, రణ ప్రౌఢ క్రియా హీనులన్
నిద్రాసక్తుల, సంహరింప నకటా! నీ చేతులెట్లాడెనో?

అంటూ, భూసురత్వం మరచి, రాక్షసత్వం చూపిన, ఆ భూసురరూప రాక్షసు
డికి, ఆత్మ విమర్శకు అవకాశం ఇస్తూ ప్రశ్నించింది. ఇక అప్పుడామెకు
అశ్వద్ధామ దీన వదనంలో. మ్లానవదనంలో, అశ్వద్ధామ కన్నతల్లిహృదయిం
దృగ్గోచరమైంది! అంతే! ఈమె మాతృహృదయం వివేకదీప్తమై విలవిల్లాడి
పోయింది క్షణకాలం.

ఉ॥ అక్కట! పుత్రశోక జనితాకుల భార విషణ్ణచిత్తనై
పొక్కుచు నున్నభంగి, నిను బోర గిరీటి, నిబద్ధుజేసి, నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట వహింపనిదై, భవదీయమాత, నే
డెక్కడ నిట్టి శోకమున నేక్రియ నేడ్చుచు బొక్కుచున్నదో!

అని తన సాటి మాతృదేవత మనోవేదనను స్పష్టంగా తెలియఁబలికిన కరుణాసముద్రురాలు ద్రౌపది! నిజమైన భాగవతులలో నిలచి వెలిగే "సమ దృష్టి" ఆమె హృదయాని కెప్పుడో అలవడిందన్న సత్యానికి ఇదో ఉదాహరణ

ఉ॥ ద్రోణునితో శిఖింబడక, ద్రోణ కుటుంబిని యున్నదింట, న
క్షీణ తనూజ శోక వివశీకృతయై విలపించు భంగి, నీ
ద్రౌణి దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంతపొక్కెనో,
ప్రాణ వియుక్తుడైన నతిపాపము! బ్రాహ్మణ హింస మానరే!

క॥ "భూపాలకులకు, విప్రుల- గోపింపం జేయదగదుః కోపించిన, ద
త్కోపానలంబు మొదలికి, భూపాలాటవులఁగాల్చు భూకంపముగాన్"

అని అర్జునునికి కర్తవ్య బోధచేసి. స్వయంగా ఆ శిశు హంతకుణ్ని రక్షించిందా ఇల్లాలు! ఒక్కో పద్యం ఒక్కో రసగుళికగా పోతన హృదయం నుంచి జాలువారి, ఆ పద్యపాద పాదంతో, అక్షరం అక్షరంలో ద్రౌపది మూర్తి, ద్రౌపతి మనస్థితి, ద్రౌపది నీతి, ద్రౌపతి ఆత్మసంయము మన కళ్ళముందర చిరంజీవిగా నిలిపాడు కదా? మహాకవి.

ద్రౌపతి చెప్పిన ఈ తీర్పువిని మండిపడుతాడు భీముడు.

చ॥ 'కొడుకులబట్టి చంపెనని కోపము నొందదు, బాలఘాతకున్
"విడువు" మనించు జెప్పెడిట "వెర్రిది" ద్రౌపది! వీడు విప్రుడే?
విడువగనేల? చంపుడిటు, వీనిని మీరలు సంపరేని, నా
పిడికిటి పోటునన్ శిరము భిన్నము సేసెద జూడుడిందఱున్!

అంటూ వచ్చిన భీమసేనుని వీరావేశాన్ని వర్ణించాడు. మహాకవి ఒకే ఒక "చంపకమాలలో" అయితే అన్నిటికీ అద్యుడు, అర్హుడు. అన్నీ తెలిసిన భగవంతుడు అయిన శ్రీకృష్ణుడు భీముడునుంచి అశ్వత్థామను రక్షించటానికి.

అడ్డువచ్చిన ద్రౌపదిని ఆందోళన చెందనీయకుండా, భీమునికోపం చల్లార్చి మంచి మాటలుచెప్పి, అటు అర్జునుని శపథం తీరేలా, అశ్వత్థామకు శిరోముండనం చేయించి సహజ చూడామణి అనే శిరోరత్నాన్ని తీయించి పంపించి వేస్తాడు. మరణాన్ని మించిన శిక్ష వేయించి బ్రాహ్మణ హత్య జరుగకుండా!

జీవితమంతా బిడ్డలకోసం బాధలు అవమానాలు సహించి భరించి కర్తవ్యం కోసం జీవించిన మాతృమూర్తి, చివరగా "మోహవిచ్ఛేదము జేయవయ్యా" అంటూ బిడ్డలపట్ల మమకారాన్ని కూడా త్రెంచి వేయమని శరణాగతి చెందినట్లే, భర్తలకోసం తనదైన ధర్మంకోసం, జీవితమంతా సుశిక్షిత తపస్వినిలా మానతపస్వినిలా నిర్వికారంగా గడిపిన ద్రౌపది పరిణత సంస్కారం అది!

ఈనాడు ఎందరో హంతకులు, మానభంగాల మహావీరులూ, చట్టాల కళ్ళు గప్పి పెద్ద మనుషులుగా చలామణీ అవుతుండటం మనందరం చూస్తున్నాం.

వారు చేసిన, చేస్తున్న ఘోరనేరాలకు దైవమే ఒకనాడు శిక్ష వేస్తాడులెమ్మని క్షమించి వదిలే ఎందరో కన్యల, స్త్రీల ఇల్లాళ్ళ, మాతృమూర్తులకు మూల గురువు ద్రౌపది! పోతన మహాకవి తేటతెల్లం చేశాడా సత్యాన్ని-అవునా?

## రాజస ఉత్తమ భక్తుడు భీష్ముడు

కుంతీస్తుతి తర్వాత, ద్వారకా నగరికి మరలిపోదల్చుకున్న శ్రీకృష్ణుని ధర్మరాజు ఆపి. తన ఘనవైరాగ్యం చెప్పి, జననష్టంతో, బంధు మరణంతో రక్తసిక్తమై సంప్రాప్తించిన ఈ రాజ్యం తన కవసరం లేదనే వైరాగ్య భావంతో, శరతల్పగతుడైన భీష్మాచార్యుని వద్దకు బయల్దేరుతాడు. అదొక నెపంగా తీసుకొని భీష్ముని అంతిమ క్షణాలలో తాను ఆయనకు దృగ్గొచరుడై భీష్మునికిమోక్షం ఇవ్వదలచినందుకు కాబోలు అనిపించేట్లుగా శ్రీకృష్ణుడు ధర్మరాజువెంట భీష్ముని వద్దకు వస్తాడు పాండవులు, ఋషులు, కుంతి మొదలైన వారందరి వెంట వచ్చిన శ్రీకృష్ణ భగవానుని చూచి కళ్ళు చెమర్చగా స్తోత్రం చేస్తాడు భీష్ముడు.

భీష్ముడు యోధాన యోధుడు, గంగా తనయుడు తన తండ్రి శంతన
మహారాజు సత్యవతిని పెండ్లాడే సమయంలో, సత్యవతి తండ్రి, తన కుమార్తె
బిడ్డలకే రాజ్యాధికారం దక్కాలని పెట్టిన షరతులకు అంగీకార సూచకంగా,
తాను ఆజన్మ బ్రహ్మచారిగా వుండిపోతానని భీష్మ ప్రతిజ్ఞచేసి, అది ఆచరించి
భీష్ముడిగా ప్రసిద్ధి చెందినవాడు గాంగేయుడు.

ఆయన జీవితధ్యేయం కురువంశస్థులను సేవించటం, వారి వారి
యుద్ధాలలో వారి పక్షం వహించి శక్తివంచన లేకుండా పోరాడి, విజయం
సాధించటమే! వారి రాజ్యలక్ష్మిని కాపాడటమే ప్రథమ కర్తవ్యం. ఒకానొక
సుక్షితుడైన సైన్యాధికారి పాత్ర భీష్మునిది ఇందులో మమకారాలకు, తర్కా
లకూ తావులేదు. న్యాయన్యాయ విచారణకు ఆస్కారంలేదు. కర్తవ్యం ఒక్కటే
ధ్యేయం, అదే లక్ష్యం.

ఇక భీష్ముని జీవితంలో ఎన్నో సంఘటనలు అనుకోకుండా జరిగి
పోయాయి. తన సోదరులు (సత్యవతీ పుత్రులు) అర్భకులు, శౌర్యహీనులు
నిరంతర స్త్రీలోలురు. అనారోగ్యపు అర్భకులు అయిన విచిత్ర వీర్య, చిత్రాం
గదుల కోసం రాచకన్యలను వివాహానికి అంగీకరింపజేయుటం అసంభవమని
భీష్మునికి తెలుసు అంచేత కాశీరాజు కుమార్తెలయిన అంబ, అంబిక, అంబా
లికల స్వయంవరానికి తానే స్వయంగా వెళ్ళి, అక్కడి రాజులందరినీ యుద్ధం
లో ఓడించి బలాత్కారంగా (రాక్షస విధానంలో) ఆ ముగ్గురు కన్యలను తన
తమ్ముళ్ళిద్దరికీ వివాహంచేయుటానికి లాక్కొని వస్తాడు భీష్ముడు. కానీ ఆకన్య
లలో "అంబ" తాను సాళ్వరాజును ప్రేమించినట్లు చెబుతుంది పశ్చాత్తాపంతో
భీష్ముడు 'అంబ'ను సగౌరవంగా సాళ్వరాజు దగ్గరికి పంపి అంబిక, అంబాలి
కను తన తమ్ముళ్ళిద్దరితో వివాహం జరిపిస్తాడు.

సాళ్వరాజు "భీష్ముడు అపహరించుకు పోతుండగా నిస్సహాయంగా
వుండి పోయాను నేను నిన్ను పెళ్ళాడను. భీష్ముని వద్దకే తిరిగి వెళ్ళమని"
అవమానంతోనూ, బాధతోనూ తిరస్కరిస్తాడు. అంబ తిరిగి భీష్ముని వద్దకు
వస్తుంది. నిర్వీర్యులు వివాహితులు అయిన ఆయన తమ్ముళ్ళనిగాక,

ఆయననే స్వయంగా తనని వివాహం చేసుకోమని, తద్వారా తనున్న నిస్సహాయస్థితి, రక్షణలేనిస్థితి, పుట్టినింటికి తిరిగిపోలేనిస్థితి గురించి పరోక్షంగా విన్నవించుకుంటుంది. దురదృష్ట వశాత్తు ఒక ఆడపిల్ల ఇష్టంగానో అయిష్టంగానో, బుద్ధిపూర్వకంగానో, బలాత్కారంగానో, ఇంటి బయటకు వచ్చేయటం జరిగితే ఇక పుట్టినింటా, మెట్టినింటా, సమసమాజంలోనూ ఆమెకు ఆనాడూ ఈనాడూ కూడా రక్షణ, స్థానం, గౌరవం లేదన్నది అంబ కథద్వారా మనకు బోధపడుతుందినాటికీ, ఇలాటి అంబలెందరో వున్నారీనాడు.

కానీ భీష్ముడు తన భీష్మ ప్రతిజ్ఞచెప్పి, అంబను తిరస్కరిస్తాడు. అన్ని విధాలా సర్వనాశనమైన అంబ నిస్సహాయ కోపంతో, పగలో, ప్రతీకార వాంఛతో తన ఈ స్థితికి కారకుడైన భీష్ముని మరణం కోసం ఈశ్వరుని గురించి కఠోర తపస్సు చేస్తుంది. నిస్సహాయురాలైన పగతోనిండిన స్త్రీ హృదయం ఎలా భగవదర్పణం అవుతుందో ఇదో ఉదాహరణ. ఈశ్వరుడు ప్రత్యక్షమై భీష్ముడు ఒకానొక ప్రత్యేక సందర్భంకోసం గాంగేయునిగా అవతరించినవాడవటంవల్ల ప్రత్యక్షంగా అతనిని మరణింపజేయటం అసాధ్యమని "శిఖండి" గా పుట్టి తద్వారా భీష్ముని మరణానికి పరోక్షకారకురాలివి కమ్మని ఆదేశిస్తాడు. ఆమె శిఖండిగా పుడుతుంది దేహత్యాగానంతరం, కురుక్షేత్ర యుద్ధంలో భీష్ముని యుద్ధంరోజు, శిఖండి పాండవుల పక్షంలో సారథిగామారి భీష్ముని పతనానికి కారకురాలౌతుంది. అర్జునుడా మహాయోధునికి కురుక్షేత్ర యుద్ధం అంతమయ్యేవరకూ, ఆయన వరం పొందిన "ఇచ్ఛామరణ" అనుసరించి ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చే వరకూ అంపశయ్యను అమరుస్తాడు తాతగారి మీద భక్తి గౌరవాలతో,

భీష్మునికి పాండవులది ధర్మం అని తెలుసు. దృతరాష్ట్రునిదీ, కౌరవులదీ అధర్మమనీ తెలుసు. ఎప్పటికప్పుడు నీతిమార్గం తన తమ్ముని మనుమలైన దుర్యోధనాది కౌరవులకు చెబుతాడేగానీ, వాళ్ళు వినిపించుకోలేని స్థితిలో సుశిక్షితుడైన సైన్యాధికారిలానే తన కర్తవ్యం మాత్రం పాలిస్తూ మౌనం

వహిస్తాడు. అయితే ఆయన జీవితమంతా అధర్మంవేపు నిలబడి, తన కిష్టం లేకుండానే అధార్మికులకు సాయంచేయటంలోనే గడిచిపోయింది. హృదయ సంస్కారం సదసద్వివేక హృదయం కలిగిన ఏ వ్యక్తికయినా అది ప్రత్యక్ష నరకం. అయినా తప్పదు, శ్రీకృష్ణుడు సాక్షాత్తూ భగవంతుడనీ, ఆయన అండ పాండవులకుండగా వారికి ఏ ఆపదలూ ప్రాణహానీ కలిగించవని విజయం తథ్యంగా పాండవులదేనని మనసా వాచా, కర్మణా తెలిసిన నమ్మిన వ్యక్తి భీష్ముడు! అంచేత తన కర్తవ్య పాలనలో భాగంగా యుద్ధంచేశాడు. దుర్యోధనుని పక్షం వహించి తనకు మరణం ఆసన్నమైందని శిఖండిద్వారా తెలుసుకుని, ఆ అపజయాన్ని, మరణాన్ని ధీరోదాత్తతతో ఆహ్వానించాడు. ధీరుని లానే! ధర్మరాజుకు రాజ్యపాలనకు సంబంధించిన విషయాలెన్నో అనుభవజ్ఞునిగా, తెలిపి ఇక తన కర్తవ్యం పరిసమాప్తమైందని తెలుసుకొని జీవితమంతా యుద్ధాలు, రాజకీయ కలుషిత వాతావరణంలో గడిపిన తన మనోవాక్కాయ కర్మలనూ, ఒక్కసారిగా భగవంతుడైన కృష్ణునిమీద కేంద్రీకరించాడు చివరి క్షణాలలో సాక్షాత్తు భగవంతుడే తన యెదుట నిలబడియుండగా భీష్ముడు భవబంధాలను క్షణంలో త్రెంచివేసుకున్నాడు. వైరాగ్యపు అంచులకు వెళ్ళాడు.

ఉ॥ వాయువశంబులై యెగసి, వారి ధరంబులు మింట గూడుచుం
బాయుచునుండు కైవడి బ్రపంచము సర్వముఁగాలతంత్రమై
పాయుచుఁగూడుచుండు నొకభంగి జరింపదు, కాలమన్నియుం
జేయుచునుండుఁగాలము విచిత్రము, దుస్తరమెట్టి వారికిన్"

అంటూ విధి బలీయమైనదని చెప్పి,

మ॥ "త్రిగన్మోహన నీలకాంతిఁదనువుద్దీపింపఁ బ్రాభాత నీ
రజ బంధు ప్రభమైన చేలము పయిన్రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై, విజృంభింప, మా
విజయుం జేరెడు వన్నెఁకాఁడుమది నావేశించు నెల్లప్పుడున్"

మ॥ హయరింఖాముఖ ధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై,
రయజాత శ్రమతోయ బిందుయుతమై రజిల్లు నెమ్మోముతో
జయముం బార్థునకిచ్చు వేడ్కనని నాశస్త్రాహతిం జాలనో
చ్చియు బోరించు మహానుభావు మదిలో జింతింతు నశ్రాంతమున్"

మ॥ నరుమాటని నవ్వుతో నుభయసేనా మధ్యమక్షోణిలో
బరులీక్షింప రథంబునిల్పి, పరభూపాలావళిం జూపుచుం.
బర భూపాయువులెల్లఁజూపులన శుంభత్కేళి వంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడు మనః పద్మాసనాసీనుడై.

సీ॥ కుప్పించి ఎగసినఁ గుండలంబులకాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనగ
నుఱికిన నోర్వక యుదరంబులోనున్న జగముల వ్రేగున జగతి గదల
జక్రంబుజేపట్టి చనుదెంచు రయమున బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయక మన్నింపుమని క్రీడిమరలఁ దిగువ.

తే॥ గీ॥ గరికి లంఘించు సింహంబు కరణిమెఱసి
నేడు భీష్మునిఁజంపుదు నిన్నుగాతు
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టి
దెరలి చనుదెంచు దేవుండు దిక్కునాకు"

మ॥ ఒక సూర్యుండు సమస్త జీవులకు దానొక్కొక్కడై తోచుపో
లిక నేదేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యక దంబంబుల హృత్స రోరుహములన్ నానావిధానూన రూ
పకుడై యొప్పుచునుండునట్టి హరినే బార్థింతు శుద్ధుండనై"

అట్లా స్తుతించి భీష్ముడు ఆ శ్రీకృష్ణుని దివ్యమంగళ విగ్రహంమీద చూపులు నిలిపి, మనసు నిలిపి మోక్షం పొందాడు.

పోతన మహాకవి భీష్మునిలోనూ పరకాయ ప్రవేశం చేశాడు. భీష్ముని ద్వారా పలికిస్తున్నట్లు ఆయన హృదయంలోనుంచి భక్త్యావేశం వెల్లువలై పెల్లుబికింది. అంచేత సుమారు ఐదువందల సంవత్సరాల క్రితం తాళపత్ర గ్రంథంగా వెలువడిన పోతన భాగవత తాళపత్ర ప్రతులు శిధిలమై పోయి నా యావదాంధ్ర ప్రజల హృదయాలలో "భీష్మస్తుతి" చెరిగిపోలేదు. శిథిలం కాలేదు. ప్రభాత పూజ సమయంలో సాధారణ విష్ణుభక్తులందరి స్తోత్రాలూ జపాలూ, మంత్రాలూ అంటూ సాంగో పాంగపూజ చేసుకోటానికి అవకాశంలేని ఆధునికుల నాలుకలమీద భీష్మస్తుతి నర్తిస్తుంటుంది. త్రిజగన్మోహ నీలకాంతి తనువుతో కుప్పించి ఎగసినవుడు మిడిపిపడే కుండలాల కాంతితో, ఒక సూర్యుడు సమస్త జీవులకు తానొక్కడై తోచినట్లు విష్ణుమూర్తి వివిధ రూపాలు మానసోల్లాసకరంగా హృదయంమీద నర్తిస్తుంటాయి. ముద్దు పలుకుల చిన్నారులుకూడా వచ్చేరాని మాటలతో పలుకుతారీ పద్యాలు. కర్తవ్య నిష్టలో పండిపోయిన ఒకానొక ఆజన్మ బ్రహ్మచారి మనసు భగవంతుడికి అర్పితంచేసి, శరీరము, కర్తవ్యమూ, శరీర, సామాజిక, రాజకీయ ధర్మాలకు అనువుగా మలచుకొని తన కర్తవ్యం పూర్తయిన మరుక్షణంలో భగవంతుని లో ఎంత త్వరగా, ఎంత నిశ్చింతగా ఐక్యంకాగలడో భీష్మ నిర్యాణం మనకు తెలుపుతుంది. ఉత్తమ శ్రేణికి, ఉత్తమ భగవత్సంస్కారానికి చెందిన ఉత్తమ భాగవతుని కథ ఇది.

## "మనలో "విష్ణురాతు" లెందరో?

ఉత్తర గర్భంలోవున్న అభిమన్యు కుమారుడైన ఆ శిశువుపై అశ్వత్థామ తనకు అర్జునుడు చేసిన అవమానాగ్నికి దహించుకుపోతూ తన తండ్రి ఆజ్ఞకూడా లెక్కచేయక "అపాండవంబగుగాక" అంటూ "బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని" ప్రయోగిస్తాడు. అది చిచ్చర పిడుగులా వచ్చి గర్భస్థ శిశువును ఛిన్నాభిన్నం చేయటానికి ఉద్యుక్తమౌతుంది, ఆగర్భస్థ శిశువు తన జన్మ జన్మాంతరాల సంస్కార పుణ్యవిశేష జ్ఞానంతో.

ఉ॥ కుఱ్ఱడశక్తి లే, దుదంగోళము లోపల నున్నవాడ ది
క్కెయ్యది? దా ననాథనని యెప్పుడు దల్లి గణింప విందునే
డియ్యిభుమ వహ్ని వాయుటకు నెయ్యది మార్గము? నన్ను గావ నే
యయ్యగలండు? గర్భజని తాపదనెవ్వడెఱుంగు దైవమా?"

అంటూ ఆవేదనతో మొదలెడుతాడు.

తల్లి గర్భంలోవుండే ప్రతి శిశువు వేదనా. ఏ చిన్న ఆవదగలిగినా ఆ శిశువు పడేయాతన, తల్లి మనోభావాలు ఆ శిశువు గ్రహించే తీరు, తల్లి మాన సిక, శారీరక స్థితిగతులు, ఆబిడ్డపై వాటివాటి ప్రభావం చూపే తీరూ, అత్యంత అద్భుతంగా విశదీకరిస్తుంది పద్యం ఒక్కటే "గర్భజనితాపద నెవ్వడెఱుంగు దైవమా?" అంటూ లోలోపల తానుపడే నరకయాతన ఎవరికి తెలుస్తుందని వాపోతాడా శిశువు.

ఈనాటి నవనాగరిక సమాజంలో చట్టబద్ధ గర్భస్రావాలు కానసీండి, చాటుమాటు గర్భస్రావాల కథలు కానీండి, ఆ గర్భస్థ శిశువులు పడే నరక యాతనకూ, చిత్రహింసకూ తార్కాణాలు ప్రసిద్ధ శాస్త్రవేత్తలు, డాక్టర్లు గర్భ విచ్ఛిత్తి సమయంలో వుపయోగించే మందులతో లోపల పిండం ఎన్ని ముక్కలుగా చేధింపబడుతుందో ఏంతటి చిత్రహింస అనుభవిస్తుందో వివరం గా ఎన్నో వైద్య పత్రికలలో ప్రచురించారుకూడా. గర్భవిచ్ఛిత్తికి వుపయో గింపబడే పల్లెటూరి మూలికలు, ఆకు పసర్లు, మాత్రలు, చట్టబద్ధంగా టౌన్లలో సిటీలలోఇచ్చే ఇంజక్షన్స్, మందులు ఏవైనాసరే ఆ గర్భస్థ శిశువుపాలిట బ్రహ్మశిరోనామకాస్త్రలే. ఇక తన తల్లిని గురించి మరింతగా ఆవేదన చెందు తాడా శిశువు మూగవేదనతో.

క॥ చిచ్చఱకోల వంశంబున జచ్చి బహిర్గతుడ గాని సమయమునను దా
నుచ్చలిత గర్భవేదన-జచ్చును మాతల్లి గర్భసంతాపమునన్"

అవునుమరి గర్భస్థ శిశువులో చలనం (ప్రాణం) పోయాక ఇక తల్లి గర్భంలో నుండే ఆ పిండం లేక ఆ శిశువు బయటపడే మార్గం వుండదు. గ్రామ ప్రాంతాలలోని మోటు మంత్రసానుల మొరటు పద్ధతులలో ఆధునికులు చాటుమాటు ప్రణయాల తాలూకు పాపభారం దింపుకొనే ప్రయత్నాలలో ఇలా మృత పిండం రోజుల తరబడి తల్లి గర్భంలోనే వుండి పోవడంతో, ఆ తల్లులుకూడా నరకయాతనపడి శరీరమంతా సెప్టిక్ అయిపోయి. బ్రతికి వుండగానే దుర్భరమైన దుర్వాసన వ్యాపించి, ఆ తర్వాత మరణించటం సర్వసాధారణంగా జరుగుతున్న విషయమే.

అప్పుడా శిశువుకు తోచిన, వున్న ఒకే ఒక మార్గం-శరణాగతి. బయటివారు చెప్పుకొనే ముచ్చటల సారాంశం అర్థం చేసుకొనే గ్రహణశక్తి కలిగి వుంటాడా శిశువు.

క॥ చెచ్చెర బాణజ్వాలలు, వచ్చిన విఘ్నండుగావ వచ్చుననుచు దా
ముచ్చటలు సెప్పసతులకు—నిచ్చలు, మా యవ్వనేడు నిజమయ్యెడినో

అంటాడు. ఇదే గ్రహణశక్తి కారణంగా అభిమన్యుడు, సుభద్రాగర్భస్థ శిశువై యుండగా తండ్రి అయిన అర్జునుడు "పద్మవ్యూహ ప్రవేశం" వరకూ తల్లికి చెబుతుండటం విని గ్రహిస్తాడు. ప్రహ్లాదుడు, లీలావతి అగర్భస్థ శిశువై వుండి నారదమహర్షి విష్ణునామ సంకీర్తననూ, విష్ణుభక్తినీ, అష్టాక్షరీ మంత్రాన్నీ హృదయగతం చేసుకొని జన్మతః పరమ భాగవోత్తమునిగా మారిపోతాడు.

ఇక చివరగా.

శా॥ రాడాచూడ సమస్త భూతములలో రాజిల్లు వాడిచ్చటన్
లేడా? పాటుని చిచ్చులమ్ము దొలగన్ లీలాగతిన్‌ద్రోచి, నా
కీడా నేడభయ ప్రదాన, మత్స? డూ హింపన్ నతత్రాత, మున్
కాడా? యొందఱిగాన? డీ యెడల మత్కర్మంబు దానెట్టిదో!

అంటూ చేతులుమోడ్చి (గర్భస్థశిశువు తల్లిగర్భంలో ఇమిడి వుండేటి శే అది) ఆర్తిగా పిలుస్తాడు. అప్పుడు శ్రీమహావిష్ణువు ఆశిశువు ఎదుట ప్రత్యక్షమై ఆపద నివారిస్తాడు. శంఖ చక్ర గదాభయహస్తుడై తనని రక్షించటానికి వచ్చిన ఆ మహానుభావుడెవరా అని పరిశీలిస్తూ, ఆ మహానుభావుడిని మరలా చూడాలనీ అన్ని దిక్కులనూ పరీక్షిస్తున్నట్లు పుట్టిన ఆ శిశువుకు "పరీక్షిత్తు" అనే పేరొచ్చింది.

కానీ ఆశిశువు తాతగారైన ధర్మరాజు మనఃస్థితి వేరుగావుంది. కురుక్షేత్ర సంగ్రామంలోనూ, సంగ్రామానంతరము, కురుపాండవుల బంధుమిత్రులు అంతా సభాంధవంగా మరణించారు. ఇక పాండవ వంశాంకురమైన కౌరవ వంశాకురమైనా రాజార్హత గలిగినవాడీ శిశువు ఒక్కడే. ఈతని మీద, ఆ తాతగారి ఆశలన్నీ ఇక ఈ శిశువు గుణగణాల ఎలా వుండబోతాయో అన్న సహజమైన ఆందోళన, ఆవేదన ఆ తాతగారిది. అందుకే ఆ శిశువు జన్మోత్సవ సందర్భంగా బ్రాహ్మణులను సన్మానించి, ధర్మరాజు తన సందేహాలను బయట పెడతాడు.

శా॥ "ఓ పుణ్యాత్ములార నా పలుకు మీరూ హింపుడా; మ్రొక్కెదన్;
మా పెద్దల్ శ్రుతకీర్తులై సదయులై మున్నారు రాజర్షులై;
యీ పిన్నాతడు వారిబోలెడి గదా యెల్లప్పుడున్ మాధవ
శ్రీపాదంబుజ భక్తి యుక్తుడగుచున్ జీవించునే? చూడరే!"

అంటూ తన పౌత్రుడు తను వారసునిగా, తమలాటి సత్కీర్తి ప్రతిష్టలతో, విష్ణుభక్తితో రాజ్యపాలన చేస్తాడో చేయడోనని అడుగుతాడు. ప్రతి తాతకూ, తన మనవళ్ళపట్ల వుండే కుతూహలమూ, వాత్సల్యమూ, భయమూ ఇదే.

చ॥ "ప్రకటిత దైవయోగమున పౌరవసంతతి యంతరింపగా
వికలత నొందనీక, ప్రభవిష్ణుడు విష్ణుడనుగ్రహించి శా
బకు ప్రదికించెగావున, నృపాలక శాబకు డింక, శాత్రవాం
తకుడగు "విష్ణురాతు" డన ధాత్రి బ్రసిద్ధికి నెక్కు బూజ్యుడై?

అంటూ ఆశిశువుకు వ్యవహార నామంగా "విష్ణురాతుడు" (విష్ణువుచే రక్షింప బడినవాడు) అని పేరు స్థిరం చేస్తారు. ఆ విష్ణురాతుడే పరీక్షిత్తుగా ప్రసిద్ధికెక్కి- పరీక్షిన్మహారాజుగానే చరిత్రలో నిలచిపోయాడు. జన్మతః విష్ణు భక్తుడు. పాండవశౌర్య పరాక్రమాలకు వారసుడు అయిన పరీక్షిత్తు - కలిని నిగ్రహించి, ధర్మదేవతను నాలుగు పాదాలతో నడిపిస్తాడు తన రాజ్యంలో.

అయితే ఎలాటి వివేకులకైనా, భక్తులకైనా విధి బలీయమైనప్పుడు, అహంకారంతో కళ్ళు మూసుకుపోతాయి. వేటకు వెళ్ళిన పరీక్షిత్తు, వేటాడటం లో అలసిపోయి దాహం తీర్చుకోవటానికి శమీకముని ఆశ్రమానికి వెళ్ళి ఆ మహాముని వున్న "సమాధి స్థితిని" తనపట్ల ఆయన ప్రదర్శిస్తున్న నిర్లక్ష్యమూ, అవిధేయత, అహంకారంగా భ్రాంతిపడి, నిరపరాధి అయిన ఆ మునీశ్వరునికి బుద్ధి చెప్పదలచి, మృత సర్పాన్ని ఆ ముని మెడలో వేసి తన రాజదర్పాన్ని, ఐశ్వర్య మదాన్నీ చాటుకొని, రాజధానికి తిరిగివస్తాడు. కానీ శమీకమహాముని కుమారుడైన "శృంగి" కూడా మహాతపస్సంపన్నుడు తన తండ్రికి జరిగిన ఈ అవమానానికి ఆ మునికుమారుని హృదయం రోషంతో దావాగ్నిలా మారిపోయింది.

"హోము హిరణ్యదానములు బుచ్చుకొనంగ; ధనంబులు లేమియుం
దేము; సపంచసంబులుగ దీవనలిచ్చుచు, వేసరింపగా
రాము: వనంబులన్ గృహవిరాములమై నివసింపజెల్లరే!
పాముసు పైవగా దగునె: బ్రహ్మమునీంద్రు భుజాగ్ర శంబునన్?"

అంటూ నిజమైన తపోధనుల ఆత్మాభిమానాన్ని, అపరిగ్రహ స్వభావాన్ని, ప్రపంచములోని ఏ ఐశ్వర్యాలకూ, అధికారాలకూ లొంగని తపస్సంపన్నతా శక్తిని చాటుతాడు. కేవలం యాచకులు, ముఖస్తుతి పరులు, అయిన కపట యోగులను రాజులు దండించినా వారికేమీ అపద జరుగదుగానీ, నిస్వార్థులూ, ప్రకృతిమాత ఒడిలో, నిష్కపటంగా తపస్సే, సర్వలోక శ్రేయఃకామనే ధ్యేయంగా జీవించే తపోనిధులను అవమానపరిస్తే ఫలితంగా పరిణమిస్తుంది

ధారుణంగా శృంగి-పరీక్షిత్తునకు ఆనాటికి ఏడవనాడు తక్షక మహాసర్ప విషా నలజ్వాలలో దగ్ధుడై నశించమని ఘోరశాపం ఇస్తాడు.

ఆ శాపం అమోఘమనీ, అప్రతిహతమని తెలుసుకున్న విష్ణురాతుని లోని అహంకారం అంతా క్షణాలమీద పటాపంచలై పోతుంది. మృత్యువు ఇక తప్పనిసరి ఆ మృత్యువు సర్వప్రాణికోటికి అత్యంత భీతావహమైనది. దానిని అత్యంత సహజంగానూ, ఇచ్ఛా పూర్వకంగానూ స్వీకరించగలిగినపుడే మానవ జీవితం సార్థకమౌతుంది. అందుకు ఆధ్యాత్మిక సాధనతప్ప మరోమార్గంలేదు.

జన్మతః నాటికే విష్ణుభక్తి బీజం. ఇప్పుడు అయాచిత, అనివార్య వైరాగ్య స్థితిలో మహావృక్షమై నిలచింది పరీక్షిత్తుని హృదయంలో భగవంతుని శ్రీచరణాలమీద మనస్సు లగ్నంచేసి, శుకయోగీంద్రుని లాటి మహాను భావుడు గురువుగా లభించగా విష్ణుకథలు వినటం మొదలు పెడతాడు.

నిజమైన భాగవతునికి అహంకార, మమకార నిర్మూలనకోసం, అతని సర్వసంపదనూ, బంధుమిత్రులనూ, హరిస్తాననీ తద్వారా అతగాడిని తన పాదాలమీద దృష్టి కేంద్రీకరించేలాచేసి, దుర్లభమైన ముక్తి సంపదను ప్రసాదిస్తానని శ్రీమహావిష్ణువే అనేకసందర్భాలలో చెబుతాడు భాగవతంలో. తాను పెట్టే పరీక్షల కొలిమిలో భక్తుని హృదయం తప్తమై, మకిలి అంతాపోయి కరిగించిన బంగారంలా, కాలిన ఇనుములా, సానబెట్టిన వజ్రంలా స్వచ్ఛము సరళమూ, నిష్కల్మమూ అవుతుంది. విష్ణుభక్తులకు విష్ణువు ప్రసాదించే దివ్య వరమే అది. అహంకార నిర్మూలనే విష్ణుభక్తుని ఆభరణం, పునర్జన్మలేని వైఫల్య పథమే విష్ణుభక్తుని ఎనలేని ఐశ్వర్యం. ఒకో్క-మెట్టుగా తన భక్తుని ఒకో్క-సంఘటన సన్నివేశం సాకుగా, అత్యంత ఉన్నత పదవికి తీసుకవెళ్ళ టమే భగవంతుని లీలా విలాసం. భగవంతునికి భక్తుని మీద కల కరుణకు ఆనోపానాలే తార్కాణాలు. భాగవత ధ్యేయమంతా ఇదే.

విష్ణురాతుడైన పరీక్షిత్తు-ఆత్మార్పణ భావంతో అలా తరించాడు. నిజానికిది ఒక్క విష్ణురాతుని కథే కాదు ఈనాటికీ మనలోని ప్రతి ఒక్కరిదీ మనలో ఎందరు-తల్లులు "అనవసరం" అనుకొని చాటుమాటు గర్భస్రావాలకు ఒడిగడితే-ఇక్క పిండాల్లా చెక్కు చెదరక పుట్టుకొచ్చేవో ఆతల్లులకూ, ఆదైవానికే తెలుసు, మనకున్న కొద్దిపాటి అక్షరజ్ఞానం చదువూ డిగ్రీ, తర్కం-పాండిత్యం, ఐశ్వర్యం, అధికారం కారణంగా, మితిమించిన అహంకారంతో "శమీక ముని" శృంగి ల్లాటి ఎందరో నిరపరాధులనూ, నిరాడంబర భక్తులనూ అవమానిస్తున్నామో, బాధిస్తున్నామో తద్వారా వారి నిస్సహాయ "నిట్టూర్పుల శాపాగ్ని కీలలకు" బలౌతున్నామో ఎవరికి తెలుసు? పదవులు, ఐశ్వర్యాలు హఠాత్తుగా పోయినప్పుడు దైవం గుర్తుకువచ్చి, మొక్కులు పెడుతూ మనలో ఎందరం పరుగులు పెడుతున్నామో ఎవరికెరుక? చివరగా మంచంలో పడి తీసుకుంటునప్పుడుకూడా సాంసారిక వ్యామోహాలూ ఆందోళనలు వదలి ఎందరినో కళ్ళారాచూస్తూ "ఇంకా వీళ్ళకి యావ ఎందుకు?" అని చిరాకు పడ్తున్నాం కదా? ఆస్థితి మనకు కలగకుండా కాస్తంత మెలకువగా ప్రవర్తించి మనసును వైరాగ్యంలో సుధృఢం చేసుకొమ్మని-విష్ణురాతుని కథ ద్వారా వ్యాసభాగవతం కమ్మని పద్యాలద్వారా పోతన భాగవతం చెబుతున్నాయి అవునా?

## "సుదర్శన చక్రం"

నాస్తికులకైనా, ఆస్తికులకైనా ఏ సందర్భములోనైనాసరే, శ్రీమహావిష్ణువు రూపాన్ని వర్ణించవలసివస్తే, ముందుగా గుర్తొచ్చేవి శంఖ చక్రాలు ప్రసిద్ధ వైష్ణవాలయాలన్నింటి మీదా, చిత్రింపబడేవి కరెంటు బల్బులద్వారా వెలుగు విరజిమ్ముతూ "ఇది వైకుంఠధామం" అని ఋజువు చేస్తూండేవి శంక చక్రాలూ-వాటి నడుమ గోవింద నామం. ఇక పౌరాణిక నాటకాలలో, సినిమాలలో, విష్ణుమూర్తి ప్రత్యక్షం కాగానే, ప్రముఖంగా కనిపించేది ఆయన కుడి చేతి వేలిమీద గిరగిర తిరుగుతుండే సుదర్శన చక్రం.

సుదర్శనుడనే గంధర్వరాజు శాపవశాత్తూ రాక్షసునిగా జన్మించగా, విష్ణువు స్వయంగా అతనిని సంహరించవలసి వస్తుంది. శ్రీమహావిష్ణువు దివ్య మంగళ విగ్రహాన్ని చూస్తు, ఆయన శౌర్య పరాక్రమాలకు ముగ్ధుడౌతూ, చివరిశ్వాస విడవబోతూ ఆ రాక్షసరూప గంధర్వుడు నిరంతరం విష్ణుమూర్తి చేయి విడవకుండా వుండే ఆయుధంగా తనకి చిరంజీవత్వం-ముక్తి ప్రసాదించమని విష్ణువును వేడుకుంటాడు. భగవంతుడాతని కోర్కెతీరుస్తూ సుదర్శన చక్రంగా ఆ గంధర్వునికి అజరామరమైన కీర్తిని, మహోన్నతమైన స్థానాన్నీ, దుష్టశిక్షణ శిష్టరక్షణా అనే అమోఘ కర్తవ్యాన్నీ ప్రసాదించి "సుదర్శన చక్రాయుధానికి" ప్రత్యేకమైన పూజ-మంత్ర జపం, మంత్ర సిద్ధి కూడా ఏర్పరిచాడని కొన్ని పురాణగాథలున్నాయి. అలాగే సూర్యబింబంలోని అతి వాడియైన ములుకుల్లాటి కిరణాల అగ్నికీ, గమన వేగానికీ సర్వలోకాలూ కంపించిపోగా దేవతలందరి విన్నపంమీద, విశ్వకర్మ సూర్య బింబాన్ని "తరిమెణ" (సాన బెట్టినట్టుగా అరగదీయటం) పట్టినపుడు రాలిన అతిశక్తి వంతమూ అగ్ని సమానమూ అయిన 'రజం' (పొడి) అంతా-బింభాకారం గానూ, ఆమరి చక్రాయుధ రూపం ఏర్పడిందని, అశ్రేష్టమైన ఆయుధాన్ని విష్ణువుకు దేవతలందరూ కానుకగా ఇవ్వగా-ఆయన ఆ ఆయుధంతో దుష్ట శిక్షణ, శిష్టరక్షణ కార్యక్రమాన్ని చేపట్టాడనీ మరోకథ ప్రచారంలో వుంది.

కథలు ఎన్నివున్నా, సుదర్శన చక్రం విష్ణుస్వరూపంలో ఒక భాగం విష్ణుకథలలో ప్రధాన పాత్ర విష్ణుభక్తులకు రక్షాకవచం. విష్ణుభక్తుల పాలిటి పీడకులకు అది మృత్యువు, వైష్ణవ సాంప్రదాయంలో శ్రీవైష్ణవ దీక్షను శిష్యులకు ప్రసాదించే ప్రతి గురువూ, ఆ శిష్యుని రెండు భుజాలమీదా ముద్రాంకితాలు 'శంఖ చక్రా చిహ్నాలు' వేశాకగానీ-మంత్రోపదేశం చేయడు. పాల సముద్రంలో 'క్షీరసాగర మధనం' సందర్భంగా ఉద్భవించిన మహాద్భుతాలలో 'పాంచజన్యం" అనే అపురూప శంఖం ఒకటి. శ్రీమహాలక్ష్మికి తోబుట్టువుగా జన్మించిన ఆ అపురూప శంఖం శ్రీమహాలక్ష్మి విష్ణువు వక్షస్థలాన్ని కోరుకోగా, పాంచజన్య శంఖం విష్ణువుచేతిలో ఒదిగిపోయి తన ప్రత్యేక స్థానాన్ని నిలుపుకుంది. ఆ శంఖంలో నుంచి (ఊదినపుడు) వచ్చేనాదం

సప్తస్వర సమ్మిశ్రితమైన ప్రణవనాదానికి సరితూగగలది. నారదమహర్షి మహతీవీణ తుంబురుని అత్యద్భుత తుంబుర నాదసహిత సుస్వరగాత్రంలానే ఈ శంఖధ్వని సకల దిక్కులకూ సంభ్రమాశ్చర్యాలు కలిగిస్తుంది. అది భక్తుల పాలిట దివ్యనాదం అయితే, దుష్టులపాలిటి ప్రళయఘోష.

సాయం సంధ్యాసమయంలో 'శంఖ నాదం' చేసి, అది అత్యంత శుభ ప్రదంగా భావించే ఆచారం ఈనాటికీ బెంగాల్ (వంగదేశం) లో నిర్వహించు కుటుంబాలలో వుంది.

ఇలా విష్ణువు శంఖ చక్రాలకు ప్రత్యేకతవుంది. తర్వాత గద అభయ హస్తం. చతుర్భుజుడైన విష్ణుమూర్తి రూపానికి పైవి ఆయుధాలు, ఆభర ణాలు ఆయన చిత్ర విచిత్ర లీలలకు సంకేతాలు దుష్టశిక్షణ, శిష్టరక్షణకు నిల యాలు. అభయహస్తంలో ఒక్కొక్కమారు తామరపూవు పట్టుకొని ప్రత్యక్ష మౌతుంటాడు భగవంతుడు. ముఖ్యంగా సుదర్శనచక్రం అనేక భాగవతుల పాలిటి దివ్యవరం. అనేక భక్తులకు అభయప్రదాత. అభక్తులను బాధించినా దుష్టులపాలిట మృత్యుదేవత. భాగవతంలో ఈ చక్రాయుధ వర్ణన ఆచక్రా యుధ కర్తవ్యం, చక్రాయుధంతో సంహరింపబడిన దుష్టుల వైనం చాల సందర్భాలతో వివరంగా వుంది. పోతన మహాకవి భక్తిపూరిత కమ్మని కవితా ఝరిలో చక్రాయుధం మన కళ్ళముందు గిరగిర తిరుగుతూ మహాద్భుతంగా దర్శనమిస్తుంది వివిధ సందర్భాలలో.

గర్భస్థ శిశువుగావున్న పరీక్షిత్తు మొరాలకించి బ్రహ్మశిరోనామకాస్త్రపు అగ్ని జ్వాలలు అడ్డుకొనటానికి, విష్ణుమూర్తి తన చక్రాయుధాన్ని పంపిస్తా డా ఉదర గోళంలోనికి శిశువుకు రక్షాకవచంలా ఆ సందర్భంలో పోతన కవితాఝరి ఇలా పొంగులు వారింది.

మ॥ తన సేవారతి చింతగాని, పరచింతా లేశమున్ లేనిస
జ్జనులం బొందు తనూజుజన్, మనుచు వాత్సల్యంబుతో ద్రోణనం
దను బ్రహ్మాస్త్రముసొనడ్డ పెట్టి, బనిచెన్, దైత్యారి, సర్వారి
ధన నిర్వక్రము, రక్షితాఖిల సుధాంధశ్చక్రమున్ జక్రమున్.

ఇక సముద్ర గర్భంలో పడిపోయిన భూగోళాన్ని యజ్ఞవరాహరూపం లో శ్రీమహావిష్ణువు ఉద్ధరిస్తున్న సందర్భంలో హిరణ్యాక్షుడు శ్రీమహావిష్ణు వుతో యుద్ధానికి తలపడగా.

మ॥ కుతులోద్ధర్త, మనంబు నందలచె రక్షోరాడ్వ్యధార్థంబుగా
దితిసంతాన కులాటవీ మహిత సందీప్త ప్రభాశుక్రమున్
"సతతోద్యజ్జయశబ్ద" సన్ముఖర భాస్వచ్ఛ క్రమున్, సంతతా
శ్రిత నిర్వక్రము బాలిత ప్రకటధాత్రీ చక్రమున్, జక్రమున్!

అంటూ చక్రాయుధ వర్ణనతో సుదర్శనచక్ర స్వరూపాన్ని, స్వభావా న్ని కర్తవ్యాన్ని కన్నులకు కట్టిచూపాడు మహాకవి.

అష్టమస్కంధంలోని గజేంద్రమోక్షం కథలోని చక్రాయుధ వేగం, అది వచ్చే తీరు గజేంద్రుణ్ణి పట్టివున్న మొసలి (మకరి) ని వధించే ఘట్టం విష్ణుభక్తుల హృదయాలలో మారుమోగుతూ, తమకు ఎప్పుడైనా ఏ ఆవద వచ్చినా ఆ చక్రి, చక్రాయుధాన్ని పంపి తమ ఆపదను నివారిస్తాడనే ప్రగాఢ విశ్వాసం నిలచిపోతుంటుంది ఈనాడూ మరేనాడూ.

మ॥ "కరుణాసింధుడు, 'శౌరి' వారి చరమున్, ఖండింపగా బంపె, స
త్వరితా కంపిత భూరిచక్రము, మహోద్య ద్విస్ఫులింగచ్ఛటా
పరి భూతాంబర శుక్రమున్, బహువిధ బ్రహ్మాండ భాండచ్ఛటాం
తర నిర్వక్రమ బాలితాఖిల సుధాంశ్వ క్రముం, జక్రమున్."

అట్లా వచ్చిన ఆ చక్రాయుధం:-

శా॥ "అంభోజాకర మధ్య నూతన నళిన్యాలింగన క్రీడనా
రంభుండైనా, వెలుంగుతేని చెలువారన్ వచ్చి, నీటన్, గుబుల్
గుంభ ధ్యానముతోఁగొలంకును గలంకం బొందగా జొచ్చిఁదు
ష్టాంభోవర్తి వసించు చక్కటికి డాయంబోయి హృద్వేగమై"

శా॥ భీమంబై తల|దుంచి |ప్రాణముల. బాపెన్ జకమాత|క్రియన్
హేమక్ష్మాధర దేహముం, జకితపన్యే భేం|ద సందోమున్
గామ|క్రోధనగేహమున్, గరటి రక్త|స్రావ గాహంబు, ని
స్సీమోత్సాహము, వీతదాహము, జయశ్రీమోహమున్ |గ్రాహమున్.

మకరిని ఖండించి మరలా విష్ణుమూర్తి చేతిని అలంకరిస్తుంది. వ్యాభరణంలా.

శా॥ పూరించెన్ హరి పాంచజన్యము, గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్యాన చలా చలీకృత మహాభూత |ప్రచైతన్యమున్,
సారోదార సిత, |ప్రభాచకిత, పర్జన్యాది రాజన్యమున్
దూరీభూత విపన్నదైన్యమును, నిర్ధూత ద్విషత్సైన్యమున్:

చూశారా ఒక దుష్టుని సంహరించి, ఒక భక్తుని కాపాడిన సందర్భంగా హరి విజయోత్సాహంతోనూ, భక్త జనులపాలిట అభయ |ప్రదాతగానూ పాంచజన్యాన్ని (శంఖాన్ని) పూరించి ఆ శంఖధ్వని తాలూకు గుణగణాలు కూడా తేటతెల్లం చేశాడు సర్వలోకాలకు

ఒకరూపాన్ని, ఒకనామాన్ని ఒక శంఖాన్ని ఇలా విడివిడిగా, హృదయంలో ఒక స్థాయిగా ము|ద్రపడి పోయేలా వర్ణించిన ఘనత పోతన కవిత్వానిది. ఆ కవిత్వానికి పునాది ఆ మహనీయునిలోని భక్తి ఆ భక్తికి మూలం భగవంతుని సాక్షాత్కారం, అపార కరుణదీవెన.

ఇక అంబరీషోపాఖ్యానంలో దుర్వాసమహర్షి, తన సహజ ముక్కోపి స్వభావంతో, నిష్కారణంగా విష్ణుభక్తుడైన అంబరీషుని పైకి, తన తపశ్శక్తితో జట నొకదాన్ని పెరికి "కృత్య" అనే శక్తిగా మార్చి, |ప్రయోగిస్తాడు మహాభక్తుడైన అంబరీషుడు, తనకు విష్ణువు |ప్రసాదించిన చ|క్రాన్ని |ప్రార్థిస్తాడు. కృత్యను సంహరించిన సుదర్శన చ|కం–ఇక దుర్వాసుని భరతం పడుతుంది. అయన్ని ముల్లోకాలకు వెంటతరుముతుంది. |బ్రహ్మరు|ద్రాదులే గాక, శ్రీమహవిష్ణువు సైతం–ఆ చ|క్రాయుధాన్ని ఆపగల శక్తి తనకు లేదని

చెప్పి, తన భక్తుడైన అంబరీషునే శరణువేడమని చెబుతాడు. శ్రీమహావిష్ణువు అట్లా విష్ణుభక్తుడే విష్ణువుకంటే అధికుడనీ, భక్తికీ, భక్తునికీ భగవంతుడు వశుడనీ తెలుసుకొని అహంకారం, అనవసర క్రోధం దిగవిడచిన దుర్వాస మహాముని అంబరీషుని శరణు వేడుతాడు. అంబరీషుడు సుదర్శన చక్రాన్ని స్తుతిస్తాడు.

పోతన భాగవతంలోని సప్తమస్కంధంలోని అంబరీషోపాఖ్యానం కథలో సుదర్శనచక్ర వర్ణన, స్తుతి, అత్యద్భుతంగా సాగిపోతుంది. విష్ణుభక్తులందరి హృదయాలలో ఆ పద్యాలన్నీ మారు మ్రోగుతుంటాయి. సుదర్శన చక్ర మహిమలానే, ఆరు పద్యాలలో పోతన మహాకవి కవితామృత ఝురిలో అంబరీషుని నోటివెంట వచ్చిన ఆ సుదర్శన చక్రాయుధస్తుతి సుదర్శనచక్ర పూజా పారాయణ అందరికీ కంఠతావస్తుంది ఒక్కరోజుతో.

చక్రాయుధాన్ని చేతబట్టిన శ్రీమహావిష్ణువు "చక్రి" అనే నామంతో పూజింపబడుతున్నాడు.

ఓ ఆయుధానికి కథేమిటి? వర్ణనేమిటి? స్తుతేమిటి? అని తర్కంలోకి దిగేవారికి బండి చక్రానికీ, సుదర్శన చక్రానికీ, తేడాగానీ మహిమలో గల తారతమ్యాలుగానీ తెలుపబూనుకోవటం వృథా ప్రయాసే అవుతుంది. టైం వేస్టుకూడా అవుతుంది, కానీ భాగవతానికి మూలం భక్తి విశ్వాసాలు అనే దొక్కటి విశ్వసిస్తే, భక్తుని హృదయంలో తన దైవం ఆ రూపం, నామం, ఆయుధాలు అణువణువూ ముద్రించుకుపోతాయి. ఆ తన దైవాన్ని ఆ దైవ చిహ్నాలుగానీ వేరువేరుగా భావించే స్థితి వుండదు. తనని ప్రాణప్రదంగా ప్రేమించే భార్య రూపం, గుణం, వస్త్రాభరణాలు ఆ భర్త హృదయంలో మెదులుతూనే వుంటాయి. తనకి ప్రాణసమానమైన భర్త చేతివాచి మొదలు తల వెండ్రుక వరకూ ఆ భార్య హృదయంలో అత్యంత అద్భుతంగా ముద్రించుకుపోయి వుంటాయి. అలాటి అనుబంధమే భగవంతునికీ, భక్తునికీ మధ్య వుంటుందనీ, వుండాలనీ, అదే ఈ సకల చరాచర సృష్టినీ, తుష్టినీ, ధర్మాన్నీ, ధర్మాచారులపట్ల మక్కువనీ దైవాన్నీ, దైవంపట్ల విశ్వాసాన్నీ తద్వారా మానవత్వం నుంచి మానవుడు దైవత్వ శిఖరాలకు చేరుకోవాలని

నిర్దేశిస్తుంది భాగవతం. మహర్షులు స్వానుభవాల సుమాలతో, తపస్సనే పరిమళంతో ఏర్చి కూర్చిన రామాయణ భాగవతాది గ్రంథాలు కట్టుకథలు కావు ఈదేశం సర్వప్రపంచానికి ప్రసాదించిన దివ్యవరాలు మన మనసుకి గ్రహణ శక్తి వుంటే, అవునా మరి.

## "శుకయోగీంద్రుడు"

విష్ణురాతుడనే పరీక్షిన్మహారాజుకు, శుకయోగీంద్రుడు. భాగవతాన్ని గురించి కూలంకషంగా చెప్పాడు. చెప్పి, పరీక్షిన్మహారాజుని ఇహబంధ విముక్తునిగానూ, మోక్షగామిగానూ మార్చాడు మానసికంగా. ఒకవ్యక్తి ఉపదేశం-లేదా ఉపన్యాసం వినగానే ఎదుటి వ్యక్తిలో సత్వరమూ, శాశ్వతమూ సత్పరిణామము అయిన మార్పురావాలీ అంటే, ఆ ఉపన్యాసకుడు లేదా ఆ ఉపదేశించే వ్యక్తి అత్యంత తపశక్తి సంపన్నుడూ, నిస్వార్ధ సేవాపరాయణుడూ నిష్కలంక చిత్తుడూ అయివుండాలి. అలా కాక డాంబికుడూ, వాగాడంబరుడూ, ఇతరుల మెప్పుకోసం నటించే నటుడూ అయితే ఆ ఉపన్యాసం లేదా ఉపదేశం తాత్కాలికంగా వినేవారిలో "శభాష్" 'బాగా చెబుతున్నాడు' అనే భావాన్ని కలిగిస్తుందేతప్ప, ఆతర్వాత వారి హృదయంమీద పరివర్తన తీసుకరాదు. ఈ రెండో కోవకి చెందిన ఉపదేశికులనూ, ఉపన్యాసకులనూ నిత్యం మనం ఇంటా, బయటా, వృద్ధులరూపంలోనూ, రాజకీయంగా పదవికలిగిన వారిలోనూ, టి. వి. ఉపన్యాస హింసాకాండలలోనూ, సభా, సన్మానకాండల లోనూ చూస్తూనే వున్నాం. చిత్తశుద్ధి లేని ఆ ఉపన్యాసాలను, వుపదేశాలను దులపరించుకుపోయే మానసిక దశకు చేరుకున్నాం కూడాను!

కానీ, ఒక రామకృష్ణ పరమహంస కరుణతో-"షోడశి" పూజతో ఒక కన్య (శారదాదేవి) అపార మాతృత్వం స్థాయికి ఎదిగిపోయి, "విశ్వమాత"గా నిలచిపోయిన సంఘటన జరిగి ఎంతో కాలం కాలేదు! 'శారదామాత' గా ఆమెలో పొంగులువారిన మాతృత్వాన్ని కళ్ళారాచూచి, మనసారా అనుభూతి చెంది ధన్యులైన వారెందరినో డైరీలాటి గ్రంథాల్లో ఈనాడు మనం చదువుతున్నాం. ఆరామకృష్ణపరమహంస వుపదేశమే ఒకపొగరుమోతు 'నరేంద్ర న్ని'

వివేకానందునిగా మార్చటం, ఆ వివేకానందస్వామి ఉపన్యాసాలకు పశ్చిమ దేశాల ప్రజలు తలలువంచి నమస్కరించటం, 'మార్గరెట్' అనే బ్రిటిష్ వనిత "సోదరి నివేదిత"గా మారి 'శ్రీరామకృష్ణ మఠ' స్థాపనకు కృషిచేయటం జరిగి ఎన్నో ఏళ్ళు కాలేదు. అలాగే స్వాతంత్ర పోరాటంలో "సిపాయికలహం" "ఝాన్సీరాణి" నాటినుండీ మహాత్మాగాంధీజీ వరకూ ఒక్క గర్జనకు, ఒక్క పిలుపుకు తమ ధన, మాన ప్రాణాలు తృణ ప్రాయంగాఎంచి స్వాతంత్ర సమరంలోకి దూకిన మహోన్నత వీరులు, త్యాగులు, చరిత్ర పటల్లో పేరైనా తెలియని మహానుభావులు ఈనేలకు రక్తతర్పణం చేశారు అదీ ఉపదేశకులకు అనుయాయులకూ మధ్యగల చిత్తశుద్ధి, కర్తవ్యదీక్ష.

సరిగ్గా అలాగే ఏడురోజులలో మృత్యువు రాబోతుండగా, ఆ ఏడురోజుల గడువునే మహదవకాశంగా తీసుకొని, శిష్యుడైన పరీక్షిత్తును వైరాగ్యపథం లోని అత్యున్నత సోపానం వరకూ తీసికెళ్ళగలిగిన సుజ్ఞాని శుకయోగీంద్రుడు. బోధ గురువుకూ బాధ గురువుకూగల తేడా తెలియజెప్పగలిగినవారా అవధూత.

ఈయన జన్మకూడా చిత్రంగానే జరుగుతుంది. వ్యాసమునీంద్రుడు ఒకరోజు అగ్నిహోత్రం కోసం "అరణి" మధిస్తుండగా, 'ఘృతాచి' అనే దేవతా స్త్రీ ఆదార్నట వెళ్తూ ఆయన కంటపడింది. అంతటి మునీంద్రుడూ మోహ పరవశుడైనాడు. ఈవిషయం కనిపెట్టిన 'ఘృతాచి' మునీంద్రునికి తాను చిక్కినా, చిక్కకపోయినా, ఆయన ఆగ్రహానికి గురౌతానన్న భయంతో, కామరూప విద్యతో 'శుక' (చిలుక) రూపందాల్చి ఎగరసాగింది. మునీంద్రు నికి వీర్యస్ఖలనమై, అరణిలో పడగా అది ఒక శిశువు రూపం దాల్చింది. ఆ శిశువే శుకయోగీంద్రుడు. జరిగిన దానికి వ్యాసుడు కలతచెందాడు. కానీ శుకంపట్ల కూడా మోహం చెందని తరుణంలో జన్మించిన వాడవటంచేత "శుకుడు" అనే నామం ప్రసిద్ధిలోకి వచ్చింది.

శుకయోగి జన్మతః ముక్తసంగుడు. తండ్రితపస్సు అతనిలో మూర్తీభవించింది. అష్టాదశ పురాణకర్త, వేదవేదాంగ పురాణ విభజనకర్త అయిన తండ్రిలోని సునిశితమైన మేధాశక్తి ధారణ చక్కగా ఉపన్యసించగల, ఉపదేశించగల నేర్పు ఆయనకి యథాతథంగా వచ్చాయి. పదహారేళ్ళలోపు బాల్యం వదలని బాలునిలా ఆయన అవధూత, దిగంబరుడు అయ్యాడు. బ్రహ్మ స్వయంగా శుకయోగికి ఉపనయనం చేశాడు. ఆకాశంనుండి దివ్య దండ కమండలాలు ఆయనకి లభించాయి. స్త్రీ పురుష బేదభావాలకు కతీతుడై, జడుడో, మూఢుడో, ఉన్మత్తుడో, బాలుడో ("బాలోన్మత్త మహాముని) అన్నట్లుగా ముల్లోకాలూ సంచరిస్తుంటాడు. 'ప్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుకశౌనకహృన్నివాస" అంటూ శ్రీలక్ష్మీనృసింహ కరావలంబ స్తోత్రంలో శంకర భగవత్పాదులు వర్ణించినట్లు నిరంతరం "హరినామ స్మరణతో, హరినామ సంకీర్తనలతో, హరికథా కాలక్షేపంతో, శ్రీహరితో సారూప్య, సాయుజ్య సామీప్య విదేహముక్తులను కైవసం చేసుకున్న మహాత్ముడాయన. ఆయన అడుగుపెట్టిన నేల పుణ్యక్షేత్రం అవుతుంది. గోవును పాలుపితికినంత సేపుగానీ ఒకచోట నిలబడదు. కానీ తనను వేదాంతపరమైన, లేదా విష్ణు కథలకు సంబంధించిన ఏ ప్రశ్న అడిగినా, దానికి సావధానంగా జవాబు చెప్పిగానీ, కదలడు అందుకే పరీక్షిన్మహారాజు, ఒక కథ పూర్తయ్యేలోగా, ఆ కథకు సంబంధించినదిగానీ, మరోకొత్త కథకు సంబంధించినదిగానీ ప్రశ్న అడిగి ఆమహానుభావుణ్ణి ఏడురోజులు తనవద్ద నిలువరించుకో గలిగాడు. చెప్పేవాడికే కాదు, పృచ్ఛకుడికి (ప్రశ్నించేవాడికీ) తెలివితేటలు వుండాలంటారు అందుకే.

ఒకమారు శుకయోగీంద్రుడు గగనగమనంలో వెళ్తున్నాడు. ఆకాశ గంగలో స్నానం చేస్తున్న అప్సర స్త్రీలు, ఆయన్ని చూచికూడా చూడనట్లే స్నానం చేస్తూండి పోయారు. ఇంతలో 'కుమారా, కుమారా' అని పిలుస్తూ వ్యాసమునీంద్రు డామార్గాన వచ్చాడు. వెంటనే అప్సర స్త్రీలు కలవరపాటుతో తమ తమ వస్త్రాలు చుట్టబెట్టుకున్నారు. వ్యాసమునీంద్రుడు వారి ప్రవర్తనకు ఆశ్చర్యపడి 'నాకుమారుడు తరుణ వయస్కుడు, వాడు వెళ్తుండగా మీరు సిగ్గుపడకపోగా, ముసలివాణ్ణయిన నన్ను చూసి సిగ్గుపడటమేమిటి?' అని

అడిగాడు. అందుకువాళ్ళు శుకయోగీంద్రుడు స్త్రీ పురుష భేదభావాల కతీతుడైన ముక్తసంగుడు, అవధూత. కానీ నీవు వయసు వుడిగిన వాంఛలు చావని తపస్వివి. రాగద్వేషాలు నీలో యింకా వున్నాయి. అందుచేత నిన్ను చూడగనే మాలోనూ సహజమైన స్త్రీ పురుష మనోవికారం కలిగింది". అని నిర్ద్వంద్వంగా చెప్పారు.

ఇక తండ్రి గొప్పవాడు, తపస్వి, అత్యంత తెలివి తేటలు గలవాడూ, మహాకవి మంత్రతంత్ర జపసిద్ధుడూ, అయితే, ఆయనబిడ్డ ఆయనని మించిన తపస్వి, బ్రహ్మచారి, సనాతనాచారాలపట్ల, సాంప్రదాయాలపట్ల, పూజానియమాలపట్ల చిత్తశుద్ధితోకూడిన ప్రవర్తన కలవాడుగా కొడుకు వుండడం చాలా అరుదైన గొప్ప విషయం.

నిత్యజీవితంలో మనం నిత్యం చూస్తుంటాం తండ్రి మేధావి అయితే కొడుకు పరమశుంఠ, తండ్రి అత్యంత ఆస్తికుడైతే కొడుకు పరమనాస్తికుడు తండ్రి నిత్యం పూజా ధురంధరుడైతే, కొడుకు పూజలమ్మాతల్లో వున్నా, నిత్యం బార్‌కూ, క్యాబరేకూ హాజరయ్యే సరుకు, ఇక సొతంత్ర్య సమరంలో త్యాగాలు చేసినవారెందరి కొడుకులో అత్యంత స్వార్థపరులుగా, దేశాన్ని కొల్లగొట్టుకొనే రకం నీచులుగా తయారు కావటమూ చూసూనే వున్నాం. ఆ తండ్రుల కీర్తిని సర్వనాశనం చేస్తారీ కుమారులు! అలాగే తండ్రి త్రాగుబోతూ, కిరాతకుడూ అయివున్న చోట కొడుకు అత్యంత మేధావి. సత్ప్రవర్తనగల వాడుగానూ వుంటాడు. దీనికి సరైన నిర్వచనం ఎవరూ చెప్పలేరు, 'ఖర్మ' అనుకొనో 'అదృష్టం' అనుకొనో సరిపెట్టుకోవాల్సిందేతప్ప.

కానీ వ్యాసమునీంద్రునికి శుకయోగి, తండ్రి కీర్తిని, మేధాశక్తినీ మరింతగా ప్రకాశింపజేసే కుమారుడు. అంచేత వ్యాసమునీంద్రుడు తన భాగవతాన్ని శుకయోగికి మాత్రమే బోధించాడు. భాగవత వ్యాప్తికి తన కుమారుడొక్కడే యోగ్యుడనీ, అర్హుడనీ ఆ తండ్రి భావించాడు. దానిని అక్షరాలా నిలబెట్టుకున్నాడా అవధూత.

ఇక భాగవతం కథ ఉపక్రమించేముందు తన ఇష్టదైవాన్ని శుకయోగి స్తుతించాడు. ఆ స్తుతిని పోతన మహాకవి శుకయోగి హృదయంలోనికి పరకాయ ప్రవేశంచేసి తనదైన భక్త్యావేశంతో ఆంధ్రుల హృదయాలలో మారుమ్రోగించాడు.

మ॥ పరుడై, యీశ్వరుడై మహామహిముడై ప్రాదుర్భవస్థాన, సం
హరణ క్రీడనుడై, త్రిశక్తి యుతుడై, అంతర్గత జ్యోతియై,
పరమేష్ఠి ప్రముఖామ రాధిపులకుం బ్రాపింపరాకుండు, దు
స్తర మార్గంబునఁదేజరిల్లు హరికిం దత్త్వార్థినై మ్రొక్కెదన్.

ఉ॥ 'ఏవిభువందనార్చనము, లేవిభుచింతయు నామకీర్తనం,
బేవిభులీలలద్భుతము,? లెవ్వాడు సంశ్రవణంబుసేయ దో
షావళిబాసి లోకము శుభాయతవృత్తిఁ జెలంగునంగ్రడు నే
నావిభు నాశ్రయించెద, నఘౌఘ నివర్తను భద్రకీర్తనున్.

ఉ॥ ఏవరమేశు పాదయుగమెప్పుడుగోరి భజించి నేర్పరుల్
లోపలి బుద్ధితో నుభయ లోకములందుల జడ్డుబాసి, యే
తాపములేక బ్రహ్మగతిఁదారు గతశ్రములై చరింతు; రే
నాపరమేశు మ్రొక్కెద నఘౌఘ నివర్తను, భద్రకీర్తనున్.

చ తపముల జేసియైన, మఱి దానములెన్నియు జేసియైన, నే
జపములు జేసియైన, ఫలసంచయ మెవ్వని జేర్పకున్న హే
య పదములై దురంత విపదంచిత రీతిగ నొప్పుచుండు, న
య్యపరిమితున్ భజించెద నఘౌఘ నివర్తను, భద్రకీర్తనున్.

మ॥ తపముల్ సేసిననో, మనోనియతినో, దానవ్రతా వృత్తినో
జప మంత్రంబులనో, శ్రుతిస్మృతులనో, సద్భక్తినో యెట్లు ల
బ్ధపదుండౌనని, బ్రహ్మరుద్ర ముఖరుల్ భావింతురెవ్వాని? న
య్యాప వర్గాధిపుడాత్మమూర్తి, సులభుండౌగాక నాకెప్పుడున్.

మ॥ అణువో కాక కడున్మహావిభవుడో, యచ్ఛిన్నుడో, ఛిన్నుడో
గుణియో, నిర్గుణుడో యటంచు విభుధుల్, గుంఠీభవత్తత్త్వ మా
ర్గణులై, యే విభుపాదపద్మ భజనోత్కర్షంబులన్దత్త్వ, వీ
క్షణముంజేసెదరట్టి విష్ణు, బరమున్, సర్వాత్ము సేవించెదన్.

పైవి మచ్చుకి అరుపద్యాలు మాత్రమే, ఉదయాన్నే నిద్రలేవగానే, మనసులో ఓమారు పై పద్యాలు మననం చేసుకు చూడండి రోజు క్రమం తప్పకుండా. ఎంతటి హృదయశాంతి లభ్యమౌతుందో. ఎంత ప్రశాంతంగా రోజు మొదలౌతుందో, లేదూ, రాత్రి పడుకోబోయేముందు రెండు నిమిషాలు పై పద్యాలు లోలోపల స్మరించుకోండి. రోజులోని చికాకులు, సమస్యలతో అలసి పోయిన హృదయానికి, రేపటి గురించిన ఆందోళనతో చికాకుపడే హృదయానికి.ఎంతటి స్వాంతన, ఎంతటి ఉత్సాహం వస్తుందో, నిశ్చింత అయిన నిద్రపడుతుందో ప్రయత్నించి చూడండి,

భక్తి అన్నది పలాయనవాదంకాదు. భక్తి అన్నది వేరెవరికోసమో వేసే వేషమూ నటనాకాదు. భక్తి అన్నది కేవలం వ్యాపారమూ, కాలక్షేపపు వ్యాపకమూకాదు ఆ బావనతోగాక భక్తి అన్నది రోజూ మన శరీరస్నానం ఆహారంలానే, మనసుని మాలిన్యరహితంగా, నిర్మలంగా వుంచుకోవటం కోసం అదే ప్రగాడ విశ్వాసం కలిగివుంటేచాలు. ఏస్తోత్రమయినా, ఏమూర్తిరూప మైనా, ఏధ్యానమైనా, ఏకులమైనా, ఏమతమైనా ఒకటే. ఈస్పీడ్ యుగంలో జపతపాలకు టైం లేదు. భాగవత, భారత రామాయణాది గ్రంధాలు క్షుణ్ణ గా చదివి అర్ధంచేసుకొనే ఓపిక తీరికలేరు. అలాటివారికోసం భాగవతంలో ఒక్కో

పాత్రద్వారా పోతన పలికించిన తేటతెనుగు తేనెలొలుకు ఆరేసి పద్యాలుచాలు మననం చేసుకోవటానికీ, మనసును క్షాళనం చేసుకోవటానికీ, మనదైన వ్యక్తిత్వాన్ని మలచుకోవటానికీ, ప్రయత్నించి చూడండి. తప్పు లేదుగా. ఇదేం తప్పుపనికాదుగా మరి!

## దాసీ పుత్రుఁడు విదురుఁ

వేదవ్యాస మహర్షి వ్రాసినవే భారత, భాగవత పురాణ సంహితలన్నీ అంచేత భారతంలోని పాత్రలు భాగవతంలోనూ సంక్షిప్తంగా పరిచయమవుతాయి. పైగా కురుపాండవులకు తానేతాత అవటంవల్ల తన వంశాంకురాలైన వారందరికీ సంబంధించిన ఏన్నో విషయాలను, వివరంగానూ, విపులంగానూ, అటుభారతంలోనూ ఇటు భాగవతంలోనూ వ్రాశాడు వ్యాసమహర్షి. ఆ వ్రాయటం కేవలం తన తాలూకు డైరీ వ్రాసినట్లుగాక, ఏయే వ్యక్తి ఏయే పరిస్థితులలో ఎలా ప్రవర్తించాడో, దాని ఫలితం ఏ విధంగా (మంచిగానీ, చెడుగానీ) అనుభవించాడో స్పష్టంగా తెలియజేశాడు. భావితరాల వాళ్ళకి అదో హెచ్చరిక, అదో పాఠం, అదో మార్గనిర్దేశనం కావాలని నిష్కపటంగా ఆశించాడా మహర్షి. భారతంలోని పాత్రలన్నీ కేవలం ధర్మాధర్మాల చుట్టూరా పరిభ్రమించి, ఆనాటి సాంఘిక, రాజకీయ నైతిక వాతావరణాలకూ ధర్మాలకూ, సర్దుబాట్లకూ అద్దంపడతాయి అందులో శ్రీకృష్ణుడు కేవలం ఓ అత్యద్భుత రాజకీయవేత్త అతి సమర్థుడైనవ్యక్తి. ధర్మగ్లాని ఎక్కడజరిగితే అక్కడ వారి పక్షం తాను వహించి, దుర్మార్గులకు బుద్ధిచెప్పి, ధర్మ సంస్థాపనకు తోడ్పడే నిస్వార్థ సమాజ సేవాపరాయణుడు. ఈనాటికీ భారతం నాటి రాజకీయ సాంఘిక నైతిక వాతావరణాలెన్నో వున్నాయి. ఏటొచ్చి శ్రీకృష్ణునిలాటి మానవాతీతులైన నాయకులే. సారధులే కనిపించటంలేదు.

ఇక భాగవతంలో శ్రీకృష్ణుడు సాక్షాత్తూ భగవంతుడు. శ్రీమహావిష్ణువు భారతంలోని పాత్రలు, భాగవతంలో తారసపడినప్పుడు, అవి రాజకీయ

చర్చగాక భక్తి భావతరంగాలతో శ్రీకృష్ణుని స్తుతిస్తాయి. అందుకు ఉదాహరణ గానే భాగవతంలో "కుంతీ స్తుతి" "భీష్మ స్తుతి" 'నారద స్తుతి' "శుక స్తుతి" ఇలా ప్రతి భక్త్యావేశంలో భగవంతుని శ్రీ చరణాలకు ఆత్మార్పణ చేసుకుం టుంది. భారత యుద్ధం జరిగేనాటికి, భారత కథాకాలంనాటికి ఆయా పాత్ర లన్నీ యవ్వన కౌమార దశలలోవున్న వ్యక్తులు సహజంగా ఆ వయసులో సమసమాజ సమస్యలపట్లవున్న ఉద్రేకమూ, ఉత్సాహమూ, భక్తి మీద భగ వంతునిమీద నిలువక పోవటమూ సహజమే. కురుక్షేత్ర సంగ్రామం తర్వాత అవే పాత్రలు వృద్ధాప్యదశలోనికి పైగా జీవితానుభవాల పాఠాల, బొప్పులతో అలసి వున్నవే కావటంతో. భక్తి ప్రపత్తులకు రంగం సిద్ధం అయింది. అయితే పుట్టుకతోనే కొందరు ముక్తసంగులుగా, మహాత్ములుగా జన్మించి, జ్ఞాన, వైరా గ్య, భక్తి మార్గాలలో ప్రయాణించటమూవుంది అలాటివారిలో నారదుడు, తుంబురుడు, సనకసనందులు, శుకయోగీంద్రుడు, భీష్ముడు, విదురుడు లాటి వారున్నారు కొందరు.

విదురుడు దాసీపుత్రుడు, వ్యాసమహర్షిని, ఆయన తల్లి అయిన సత్య వతి భర్తృ విహీనులైన తన కోడళ్ళిద్దరికీ (అంబిక. అంబాలిక) పుత్రభిక్ష పెట్టవలసిందిగా కోరినపుడు, తల్లికోర్కె తీర్చడానికి వ్యాసమునీంద్రుడు అంబిక, అంబాలికలతో ఒక్కోరాత్రి గడుపుతాడు. కానీ వాళ్ళిద్దరూ వ్యాసుని రూపానికి ఒకరు భయపడి కళ్ళు మూసుకోగా, మరొకరు అసహ్యంతో 'పాలి పోతారు' ఫలితంగా పుట్టంధుడైన ధృతరాష్ట్రుడు, పాండువ్యాధి గ్రస్తునిలా పాండు శరీరంతో పాండురాజు పుడతారు. ఈ ఫలితం ముందే తెలుసు గనుక వ్యాసుడు తల్లికి చెప్పగా, ఆమె మరలా ఆ కోడళ్ళని పంపుతుంది వ్యాస మునీంద్రునిపట్ల ఏర్పడిన భయమూ, అసహ్యమూ కారణంగా ఆరాజకుమార్తె లిద్దరూ, తాము వెళ్ళక ఒక దాసీదాన్ని ఆయనవద్దకు పంపుతారారాత్రి తమకు బదులుగా ఆ దాసి తన కర్తవ్యం తప్ప అన్యమెరుగని కర్తవ్య పరాయణ. నిష్కపటంగా తన యజమానురాళ్ళ ఆదేశంమేరకు, వ్యాసమునీంద్రుని భక్తిగా సేవించుకుంది. ఫలితంగా ఆమెకు జన్మించిన కుమారుడే "విదురుడు" జన్మతః తండ్రి వేదవ్యాసునిలోని జ్ఞాన, వైరాగ్యాలు, సదాలోచన,

సత్కర్మాచరణ సునిశిత మేధాశక్తి పుణికి పుచ్చుకున్న మహనీయుడు. తన సోదరుడైన ధృతరాష్ట్రుని అడుగడుగునా పక్షపాతం తగదని హెచ్చరిస్తూనే వుంటాడు. విదురుడు భారతం అంతటా ఆలాగే తన మరోసోదరుడైన పాండు రాజు కుమారులైన పాండవుల శౌర్య ప్రతాపాలకు సంతోషిస్తూ వారికి అండగా నిలచి శ్రీకృష్ణుని మహానుభావుడిగా దైవంగా గుర్తించి కీర్తిస్తూ వారికి శుభం కలగాలని అనుక్షణం "దీవిస్తుంటాడు" సమాజంలో, రాజకీయంలో, సంసారంలోవున్నా. విదురుడు జ్ఞాన వైరాగ్యాలతో, తామరాకుమీద నీటిబొట్టులా ఏదీ తనకు అంటకుండా మసలుకుండాడు.

"కర్మణ్యేవాధికారస్తే మాఫలేషుకదాచన" అనే గీతా శ్లోకార్థానికి అనుగుణంగా 'కర్మనాది-ఫలితంనీది' అనే జ్ఞానమార్గంలో ఆత్మార్పణ భావంతో మసలుకొని చరితార్థుడౌతాడు. "విదురనీతి" అని ప్రసిద్ధిచెందిన వీయన పలుకులు. రాయభారం విఫలమౌతుందని తెలిసి, శ్రీకృష్ణుడు రాయభారం నడపటానికి హస్తినాపురికి వచ్చినప్పుడు. నిరాడంబర భక్తుడూ, జ్ఞానీ, నిష్పక్షపాతి, ధర్మవర్తనుడు అయిన విదురుని ఇంట సాత్విక విందు ఆరగించి, ఆ భక్తుణ్ణి ధన్యుణ్ణి చరితార్థుణ్ణి చేస్తాడు.

దాసీ పుత్రుడైన విదురుడు - శూద్రునిగా పరిగణింపబడే విదురునికి చరిత్రలో ఇంతటి మహోన్నత స్థానం ఇచ్చి, దానిని పదేపదే ఋజువుచేసి కులమతాలు ముఖ్యంకాదు. గుణగణాలకే ప్రాధాన్యం ఏ వ్యక్తికయినా అని భారత భాగవతాలలో ఋజువుచేసిన వ్యాసమునీంద్రుని కంటే అభ్యుదయ వాదీ, ఆదర్శవాదీ ఆ విదురుని ఇంటి ఆతిథ్యం స్వీకరించటమేగాక, తన అగ్రగణ్య భక్తులలో ఒకనిగా నిలిపిన శ్రీకృష్ణుని కంటే సోషలిస్టు-మరొకరు వున్నారా ఈనాడు మత్స్యగంధి (సత్యవతి) (షెడ్యూల్ ట్రైబ్స్) కి పరాశరునికీ పుట్టినవాడు వ్యాసుడు వ్యాసునికీ దాసీకి జన్మించినవాడు విదురుడు. యధాతథంగానే ఆ జన్మవివరాలు వ్రాశాడు వ్యాసుడు. మరి ఆనాటివారు కులపిచ్చి మతపిచ్చి మనుషులా. అగ్రవర్ణాలు సృష్టించిన కథలా ఆ పురాణాలు ఆలోచించండి ఒక్కమారు.

ఇక విదురునినైజం చాలా నిర్మలమైనది శ్రీకృష్ణరాయబార ఘట్టంలో శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునికి చెప్పవలసిన దంతా చెప్పి ఆ సభాస్థలికి విదురుని రమ్మనీ, పుట్టంధుడేగాక పుత్రవాత్సల్య వక్షపాతంతో చెపిటివాడు, మతి మాలినవాడూ కూడ అయిన ధృతరాష్ట్రునికి నీతి చెప్పమని చెబుతాడు. విదురుడు తన అన్నగారైన ధృతరాష్ట్రునితో శ్రీకృష్ణుని భగవదవతారంగా చెప్పి, ఆ భగవంతుడి అండవుండగా పాండవులకు అపజయం అన్నది వుండబోదనీ చెబుతాడు నిండుసభలో మదమాత్సర్యలోలుడూ, దురభిదుర్వర్తనుడు అయిన దుర్యోధనుని మాటలు విని, కొడుకన్న పక్షపాతంతో అధర్మమైన తీర్పు చెప్పవద్దనీ, యుద్ధానికి అంకురార్పణ జరపవద్దనీ హితవు చెబుతాడు.

ఉ॥ కావున, పాండునందనుల గాటియ పెట్టక, రాజ్య భాగమున్
వావిరి నిచ్చి, రాజ్యమును వంశము పుత్రుల బంధు వర్గమున్
గావుము గాక, లోభియగు కష్ట సుయోధను మాట వింటివే,
భూవర! నీయుపేక్షనగుఁ బోకులనాశనము, బంధు నాశమున్.

తే॥ ఒకనికై యిట్లుకుల మెల్లనుక్కడంప
నెత్తుకొనఁజూచె; దిదినీతియే? నృపాల
వినుము నామాట, నీసుయోధనుని విడిచి,
కులము, రాజ్యంబు, దేశంబు నిలుపవయ్య.

అని నిర్ద్వంద్వంగా, నిష్పక్షపాతంగా చెబుతాడు. కానీ విభీషణునిహితవు వినిపించుకోని రావణాసురునిలా, హరిభక్తుడైన కన్న కొడుకునీ హింసించిన హిరణ్యకశిపునిలా-ధృతరాష్ట్రునికి వంశక్షయం నుదుట వ్రాసిపెట్టి వుండగా ఆ హితవు తల కెక్కదు.

ఈలోగా, అసలే దురభిమాని పెద్దలమాటంటే గౌరవంలేని దుర్యోధనుడు మండిపడి-నిండుసభలో తనచిన్నాన, గౌరవనీయుడు, పూజనీయుడు అయిన విదురుణ్ణి-బాంధవ్యం-జ్ఞానం, వయోబేధం ఏమీ లెక్కచేయకుండా, నిందిస్తాడు నీచంగా మెడబెట్టి గెంటనున్నట్లు మాట్లాడుతాడు.

క॥ "దాసీ పుత్త్రుని మీరలు, దాసీనుంజేయకిటకుఁ దగరావింపన్
నాసీనుండై, ప్రేలెదు, గాసిలి చెడిపోవ వెడలగా నడువరనన్.

అంతటి అవమానాన్ని ఎదుర్కొన్న విదురుడు-ఇక మారుమాట్లాడడు. మూర్ఖులముందు జరిగిన అవమానంతో, ఇంకా మాట్లాడటం అనవసరమను కొని ఎలాగూ జరగబోయే కురుక్షేత్ర సంగ్రామ ఫలితం తెలుస్తూనే వుంది గనుక, అస్త్ర సన్యాసంచేసి, పెల్లుబికిన కోపాన్ని నిగ్రహించుకొని సభవిడిచి తీర్థయాత్రలకు వెళతాడు, కురుక్షేత్ర సంగ్రామానంతరం చాలాఏళ్ళ తర్వాత హస్తినాపురికి ధర్మరాజు రాజుగా వున్న తరుణంలోనే వస్తాడు మరలా వివే కులూ, జ్ఞానులూ, తమకు జరిగిన అవమానాలకు ప్రతీకారం ప్రయత్నం చేయరు. ఆ అవమానాలు చేసిన వ్యక్తులకు కాలమేతీర్పు, శిక్ష విధిస్తుందని వారికి తెలుసు తమ మౌనం తమ నిట్టూర్పే వెయ్యిశాపాల పెట్టు అనికూడా వారికి తెలుసు. తమకు విలువ, గౌరవం లేనిచోట వుండేకంటే తీర్థయాత్రల నెపంతో, నిస్వార్థంగా జల జల పారుతూ స్వచ్ఛ జలాలనిచ్చే నదులు, ఓషధలు నింపుకున్న పర్వతాలు, మనసుకు శాంతినిచ్చే పుణ్యక్షేత్రా లలో కాలం వెళ్ళబుచ్చుకోవటమే మంచిదని తలుస్తారు. అవనే చేస్తాడు విదు రుడు. తన కళ్ళతో బంధుక్షయాన్ని చూస్తు విధిలేక దుర్యోధనుని పక్షం వహించి పాండవులకు, తద్వారా ధర్మానికి అపకారం చేసేకంటే, తాను నిశ్చిం తగా దైవధ్యానంలో ఈ అలజడికి దూరంగా వెళ్ళాలనుకొని వెళ్ళిపోతాడు.

క॥ కూరలు-గాయలు నీళ్ళాహారముగా, గొనుచు, నియమ మలవడగ నసం
స్కార శరీరుండగుచు, ను-దారతనవ ధూత వేషధరుడై వరుపన్.

క॥ హర్షము గదురగ, భారత-వర్షమునం గలుగు పుణ్యవరతీర్థములు
త్కర్షం జూచుచు విగతా-మర్షుండై సంచరించె మనుజవరేణ్యా.

అవునుమరి. "ఒకచోనేలను బవ్వళించు నొకచో లొప్పారు భూసెజ్జ పై" అన్న భర్తృహరి పద్యంలా జ్ఞాని అయినవాడు భౌతిక సుఖాలకు, ప్రాపంచిక విషయాలకు ప్రాధాన్యం ఇవ్వడు. దాసీ పుత్రుడంటూ విదురుణ్ణి

వయోజ్ఞాన వృద్ధుణ్ణి తూలనాడిన దుర్యోధనుడే - సూతపుత్రునిగా పరిచయం అయిన కర్ణునికి తన పక్కన పెద్ద పీటవేస్తాడు. పాండవులమీద పగతోరగిలే దుర్యోధనుడికి వ్యక్తులూ-వ్యక్తిత్వాలూ-కులాలు మతాలు కాదు ముఖ్యం. తన పగ తీర్చుకొనే సాధనంగా ఎవరినైనా ఉపయోగించుకుంటాడు.

ఇక విదురుడు తిరిగి వచ్చేనాటికీ, (మైత్రేయ మహామునిద్వారా కాలం కషంగా భక్తి వైరాగ్యాలు తెలుసుకొని) హస్తినాపురంలో ధర్మరాజు రాజ్యం చేస్తున్నాడు. కొడుకులందరూచావగా: మనవళ్ళుచావగా విధవలందరూ గోలు గోలున ఏడుస్తూ కాలం వెళ్ళబుచ్చుతుండగా ఏ పాండవులమీద ద్వేషంతో ఏ పుత్ర వాత్సల్యంతో ఇలాటి పరిస్థితి కోరుకొని తెచ్చుకున్నాడో, ఆ ధృత రాష్ట్రుడు ఆ గాంధారిపైకి కనిపించని పుత్రశోకంతో కుమిలిపోతూ అపాండ వుల రాజ్యంలోనే, (ఒకప్పుడు తాము కుంతీదేవికిచ్చిన పరిస్థితినే) తాము వారి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడుతూ జీవితం వెళ్ళమారుస్తున్నారు. ఈపరిస్థి తిలో తిరిగి విదురుడు తన సోదరునికీ, వదినెగారికీ హితవు చెబుతాడు.

శా॥ "పుట్టంధుడవు, పెద్దవాడవు, మహాభోగంబులా లేవు; నీ
పట్టెల్లంజెడిపోయె; దుస్సహ జరాభారంబు పైగప్పె, నీ
చుట్టా లెల్లనుబోయిు; రాలు మగడున్ శోకంబునన్ మగ్నులై
కట్టా! దాయలపంచ నుండదగవే? గౌరవ్యవంశాగ్రణీ.

క॥ "పెట్టితిరిచిచ్చు, గృహమున-బట్టితిరి తదియ భార్య, బాడవులకుం
గొట్టితిరి, వారు మనుపగ, నెట్టైన భరింప వలెనె? యీ ప్రాణములన్?"

క॥ బిడ్డలకు బుద్ధిసెప్పని-గ్రుడ్డికి బిండంబువండి కొని పొండిద్వెపై
బడ్డాడని భీముండొఅ-గొడ్డెము లాడంగ గూడుగుడిచెదవధిపా.

క॥ కనియెదవో బిడ్డలనిక-మనియెదవో తొంటికంటె మనుమలమాటల్
వినియెదవో, యిచ్చెద రమ్మని-యెదవో దానములకు నవనీసురులన్?

క॥ దేహము నిత్యముగాదని-మోహము దెగగోసి, సిద్ధము నివర్తినుడై
గేహము వెలువడు నరుడు-త్సాహముతో జెందు ముక్తి, సంపదననఘా!

అంటూ (పోతన మహాకవి అనువదించిన అత్యద్భుతపద్య కవితాఝరి లో) ధృతరాష్ట్రునికీ, గాంధారికీ, ప్రాణములమీదా, బ్రతుకుమీదా తీపిని వదలించి, వైరాగ్యం మీదకు మనసు మరలించి, వానప్రస్థాశ్రమానికి మాన సికంగా సిద్ధం చేస్తాడు వాళ్ళిద్దరినీ. అంత కటువుగానూ. అంతటి నిర్మోహ మాటంగానూ, చెపితేతప్ప ఆవృద్ధ దంపతులకు వ్యామోహం తెగిపోలేదు మరి అయితే వారిని అడవులలోనికి నెట్టి (హితబోధ చేసి) తాను హస్తినాపురిలోనే కూర్చోలేదు విదురుడు. ఇది ఈనాటి బోధగురువులు చేసేపని. తనకి హస్తినా పురితో పనిలేదని విదురునికి తెలుసు.

ధర్మం జయించి పాండవులు రాజ్యం చేస్తుండగా ఇక తన సలహాలు, హితవులూ అవసరం లేదనీ తెలుసు ఆ వయోవృద్ధునికి అంతేకాదు శ్రీకృష్ణ నిర్యాణంతో, కలిప్రవేశం జరుగబోతుండగా, ఇక తనలాటి జ్ఞానులకు విలువా, పూజావుండవనీ తెలుసు. అంచేత తాను కేవలం (కాళ్ళరిగేలా తీర్థయాత్రలు చేసి దేశం చుట్టివచ్చి మరలా సంసారాల్లో జోక్యం చేసుకొనే ఈనాటి చాలా మంది వృద్ధులలాగాక) తీర్థయాత్రలూ, పుణ్యక్షేత్రాల దర్శనంతో పెంచు కొన్న జ్ఞానం ఆచరించి చూపుతూ, భగవంతుని శ్రీచరణాలమీద మనసు లగ్నం చేసి ధృతరాష్ట్రుడు, గాంధారితోబాటు తానూ హిమవత్పర్వత ప్రాం తాలకు వెళ్ళి, వారితోబాటు దావానలానికి ఆహుతై దేహం చాలిస్తాడా మహా త్ముడు. మాండవ్య మహాముని శాపం వలన, యమధర్మరాజు ,దాసీపుత్రునిగా విదురుడిగా జన్మించాడని చెబుతాడు వ్యాసమహర్షి. అంచేత జన్మతః జ్ఞాని, విరాగీ, ధర్మాధర్మ విచక్షణా దక్షుడూ, అయి జన్మ, కులమూ ముఖ్యంగాదని, మనిషికి కావలసింది ధర్మం, దైవం అని నిరూపించాడు విదురుడు. మనం పరికించి చూస్తే విదురులెందరో వున్నారీనాడూ.

# బ్రహ్మ

మైత్రేయ మహాముని, విదురునితో బ్రహ్మను గురించీ, బ్రహ్మసృష్టి గురించి వివరంగా చెప్పాడు. విష్ణువు నాభికమలంలో నుంచి సృష్టికార్యాన్ని తన బాధ్యతగా స్వీకరించాడు "అహం" అనే దేహాభిమాన బుద్ధితో ప్రారంభ మైన ఈసృష్టి, ఆహారం, భోగేచ్ఛ, కామం వగైరా మోహ పాశాలతో వృద్ధి పొంది, కామ క్రోధాదులు, చిత్తవిభ్రమంలాటి తామస, రజోగుణం పరంపరగా సాగింది. అయితే అలాటి సృష్టి చేసినందుకు, బ్రహ్మకూడా పశ్చాత్తాపం చెందాడు. మరలా తనలో తాను విష్ణుధ్యానంచేసి సనక, సనందన, సనత్కుమార సనత్సుజాతులనే అవదూత స్వరూపులను, బ్రహ్మ మానసపుత్రులుగా ఖ్యాతి గాంచి వారిని సృష్టించి వారిని సృష్టికార్య బాధ్యత వహించవలసిందిగా కోరాడు బ్రహ్మ కానీ, నిరంతర భగవధ్యానా సక్తులు, మోక్షగాములూ, ఏ యుగానికీ బాల్యం వదలని అవధూత స్వరూపులు, బ్రహ్మచారులూ అయిన వారంతా బ్రహ్మ ఆజ్ఞను పరిహసించి తమ త్రోవన తాము వెళ్ళిపోయారు. అందుకు కోపంతో బ్రహ్మ కనుబొమ్మ ముడిపడింది. ఆక్రోధాగ్ని నుండి 'నీలలోహితుడు' అనేవాడు జన్మించి, జన్మతః పెద్దగా ఆక్రందన చేశాడు. తర్వాత "తండ్రీ, ఏంచెయ్యాలో ఆజ్ఞాపించు" అన్నాడు. బ్రహ్మ రోదనంనుండి పుట్టిన నీలలోహితుని 'రుద్ర' నామంతో పిలిచి చంద్రునిలో, సూర్యకాంతిలో, వాయువులో నీటిలో, ఆకాశంలో, అగ్నిలో, భూమిలో, ప్రాణంలో, తపస్సులో, హృదయంలో, ఇంద్రియాలలో ఇలా ఏకాదశస్థానాలలో (11స్థానాలు) నివసించమనీ ఆయా స్థానాలకు తగినట్లుగా 'మన్యు' మను, మహాకాల, మహత్, శివ, ఋత్ధ్వజ, ఉరురేతస్, భవ, కాల, వామదేవ, ధృతవ్రతులనే పదకొండు నామాలతో (ఏకాదశ రుద్రులుగా) సంచరించమనీ, వారివారికి అనురూపలు, అనుకూలురు అయిన భార్యలు వరుసగా "ధీ, వృత్తి, అశనా, ఉమా, నియత్, సర్పిః, ఇలా, అంబికా, ఇలావతి, సుధా, దీక్ష" అనే నామాలు కలిగిన వారితో సృష్టి వృద్ధిచేయమని ఆజ్ఞాపించాడు ఆ ప్రకారమే ఆ రుద్రులచేత రుద్రగణం సృష్టింపబడింది. స్థావర జంగమాలన్నీ వీరే మింగేట్లు తయారయ్యారు. వీరినే

"భర్గులు" అని కూడా అంటారు. వీరి వంశజులే భార్గవ వంశస్థులు. బ్రహ్మ ఈ వైపరీత్యం గమనించి, భర్గులతో 'ఇక మీ సృష్టిచాలు. మీరు శ్రీమన్నారాయణుపై మనసు లగ్నంచేసి. తపోవృత్తితో శేషజీవితం కొనసాగించండి' అని మరలా ఆజ్ఞాపించగా వారంతా ఆప్రకారమే వెళ్ళిపోయారు. మరలా బ్రహ్మ తన శరీరావయువములలోనుండి, దక్షుడు, నారదుడు, పులహుడు, పులస్త్యుడు, భృగువు, క్రతువు, అంగీరసుడు, వసిష్ఠుడు, మరీచి, అత్రి అనే పదిమంది పుత్రులను సృష్టించాడు. ఊరువులనుండి ఉద్భవించిన నారదుడు విష్ణు భక్తునిగా, చిరంజీవిగా, బ్రహ్మచారిగా, కలహభోజనుడిగా, లోక కళ్యాణం కోసమే కలహాలు సృష్టించే విశిష్ట వ్యక్తిగా నాటికీ నేటికీ కీర్తింపబడుతున్నాడు. పులస్తునిద్వారా పౌలస్త్యవంశం ప్రఖ్యాతిగాంచి, వారి వారసుడే అయిన రావణబ్రహ్మ పుట్టి, స్వభావంచేత రాక్షసుడై, శ్రీరామావతారానికి నాంది పలికాడు. అత్రిమహర్షి సప్తర్షులలో ఒకరిగా ప్రఖ్యాతిగాంచి నక్షత్ర మండలంలో చిరంజీవిగా ప్రకాశిస్తుండటమేగాక, త్రిమూర్తి అవతార పురుషునిగా కీర్తింపబడే దత్తాత్రేయుని తండ్రిగా, అత్రిమహర్షి భార్య అనసూయాదేవి పతివ్రతా శిరోమణిగా చరిత్రలో శాశ్వతులైనారు.

వశిష్ఠుడు, తపస్సులోనూ, శాంతంలోనూ, ప్రఖ్యాతిగాంచి, బ్రహ్మర్షిగా సకల దేవగణాలచేత పూజలందుకుని, ఇక్ష్వాకుల కులగురువు పీఠానికి మూల పురుషుడై, విశ్వామిత్ర మహర్షికి పరోక్ష (వైర) గురువై, ఈనాటికీ పౌరోహిత్య పీఠానికి "వశిష్ట పీఠం," "వశిష్ఠులవారు" అనే పేరు చిరంజీవిగా చేసిన మహాత్ముడు. దక్షుడు, దక్షాధ్వర ధ్వంసం అనే ప్రఖ్యాత ఇతిహాసానికి కథానాయకుడై, 'వీరభద్రావతారానికి' మూలసాధనం అయ్యాడు. 'దాక్షాయణి' గా పార్వతి ఉద్భవించింది దక్షునికే. బ్రహ్మ తన వివిధ అవయవాలలోనుంచి మరల పునఃసృష్టి చేశాడు. 'ధర్మము, మృత్యువు. అధర్మము, కామము, క్రోధము, లోభము పుట్టుకు వచ్చాయి. ఆయన శరీరచ్ఛాయలోనుంచి 'కర్ధముడు' అనే మహర్షి పుట్టి. 'కర్ధమ ప్రజావతి' గా ప్రజావతులలో ఒకరైనాడు. దేవహూతి అనే ఆమె ఈయన భార్య.

బ్రహ్మ నోటినుండి "వాణి" జన్మించింది ఆ భారతి ముగ్ధమోహన సౌందర్యంచూచిన బ్రహ్మ, తనలోనుంచి జన్మించిన ఆమె తన 'తనయ' అనే వావివరుస లేకుండా, ఆమెను మోహించి, భార్యగా చేసుకున్నాడు, ఈ వికృతాన్ని చూచిన, బ్రహ్మ పుత్రులైన మరీచాది మహామునులు,

ఉ॥ చాలుబురే సరోజభవ సత్పథవృత్తిఁ దొఱఁగి, కూతు ని
ట్లాలరివై రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియే?
బేలరివైతి నీతగవు బెద్దతనంబును మంటిపాలుగా,
శీలముపోవ, దట్టి, యిటు సేసిన వారలు మున్నగల్గిరే.?

ఉ॥ నీవు మహానుభావుడ, వనింద్యచరిత్రుడ విట్టిచోట, 'రా,
జీవభవుండు దావిధి నిషేధము లాత్మ నెఱుంగడయ్యె, నీ
భావభవ ప్రసూన శరబాధితుడై, తన కూతుఁబొందెఁ బో,
వావిదలంపలే' కనుచు వారక లోకులు ప్రువ్వదిట్టరే!'

అని నిందిస్తారు తండ్రిని! కానీ జరగవలసినదేదో జరిగిపోయింది. వాణిని తన రాణీగానే చేసుకున్నాడు బ్రహ్మ కానైతే, తన బిడ్డలచేత అలా నిందింపబడి, తన పనికితానే సిగ్గుపడి, ఆ శరీరాన్ని త్యజించి, మరో శరీరం ధరించాడు. శరీరత్యాగం అయితే చేయగలిగాడు గానీ, "అడుదానిజూడ నర్థంబు జూడంగ, బ్రహ్మకైన బుట్టు రిమ్మ తెగులు" అనే తెలిక మాటకు మూలపురుషుడైనాడు. సృష్టికర్త అయిన బ్రహ్మే ఇలా వావివరుసలు తప్ప టంతో, ఆతర్వాత కొన్ని వంశాల రాజులు కూడా, సోదర, సోదరీలు దంపతులు గా మారిన వికృతాలు భాగవతంలో, చాలా వున్నాయి. వారి వంశాలూ ప్రసిద్ధమైనవేమరి. ఈనాడూ, కొన్ని కొన్ని దేశాలలో, కొన్నిమత సాంప్ర దాయాలలో రాజులు, జమీందారులు వగైరాలు ఒక తండ్రికి వివిధ భార్యల ద్వారా పుట్టిన సోదరి, సోదరులు, చిన్నాన్న, పెదనాన్న బిడ్డలు, దంపతులు కావటం ఆచారంగా కొనసాగుతోంది. మనదేశంలోనూ, మేనత్త మేనమామ బిడ్డలు. మేనరికాల వారసత్వంగా కొనసాగుతూ. కొన్ని తరాలకు అసలు

వాళ్ళివరుసలే అర్థంగాని దాంపత్యాలు ఈనాడు కొనసాగటానికి, అనాటి బ్రహ్మ వికృతచర్యే మూలసూత్రమన చెప్పవచ్చు. అంచేత "కామాతురాణాం, నలజ్జ, నభయం" అనే సామెత కూడా ఏర్పడిందేమో.

బ్రహ్మ చతుర్ముఖాలనుండి వేదాలు, వేదాంగాలు అయిన సర్వశాస్త్రాలు గానం (గాంధర్వం) లాటి సర్వకళలూ ఉద్భవించాయి అయితే సృష్టి సృష్టికీ మధ్య ఆయన తన శరీరాన్ని త్యజించవలసి వచ్చింది. అతర్వాత ఎంత సృష్టిద్దామని ప్రయత్నించినా, అదాయనకు అసాధ్యమైపోయింది. ఆయన శరీరం రెండు భాగాలుగా విడిపోయి. కుడిభాగం "స్వాయంభువ మనువు" గానూ, ఎడమ భాగం "శతరూప" అనే స్త్రీ గానూ మారింది. ఆ దంపతులద్వారా సృష్టి అద్భుతంగా వృద్ధిపొందింది,

సృష్టిబాధ్యత వహించేముందు, బ్రహ్మ తన కర్తవ్యం గోచరించక, శ్రీమన్నారాయణుని గురించి వెయ్యి దివ్యవత్సరాలు ఘోర తపస్సుచేస్తాడు, తన జన్మస్థానమైన కమల నాళంలో పైకి క్రిందికీ తిరుగుతాడు. శ్రీమన్నారాయణుని దర్శనంకోసం. చివరగా తన హృదయంలోనే, శంఖ చక్రగదా పద్మహస్తాలతో, చతుర్భుజుడు, సర్వాంతర్యామి, సర్వసృష్టి స్థితిలయాలకు కారణభూతుడు, అద్యుడు, అనంతుడు అయిన శ్రీమన్నారాయణుని దర్శించి కృతార్థుడౌతాడు.

ఆ॥ వె॥ "కపటమునులకెంత కాలంబునకునైన-సంతసింప నేను జలజగర్భ!
చిరతపస్సమాధిజెంది విసర్గేచ్ఛ-మెలగునిన్ను బరిణమింతుగాని.

క॥ తపమనగ నాదుహృదయము, తపమను తరువునకు ఫలవితానమునేనా
తపముననే, జననస్థిత్యుప సంహరణము లొనర్చుచుండుదుఁ దనయా.

క॥ కావున మద్భక్తికి, దపమే విధమున మూలధనము: నిది నీమది రా
జీవభవ! యెఱిగి; తపమిటు గావించుట విగతమోహ కర్మడవింకన్.

అని శ్రీమన్నారాయణుడు శలవిస్తాడు. తనదైన విష్ణుపథం చేరుకోవటానికీ, తనదైన విరాటస్వరూపం దర్శించటానికీ, తన శ్రీచరణాలు కొలిచే అర్హత పొందటానికీ, కపటంలేని తపస్సు ఒక్కటే మార్గమని యుగయుగాలకూ చాటి చెబుతాడు. బ్రహ్మకు ఉపదేశించినట్లు. ఆ పలుకులే–పోతన మహాకవి తేటతెనుగులో పై పద్య రూపాలుగా సంతరించుకున్నాయి హృదయాలలో మారు మ్రోగేలా.

సృష్టి వివిధ రూపాలలో వృద్ధిపొందిన తర్వాత, నారదమహర్షి, తండ్రి అయిన బ్రహ్మదేవుని వద్దకువచ్చి, ఈ సర్వసృష్టి ప్రకారం తెలియచెప్పమని వేడుకుంటాడు. భావికాలంలో ఎందరో మహర్షులకూ, మహాత్ములకూ నారదుడు "మహద్గురువు" కావలసి వుందనీ, నారదుడు అర్హుడైన శిష్యుడనీ తెలిసిన బ్రహ్మ సర్వసృష్టి రహస్యమంతా నారదమహర్షికి బోధిస్తాడు. ఆ నారదుడే, వాల్మీకి, వ్యాసమహర్షులకూ, ధృవుడు, ప్రహ్లాదుడులాటి భక్తాగ్రేసరులకూ, మరెందరో మహర్షులకు మంత్రోపదేశంచేసి వారందరినీ మహర్షులుగా మలచిన మహనీయుడు.

బ్రహ్మలేని పురాణంలేదు. బ్రహ్మనుగురించి తపస్సుచేయని రాక్షసుడు లేడు. బ్రహ్మద్వారా యక్షగంధర్వ దేవపన్నగ జాతులెవ్వరివల్లా మరణం లేకుండా వరంకోరుకొని వరంపొందాడు రావణుడు. నరవానరులను మరచిన రావణునికి వారివల్లే మరణం ప్రాప్తించాలని–దేవతలకు తెలియజెప్పి, రామావతారానికి ప్రోత్రహించినదీ బ్రహ్మదేవుడే. అలాగే హిరణ్యాక్ష, హిరణ్యకశిపులకూ వారివారి తపస్సులకూ మెచ్చి వరప్రదానం చేసినదీ బ్రహ్మే మరలా హిరణ్యకశిపునికోసం "యజ్ఞవరాహరూపాన్ని" సృష్టించినదీ బ్రహ్మే. హిరణ్యకశిపునికోసం "నృసింహావతార అవశ్యకతలు సృష్టించినదీ బ్రహ్మే. ఇలా భోళాశంకరునిలానే వరాలివ్వటమూ బ్రహ్మనంతే. అవి లోకకంటకంగా మారటంతో వాటికి వుపాయాలు సృష్టించి, శ్రీహరిచేత వివిధ అవతారాల రూపకల్పనకు సూత్రధారి అయినవాడుకూడా బ్రహ్మదేవుడే.

ఇక ఏయుగంలో ఏనియంత (రాక్షసుడు మరణించిన) సందర్భాలలో ఆ రాక్షసుని అంతమొందించిన అవతార పురుషుని స్తుతించే సందర్భాలలో దేవగణాలతోసహా, ముందుగా వచ్చేదేవుడు బ్రహ్మ. అంచేతే, ఈనాటికీ పూజావిధానాలలోవున్న ఎన్నో స్తోత్రాలకు "బ్రహ్మఋషి" అనుష్టుప్ఛంద" అంటూ ఆయా మంత్రాల ఋషిగా బ్రహ్మ కీర్తింపబడుతున్నాడు.

గగనపథంలో సూర్యపథం, చంద్రపథం, వాయుపథం, జ్యోతిశ్చక్ర పథం, సిద్ధచారణ విద్యాధరపథం, నక్షత్రపథం ఇలా అనేక మార్గాలు, లోకాలు వున్నట్లే, బ్రహ్మపథం, బ్రహ్మలోకం ప్రత్యేకమైనవి. ఎంతో ఘోర తపస్సు చేసిన మహర్షులకుగానీ, బ్రహ్మపథంలో విహరించి, బ్రహ్మ లోకంలో నివ సించే అర్హతరాదు. బ్రహ్మలోకం, సత్యలోకం ఇలా ఊర్ధ్వలోకాలలో బ్రహ్మ లోకం ప్రసిద్ధమైనది.

ఇలా సకల వేదాలకూ, మంత్రాలకూ, తపస్సుకూ, సర్వజగత్తులోని చరాచరాలకూ సృష్టికర్త అయిన బ్రహ్మ సరస్వతి (వాణి) ఇల్లాలుగా కాలాన్ని విభజించి సృష్టించాడు. అనేక సందర్భాలలో, భాగవతంలో శ్రీమన్నారాయ ణుని కీర్తించిన వారిలో బ్రహ్మ అగ్రగణ్యుడు.

## సనక సనందనులు - జయ విజయులు

భాగవతంలో బాలభక్తులు చాలామంది కనిపిస్తారు, బ్రహ్మమానస పుత్రులైన సనక సనందన, సనత్కుమార సనత్సు జాతులనే మహర్షులు బాల్యప్రాయం ఎన్నటికీ వదలని అవధూతల స్థాయి మహాత్ములు. కౌపీనధారు లు గానో, దిగంబరులుగానో సంచరించే వీరు బాల్యావస్థ దాటినా, దాటని వారే! విష్ణునామ సంకీర్తన, విష్ణుమంత్ర జపోపాసనా తప్ప మరేవ్యాపకమూ లేనివీరు ముల్లోకాలనూ తమ తపోశక్తితో చుట్టివస్తుంటారు. వీరికి ఎక్కడా ఏ అడ్డంకిలేదు. ఉండదుకూడా! మహోన్నత భక్తకోటికి చెందినవారు వీరు. ఒకమారి సనక సనందనలు, శ్రీహరిని దర్శించే కుతూహలంతో, వైకుంఠానికి

వచ్చారు. వైకుంఠంలోని ఆరుద్వారాలు దాటి సప్తమ ద్వారము, విష్ణు అంతః పుర మందిరము అయిన వైకుంఠ ద్వారాన్ని రారుచే.

ఆద్వారం దగ్గరవుండే పార్షదులు (కావలాభటులు) అనేవారు ఈనాటికీ వీవైష్ణవాలయాన్నయినా గమనించి చూడండి, గర్భగుడి ద్వారానికిరు వేపులా విష్ణు సమాన స్వరూపులు ఇద్దరు ద్వారపాలకులుగా దర్శనం ఇస్తారు. వారికీ మ్రొక్కుతారు విష్ణు భక్తులు కారణం నిరంతరం శ్రీహరి శ్రీచరణాల చెంత నిలిచివుండే మహద్భాగ్యానికి నోచుకున్న మహాత్ములు వారు.

(అయితే ఈనాడు చాలా ఆఫీసులలోనూ ఆఫీసర్ల ఇళ్ళవద్దా, ప్యూన్సుగా వుండే కొందరు "మహాత్ముల" వింత చేష్టలను మనందరం చూస్తూనే వుంటాం! "అసలు అయ్యగారి" కంటే ఎక్కువ ఫోజ్ వేస్తుంటారు వీరు! అయ్యగారినీ టైంలో కలుసుకోవటానికి వీలులేదంటారు, తమ పొడుపు చెల్లించమనీ పరోక్షంగా పీడిస్తారు. వచ్చినవారిని గంటల తరబడి కూర్చోబెడితే. (అయ్యగారి దర్శనం కానివ్వకుండా) తమ హోదా, గొప్ప పెరుగుతాయని భ్రమపడుతుంటారు! ఈ ద్వారపాలకులను దాటితేనే అసలు ఆఫీసరుగారి–మంత్రిగారి ఇలా గొప్పవ్యాక్తి దర్శనం, కొన్ని కొన్ని దేవాలయాలలో కొందరు పూజారులే ఈ ద్వారపాలక పాత్రవహించి, దేవుడికీ–భక్తుడికీ మధ్య శని దేవుళ్ళలా హింసలు పెడుతుండారు.

జయవిజయులు సహజంగా మంచివారే! సనకసనందనుల మహాత్యం తెలిసినవారే! కానీ ఆరోజు వారికి ఏమి దుర్బుద్ధి పుట్టిందో, "ఈ సమయంలో స్వామివారు దేవేరితో, ఏకాంత మందిరంలో వున్నారు, గనుక మీరు లోనికి ప్రవేశించటానికి వీలు కాదని" అడ్డగించారు.

సనక సనందనాదులు నిర్ఘాంత పోయారు. శుకయోగీంద్రునిలా అవధూతలు, దిగంబరులు, స్త్రీ పురుష బేధభావాతీతులు, అరిషడ్వర్గ రాగాతీతులు అయిన తమకు–తమ పితృసమానుడు అయిన శ్రీహరి దర్శనానికి అభ్యంతరమా?

జయవిజయులు నచ్చచెప్పినా వినకపోవడంతో సనక సనందనలు ఆ ద్వారపాలకులకు ఘోరశాపం ఇచ్చారు. "కామక్రోధ లోభాది దుర్గుణాలతో తామస స్వభావులై భూలోకంలో జన్మించమని" శపించారు. ఆశాపంవిని, జయవిజయులు హడలిపోయారు. సనక సనందనాదుల పాదాల మీదపడి శరణువేడారు. ఈ సమయంలో లీలామానుష వేషధారీ, భక్త జనవత్సలుడు అయిన శ్రీమహావిష్ణువు అక్కడకు వచ్చాడు. తన ద్వారపాలకులు ఉచితాను చితాలు, అర్హతా నర్హతలు పాటించకుండా, పామరులను వలె పాషండులను వలె, దొంగభక్తులనువలె సనక సనందనాది మహాత్ములను నిరోధించటం తెలుసుకొని, వారికి తగినదండన విధించబడిందని, సనక సనందన మహర్షులను. తన పార్షదులు చేసిన తప్పుకు, యజమాని అయిన తానే బాధ్యుణ్ణి అంటూ, క్షమాపణ వేడుకుంటాడు.

ఉ॥ "గోవితతిన్, ధరాదివిజకోటిని నన్ను, దీనవర్గమున్
వావిరి భేదబుద్ధి గనువారలధోగతి బొంద, నందునా
శీవిషరోష విస్ఫురణ జెంది, కృతాంత భటుల్ మహోగ్ర గృ
ధ్రావళి వోలె జంచువుల నంగములుద్ధతి జింతురెప్పుడున్,"

సీ॥ పొలుచునాచిత్తమందుల యభిప్రాయంబు
దెలియంగలేక, యుద్వృత్తులగుచు
గడగి మీయానతి గడచిన దద్దోషఫలము
వీరలకు సంప్రాప్తమయ్యె!;
మునులారా, నాచిత్తమున నున్నరీతియు
నిట్టిద, భూమిపై బుట్టివీర
లచిరకాలమున నాయంతి కంబునకోలి
నచ్చుదెంచుపటుగా ననుమతింప.

తే॥ వలయునని "యుష్మత్కుందుండు
వలుకుటయును-విని మనంబున
సనకాది మునివరేణ్యు, లమ్మహాత్ముని
మృదుల భాషామృతంబు-దవిలి
క్రోలియు రోషసందష్టులగుచు."

ఇదీ భక్తపరాధీనుడైన భగవంతుని ఔన్నత్యం! తన మహోన్నత భక్తులకు జరిగిన అవమానం తనదిగా భావించి ఆ అవమానం చేసినది తన భృత్యులే అయినా, ఆ బాధ్యత తానువహించి మహర్షులను ప్రసన్నులుగా చేసుకున్నాడు. అంతేగాక అజ్ఞానంతో వ్యవహరించిన తన ద్వారా పాలకుల మీద అపారదయతో, వారినీ కరుణించమని ఆమహర్షులనే వేడుకున్నాడు! ఇదీ భగవంతుడి తత్వం.

సనక సనందనులు కూడా ప్రశ్చాత్తాపపడ్డారు, తమ తొందరపాటుకు తాత్కాలిక కోపావేశానికి బాధపడ్డారు. సాక్షాత్తు భగవంతుడే తమకు క్షమాపణ చెప్పటంచూచి (అహంకరించక) సిగ్గుపడ్డారు. శ్రీహరి చరణాలమీద వాలి-ఆయనకు స్తోత్రం చేశారు! తమదీ అజ్ఞానమేననీ, మన్నించమనీ వేడు కుంటారు.

అప్పుడు శ్రీహరి, జయవిజయులను అసురులుగా జన్మించమనీ, విప్ర వాక్కు అమోఘమనీ, దానిని ఎదిరించటం తనకూ శక్యంగాదనీ చెబుతూ, తనకు శత్రువులుగా పుట్టి నిరంతరం తనను ద్వేషిస్తూ, తనచేత యుద్ధంలో మరణించి-

క॥ నను వైరంబుననైనను-మనమున దలచుటను నా సమక్షమున, ముదా
నన మీక్షించుచు నీల్గుట ననఘాత్మకులై వసింతు రస్మత్పదవిన్.

క॥ విమడిలమీద నికెన్నటికిని బుట్టవు లేదు వీరికిఁ; మీరలు వ
ల్కినయట్లు నాదుచిత్తము నను దలతుం గాన మీమనంబుల నింకన్
దీనికిఁ జింతఁ దక్కుడు, సుధీజన పుంగవులారా!"

అంటూ అభయ ప్రదానం చేస్తాడు.

ఇదే "వైరభక్తి" గా ప్రచారంలోకి వచ్చింది. జయవిజయులే, కశ్యప మహామునికీ, "దితి" కీ హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా జన్మించి-జన్మతః విష్ణుద్వేషులై, సాధు హింసాపరాయణులై, లోకకంటకులై చివరకు హిరణ్యాక్షుడు. "యజ్ఞవరాహమూర్తి" అవతారం దాల్చిన శ్రీహరిచేత యుద్ధంలో మరణించగా, హిరణ్యకశిపుడు "నృసింహావతారం" చేత చంపబడుతాడు.

ఇదంతా ఆలోచిస్తే, ఒక్కొక్కసారి మహోన్నత స్థానంలో వున్నవారికి (భగవస్సాన్నిధ్యంలాటి ఉన్నత పదవి మరేముంది?) విధిబలీయమని తేట తెల్లమౌతుంది. జయవిజయులు విష్ణుమందిర ద్వారపాలకులుగా నిరంతరం శ్రీహరి సామీప్య, సాకార, సాయుజ్య సేవలనే మహా అదృష్టానికి నోచుకొని వుండే, క్షణకాలంలో శాపోపహతులై, అసుర జన్మలలోకి త్రోసివేయ బడటం దైవలీల కాదా?

అయితే వారి విష్ణుసేవ వ్యర్థం కాలేదు. వారు ఏరాక్షస తల్లితండ్రుల గర్భవాసానో జన్మించలేదు ఏప్పుడూ! కశ్యపమహర్షి దితిలాటి తపస్సంపన్నులైన దంపతులకే బిడ్డలుగా జన్మించారు. నిరంతరం విష్ణుద్వేషంతోనే విష్ణునామం ఉచ్ఛరిస్తు, విష్ణుస్వరూపం ధ్యానిస్తు, చివరగా విష్ణుదర్శనంతో నిశ్చేష్టులై, విష్ణుచేతిలో మరణించి, మరలా విష్ణుసాయుజ్యం పొందారు.

ఈనాడూ "దేవుడులేడు, దేవుడులేడు. దేవుడని మీరు చూచారా? నేను నీలోను, దరిద్రులలో దేవుణ్ణి చూస్తాను. గుడిలో. రాయిలో చూడను దేవుడు లేడసలు. మనిషే దేవుడు!" ఇలా వాదనలు చేసే కొందరి నాలుకమీద అనుక్షణం నర్తించే మాట "దేవుడే" వారిది వైరభక్తి. వారికి బహుశా త్వరగానే ముక్తి దేవుడు లేనే లేడని వాదిస్తూనే, దైవం వునికిని మరువలేనిది వీరే ఒకానొక జీవితపు మలుపులో అనుభవాల పొరలో, ఇలాంటివారు రక్కున జ్ఞానోదయం కలిగి, దైవంమీద అచంచల భక్తి విశ్వాసాలు పొందుతారు. స్థిరవైరాగ్యానికి బాటవేసుకుంటారు. ఇలాంటి వైరభక్తులు ఎందరో వున్నారు చరిత్రలో.

సనక సనందనలు-శ్రీహరిని స్తుతిస్తారీ సందర్భంలో ఇక పోతన మహా కవి మరల వారిలోకి పరకాయ ప్రవేశం చేశాడు తనదైన భక్త్యావేశంతో.

చ॥ వనజదళాక్ష! భక్తజనవత్సల! దేవ! భవత్సుతుండు, మ
జ్జనకుడునైన, పంకరుహజాతుడు, మాకు రహస్యమొప్పఁ జె
ప్పిన భవదీయ మంగళ గభీర పరిగ్రహ విగ్రహంబు మే
మనయము జూడగంటిమి కృతార్థులమై తగమంటి మీశ్వరా!

చ॥ మహిత యశోవిలాసగుణ మండన! సర్వశరణ్య! యింద్రియ
స్పృహులకు గానరాక యతసీకుసుమద్యుతి నొప్పుచున్న నీ
సహజ శరీరమిప్పుడు భృశంబుగఁ జూచి మదీయ దృక్కులిం
దహహ! కృతార్థతం బొరసె; నచ్యుత! మ్రొక్కెద! మాదరింపవే!

అది భగవంతుడికీ, భాగవతునికీ వుండే అనుబంధం.

సనక సనందనాదులు లాంటి మహాభక్తుల మనస్సు నొప్పించక తానే క్షమాపణ చెప్పుకున్నాడు భగవంతుడు.

తన పాదరేణువులైన ద్వారపాలకులకు (సనక సనందనులను) విప్ర శాపరూపాగ్ని నుండి, తేలిక మార్గంలో-మూడు జన్మలలో, వైరభక్తితో-నిరంతర భగవధ్యానంతో, తన పాదసన్నిధికి తిరిగి రప్పించుకున్నాడు భగవంతుడు.

## "యజ్ఞవరాహమూర్తి"

భగవంతుని లీలలలానే, రూపాలూ కూడా అనంతాలు, అద్భుతాలు ఒక రూపం ఉచ్చమైనదనిగానీ, ఒకరూపం నీచమైనదిగానీ భావించటానికి వీలు లేకుండా, భగవంతుడు అతి చిన్న రూపాలలోనూ అతి విరాట్ రూపాలలోనూ కూడా తన ఉనికిని ప్రదర్శించి, తన మహిమలనుచాటి, తన భక్తులకు

తనపై గల అపార విశ్వాసానికి భక్తి శ్రద్ధలకూ, ఋజువునూ, తన భక్తులు కాని వారికి భగవద్ద్వేషులకు తన ఉనికి మహాత్యం, తనభక్త రక్షణా ధురీణతా చాటి చెప్పి, కనువిప్పు కలిగిస్తుంటాడు. ప్రతి యుగంలో ఇది జరుగుతూనేవుంది. వివిధ సన్నివేశాలలో, అయితే మనకే ఆలీలలనూ ఆ రూపాలనూ గ్రహించే మనోచక్షువులు, హృదయ సంస్కారం, భగవంతునిపట్ల భక్తి విశ్వాసాలు వుండాలి. భాగవతం మొత్తం తెలిపే సారాంశమిదే.

అతి చిన్న మీనం (చేప) లోదూ, జలచరమూ, భూచరమూ అయిన కమఠం (తాబేలు) లోనూ విష్ణువు తన దివ్యరూపాన్ని దివ్య మహత్తునూ చూపాడు. చీమనుండి, బ్రహ్మవరకూ సకల చరాచరా జీవ రాశులలోనూ జీవజగత్తులోనూ తానునిండి వున్నానని ఋజువు చేసుకున్నాడు. ఆయాసన్ని వేశాలలో, ఇక "సూకర రూపం" (పంది రూపం) దాల్చి, పాతాళానికి జలంలో క్రుంగిపోయిన భూమిని ఉద్ధరించి "యజ్ఞవరాహమూర్తి" గా కీర్తింపబడ్డాడు. కేవలం భూమిని ఉద్ధరించటంవరకే ఆ అవతార ధ్యేయంగాక, హిరణ్యాక్షుడనే ఘోర రాక్షసుడిని సంహరించటానికి ఆ అవతారం అవశ్యకమైంది.

బ్రహ్మ శరీరం రెండు భాగాలుగా విడిపోయి "స్వాయంభువమనువుగా" నూ "శతరూపగా" నూ మారి వారి దాంపత్యంద్వారా సృష్టి వృద్ధి పొందటం మైత్రేయ మహాముని విదురునికి చెప్పాడు. ఆతర్వాత వారి సృష్టి, జగత్తంతా నిండిపోగా భూమిహఠాత్తుగా రసాతలానికి క్రుంగిపోయింది, స్వాయంభువ మనువు తండ్రి అయిన బ్రహ్మను ఈభూమి ఉద్ధరణ ఎట్లా అని ప్రశ్నిస్తాడు.

బ్రహ్మదేవుడుకూడా చింతామగ్నుడౌతాడు.

సీ॥ అఖిల జగత్కల్పనాటోపమునకు బాల్పడిన, నాచేత నెబ్బంగినిపుడు
దగిలి విశ్వంభరోద్ధరణంబు గావింపనగునని సర్వభూతాంత రాత్ముఁ
బురుషోత్తముని, నవపుండరీకాక్షు లక్ష్మిపతి దనమనస్థితునిజేసి
తలపోయుచున్న బద్మజు నాసికా వివరమ్మున యజ్ఞవరాహమూర్తి

తే॥ యర్థినంగుష్ఠ మాత్రదేహః ఖతోడ జననమంది వియత్తలస్థాయియగుచు
క్షణములోపల భూరిగజ ప్రమాణమయ్యె నచ్చటి జనముల కద్భుతముగ-

అట్లా యజ్ఞవరాహమూర్తి అవిర్భావం జరిగింది

"బ్రహ్మ నాసారంధ్ర నిర్గత స్తబ్ధరోమలోకంబు, మనముః విలోకింప అంగుష్ఠ మాత్రమై, యాక్షణ మాత్రలోన, మహిమ దీపింప దంతి ప్రమాణ మును మహోన్నతంబైన గండశైలోపమంబు నయ్యె" ననుచు ..

అక్కడవున్న మరీచి మునిముఖ్యులంతా ఆ యజ్ఞవరాహమూర్తి దివ్య రూపాన్ని కళ్ళారా చూచి అచ్చెరు వొందుతారు.

భూమి ఉద్ధరించటానికి ఆ యజ్ఞ వరాహుడు సాగరాన్ని తన వాడి కోరలులో చీల్చుకుంటూ రసాతలానికి చేరుతాడు. తన దంష్ట్రాగ్రముఃలమీద భూగోళాన్ని స్థాపించి శంఖ; చక్ర, గదా, పద్మహస్తుడైన శ్రీహరి వరాహ రూపంలో మహాద్భుతంగా, రసాతలంనుంచి పైకి వస్తున్నాడు. ఆ సమయం లోనే "హిరణ్యాక్షుడు" అనే రాక్షసుడు, యుద్ధకాంక్షతో, "వరుణుని" మీదకు యుద్ధానికి వెళతాడు. ఆరాక్షసుని బలపరాక్రమాలు తెలిసిన వరుణుడు వాడితో తాను యుద్ధం చేయలేననీ, "వైకుంఠంలో వున్న శ్రీమన్నారాయణుడే నీకు సమవుజ్జీ" అనీ చెబుతాడు. హిరణ్యాక్షుడు వైకుంఠంవేపు పరుగు తీస్తుంటాడు యుద్ధోన్మాదంతో! ఆ సమయంలో కలహభోజనుడుగా కీర్తికెక్కిన నారదుడు హిరణ్యాక్షునికి ఎదురౌతాడు. "శ్రీహరి వైకుంఠంలో లేడు. యజ్ఞవరాహ రూపంతో సాగరగర్భంలో వున్నాడు" అని చెప్పి, ప్రోత్సహించి, పురికొల్పి మరీ మృత్యుముఖంవేపు వాడిని పంపుతాడు ఇక హిరణ్యాక్షుడు యజ్ఞవరాహ మూర్తిని వెక్కిరిస్తూ యుద్ధానికి తలపడతాడూ తన దష్ట్రాగ్రాలమీద వున్న భూమి సముద్రంలోనుంచి పైకి తెచ్చి స్థిరంగా నిలిపి ఇక ఆ రాక్షసునితో యుద్ధానికి సిద్ధపడతాడు వరాహమూర్తి

వారిద్దరిపోరు మహాద్భుతంగా జరుగుతుంది. బ్రహ్మాది దేవగణమంతా ఆయుద్ధాన్ని చూస్తుంటారు. ఆ రాక్షసునిచేత హింసింపబడిన దేవ, దానవ, యక్షగంధర్వ, కిన్నెర, కింపురుష, విద్యాధర, సిద్ధచారణ మహర్షి గణమంతా యజ్ఞవరాహ రూపంలోని శ్రీహరి, వైజయంతీ మాలాధరుడైన హిరణ్యాక్షునికీ జరుగుతున్న భీకర పోరాటాన్ని చూస్తూ "వీణ్ణి హతమార్చు స్వామి" అంటూ వేడుకుంటారు. వరాహమూర్తి హిరణ్యాక్షుణ్ని హత మార్చి భూమిని తన దంష్ట్రాగ్రాల మీద నిలిపి నిల్చుంటాడు.

మ॥ దితి జాధీశుని నీ గతిందునిమి యుద్ద్వృరత్తిం దదీయాంగ శో
ణిత పంకాంకిత గండభాగుఁడగుచు న్విష్ణుండు దానొప్పె వి
స్తృత సంధ్యాంబుద ధాతుచిత్రిత సముద్దీప్త క్షమాభృద్గతిన్
క్షితి దంష్ట్రాగ్రమునన్ ధరించి జలరాశిం బాసియేతేరగన్.

తే॥ బాలశీతాంశు రేఖా విభాసమాన ధవళదంష్ట్రాగ్రమున నున్న ధరణియొప్పె
హరికి నిత్యానపాయినియైన లక్ష్మి నెరయ బూసిన కస్తూరిని కరమనగా!

ఆరూపంతో నిల్చిన యజ్ఞవరాహమూర్తి దివ్యరూపం నాటికీ. నేటికీ విష్ణు భక్తుల హృదయాలలో శాశ్వత ముద్రవేసుకుంది. విష్ణు దశావతార మూర్తుల చిత్రాలలో కనిపించే మూడవ అవతారమైన యజ్ఞవరాహుని మూర్తిని గమనించండి.

ఒక దుష్టుడు లోకానికి అపకారంచేస్తూ, సాధుజనులను హింసిస్తూ వీర గర్వంతోనూ, తపోగర్వంతోను అజేయుడై నియంతృత్వ ధోరణిలో కొన సాగు తున్నప్పుడూ, ఆ దుష్టుని ఎదురించే శక్తిలేని బలహీనుల ఆర్తనాదాలు బలంపున్నా వాడి యోగబలం, తపోబలం, వరబలం ముందు, తమ బలం పనికిరాక బలవంతులు నిస్తేజులై భగవంతుని శరణుజొచ్చినపుడూ, ఈసృష్టిని సక్రమంగా పాలించడానికీ, నడిపించటానికీ, దుష్ట శిక్షణచేసి, శిష్టరక్షణచేసి ఆర్తులను కాపాడటానికీ ధర్మాన్ని పునరుద్ధరించటానికి భగవంతుడు తప్పని సరిగా అవతరిస్తాడు. అవతరించి తీరాలి అది ఏ రూపమైనా కావచ్చు. ఇది సర్వ మతాలలోను వున్న నగ్నసత్యం.

యజ్ఞవరాహమూర్తి అవిరావ్భం చాలా-వరకు నృసింహావతార అవిర్భావానికి దగ్గర పోలికలతో వుంటుంది.

అలా హిరణ్యాక్షుడనే దానవుణ్ణి చంపటమూ, భూమిని ఉద్ధరించటము అనే రెండు కార్యసాధనాలద్వారా (దుష్టశిక్షణ, శిష్టరక్షణ) ఒక వరాహరూపం అది వరాహరూపంగా, యజ్ఞ వరాహంగా, దైవంగా రూపు సంతరించుకున్నది. భక్తుల విశ్వాసానికి భక్తికీ ప్రతీకగా నిల్చింది

ఇక బ్రహ్మాది దేవతలు ఆ మూర్తిని స్తుతించారు. సందర్భం వచ్చి రాగానే పోతన కవి హృదయం భక్త్యావేశంతో, గగన గంగలా కవితాఝరి జాలువారింది,

సీ॥ దేవ జితంజితంతే పరమేశ్వర!
జితయజ్ఞభావన! శ్రుతిశరీర!
యనుచు గారణసూకరా కారుడగు నీకు
నతిభక్తి మ్రొక్కెదమయ్య వరద
భవదీయ రోమ కూపములందు లీనంబులై
యుండు నంబుధు; లట్టి యధ్వ
రాత్మకమైతనరారు నీరూపంబు
గానంగరాదు దుష్కర్మ పరుల॥

తే॥ కట్టి నీకు బ్రణామంబు లాచరింతు మఖిలజగదేక కీర్తి; దయానువర్తి!
భవ్యచారిత్ర! పంకజ పత్రనేత్ర! చిరశుభాకార! ఇందిరాచిత్తచోర!

అట్టి తేనెల సోనలు వారే పద్యాలు వరుసగా సాగిపోతాయి ఆస్తోత్రరుపంలో-చివరగా మైత్రేయుడు విదురునికి కథ తెలుపుతూ-మైత్రేయుని మాటలుగా,

శా॥ కాన సరోజ లోచను జగత్ స్తవనీయ కథాసుధారసం
బానినయట్టి జిహ్వ! యసదవ్యకథా లవణోదకంబులన్
బానము సేయ జూచునే? సుపర్వమహీజ మరంద పానలా
భానుభవంబు నొందు మధుపంబును బోవునే వేపచెట్లకున్!

-అంటూ పోతన మహాకవి-

ఒకమారు శ్రీహరి శ్రీచరణారవిందముల మీద చూపు, మనసు లగ్నం చేసిన హరి భక్తులు, 'ఆమహోన్నత సంపదనుగాక, తుచ్ఛమైన శారీరక, వస్తు భోగభాగ్య సముదాయానికి ఆశిస్తారా? ఆశించరుగాక. ఆశించరు!" అంటూ స్పష్టం చేస్తాడు. నిజమే మరి మన కనులముందు నశించిపోయే వస్తుసముదాయానికీ, సంపదలకూ, మన మనోచక్షువులకు శాశ్వతత్వం ఇచ్చే మహదైశ్వర్యానికి తేడా తెలుసుకో గలిగితేచాలు! అదే నిజమైన జ్ఞానం మనిషికి అవునా?

## హిరణ్యాక్షుడు — హిరణ్యకశిపుడు — వేనుడు

ఒక్కొక్కమారు విధివైపరీత్యం పరికిస్తే విచిత్రంగానూ, ఆ భగవంతుని లీలలు దురవగాహనంగానూ వుంటాయి సత్పురుషులు, పతివ్రతామతల్లులూ, అయిన వారికి అతికర్కోటకులూ, దుర్జనులూ బిడ్డలుగా జన్మిస్తారు! వారి అమానుష చర్యలకు తల్లితండ్రులు కూడా తల్లడిల్లి పోతుంటారు. ఆ తల్లి దండ్రులలో మచ్చుకైనా లేని దుర్గుణాలు ఈ బిడ్డలకెలా సంక్రమించాయో. అని ఆశ్చర్యం కలుగుతుంది. అలానే అతి నీచులు, దుర్మార్గులు, కర్కోటకులు ఆయిన తండ్రికీ తల్లికి (తల్లిలో మంచిగుణాలు వుండవచ్చు) అతి సాత్వికులు అత్యంత దైవభక్తులూ జన్మించి, ఆతల్లిదండ్రుల తరతరాలకూ సత్కీర్తి సాధిసుంటాచు.

ఇందుకు ఉదాహరణగా భాగవతంలో మనువంశంలో పుట్టిన పరమ దుర్మార్గుడైన "వేనుడు" అనే రాజు కథా! కశ్యప మహర్షి, దితి వంటి మహా తపస్విద్వులకు జన్మించిన హిరణ్యాక్ష, హిరణ్యకశిపులనే రాక్షసుల (వారి చర్యల ద్వారా రాక్షసులైనారు వారు-విప్రవంశంలో జన్మించికూడా) కథా! హిరణ్య కశిపుడు లాంటి కర్కోటకుడూ, లోకకంటకుడూ విష్ణుద్వేషి అయిన రాక్షసునికి అతని భార్య లీలావతి అనే పతివ్రతకూ పుట్టిన పరమ భాగవతోత్తముడూ, బాలభక్తుడూ, భక్తాగ్రేసరుడూ అయిన ప్రహ్లాదుని కథా వగైరా లెన్నో వున్నాయి రామాయణంలోనూ బ్రహ్మ పుత్రుడైన పులస్త్యుని వంశంలో రావణా-బ్రహ్మగా జన్మించే తన రాక్షస కృత్యాలతో ముల్లోకాలను పీడించి శ్రీరామావతారం ద్వారా హతుడైన రావణాసురుని కథా ఒక ఉదాహరణ.

భాగవతంలో కశ్యప మహర్షి మహాతపోనిధి అయన భార్య "దితి" అనే ఆమె మహా పతివ్రత. ఈమె బ్రహ్మ పుత్రుడైన దక్షప్రజాపతి కుమార్తెల లో ఒకర్తె. ఇద్దరూ తపోబల సంపన్నులే.

కానీ విధిబలీయమై, అసురసంధ్యా సమయంలో, దితికి సంతాన వాంఛకలిగి భర్తయైన కశ్యప మహర్షికి తన కోర్కె తెలుపుతుంది. ఆసమయంలో భయం కరులైన రుద్రభటులు సంచారం చేస్తుంటారని అలాంటి సమయం కామానికి నిషిద్ధమనీ కశ్యప మహర్షి, భార్య అయిన దితికి ఎంతగానో నచ్చచెబుతాడు కానీ తన మోహావేశాన్ని, సంతాన కాంక్షనూ నిగ్రహించుకోలేక పోతుంది దితి ఇక కశ్యపమహర్షి భూత, భవిష్యత్ వర్తమాన కాలాలనూ, వాటి ఫలితాలను తెలిసిన జ్ఞాని గనుక ఆమెను నొప్పించక ఆమె కోర్కె సఫలం చేస్తాడు.

ఫలితంగా దితి గర్భవతి అవుతుంది. అయితే ఆమె గర్భాన జయ విజయులు బిడ్డలుగా జన్మించాలి గనుక వారు రాక్షసులుగా మారుతారని తెలుసుగనుక కశ్యపమహర్షి ఆమెతో ముందుగానే చెబుతాడు.

క॥ "పరగిన దర్పోద్ధతులిద్దరు గొడుకులు నీకు బుట్టి, ధరణికి వ్రేగై
నిరతము బుధజనపీడా-పరులై వర్తింతురాత్మ బలగర్వమునన్."

తే॥ అట్టి దుష్కర్మములకును, మహాత్ములలిగి
విశ్వవిదుడైన హరికిని విన్నవింప
నతడు కోపించి హరి కులిశాయుధమున
గిరుల కూల్చిన గతి వారి ధరణిగూల్చు!

పాపం! దితి బాధపడుతుంది! తన గర్భవాసాన లోకకంటకులైన కుమారులు జన్మించి, విష్ణువు చేతిలో మరణిస్తారనీ తెలిసి రోదిస్తుంది. మరలా కశ్యప మహర్షి ఆమెను ఓదార్చి నిరంతరం హరినామస్మరణతో కాలంగడపమనీ, కావలసిన కార్యం కాక మానదనీ, అయితే దితి కుమారులలో ఒకరి గర్భవాసాన పరమ భాగవోత్తముడు, విష్ణు భక్తుడు జన్మించి, జన్మతః సద్వంశ సంజాతులయినా, దుష్కర్మలతో రాక్షసులుగా మారిన ఆ తండ్రుల వంశాలను దుష్కీర్తిని ఉద్ధరించి, సత్కీర్తి సాధిస్తాడని చెబుతాడు. అలా తన బిడ్డలు రాక్షసులౌతారని తెలిసి దుఃఖమూ, తన మనుమడు భక్తాగ్రేసరుడౌతాడని సంతోషము కలిగి దితి గర్భం ధరిస్తుంది తల్లిగా.

ఇక ఆ పుత్రులు పుట్టిన వేళ-ప్రకృతి విపరీతాలు సంభవించాయి,

తే॥ ధరణిగంపించె! గులపర్వతములు వడకె?
జలధులుగలంగె దారకావళులుడుల్లె!
గగన మగలెను; మ్రొగ్గెదిక్కరులు; దిశల
మిడుగుఱులెగసె; బిడుగులు పుడమింబడియె!

నిజమే మరి; ఈనాడయినా మనం జాగ్రత్తగా పరిశీలిస్తే, ఒక మహా విలయం సంభవించబోయే ముందు ప్రకృతి ఇలా భీభత్సం అవుతుంటుంది చూడండి. ఒక నియంత రాజ్యం చేస్తున్నా, కరువులు, తుఫానులు, అనావృష్టి, భూకంపం లాంటి ఏన్నో తరచూ జరుగుతుంటాయి. అవి ప్రకృతి తెలిపే నిరసనలు. ప్రకృతి చూపే తిరస్కారాలు, కానైతే అవి గమనించి ప్రవర్తన సరిదిద్దుకొనే రాజులూ లేరు. ప్రజలూ లేరు. ఈనాడూ, మరేనాడూ! అవి అలా సూచన ప్రాయంగా జరిగిపోవలసిందే!

ఆమె ఇద్దరు మగబిడ్డలను ప్రసవించింది,

బంగారు రంగు కళ్ళు గలిగిన వాడికి హిరణ్యాక్షుడనీ, పెద్దవాడికి హిరణ్యకశిపుడనీ పేర్లుపెట్టి, కశ్యప మహర్షి తపోభూములకు వెళ్ళిపోయాడు భవబంధాలను దూరంగానూ, భావిలో తన బిడ్డలద్వారా జరగబోయే లోక కంటకత్వానికి సాక్షీభూతుడుగా వుండటానికి (ఒక తండ్రిగా) ఇష్టంలేకనూ!

అందులో హిరణ్యాక్షుడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి, తనను యుద్ధంలో జయించగల వీరుడెవ్వడూ లేకూండా వరంపొందాడు! అపర గర్వంతో వాడు ముల్లోకాలనూ పీడించి, సకల దేవతలనూ ఓడించి, నానా బీభత్సం సృష్టించాడు. వాడే "యజ్ఞవరాహమూర్తి" చేత మరణించాడు ఆ యజ్ఞవరాహునికీ భూదేవికీ జన్మించిన బిడ్డె "నరకుడు" వాడూ అసురుడే అయ్యాడు.

మను వంశంలోనే "అంగుడు" అనే రాజుకు "సునీథ" అనే మహా పతివ్రత అయిన భార్యకూ "వేనుడు" అనే దుర్మార్గుడు పుట్టుకొచ్చాడు.

ఆ వేనుడు జన్మించటం కూడా సాధారణంగా కాదు. అంగుడు పుత్రకామేష్టి చేయుగా, దివ్యపురుషుడు దివ్యపాయసంతో అవిర్భవించి ఇస్తే, ఆ దివ్యపాయసాన్ని అంగుని భార్య అయిన సునీథ అతిభక్తిగా స్వీకరించింది.

కానీ వారికి పుట్టిన కొడుకు "వేనుడు" పరమ దుర్మార్గుడైనాడు,

చ॥ కమలదళాక్షి పాయసము గౌతుక మొప్పభుజించి, భర్తృసం
గమమున జేసి తక్షణమ గర్భముదాల్చి కుమారుగాంచె; న
క్కొమరుడు నంత మాతృ జనకుండగు మృత్యువు బోలి తా నధ
ర్మమున జరించుచుండె గుణమండన! వేనుదనంగ నిచ్చలున్!

వాడి దుర్మార్గాలతో ఆ తల్లితండ్రులు విసిగి వేసారి పోయారు. ఆ తండ్రి లోలోపల కుళ్ళిపోయాడు,

క॥ అనయమునిట్టి కుపుత్త్రుని గనిపరితాపంబు బొందుకంటెను ధరలో
నవపత్యుండగుటొప్పును వనజాక్షుభజించునట్టి వాడగువాడున్!

అని-సాధారణ తండ్రులలా సగటు తండ్రులలా-తన పుత్రరత్నం దుశ్చేష్టలను (ఈనాటి చాలామంది అధికారంలో వున్న తండ్రులలా) సమర్థి చటానికి ప్రయత్నించక,

సీ॥ "జనులకు దుష్పుత్త్రకునిచేత
నపకీర్తియు, నధర్మమును, సర్వజనవిరోధ
మును, మనోవ్యధయును, మునుకొని
బాపించు నట్టి కుపుత్త్రమోహంబు విడువఁ
జాలక బహుమాన సంగతి గనునెవ్వ
డతని గేహంబు దుఃఖాలయంబు
నగుచినని. మతయునిట్లను" మనుజుండు
శోకస్థానమగు పుత్త్రకతనజేసి

తే॥ యనుపముక్లేశభాజనం బయినగృహము
విడుచు గావున నిట్టి వివేకహీనుఁ
డగు కుపుత్త్రి సుపుత్రుగా నాత్మదలతు
ననుచు నారాజు బహుదుఃఖితాత్ముడగుచు.

ఒక రాత్రికిరాత్రి అంతఃపురం విడిచి అరణ్యాలు పట్టిపోయాడా రాజు. ఇక వేనుడు రాజుగా అభిషిక్తుడై మరింతగా చెలరేగి పోయాడు. తానే సర్వాంత ర్యామిననీ-తానే రాజరూపంలోవున్న సర్వేశ్వరుడననీ చాటుకొని అహంకారం పరాకాష్ఠకు చేరుకోగా తనకు శ్రేయస్సు, హితవు చెప్పవచ్చిన మహర్షులను అవమానపరచి, దైవానికి బదులుగా తనకే మ్రొక్కమని వాచాలత ప్రదర్శించాడు అంతే ఆ మహర్షుల కోపాగ్నికి మరణించాడు. వారి కోపాగ్నిలో మాడి మసి అయ్యాడు. అయితే తల్లి అయిన సునీథ తన కొడుకు నిర్జీవ కళేబరాన్ని, తన యోగశక్తితో కాపాడుతూ దాచి పెట్టింది. మరలా

రాజులేని రాజ్యం అల్లకల్లోలం కావటంతో మహర్షులు ఆ వేనుడి నిర్జీవ కళేబరాన్ని "ఊరు మధనం" గావించారు "నిషాదకుడు" అనేవాడు పుట్టుకొచ్చాడు. వాడిలో రాజరికపు లక్షణాలు లేకపోగా, వాడూ వేనుడి ప్రతిబింబంలానే వున్నాడనితోచి మహర్షులు వాడిని 'గిరికాననలలో' వుండమని పంపించారు. వాడి వంశజులే "నిషాదులు" గా పేరు పొందారు. మరల వేనుడి బాహువులు మధించగా, 'పృధుడు' 'అర్చి' అనే పురుషుడు, స్త్రీ పుట్టు కొచ్చారు. ఈతడే పృధుచక్రవర్తిగా, విష్ణ్వాంశ సంభూతుడుగా ప్రసిద్ధికెక్కి, జనరంజకముగా రాజ్యంచేశాడు. 'అర్చి' లక్ష్మి అంశ సంభూతురాలుగా కీర్తింపబడి పృధు చక్రవర్తి ఇల్లాలైంది. అంటే-వేనుడి వంశంలో-ఒక సోదర సోదరీలు దంపతు లయ్యారు ఒకే శరీరంనుండి జన్మించి.

అట్లా విష్ణుభక్తుడైన 'అంగ' మహారాజుకు, సుశీల సంపన్న అయిన సునీధకు కర్కోటకుడయిన వేనుడు జన్మించగా-వేనుడికి-పృథివి నుంచి సకల ఔషధ రాశులనూ, దేవ, యక్ష, గంధర్వ, విద్యాధర, మానవ, పక్షి, మృగ గణాలన్నీ తాము తాము కోరిన ఆహార పదార్థాలనూ పితికి సస్యశ్యామలంచేసి చక్రవర్తిగా కీర్తిపొందిన పృథుచక్రవర్తి పుట్టాడు.

హిరణ్యకశిపుడికి-ప్రహ్లాదునిలానే.

## కపిలుడు

భాగవతంలోని యోగీంద్రులలో ఎన్నదగినవారు 'కపిల' మహాముని బిడ్డ చేత యోగరహస్యాలు విని తరించిన మాతృమూర్తులలో, కర్దమ ప్రజాతి భార్య అయిన దేవహూతి ప్రధమురాలు.

బ్రహ్మకుమారుడు కర్దముడు బ్రహ్మచేత సృష్టి పెంపొందింపజేయుమని ఆజ్ఞాపింప బడతాడు. కర్దముడు వెయ్యి దివ్యవత్సరాలు శ్రీమన్నారాయణుని గురించి ఘోర తపస్సు చేస్తాడు. అప్పుడు శ్రీహరి ప్రత్యక్షమై, స్వాయంభువ మనువు. శతరూపల కుమార్తె అయిన దేవహూతిని వివాహమాడి

తొమ్మిది మంది కుమార్తెలను కని వారివారిని మహా తపస్సంపన్నులైన మహర్షులకు భార్యలుగా ఇమ్మని, వారిద్వారా సృష్టి అభివృద్ధినొందుతుందనీ వరం అనుగ్రహిస్తాడు. స్వాయంభువ మనువు, శతరూపలు, స్వయంగా "దేవహూతి" ని వెంట పెట్టుకొని వచ్చి, కర్దమునికిచ్చి వివాహం చేస్తారు. కర్దముడు మాత్రం తన భార్య సంతానవంతురాలైన తర్వాత తాను తపోవనాలకు వెళ్ళి శ్రీమన్నారాయణుని ధ్యానంలో శేషజీవితం గడుపుతానని చెబుతాడు. వివాహానికి ముందు.

కర్దముడు మహాతపస్సంపన్నుడు. రామాయణంలోని భరద్వాజముని వశిదర్శించి చూపిన మహాద్భుత యోగవిద్యా ప్రదర్శనలాటిదే, కర్దముని లోనూ నిగూఢంగ వుంది అంటే ఆమహర్షులు తమతపోబలంతో ఏఐశ్వర్యాలు ఏ ఐహిక సుఖాలు అయినా సంకల్పం మాత్రం చేత సృష్టించుకోగలరు. అయితే వారు క్షణభంగురమైన ఆ తుచ్ఛ భోగాలకూ, ఐశ్వర్యాలకూ ప్రధాన్యత ఇవ్వక, శాశ్వత మోక్ష మార్గం అయిన భగవంతుని శ్రీచరణ ధ్యానానికే ప్రాధాన్యత, విలువ-ఇస్తారు. అంచేత అతి స్వల్ప పరిణామంలో కనిపించే మర్రివిత్తనంలో, మహాశాఖోపశాఖలతో విస్తరిల్లే మహావృక్షం దాగివున్నట్లే తమ మహత్యాలను తమలోనే దాచుకుంటారు వినయంగా, నేటి గారడీ స్వాముల వార్లు, అట్టహాసాల అమ్మవార్ల మహిమలలా లేనిపోని మహిమల ప్రదర్శన చేయరు. ఎప్పుడో అవసరమైతే తప్ప తమ తపోశక్తి ప్రదర్శించరు.

దేవహూతి భర్త సపర్యలతో కృశించింది. సంతాన కాంక్ష ఆమెలో బలీయమైంది. ఇది గమనించిన కర్దముడు ఆమె మనసెరిగి, సుకుమారి. రాజకుమారి, అయిన దేవహూతి మనసుకు అహ్లాదం కలిగించటం కోసం తపశ్శక్తితో, మనోభావాని కనుగుణంగా, గగనంలో విహరించగల మహాద్భుత విమానాన్ని, అందులోనే సర్వభోగాలనూ సృష్టించాడు. ఆమెతో విహరించి ఆమెకు సంతోషం కలిగించి, ఆమెకు తొమ్మిది మంది కుమార్తెలు జన్మించేలా కాలం గడుపుతాడు. కుమార్తెలు పుట్టగానే, తాను తపోవనాలకు వెళతానంటాడు కానీ దేవహూతి. అతి దీనంగా, జాలిగా, తనకు ఈ భవబంధాలను తొలగజేసే

పుత్రుడు కావాలని కోరికగా వుందనీ, ఈ కుమార్తెలకు వరుళ్ళను చూచి వివాహం చేసి, తండ్రిగా బాధ్యత నిర్వర్తించమనీ భర్తను వేడుకుంటుంది, కర్దముడు అంగీకరించి, దేవహూతితో, నిరంతరం శ్రీమన్నారాయణుని చరణ కమలాలను ధ్యానించమనీ, శ్రీమన్నారాయణుడే తనకోర్కె మేరకు, ఆమెకు పుత్రుడుగా జన్మించి, తల్లికి సాంసారిక వ్యామోహం తెగవేసే తత్వబోధ చేయగలడనీ బోధిస్తాడు.

దేవహూతి భర్త బోధ గురు బోధలా స్వీకరించి ఆమె గర్భవాసాన శ్రీ మన్నారాయణుడే సాక్షాత్తుగా, "కపిలు" డిగా జన్మించాడు, కపిలుడు పుట్టిన సమయంలో సర్వప్రకృతి సంతోషంతో పులకించి పోయింది. బ్రహ్మ స్వయంగా మరీచాది మహర్షులతో కర్దముని, దేవహూతిని ఆశీర్వదించటానికి, కపిలుణ్ణి చూడటానికి వస్తాడు ఆ సందర్భంగా కర్దములు తన కుమార్తెలయిన 'కళ' ను మరీచి మహామునికీ 'అనసూయను' అత్రి మహామునికి 'శ్రద్ధ' ను అంగీరసునికీ, 'హవిర్భును' ను పులస్తునకు, 'గతిని' పులహునికీ, 'క్రియ' ను క్రతు మహర్షికీ, 'ఖ్యాతి' ని భృగుమహర్షికీ, "అరుంధతిని" వశిష్టునకు "శాంతి" ని అథర్వ మహర్షికీ వరుసగా ఇచ్చి వివాహాలు చేయిస్తాడు.

(ఈనాటి అప్టుడేటు అనుకుంటున్న పేర్లను-ఆనాటి అమ్మాయిల పేర్లనూ గమనించండి.)

కపిలుడు సాక్షాత్తు విష్ణు స్వరూపుడని తెలుసుగనుక, కర్దముడు, తన పుత్రునికి నమస్కరించి అతని వలన అనుజ్ఞాతుడై తపోవనాలకు వెళ్ళి పోతాడు. తర్వాత తల్లి అయిన దేవహూతి కపిలుని తనకు మోక్ష మార్గం వుపదేశించమని కోరుతుంది.

కపిలుడు తల్లికి వుపదేశించిన యోగం "సాంఖ్య యోగంగా" జగత్ప్రసిద్ది పొందింది తిరుపతి పుణ్యక్షేత్రంలో ఈనాటికీ 'కపిల తీర్థంగా' ప్రఖ్యాతి గాంచి అశేష భక్త కోటిచేత సేవించబడుతున్న తీర్థం ఆ కపిల మహాముని కొంతకాలం నివసించిన పుణ్యస్థలంగా చెబుతుంటారు పెద్దలూ, పురాణాలూ.

క॥ విను జీవుని చిత్తము దా-ఘనభవబంధాప వర్గకారణ, మది యే
చిన, త్రిగుణాసక్తంబయి-నను, సంసృతి బంధకారణంగు మరియున్

తే॥ అదియు నారాయణాసక్తమయ్యే నేని, మోక్షకారణమగు—

అంటూ జీవుని పుట్టుక మొదలు జీవుని చరమ దశవరకూ గలిగిన వివిధ తత్వాలనూ, బంధాలనూ, బంధ విముక్తులనూ అత్యద్భుతంగా వివరిస్తాడు తల్లికి కపిలుడు,

కొందరు భగవంతుని సామీప్యమే తమకు సర్వస్వంగా భావించి, ఆయనను చూస్తూ ఆయన వెంట వుంటూ, ఆయనకు సేవలుచేస్తూ ముక్తి మార్గాన్ని చూరగొంటారు. ఇది 'సామీప్య' ముక్తి. వీరినే సగుణ భక్తులు అంటారు. (రామాయణంలోని లక్ష్మణుడీ కోవకు చెందిన భక్తుడు) వైకుంఠంలోని విష్ణుకింకరులలో ఎక్కువ మందీ కోవకు చెందినవారు.

కొందరు దైవస్వరూపంలో తామూ తాదాత్మ్యం చెందిపోయి ఆ దైవానికి ప్రతిబింబాలుగా భాసిస్తూ ముక్తి పొందుతారు. వీరిది "సారూప్య" భక్తి "సారూప్య" ముక్తి

మరికొందరు నిర్వకార మనస్థితిలో దైవధ్యానం, తపస్సుతప్పమరో ఐహిక ఆలోచన లేకుండా వుంటారు. వారు "సాయుజ్య" ముక్తిని చేరుతారు. వీరే మహోన్నత వీతరాగులు, ముక్త సంగులు. ఇట్లా వారివారి చిత్త సంస్కారాన్ని పూర్వజన్మ సుకృతాన్ని బట్టి భగవత్సాన్ని ధ్యాన్ని చేరుతారు భక్తులు.

మ॥ సమతన్ స్నేహముచే సుతత్త్వమును, విశ్వాసంబుచేతన్ సఖి
త్వము, చాలన్ హితవృత్తి చేతను సుహృత్త్వంబున్, సుమంత్రోపదే
శము చేతన్ నిజదేశికుండనక, నిశ్చల్ పూజ్యుడౌ, నిష్టదై
వము నై వారికి, గాలచక్ర భయముల్ వారింపుదున్గావునన్!

అని చెబుతాడు. ఇట్లా సాంఖ్యయోగం బోధించి, ఆమెకు సులభ తరుణో పాయంగా "తల్లీ" భక్తిని మించిన తపస్సు, యోగం యజ్ఞం లేవుగాకలేవు నిరంతరం శ్రీమన్నారాయణుని శ్రీచరణారవిందాలను ఏకాగ్రతతో స్మరిస్తూ ఆయన అనంత కోటి నామాలతో ఒక నామాన్ని నిరంతరం జపిస్తూ, ఆయన పై సర్వబాధ్యతలు వదిలి శరణాగతిచెందే ఉత్తమభక్తి, ఉన్నతభక్తి మూడ భక్తి ఒక్కటే చాలు మోక్షం కరతలామలక మౌతుంది అని బోధిస్తాడు. శ్రీ వైష్ణవ సాంప్రదాయంలో నేటికీ సాంప్రదాయాను సారంగా వస్తున్న పూజా విధి ప్రకారం.

ముందుగా శ్రీహరి శ్రీచరణాల మొదలు, మణిమయ కిరీటం వరకూ. ఆయన పాదాలు, పీతాంబుర శోభిత కటిప్రదేశం, వైజయంతీ మాలాలంకృత వక్షస్థలం. శంఖ, చక్రగదా పద్మహస్తాలు ధరించిన చతుర్భుజాలు, చక్కని ముఖబింబం, కరుణరసం జాలువారే చల్లని చూపులు భక్తకోటిపై ప్రసరింప చేసే నేత్ర యుగ్మం, మణిమయు కిరీటం-ఇలా నఖశిఖ పర్యంతం ఆ దివ్య మంగళ విగ్రహాన్ని, ఆ తర్వాత ఆమూర్తి మహోన్నత గుణాలనూ కీర్తిస్తూ పూజిస్తూ, భక్తి తత్వం ఒక్కటే సర్వ శరణ్యంగా సాగిపోతేచాలు, స్త్రీ వృద్ధ, బాలక, వయోరూప, కులమత భేదాలు లేకుండా మానవ, దానవ, వానర, క్రిమి కీటక, మృగ, పక్షిగణం అనే బేధం లేకుండా సర్వప్రాణికోటికీ ముక్తి లభించి తీరుతుంది. అణిమాద్యష్ట సిద్ధుల సాధనలాంటి ప్రలోభాలకు లోను గాకుండా భక్తులు మోక్షంమీదే స్థిరమైన బుద్ధి కలిగివుండాలి. సర్వసంపదలకూ మూలమైన దైవమే మనకు సాక్షాత్కరించాలి. కానీ ఈ సర్వసంపద ఆ భగ వంతుని కృపతో దానంతటదే చేకూరుతుంది.

తామస, రాజస, సాత్వికభక్తి యోగాలలో, సాత్విక భక్తి యోగం వుత్కృష్టమైనది. కాబట్టి తల్లీ,

క॥ విను, సర్వభావముల బర—ముని,
ననఘు, ననంతు, నీశు, బురుషోత్తము స
న్మనమున భజియింపుము, ముద
మున బునరావృత్తి లేని ముక్తి లభించున్."

అని బోధిస్తాడు కపిలుడు. అంతేకాదు ఈయోగరహస్యాలు, దైవభక్తి లేనివారికి దైవం అంటే నిర్లక్ష్యం గలవారికీ బోధించరాదు; నిజమైనభక్తి శ్రద్ధలు గలవారికే బోధించాలి. అని ఆదేశిస్తాడు కూడా దేవహూతి కుమారుని బోధతో, విరక్తి మార్గం తెలుసుకొని సరస్వతీ, బిందు సరోవర తీరంలో, ప్రగాఢ భక్తి వైరాగ్యాలతో భగవంతునిలో ఐక్యం అయిపోయింది కపిలుని సాంఖ్య యోగం యోగులెందరికో మార్గదర్శనం అయ్యింది నాటికీ నేటికీ.

# ధృవుడు

ఏ యుగంలో నయినా, ఏరంగంలో నయినా ఒకానొక వ్యక్తి, మహోన్నతుడుగా మారాడూ అంటే, ఆమార్పు వెనుక ఒక బలవత్తరమైన సంఘటన, ఆసంఘటన తాలూకు స్పందన. ఆ సంఘటన తాలూకు ప్రేరణ తప్పని సరిగా వుంటాయి. అలాగే ఒకడు ఆస్తికుడుగా మారినా. ఒకానొక స్త్రీ అదృశ్య హస్తం ఆ మార్పు వెనుకాల వుండితీరుతుంది. ఇది చరిత్రలో తిరుగులేని సత్యం. ఏందరో అతి కాముకులైన వ్యక్తులు, వేశ్యాలోలురు, ఆకాశ్యం కారణంగానే, తపోనిధులుగా, మహాత్ములుగా మారిన కథలెన్నో చరిత్రలో వున్నాయి. ఆనాటి పుండరీకాక్షుడనే భక్తుని మొదలు, నిన్న మొన్నటి వేమన వరకూ పైకోవలోకి వస్తారు. పన్నెండు మంది ఆళ్వారులలో ఒకరైన ఆళ్వారు, విప్రనారాయణుడనే పేరిట ప్రసిది పొందినవాడూ అయిన మహనీయుని కథకూడా ఆ కోవలోనిదే.

ఇక బాలభక్తులుగా భాగవతంలో ప్రసిద్ధికెక్కిన వారిలో ధృవుడు, ప్రహ్లాదుడు ముఖ్యులు. ఒకరికి పినతల్లి, తల్లిద్వారా జరిగిన బోధ భక్తికి మార్గమైతే, మరొకరికి తల్లిగర్భంలో తానుండగానే దేవఋషి నారదమహర్షి బోధ మార్గదర్శకం అయింది.

స్వాయంభువమనువు, శతరూపల కుమారులైన ప్రియవ్రత, ఉత్తాన పాదులలో, ఉత్తాన పాదుడనే అతనికి ఇద్దరు భార్యలు. సునీతి, సురిచి అయితే ఉత్తానపాదుడు రెండవభార్య అయిన సురిచికి దాసానుదాసుడు. ఒక విధంగా భార్యా విధేయుడు. ఆమెమాట కాదనే ధైర్యం ఆయనకు లేదుగాకలేదు.

సునీతి కుమారుడు ధృవుడు, సురిచి కుమారుడు ఉత్తముడు. ఒక రోజు సురిచి కుమారుడైన ఉత్తముడు తండ్రి అయిన ఉత్తానపాదుడి ఒడిలో కూర్చుని గారాలు పోతున్నాడు. ఆ సమయంలో అక్కడకు వచ్చిన ఐదేండ్ల బాలుడైన ధృవుడికి కూడా తమ్ముడిలానే తానూ తండ్రి ఒడిలో కూర్చుని ఆనందించాలని ఆశ కలిగింది. తండ్రి దగ్గరకు వెళ్ళాడు. రెండవ భార్య కనుసన్నలలో మెలిగే ఆ తండ్రి, కొడుకును ఆదరించలేదు. ఆ భార్య కోపానికి భయపడి. పినతల్లి అయిన సురిచి ధృవుణ్ణి ఈసడిస్తు హేళన, తిరస్కారం నిండిన స్వరంతో,

తే॥ గీ॥ తండ్రి తొడనెక్క వేడుకదగిలేనేని,
ఖూని నాగర్భమున నాడుపుట్టన్యక
గర్భమున బుట్టి కోరిన గలదెనేడు
జనకు తొడ యెక్కు భాగ్యంబు సవతికొడుక!

అని అంటుంది. తండ్రిముందు పినతల్లి ఆడిన కఠినోక్తులకు బాధపడతాడు ధృవుడు. తండ్రికూడా మారుబలకగపోగా సవతితల్లి మరో సలహాకూడా ఇస్తుంది హేళనగానే.

క॥ "అదిగావు నీవధోక్షజు, పదపద్మము లాశ్రయింపు పాయక, హరి నా
యుదరమున బుట్టనిచ్చును వదలక యట్లయిన ముదము వడసెదవనఘా.

అంటూ అపసిహృదయంలో ఆమాటలు ములుకులై నాటుకున్నాయి. నేరుగా తల్లి అయిన సునీతి వద్దకు వచ్చాడా బాలుడు. ఆ సరికే సవతి అయిన సురుచి ద్వారా తన కుమారునికి జరిగిన అవమానం దాస దాసీల

ద్వారా వినివున్న సునీతి. ధృవుణ్ణి అక్కున జేర్చుకొని దుఃఖిస్తూ

క॥ ఏటికిమిటి చేతను బెండ్లామనికాదు, నికృష్ట దాసియనియును బిలువం
గను జాలని దుర్భగురాలనగల నా కుక్షినుదయమందిన కతనన్!

క॥ నినునాడిన యాసురచి వచనములు సత్యంబులగును, సర్వ శరణ్యుం
డనగల హరిచరణంబులు గను, జనకుని యంక మెక్కగా దలతేనిన్!

అని సహజ స్త్రీ స్వభావమైన దీనాలాపములు చేస్తుంది. ఆ శోకం తోనే కుమారుణ్ణి ఊరడిస్తూ "సకలలోకైక శరణ్యుండు దీనజన బాంధవుడు అయిన శ్రీహరిని మనసారా ధ్యానించు నాయనా. లోగా బ్రహ్మాది దేవతలు, మీతాత అయిన స్వాయంభువ మనువు మొదలైన వారంతా శ్రీమన్నారాయణుని పూజించి, ధ్యానించి, అత్యంత వున్నత పదవులు పొందారు. నీ, నా దుఃఖాన్ని ఉపశమింప జేయగలిగినవాడు ఆ శ్రీహరి ఒక్కడే" అంటుంది.

తల్లిబోధ బీజమై నాటుకుంది. ధ్రువుని హృదయక్షేత్రంలో.

ఆ రాత్రికి రాత్రే అంతఃపురం కదిలి శ్రీమన్నారాణుని ప్రత్యక్షం చేసుకోవాలనే ధృఢ చిత్తంతో అరణ్యాలకు బయల్దేరాడు ధృవుడు. నారదమహర్షి ఆ బాలునికి ఎదురై, ఇంత చిన్నవయసులో ఇంత పెద్ద పట్టుదల వద్దనీ, మహాయోగులకు కూడా సాధ్యంకాని విష్ణుదర్శనం అంత తేలికగా లభించదనీ వారింపజూస్తాడు. కాని ధృవుడు తన పట్టుదల వదలడు. తన పినతల్లి హేళనకు జవాబుగా తాను ఈ ముల్లోకాలలోనూ ఎవరూ సాధించలేని అత్యున్నత పీఠాన్ని అధిరోహిస్తేనే తప్ప తనకు శాంతి లేదనీ, అందుకు శ్రీమన్నారాయణుని చరణారవిందాలు వదలక పట్టుకుంటాననీ చెబుతాడు. నారదుడు సంతోషించి ద్వాదశాక్షర కలితమైన "వాసుదేవ" మంత్రాన్ని ఆ చిరంజీవికి ఉపయోగించి, మధువనం తపస్సుకు అనువైన ప్రదేశమని సూచిస్తాడు.

సీ॥ హారకిరీట కేయూర కంకణ ఘనభూషణుడాం్రశిత పోషణుండు
లాలిత కాంచీ కలాప శోభిత కటి మండలుం, డంచిత కుండలుండు,
మహనీయ కౌస్తుభమణిఘృణి చారు గ్రైవేయుకుండానందదాయకుండు
సలలిత ఘన శంఖ చక్రగదా పద్మహస్తుడు, భువన ప్రశస్తుండజుడు.

తే॥ గ్రమసౌరభ వనమాలికాధరుండు
హతవిమోహుండు, నవ్యపీతాంబరుండు
లలిత కాంచన నూపురాలంకృతుండు,
నిరతిశయ సద్గుణుడు దర్శనీయుతముడు.

నీ కోరిక తీరుస్తాడని ఆశీర్వదించి వెళతాడు నారదమహర్షి. ఇక ధృవుడు బాలునికి తగని పట్టుదలతో హఠ యోగక్రియలో, మొదట్లో మూడు రోజుల కొకసారి ఆహారం తీసుకుంటూ ఆ తర్వాత, జలహారునిగా, ఆ తర్వాత వాయు భక్షకునిగా, ఆ తర్వాత వాయువునూ బంధించి, తీవ్ర సమాధి నిష్ఠలో ఆరు నెలలు ఘోర తపస్సు చేస్తాడు, ఆ ఉగ్ర తపస్సుకు పృథివి కంపించింది. దిక్కరులు ఒణికి పోయాయి. ఒకే ఒక కాలి బ్రొటనవేలు ఆధారంగా, హృదయంలో పంకజనాభుని మూర్తిన్నిలిపి, నేలమీద నిల్చుని స్థాణువై పోయిన ధృవుని తపశ్శక్తికి జగన్నాధుడు కూడా చలించి పోయాడు. భక్తవరాధీనుడై పరుగున వచ్చాడు. ధృవుడి ముందు ప్రత్యక్షమైనాడు నాయనా!" అంటూ.

ఇక ధృవుడి ఆనందానికి అవధుల్లేవు. పోతన కవిత్వానికి అవధుల్లేవు భక్త్యావేశపు ఝురిలో, శ్రీమన్నారాయణుని స్తోత్రం చేయుటంలో అటు ధృవుడూ, ఇటు పోతనా తమని తాము మరచిపోయి భక్తుల హృదయాలలో మార్మ్రోగే పద్యసుమ, కుసుమ హారాలతో, నీరాజనాలతో భగవంతునీ, భక్తకోటినీ ముంచెత్తి వేశారు.

చ॥ హరి! భజనీయ మార్గ నియతాత్మకులై భవదీయమూర్తివై
వఱలిన భక్తి యుక్తులగు వారల సంగతిఁ గల్గజేయు స
త్పురుష సుసంగతిన్ వ్యసనదుస్తర సాగర మప్రయత్నతన్
నర సభవత్కథామృద రసంబున మత్తుడనై తరించెదన్.

అంటూ స్తోత్రం చేసిన ధృవుని భక్తికి మెచ్చి, భక్త వరదుడు-భక్తుని మనసులోని కోరిక తెలిసి.

క॥ ధీర వ్రత రాజన్యకుమారక! నీ హృదయమందు మసలిన కార్యం
బారూఢి నెఱుంగుదు నారయునది పొందరానిదైనను నిత్తున్.

అని అభయమిచ్చి గగనంలో నక్షత్ర మండలం కూడా అధిగమించిన తర్వాత "ధ్రువక్షితి" అనే మహోన్నత స్థానాన్ని ప్రసాదించాడు. సప్తర్షి మండలాన్ని కూడా అధిగమించి, నాటికీ, నేటికీ, ఏనాటికీ శాశ్వతంగా "ధ్రువ నక్షత్రంగా" వెలిగే అద్వితీయ స్థానాన్ని ప్రసాదించి సంతుష్టుణ్ణి చేశాడు. బాలభక్తుణ్ణి భగవంతుడు అంతేగాక ఒకసారి శ్రీహరి కరుణాకటాక్షాలు ప్రసరించిన వారికిక ముల్లోకాలలోనూ శత్రువు ఉండరు. ఒకనాడు తిరస్కరించిన పినతల్లి, తండ్రి వగైరాలు నీ పాదాక్రాంతు లౌతారనీ చెబుతాడు శ్రీహరి. రాజ్యపాలనచేసి చివరగా "ధృవక్షితి" లో వెలుగొందమని ఆనతిస్తాడు హరి అంతర్ధానమౌతు.

ధృవుడు రాజధానికి తిరిగివచ్చి, తండ్రి, తమ్ముడు, పినతల్లి తనకు క్షమాపణలు చెప్పుకోగా, తల్లి ఆనందించగా యవ్వనం వచ్చాక తండ్రిచేత పట్టాభిషిక్తుడైనాడు. రాజుగా ఉత్తానపాదుడు ధృవుని రాజునుచేసి తపోవనాలకు వెళ్ళిపోయాడు. ఉత్తముడు వేటకు వెళ్ళి గంధర్వులచేత మరణించాడు యుద్ధంలో. ఉత్తముని తల్లి అయిన సురుచి కూడా కొడుకు చనిపోయాడనే దుఃఖంతో కారడవులకు తల్లడిల్లుతూ పోయి అక్కడ దావాగ్నికి ఎర అయి చనిపోయింది.

తన తమ్ముణ్ణి గంధర్వులు చంపారనే అనుమానంతో ధృవుడు గంధర్వ రాజు మీదకు యుద్ధానికి వెళ్ళి, వాళ్ళని చిత్రహింసలు పెడతాడు. అప్పుడు తాత అయిన స్వాయంభువ మనువు ప్రత్యక్షమై హరి భక్తులకిలా అకారణ ద్వేషం అనుమానం ఆదారమైన వైరం వనికిరావని బోధిస్తాడు. కుబేరుడు స్వయంగావచ్చి.

మనుమనుమని "మనుమను" మని మనమున దీవించి మరీ వెళతాడు ధృవుడుకూడా సకల జన రంజకంగా రాజ్యపాలనచేసి శింశుమార ప్రజాపతి కుమార్తె అయిన "భ్రమి" అనే ఆమెను, వాయుపుత్రి అయిన "ఇల" అనే ఆమెను వివాహమాడతాడు. భ్రమికి 'కల్పుడు' 'వత్సరుడు' అనే కొడుకులిద్దరు, 'ఇల'కు "ఉత్కళ" అనే కొడుకు అతిమనోహర రూపయైన మరో కుమార్తె కలుగుతారు. చివరగా, ధృవుడు-తాను కోరుకున్న "ధృవపదక్షితి"కి తరలి వెళతారు.

మొత్తంమీద విష్ణుభక్తులలోనూ, బాలభక్తులలోనూ, ప్రఖ్యాతి కెక్కిన ధ్రువుడు, ధ్రువనక్షత్రం నాటికి నేటికీ తళుక్కున మెరుస్తున్నట్లే, పోతన మహాకవి సందర్భం వచ్చీరాగానే భక్త్యావేశంతో జలజలపారే గంగలా దొర్లించిన పద్యాలు విష్ణుస్తోత్ర పద్యాలు-భక్తుల హృదయాలలో మారు మ్రోగుతుంటాయి ఏనాటికీ.

# సతీదేవి

పురాణాలన్నిటిలో హిమవత్పర్వత పుత్రికగా ఖ్యాతినొందిన పార్వతీదేవికి, సురేదేవుడికి. దేవతకు లేనన్ని పేర్లు, కథలు, గౌరవభక్తి ప్రపత్తులు వున్నాయి. ఆసేతు హిమాచలం ప్రతి జాతిలోనూ, ప్రతి మతంలోనూ, "అమ్మవారి" స్థానంలో పూజలు అందుకుంటూనే వుందామె ఇంటింటా "నా తల్లి తండ్రి ఎవరోనాకు తెలియదు. అని చెప్పే అనాథలు దేవగంధర్వ జాతుల వారూ వున్నారు గానీ, "అమ్మవారంటే ఎవరో తెలీదు." అనే మానవ దానవ మరే ఇతర జాతులూ లేవు ఈ భూమిమీద కనకదుర్గ మొదలు కాశీ విశాలాక్షి వరకూ, భగవతి మొదలు బతకమ్మ వరకూ వివిధ రూపాలలో వివిధ నామాలలో వివిధ ప్రదేశాలలో నాటికీ, నేటికీ ఏనాటికి పూజలందుకుంటూనే వుంది. సర్వమంగళ స్వరూపిణి అయిన అమ్మవారు. ప్రతి ఆడపిల్ల పేరులోనూ (మరింత నాస్తికంగానో, అతి అభ్యుదయంగానో భావించి 'వంకాయ, బెండకాయ, చీపురు, చేట,, లాంటి పేర్లు ఆలోచించే వారికిగాక సాధారణ, సగటు·

కుటుంబాలలోని ఆడపిల్లలు పేర్లలో) ఎవరో ఒక అమ్మవారిపేరు అంతర్గంగా వుంటూనే వుంది. ఇక వివాహాది సమయాలలో వధువుచేత 'మంగళ గౌరి వ్రతం, మంగళ గౌరీపూజ అంటూ చేయిస్తుంటారు. కేవలం సుమంగళిగా పరిపూర్ణ జీవితమూ, భర్త అనురాగమూ, బిడ్డలతో కూడిన చల్లని సంసారమూ నీకు మల్లెనే నాకూ ప్రసాదించు తల్లీ' అని ఆ నవ వధువు మనసారా కోరు కోవటమే ఆ వ్రతం ఆ పూజలోని ఉద్దేశ్యం.

ప్రాతివ్రత్యంలో పార్వతీదేవి ఆదర్శప్రాయురాలు నారీలోకానికి రామాయణ కావ్యంలో సీతాదేవి భర్తను అనుసరించటంలోనూ; అగ్నిపరీక్షతో నెగ్గి పునీతురాలిగా కీర్తింపబడటంలోనూ, ఆసేతు హిమాచలం మహిళల్లాలుగా ఎట్లా ఆ చంద్రార్కం నిలిచిపోయిందో, పార్వతీదేవి తన అచంచల భక్తి విశ్వాసాలతో కఠోర జపతప నియమాలతో కూడిన తపస్సుతో, భోళాశంకరుడు భక్తవ శంకరుడు, లయకారకుడూ, మోక్షప్రదాత అయిన ఈశ్వరుణ్ణి భర్తగా పొందింది. ఈశ్వరుడు కూడా ఆమె భక్తికి, తనయందు లగ్నమైన ఆమె హృదయాంతర్గత ప్రేమకు ముగ్ధుడై, తన శరీరంలో సగభాగంలో ఆమెను కలుపుకొని 'అర్ధనారీశ్వరుడుగా' ప్రఖ్యాతుడయ్యాడు. "అర్ధాంగి" అనే మాట శివపార్వతుల వలన ఉత్పన్నమైన పదమే.

భర్త భోగభాగ్యాలతో వున్నపుడూ, భర్త ఎక్కువ 'సిరి' గలవాడైనప్పుడూ, భార్య (స్త్రీ) ఆ భర్తని ప్రేమించటంలో ఆశ్చర్యమూ, అసహజమూ ఏమీలేవు, ఆమె కోరిన ప్రతి కోరిక తీర్చగల ఐశ్వర్యం ఆ భర్తకు వుంటుంది. అర్థికంగా ఆదినాటికీ నేటికి ఎందరు స్త్రీల (భార్యల) పట్లనో ఋజువౌతున్న నగ్నసత్యం.

కానీ భర్తకు ఏ ఐశ్వర్యాలూ లేవనీ ఐహిక సంబంధమైన ఏ కోర్కెలు తీరవనీ, ఏ భోగభాగ్యాలకూ ఆస్కారం లేదనీ, తెలిసీ, చూసి, ఆభర్తనే కోరు కోవటం, ఆ భర్తనే అనుసరించటం ఆభర్త తప్ప మరో ఆలోచన, ఆరాధన, దైవం, లేకుండా వుండటం. కొందరు స్త్రీలకే సాధ్యం. అలాటి వారే ఆభర్తల చేత కూడా అనన్య సామాన్యంగా గౌరవింపబడి, మహా పతివ్రతలుగా

కీర్తింబడి ఆసేతు హిమాచలం, ఆచంద్రార్కం చిరంజీవినులుగా నిలిచిపోతార అనసూయ, అరుంధతి, సీత, సావిత్రి ఇలాంటివారిలో కొందరు. పార్వతీదేవి వీరందరికి తలమానికం, వీరందరికీ ఆదర్శ మహిళ. వారికేకాదు ప్రతి స్త్రీకి ఆమె ఆదర్శనతి.

శ్రీమన్నారాయణుని భార్య అయిన లక్ష్మిదేవి క్షీరసాగరంలో ఉద్భవించగా ఆమె అపురూప లావణ్యానికి సర్వదేవత గణాలూ అద్భుతపడు తుండగా, ఆమె ఎవరిని వరిస్తుందోనని కుతూహలంతో అందరు నిరీక్షిస్తున్న తరుణంలో, అమె చూపులు శ్రీహరిపైనా, శ్రీహరిచూపులు ఆమెపైనా పరస్పరాకర్షణతో అనురాగంతో నిలిచిపోయాయి ఆమెను శ్రీమహాలక్ష్మిని తన వక్షస్థలంలో స్థానం ఇచ్చి భార్యగా చేసుకున్నాడు శ్రీమన్నారాయణుడు. కానీ ఆమె చంచల స్వభావురాలు తరచూ స్థాన చలనంతో పరుగెడు తుంటుంది.

బ్రహ్మ ముఖంనుండి ఉద్భవించిన సరస్వతి, బ్రహ్మ ఇల్లాలై ఎవరో కొందరు మహాకవులకు, మహర్షులకు తప్ప, గోచరించదు ప్రసన్నురాలుకాదు. లక్ష్మి సరస్వతులు ఒకచోట కలిసి వుండటమూ అరుదే.

ఇలా త్రిమూర్తుల ఇల్లాళ్ళలో, పార్వతీదేవి ప్రత్యేక వ్యక్తిత్వం గలిగిన స్త్రీమూర్తి కపాలహస్తుడు విభూది అంగరా గంగా కలవాడూ, కైలాసాచల నివాసీ, స్మశానవాసీ, ప్రమథగణ సేవితుడూ, అయిన ఈశ్వరునిలో ఆమె "పరతత్వాన్ని" గ్రహించుకుంది. ఐహిక ఐశ్వర్యాల డాంబికతలేని ఆ నిరాడంబరునిలో దిగంబరునిగా అవధూత లక్షణాలతో భాసించే ఆ బోళాశంకరుని లో అమె సర్వసృష్టిస్థితి నిలయాలకూ మూలమైన మోక్షమనే మహదైశ్వర్యాన్ని మనోనేత్రాలతో దర్శించింది. అంచేత ఆమె అయనలో అర్థశరీరంగా ఐక్యమై సుమంగళీత్వానికీ, పాతివ్రత్యానికి కొత్త అర్థాన్ని, విలువనూ, తెలియజెప్పింది, లలిత, రాజరాజేశ్వరి, వగైరా నామాలతో, శ్రీచక్రార్చనలతో శ్రీవిద్యకు శ్రీకారం చుట్టినదీ పార్వతీదేవే. శ్రీశైల భ్రమరాంబను "మాఇంటి ఆడ పడుచు" అని గర్వంగా చెప్పుకుంటారు కన్నడిగులు. "మా ఆడపిల్ల"

అని చెప్పుకుంటారు శ్రీశైల ప్రాంతపు చెంచుజాతులవారు - అమాయకులు, మూఢభక్తులూ అయిన గిరిజనులు. మధుర మీనాక్షిని 'పాండ్య రాజతనయ' అంటూ తమ ఆడపడుచుగా అభివర్ణించుకొని గర్వపడతారు తమిళులు (దక్షిణాత్యులు)

ఇక ఉత్తర హిందూదేశంలో వింధ్యవాసినీ, హైమవతి, కాళి వీరంతా ప్రఖ్యాత దేవతామూర్తులు. కాశీ విశాలాక్షి, కాశీ అన్నపూర్ణ వీరంతా పార్వతీ దేవి అంశలు కాళిదాసు మహాకవి కవిత్వానికి మూలమైన కాళీ. ఆదిశంకరా చార్యునిచేత వివిధ రూపాలలో స్తోత్రం చేయబడిన శక్తి స్వరూపిణులు-శక్తి యంత్రాలు శ్రీచక్రాలు అన్నీ ఆ దేవి మూర్తివే. ఆసేతు హిమాచల "పర్వత రాజపుత్రి, పార్వతి, హైమవతి, దుర్గ, చండి. కాళి, దాక్షాయణి, లక్ష్మి సరస్వతి వగైరా ఎన్నో రూపాలతో పూజలందుకొనే పార్వతి-అపురూప సౌందర్యరాశి. అమ్మలగన్న అమ్మ పోతన కవికూడా ,అమ్మలగన్న అమ్మ, ముగ్గురమ్మల మూలపుటమ్మ, చాల పెద్దమ్మ, సురారులమ్మ, కడుపారిడి బుచ్చినయమ్మ తన్నులోనమ్మిన వేల్పుటమ్మల మనంబుల నుండెడియమ్మ, దుర్గమాయమ్మ కృపాబ్ధి నిచ్చుత, కవిత్వ, మహత్వ, పటుత్వ సంపదల్ అని మహాద్భుత కవితా వేశంతో, భక్త్యావేశంతో ( మొక్కి మరీ భాగవతం ఆరంభించాడు.

ఆమె సౌందర్యం, సౌశీలం, రాశీభూతమైన చల్లని తల్లి రావణాసురుని లానే మదోన్మత్తుడూ, మహిషాసురునిలాటి పశుతుల్యుడూ, చండముండ, శుంభ నిశుంభులలాటి మూఢ చిత్తులూ తప్ప ఆ తల్లిని మోహదృష్టితో చూడరెవరూ ఆబాలగోపాలానికి ఆమె కన్న తల్లి, జగజ్జనని. ఆమె దయారస దృష్టిచాలు- ముల్లోకాలూ కాపాడటానికి.

అదే ఆమె ప్రత్యేకత.

ఆమెలాటి ఆడపిల్ల తమ వంశకీర్తి ఇనుమడింపజేయాలను కొంటారు ప్రతి ఆడపిల్ల తల్లిదండ్రులు.

ఆమెలాటి పాతివ్రత్యంతో ఆమె పొందిన రకం భర్త అనురాగంతో ఆమెలాటి సుమంగళిత్వంతో తమ బ్రతుకులు పండిపోవాలను కుంటారు. అవి వాహిత కన్యలు, వివాహిత స్త్రీలు,

ఆమెలాటి అపారమాతృత్వమే తమ జీవిత పరమావధిగా సాధిస్తారు యోగినులు (శారదాదేవి లాటి మరెందరో మహోన్నత స్త్రీలు)

క్షీర సాగర మథనం సందర్భంలో దావాగ్ని వెలువడి; సర్వలోకాలను మ్రింగేలా వృద్ధి పొందుతోంది, సర్వదేవతా గణాలూ ఆ మహాగరళ దావాగ్ని కీలలకు భీతిల్లి పారి పోసాగాయి. ఆ సమయంలో ఈశ్వరుణ్ణి హాలాహలరూప మైన ఆ దావాగ్నిని నివారించవలసిందిగా సర్వదేవ గణాలూ ప్రార్థించి, సర్వమంగళ అయిన శివపతిని, శివుణ్ణి మెప్పించవలసిందిగా వేడుకుంటాడు.

ఆమె అంగీకరించి ఈశ్వరుణ్ణి కోరకుండా హాలాహలం నిగ్రహించమని ఆ సందర్భంలో పోతన మహాకవి అత్యద్భుత వర్ణన పరికించండి.

మ॥ అమరన్ లోక హితార్థమందు నభవుం "దౌగాక" యుం చాడెంబో
యమరుల్ భీతిని "మ్రింగుమీ" యనిరివో, యంభోజగర్భాదులుం
దముగావన్ 'హరలెమ్ము! లెమ్మనిరి' వో తాజూచి కన్గంట, న
య్యుమ, ప్రాణేశ్వరునెట్లు మ్రింగుమనె నయ్యుగ్రానల జ్వాలలన్,

అని పరీక్షిత్తు ఆశ్చర్యంగా అడుగగా, శుకయోగీంద్రుడు జవాబిస్తాడు.

క॥ మ్రింగెడివాడు విభుండని,
మ్రింగెడిదియు గరళమనియు, మేలని ప్రజకున్
మ్రింగుమనె సర్వమంగళ, మంగళ
సూత్రంబు నెంతమది నమ్మినదో.!

అంటూ,

ఆమె భక్తి అలాంటిది ఆమె భక్తజన రక్షణా ఆతురత అలాంటిది. ఆమె భర్తపై ఆమెకుగల అచంచల విశ్వాసం అలాంటిది ఆమెకుగల ఆత్మ విశ్వాసం అలాంటిది. అంచేత ఆమె ఈశ్వరునిరాణి శర్వాణి అయింది. శివసతి శివ అయింది ముల్లోకాలకూ నాటికీ నేటికి, ఏనాటికీ జగజ్జనని అయింది.

ఆమె దక్షుని పదమూడుమంది కుమార్తెలలో ఒకర్తెగా "సతీదేవి" గా జన్మించింది "దక్షాధ్వరధ్వసం" అనే కథకు నాయిక అయ్యింది. ఆమెను దక్షుడేకోరి శివునికిచ్చి పెళ్ళిచేశాడు. కానైతే బ్రహ్మ పుత్రుడైన దక్షుడు (దక్ష ప్రజా తికి తన ఐశ్వర్యం మీదా, తన అధికారంమీద, తన మంత్రశాస్త్ర విహిత తపశ్శక్తిమీదా. ఎనలేని గర్వం, అహంకారం వున్నాయి. తన అల్లుడైన ఈశ్వరుడు నిర్ధనుడనీ, స్మశానవాసీ కపాలధారి భస్మాంగరాగుడూ, మౌనీ అనీ-ఒక విధమైన తిరస్కార భావమూ వుంది. లోలోపల తన గొప్ప ప్రదర్శి ంచు కొనే తత్వం దక్షునిది. తనగొప్ప తనంలోనే నిగ్రహించుకొనే మహత్ త్వం ఈశ్వరునిది, తన ఐశ్వర్యం శాశ్వతమనే భ్రమ దక్షునిది.

సర్వ ఐశ్వర్యాలకు మూలం శాంతి, తపస్సు అనే భావం ఈశ్వరునిది.

తనను అందరూ నమస్కరించాలనే అహంకారం దక్షునిది. తనలో తాను తారకనామం జపిస్తూ-సర్వాంతర్యామికి మాత్రం మౌనంగా లోలోపల మ్రొక్కుతూ రాగాది అరిషడ్వకారాలుగల అహంకారులకు అభివాదనం చేయు నవసరం లేదని భావించే మహత్తత్వం ఈశ్వరునిది.

ఇక్కడే ఆ ఇద్దరిమధ్యా వైర్యం ప్రారంభమైంది.

అది ఎలా కొనసాగిందో, చివరకేలా పరిణమించిందో తెలుసుకుందామా.

# సతీదేహ పరిత్యాగం

పూర్వం బ్రహ్మచేస్తున్న యజ్ఞం చూడటానికి దక్షుడు అట్టహాసంగా వచ్చాడు. అక్కడ యజ్ఞం చూస్తున్న దేవ, బ్రాహ్మణ ఋషిగణమంతా బ్రహ్మ పుత్రుడైన దక్షుని పట్ల గౌరవాభిమానాలలో, తమతమ ఆసనాలమీదనుండి లేచి, ఆయనకు అభివాదనం చేశారు. కానీ అక్కడేవున్న ఈశ్వరుడు మాత్రం నిర్వికారమూర్తి గనుక, నిమిలిత లోచనుడిలా, దక్షుని చూచీ చూడనట్లూర కున్నాడు. అదే దక్షునికి తగని కోపాన్ని కలిగించిన అంశం. వెంటనే రాజస తామస భావాల ప్రతిబింబంలా మారిపోయిన దక్షుడు ఆ భావాలకు అక్షర రూపం ఇస్తూ ఈశ్వరుడ్ని నిందించసాగాడు. సభాసదులందరి ముందు "నా కూతురైన సతీదేవిని ఈ మర్యాదలు తెలియనివాడు, నా అంగీకారముతోనే వివాహమాడాడు కదా, నాకు నమస్కరించకపోగా, నన్ను పలకరించనైనా పలకరించలేదు". అంటూ మొదలెట్టి.

సీ॥ అనయంబులుప్త క్రియాకలాపుడు మానహీనుడు మర్యాదలేనివాడు,
మత్త ప్రచారుఁడున్మత్తప్రియుడు దిగంబరుడు భూతప్రేత పరివృతుండు
దామసప్రమథ భూతములకు నాధుండు, భూతిలిప్తుండ స్థిభూషణుండు
నష్టశౌచుండు మనద్మనాథుడును దుష్టహృదయుడు గ్రుడును బరేతభూని

తే॥ గీ॥ కేతనుడు, వితతస్రస్త కేశు, డశుచి
యయిన యితనికి శివనాముఁడను ప్రవాద
మెటులు గలిగె? 'నశివు' డగు నితనినెఱిగి
యెఱిగి వేదంబు శూద్రునకిచ్చినటులు.

"నా కుమార్తెను ఈతనికి విధి ప్రేరితుడనై ఇచ్చానుకదా." అని నానా దుర్భాషలాడాడు దక్షుడు అంతటితో ఆగక,

క॥ "ఇతడింద్రోపేంద్ర పరీవృతుడై మఖ సమయమున హవిర్భాగము,దే
వతలంగూడగ మహిత నియతి బొందకయుండుగాక 'యనిశపియించెన్

ఇంత జరిగినా శాంతస్వరూపుడైన ఈశ్వరుడు కోపించలేదు సరిగదా దక్షుని నిందాలాపాలాయన హృదయానికి 'ఈశ్వరస్తుతి' లా వినిపించి, మౌనంగా తన ధ్యానంలో తానుండి పోయాడు. అదీ ఈశ్వరుని ప్రత్యేకత. కానైతే ఈశ్వర భక్తాగ్రేసరుడు, వాహనమూ అయిన నందీశ్వరుడు, తన స్వామిని నిందచేసిన దక్షుని మాటలు సహించలేక పోయాడు. "ఈదక్షుడు తన మానవ శరీరం గొప్పగా భావించి ఈశ్వరుణ్ణి ఇలా నిందించాడు గనుక, ఇతడు త్వరలోనే 'మేక ముఖం' గా మారుతాడు పైగా ఈ సమయంలో దక్షుని సమర్ధించిన బ్రహ్మణ, దేవతలెవరైతే వున్నారో వారంతా "హరిద్వేషం" కారణంగా, యాచకులై, అపవిత్ర ప్రవర్తన గలవారుగా మారిపోతారు, అని శపించాడు వెంటనే దక్షుని సమర్ధిస్తూ భృగుమహర్షి, రుద్ర అనుచరులైన వారంతా నష్టశౌచులై, హీనవర్ణనులై, సదాచారహీనులై వుంటారని శపిస్తాడు ఇట్లా శాప ప్రతిశాపాలతో ఆ బ్రహ్మ యజ్ఞం జరిగిపోయింది.

ఆ తర్వాత ఇక దక్షుడు తన అల్లుడైన ఈశ్వరుని లెక్కచేయలేదు. తాను ప్రజాపతు లందరికి అగ్రేసరుడనే గర్వంతోనూ, సకలమంత్ర, తంత్ర శాస్త్రపారంగతుణ్ణనే గర్వంతోనూ, ఈశ్వరుడులేని యజ్ఞం నాశన హేతువు అని తెలిసీ, కావాలని ఈశ్వరుని అవమానించాలనే ధ్యేయంతో 'బృహస్పతి సవన' మనే యజ్ఞం చేయటం ఆరంభించి, సకలదేవత గణాలనూ సగౌరవంగా ఆహ్వానించి, అల్లుడైన ఈశ్వరునికి అసలు కబురైనా పంపడు. అయిజ్ఞానికి వెళ్తూ, వస్తూ దేవగణాల స్త్రీపురుషులు కైలాసం మీదుగా గగనచారులై వెళ్తూ ఆ యజ్ఞంయొక్క గొప్పదనాన్ని దక్షుని వైభవాన్ని తెగపొగుడుతూ వెళ్తుంటారు. వారందరి మాటలు విన్న "సతీ" దేవికి తానుకూడా తండ్రి యజ్ఞాన్ని చూడటానికి వెళ్ళాలనే కుతూహలమూ, అపరిమితమైన ఆకాంక్ష, ప్రలోభము కలిగాయి. భర్తయైన ఈశ్వరుని తాను వెళ్ళటానికి అనుజ్ఞ ఇమ్మని కోరిందా ఇల్లాలు. కన్నతండ్రి పిలుపు లేకున్నా ఫర్వాలేదంది ఆ పిచ్చి ఇల్లాలు.

ఈశ్వరుడు అర్ధాంగి కోరికలోని అనౌచిత్యమూ, ప్రలోభమూ గుర్తించి సర్వవిధాలా నచ్చచెప్పాడు.

సజ్జనులు, సాత్వికులు, భక్తులు అయినవారు, భాగవతత్వాన్ని నిజంగా తెలిసినవారూ, అయిన జనులు బంధువులైనా, కాకున్నా వారు పిలిచినా, పిలవకున్నా వెళ్ళటంలో తప్పులేదుగానీ, అహంకరులు ఈశ్వరతత్వం తెలియని వారూ, అయినవారూ బంధువులైనా కాకున్నా, వారు పిలిచినా పిలువకున్నా వారి ఇళ్ళకు వెళ్ళటం అనుచితమనీ, అవమానాలను ఆహ్వానించటమేనని అలాటి మూర్ఖుల వలన అవమానం పొందటంకన్నా మరణం మేలని బోధిస్తాడు.

క॥ కుటిలబుద్ధులయిన కుజనుల ఇండ్లకు
నార్యులేగ, వారనాదరమున
బొమలు ముడివడంగ, భూరిరోషాక్షులై
చూతు; రదియుగాక సుదతి! వినుము.

ఉ॥ సమదరిపుప్రయుక్త పటుసాయక జర్జరితాంగుడయ్యు, దుః
ఖమును దొఱంగి, నిద్రగనుఁగాని కృశింపడు మానవుండు, నో
యుమ విను, మిష్టబాంధవ దురుక్తులు మర్మములంట నాటఁజి
త్తమున నహర్నిశంబు బరితాపము నొంది కృశించునెప్పుడున్.

కాబట్టి దక్షతునూభవవైనా నామూలంగా నీవు నీ తండ్రిచేత అవమానింప బడతావు. ఒద్దు అని చెబుతాడు. కానీ దాక్షాయణి మోహం వదల్లేదు. పుట్టింటిమీది మమకారం, తండ్రి యజ్ఞవైభవం ఆమెను నిలువనివ్వలేదు.

(రామాయణంలో సీతాదేవి మాయలేడి ప్రలోభంతో భర్తకు దూరమౌతుంది. సరిగ్గా అలాగే సతీదేవి, తండ్రి యజ్ఞవైభవ ఆకర్షణతో, పుట్టింటి మమకారంతో తనకు తాను దగ్గమౌతుంది ఆ సీత, ఈసతి ఇద్దరూ త్రైలోక్య

పూజ్యులేగాక ఆయా సంఘటనలద్వారా త్రిలోక స్త్రీలకూ ప్రలోభరహితమైన. భర్త ప్రేమ భర్తసాన్నిధ్యం మించిన ఐశ్వర్యం స్త్రీలకు లేనేలేదని ఋజువు చేసినవారే.)

అలా వెళ్ళటానికి నిశ్చయించుకున్న సతీదేవి నిర్ణయం తెలుసుకున్న పరమశివుడు యిక జరుగవలసినది జరుగక మానదనే నిర్లిప్త వైఖరితో పొమ్మని, వద్దనీ చెప్పక మౌనంగా వుండిపోయాడు.

ఆమె మాత్రం భర్త మీద కించిత్తు కోపం వచ్చి,

తే॥ గీ॥ మఱియు గుపితాత్మయై స్వసమానరహితు
నాత్మదేహంబు సగమిచ్చినట్టి భవునివిడిచి "మూఢాత్మయగుచు"
నవ్వేలదిసనియొజనకు జూచెడు వేడుక సందడింప."

విసవిసా వెళ్ళిపోతున్న ఆమె వైఖరిచూచి, తమ యజమానురాలు శివసతి మాతృస్వరూపిణి అట్లా నిరాలంకారంగా కోపంగా వున్నపాటున నడచి వెళ్ళటం సహించలేక ఆమె వస్త్రాభరణాలు మొదలైనవి తీసుకొని నందీశ్వరుడు, నందివాహనంగా ఆమెను రుద్రానుచరులు అనుసరించారు సగౌరవంగా.

దక్షుని ఇంట యజ్ఞవాటికలో అడుగెట్టిన సతిని-తండ్రి అయిన దక్షుడు కన్నెత్తి చూడలేదు, పలకరించలేదు. అసలామె వునికినికూడా గుర్తించనట్లే, తన యజ్ఞ హవిర్భాగాలను సర్వదేవతలకూ అందిస్తూ ఈశ్వరునికా అధికారం అవకాశం లేకుండా చేస్తూ, గర్విస్తూ తన పని తాను చేసుకు పోతున్నాడు.

సతీదేవి తల్లి, సోదరులు ఆమెను వాత్సల్యంగా క్షేమమడిగారు. కానీ సతీదేవి తండ్రి ప్రవర్తనతో హృదయం ప్రయ్యలు కాగా, తల్లి, సోదరుల ఆదరం ఆమెకు పూరట కలిగించలేదు. పైగా దక్షునికి భయపడి దేవతాగణం

ఋషులు చాలామంది కూడా ఆమెను నిరాదరిస్తూ గుర్తించలేదు. గౌరవించ లేదు. రుద్రుడులేని యాగం ఏమిటని దక్షుని మందలించలేదు.

సతికి తన భర్త అయిన ఈశ్వరుని మాటలు గుర్తుకు వచ్చాయి. అపురూపమైన భర్త అనురాగంకంటే స్త్రీ కోరతగిన ఐశ్వర్యం ఏమిటన్న పశ్చాత్తాపం వచ్చింది, ముల్లోకాలలోనూ ఏ స్త్రీకి లభించని "అర్ధనారీశ్వర" మనే అపూర్వ గౌరవాన్ని పొందిన తాను ఆ భర్తను తిరస్కరించి రావటంలో ఈ పుట్టింటిలో జరిగిన అవమానం తెలిసి వచ్చింది. ఈ అవమానంకంటే మరణం మేలనే నిశ్చయానికి ఆమె వచ్చింది.

వెంటనే తండ్రి అయిన దక్షుణ్ణి ఆయన ఐశ్వర్యాన్ని ప్రజాపతిత్వ అహంకారాన్ని నిరసిస్తూ దూషించింది.

ఉ॥ "నీలగళాపరాధియగు నీకు దనూభవనౌట చాలదా?,
చాలు గుమర్త్య! నీదు తనుజాతననన్ నుది సిగ్గుపుట్టెడి
ధ్నల పేరన్ మహాత్ములకు నెగ్గొనరించెడి వారి జన్మముల్?
గాలుపనే తలంప జనకా! కుటిలాత్మక యెన్ని చూడగన్?

చ॥ వరవృషకేతనుండు భగవంతుడునైన హరుండు నన్ను నా
దర పరిహాస వాక్యముల 'దక్షతనూభవ' యంచుఁబిల్వ నేఁ
బురపుర బొక్కుచున్, ముదము బొందక, నర్మవచః స్మితంబులన్
దొఱగుదు నీతనూజనను దుఃఖము కంటెను జచ్చుటొప్పగున్".

అని పతివ్రతా శిరోమణి త్రిజగన్మాత యజ్ఞ సభాసదులందరు చూస్తుండగనే పద్మాసనం వేసుక్కూర్చొని ప్రాణాయామ యోగక్రియద్వారా తన తపశ్శక్తి అనే అగ్ని సృష్టించుకొని నిలువునా భస్మమై పోయింది. సభఅంతా హాహాకారాలు మార్మోగాయి. ఆమెకు జరిగిన అవమానం తమ మాతృమూర్తి ఇలా దేహత్యాగం చేయటం కళ్లారా చూచిన రుద్రగణాలు రోషావేశంతో "తండ్రీ ఆజ్ఞఇవ్వు" అన్నాడు. ఈశ్వరుడు దక్షుని సంహరించి దక్షాధ్వర ధ్వంసం చేసి రుద్రగణాలకు నాయకుడవై సాగమని, దక్షాధ్వారంతో,

యజ్ఞ విధ్వంసక చర్యకు పూనుకున్నాయి, కానైతే భృగువు తన అద్భుత తపశక్తితో హోమగుండం నుంచి 'ఋభులు' అనే భయంకర కింకరులు వేలాదిగా జన్మించి రుద్రగణాలను చిందర వందర చేశారు తమ పరాక్రమాలతో.

నందీశ్వరుడు మొదలైన రుద్రగణాలన్నీ ఈ జరిగిన వైపరీత్యం ఈశ్వరునికితెలుపటానికి కైలాసానికి పరుగుతీశారు! సతీదేవి మరణవార్త విన్న ఈశ్వరుడు (అది ఆయన ముందుగా ఊహించినదే అయినా) బాధతో కోపంతో ఉన్మత్తునిలా-వెర్రినవ్వు నవ్వాడు.

శా॥ ఆద్యం డుగ్రుడు నీలకంఠు డిభదైత్యారాతి దష్టోష్ఠుడై
మాద్యద్భూరి మృగేంద్ర ఘోషమున భీమప్రక్రియన్ నవ్వుచున్
విద్యుద్వహ్ని శిఖాసముచ్చయరుచిన్ వెల్గొందు చంచజ్జటన్
సద్యః క్రోధముతోడ బుచ్చివయిచెన్ క్ష్మాచక్ర మధ్యంబునన్.

అంటూ పోతన మహాకవి ఆ ఈశ్వరుని క్రోధాగ్నినీ ఆక్రోధంతో పెరికి వేసిన జటనూ వర్ణించి ఆ రూపాన్ని భక్తులందరి హృదయాలలో శాశ్వత ముద్ర వేశాడు తన మహాద్భుత కవితాఝురితో.

## వీరభద్రావతారం దక్షాధ్వరధ్వంసం

ఒక నియంతను, ఒక అహంకారిని, ఒక అకారణ భగవ[illegible], సా[illegible]కత లోపించి, తామస ప్రవృత్తితో తన తపశ్శక్తిని గొప్పగా భావించుకొనే ఒక మూర్ఖుడిని అంత మొందించాలన్నా, ఆ మూర్ఖునికి బుద్ధిచెప్పాలన్నా ఒకానొక అవతార అవిర్భావం తప్పని సరి అవుతుంది. ఏయుగంలోనయినా హిరణ్యాక్షుని సంహరించటానికి 'యజ్ఞ వరాహమూర్తి' అవతరించాడు. హిరణ్య కశిపుని కోసం 'నృసింహమూర్తి' అవతరించాడు. రావణాసురుని కోసం "శ్రీరాముడు" అవతరించాడు. ఇలా చరిత్రలో ప్రతి అవతారమూర్తి సృష్టికి ఒక ప్రత్యేక అవసరమూ, ఆవశ్యకతా ఏర్పడ్డాయి. అకారణ ఈశ్వరద్వేషి,

అహంకారి అయిన దక్షుడు తన కన్నకూతురన్న మమకారం కూడా లేక సతీదేవిని అవమానించగా ఆమె తండ్రిని తిరస్కరిస్తూ, ఈశ్వరుని ధ్యానిస్తూ

తే॥ గీ॥ అమ్మహాత్ముని యంక పీఠంబునందు
నాదరంబున నుండు దేహంబు, దక్షు
వలని దోషంబునను విడువంగదలచి
తాల్చె దనువున ననిలాగ్ని ధారణములు!"

సతీత్వం చెందింది. "సతి"గా దేవతగా నిలిచిపోయింది ఆసేతు హిమాచలం! ఈశ్వరుడు సతీవియోగానికి తల్లడిల్లి ఉగ్రుడై, తన జటాజూటంలోని జట ఒకటి పెరికి భూమిమీద (కైలాస పర్వతం మీద) పడవేశాడు. ఆ జట రుద్రరూపుడై, రుద్రపతి బింబమై, "వీరభద్రావతారంతో" వేయి చేతులతో నింగి, నేల ఏకం చేస్తూ, నిలచింది. ఆ సమయంలో ఆ రూపం ఎలా వుందో గమనించండి.

సీ॥ అభ్రంలిహాదభ్ర విభ్రమాభ్ర భ్రమ కృన్నీల దీర్ఘ శరీరమమర
బ్రజ్వల జ్వలన దీప్త, జ్వాలికాజాల, జాజ్వల్యమాన కేశములు మెఱయ,
జండ దిగ్వేదండ తుండాభదోర్దండ, సాహస్రధృత, హేతి సంఘమొప్ప,
వీక్షణత్రయి లోకవీక్షణద్యుతి లోక వీక్షణతతి దుర్నిరీక్షముగను!

తే॥ గ్రకచకఠిన కరాళదంష్ట్రలు, వెలుంగ,
ఘన కపాలాస్థి వనమాలికలు నుదనర
నఖిలలోక భయంకరుడగుచు, వీర
భద్రుడుదయించె, మాఱట రుద్రుడగుచు.

అలా పోతన మహాకవి అక్షరమాలలో ఉద్భవించిన వీరభద్రుని రూపం నాటికీ, నేటికీ, మరేనాటికీ శైవుల, వీరశైవుల హృదయపీఠం మీద చిరముద్ర వేసుకు పోయింది. ఆ వీరభద్రుడు తండ్రి అయిన రుద్రునికి నమస్కరించి 'తండ్రి ఆజ్ఞ ఇవ్వు!' అన్నాడు ఈశ్వరుడు దక్షుని సంహరించి దక్షాధ్వర ధ్వంసం చేసి రుద్రగణాలకు నాయకుడవై సాగమని దక్షాధ్వరంలో

ఈశ్వరుని పరిహసించిన బ్రాహ్మణులకుబుద్ధి చెప్పమని ఆజ్ఞాపించాడు. ఆ ఆజ్ఞ శిరసావహించి బయల్దేరాడు వీరభద్రుడు దక్షాధ్వర ధ్వంసానికి రుద్రగణ సమేతుడై! పెనుచీకట్లు క్రమ్ముతున్నట్లు మింటికెగసిన ధూళితో, వీరభద్రుడు విజయంచేశాడు. ఇక ఆ అవతారానికి అడ్డేమిటి? దక్షుని శిరస్సు ఎన్నిమార్లు ఖండించినా, మంత్రపూతరిమైన ఆశరీరానికి మరణం లేకపోవటం గమనించి ఆ శిరస్సును హోమగుండంలో వేసి ప్రేల్చివేశాడు వీరభద్రుడు. వీరభద్రుని చేతిలో భయంకర మరణం పొందిన దక్షునిచూచి, అందాకా దక్షుని సమర్ధించిన కొందరు దేవతా గణాలు, ఋషులు బ్రాహ్మణులు చెల్లాచెదురుగా పరుగెత్తారు. కానీ ఎవరైతే ఈశ్వరుని నిందించారో? సతీ ఆత్మాహుతికి పరోక్ష కారకులైనారో వారందరినీ రుద్రగణాలు చిత్రహింసలుపెట్టి మరీ చంపారు. భృగువు కళ్ళు పెరికారు. 'పుషుని' పళ్ళూడ కొట్టారు. ఇలా యజ్ఞవాటిక అంతా నిర్జీవ కళేబరాలతోనూ ధ్వంసం చేయబడిన పదార్థాలతోనూ నిండిపోయింది. అట్లా దక్షాధ్వర ధ్వంసం నీచులకు ఒక గుణపాఠంగా భాసించింది.

అ దక్షాధ్వర సందర్భంగా ప్రళయకాల రుద్రునిలా మారిన వీరభద్రుడు,

సీ॥ సుమహిత నిశిత త్రిశూలాగ్ర
 సంప్రోత నిఖిల, దిక్కరి రాజనివహుండగుచు
జటులోగ్ర నిష్ఠుర స్తనిత గంభీ
 రాట్టహాస నిర్భిన్నా ఖిలాండుడగుచు
భూరి కరాళ విస్ఫారం, దంష్ట్రాహతి,
 పతిత తారాగణ ప్రచయుడగుచు
వివిధ హేతివ్రాత విపుల ప్రభాపుంజ
 మండిత, చండ దోర్దండుడగుచు.

తే॥ గీ॥ వికటరోష భయంకర భ్రుకుటి దుర్నిరీ
దీక్ష దుస్పృహ తేజోమహిమ దనర్చి,
ఘనకీర్ణ జటాబంధకలితుడగుచు
నఖిల సంహార కారణుడై నటించు.

తే॥ అట్టి దేవుని త్రిపుర సంహారకరుని
చంద్రశేఖరు, సద్గుణసాంద్రు నభవు
మనము రోషింప జేసిన మంగళముల
బొందవచ్చునె పద్మగర్భునకునైన?.

(అని పోతన మహాకవి-దివ్యాక్షర పద్యమాలధరుడై నేటికీ-మధుర మీనాక్షీ ఆలయంలో ఎవరో-కాల గర్భంలో కలసిపోయిన అజ్ఞాత, మహాశిల్పి చేతి వులితో ఒక స్థంభంమీద-నిల్చి వున్నాడు సజీవ భంగిమలో!)

దక్షాధ్వర విధ్వంసంలో దెబ్బలుతిని పారిపోయిన దేవతలు బ్రహ్మకీ విషయమంతా తెలుపగా ఇది ఇలాగే కొనసాగితే ఇంకా రుద్రగణాలు వీర భద్రుడు ముల్లోకాలుకూడా ధ్వంసం చేస్తారని, బ్రహ్మాది దేవతలు కైలాసం వెళ్ళి ఆసరికి దక్షిణాభిముఖునిగా ధ్యానసమాధిలోనిమగ్నమై "దక్షిణామూర్తి" గా మారిన పరమశివుని స్తోత్రం చేశారు ప్రసన్నుడికమ్మని "వీరభద్ర విజ యాన్ని" ఇక ఆపమనీ! ఇక పోతన పరకాయ ప్రవేశం చేశాడు. మరల బ్రహ్మ దేవగణాలలోకి! ఈశ్వర స్తోత్రం ప్రారంభమైంది.

తే॥ గీ॥ జగములకు నెల్లయోని బీజంబులైన
'శక్తి శివ' కారణుండవై జగతినిర్వి
కారబ్రహ్మంబ వగుదున్న, గడగి విశ్వ
నాథుగా నెటిగెద నామనమున నవళ!

అంటూ భోళాశంకరుడు మరలా ప్రసన్నుడై ధక్షాధ్వర ధ్వంసమైన యజ్ఞవాటికకు వేంచేస్తాడు. వీరభద్రుని అవతారాన్ని బ్రహ్మాది దేవతలంతా స్తుతించి శాంతింప జేస్తారు.

అక్కడికి శ్రీమన్నారాయణుడు వస్తాడు. దేవతల ప్రార్థన ఆలకించి ఆయననూ స్తోత్రం చేస్తారు దేవతలు. ఈశ్వరుని మరల యజ్ఞాలన్నిటిలోనూ

"యజ్ఞభాగం" ఉండేట్లుగా ఒడంబడిచి శాంతింప జేస్తారు. దేవతలు విగత జీవుడైన దక్షుని అహంకార రూపమైన శిరస్సు నశించింది గనుక "మేకతల" అమర్చి 'మేషముఖుడు' ఈశ్వరుని మహిమ తెలుసుకొని స్తోత్రంచేసి పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోగా భృగుడికి కళ్ళు, పూషునికి పళ్ళు, ఇట్లా ఆయా దేవతలకు ఆయా అవయవాలు (కృత్రిమంగా) కల్పింప బడ్డాయి.

సతీదేవి హిమవత్పర్వత రాజుకూ, మేనకాదేవికీ కుమార్తెగా 'పార్వతి'గా జన్మించి, మరల ఆయన అర్థాంగి అయి, జగజ్జనని అయ్యింది.

దక్షాధ్వర సందర్భంగా, విచ్చేసిన నారాయణుని భృగుమహర్షి కీర్తించినట్లుగా,

మ॥ "అంవి దోదర తాంకీన ఘన మాయా, మోహితస్వాంతులై
పరమంబైన భవన్మహా మహిముం బాటించి కానంగ నో
పరు బ్రహ్మాది శరీరులజ్ఞులై, యోపద్మాక్ష భక్తార్తి సం
హరణాలోకన నన్నుగావదగు నిత్యానందా సంధాయివై"

అంటాడు పోతనమహాకవి భక్త్యావేశంతో.

అలాగే వివిధ దేవతల రూపంలో కీర్తించాడాయన భక్త్యావేశం శాంతించే వరకూ!

భాగవతంలోని పతికథా ఒక భక్తునికి భగవంతునికీ భగవద్భక్తికి ప్రపత్తులకూ సంబంధించినది. ఆయా కథలలో పతి పద్యంలోనూ పోతన మహాకవి యావదాంధ్రులకు భక్తిరసామృతాన్ని పంచిపెట్టాడు. తన అక్షర కుసుమాలతో కూర్చిన తేటతెనుగు పద్యాలతో ఏ ఒక్క పద్యమూ తీసివేసు దగినదికాదు, ఏ ఒక్క పద్యమూ వదలివేయ వలసినదిలేదు.

అయితే ఆ అక్షరాలలో నిబిడీకృతమైవున్న భక్త్యావేశాన్ని అర్థంచేసుకొని ఆస్వాదించి అనుభూతి చెందే హృదయ సంస్కారం ఒక్కటే మనం సాధించుకో గలిగితేచాలు ఆ భగవంతుడు మన హృదయపీఠం మీద నిలిచిపోతాడు స్థిరంగా.

# "శ్రీ నృసింహావతారం"

శ్రీ నృసింహస్వామి అవతారమే ఒక ప్రత్యేక వ్యక్తిత్వము, మహత్యము, భక్తి ప్రపత్తులకు నిలయమైనది. ఆంధ్రదేశంలో నవనారసింహ క్షేత్రాలు ప్రసిద్ధమైనవి వున్నాయి. యావద్భారతదేశంలో నృసింహస్వామి కొండలు ఆలయాలు లెక్కలేనన్ని వున్నాయి. భాగవతంలోని పంచమ స్కంధంలో భూగోళ ఖగోళవర్ణన సందర్భంలో, స్వాయంభువమనవు కుమారుడైన ప్రియవ్రతుడు భూమిమీద సూర్యునితోబాటు ప్రదక్షణచేసి, ఏర్పరచిన భూభాగాలు ఆ భూభాగాలు ఎల్లలు, జంబూద్వీపం, భరతఖండం వగైరాలు, శుకయోగీంద్రుడు తెలిపిన సందర్భంలో భారతవర్షం ఆయా వర్షాల కధిదేవతలను పేర్కొంటు 'హరి వర్షపతియైన' 'నరహరి'ని అందున్న జనులు, మహసంప్రీతితో, భక్తితో పహ్లాదాది దానవ వృద్ధులతో వారివారి సంతతివారితో శ్రీ నృసింహుని పూజిస్తుంటారని తెలుపబడింది.

ప్రకాశంజిల్లాలోనే మాల్యాద్రి అనే పుణ్యక్షేత్రం ఆ కొండమీద జ్వాలా నరసింహస్వామిగా అగస్త్యమునిచేత ప్రాణ ప్రతిష్ఠ చేయబడిన నృసింహస్వామి నాటికీ నేటికీ ప్రసిద్ధుడు. ప్రకాశంజిల్లా "శింగరాయకొండలో "యోగానంద నృసింహస్వామి" పేరుతో నారద ప్రతిష్టతో శ్రీ నృసింహస్వామి పూజింపబడుతూ అదొక దివ్యక్షేత్రంగా భాసిస్తోంది. గుంటూరుజిల్లా 'మంగళగిరి'లో "పానకాల నృసింహస్వామి" పేరుతో శ్రీ నృసింహుడు భక్తజనులకు కొంగు బంగారమై వెలసి అది నేటికీ పుణ్యయాత్రా స్థలంగా శోభిల్లు తున్నది. విశాఖపట్నం దగ్గరవున్న "సింహాచలం" ప్రశిద్ధ నృసింహక్షేత్రంగా 'అప్పల నరసింహస్వామిగా' చందన కవచంలో స్వామి సాక్షాత్కరిస్తూ నేటికీ అది దివ్య క్షేత్రంగా వెలుగొందు తున్నది 'అహోబిల నృసింహస్వామి' యావద్భారత దేశంలోనే ప్రశిద్ధుడూ. అనంతపురంజిల్లా 'కదిరి' నృసింహస్వామి సుప్రశిద్ధుడే గాక అన్నమాచార్య కీర్తనలోనూ 'కదిరి నృసింహుడు', స్థంభమున వెడలె

అంటూ కీర్తింపబడి స్తోత్రం చేయబడుతున్నాడు ఈనాడూ. హైదరాబాదు దగ్గర వున్న "యాదగిరి" నృసింహస్వామి ఆ ప్రాంతపు ప్రజలకు ఇలవేల్పు. చిత్తూరుజిల్లా "చోళంగి" నృసింహస్వామి ప్రశిద్ధుడు. నెల్లూరుజిల్లాలో నెల్లూరు దగ్గరవున్న 'వేదాద్రి నృసింహస్వామి' అప్రాంత ప్రజలెందరికో ఇష్టదైవం.

ఆంధ్రదేశంలో సగటుగా ప్రతి కుటుంబంలోనూ, ప్రతితరంలోనూ 'నరసింహం, నరసింహారావు, లక్ష్మీనరసింహం, అప్పలనరసింహం, అప్పారావు. సింహాలు, సింహాచలం, మాలకొండ, కొండయ్య, కొండమ్మ, నరసమ్మ, నరసయ్య, యాదగిరి, వేదగిరి, యాదయ్య, యాదాద్రి వేదవతి, యోగనరసింహ, యోగయ్య, పానకాలు లాటిపేర్లు తప్పనిసరిగా వున్నాయి. ఎందరో దేశ, విదేశాల్లో వున్న మన భారతీయులు పేర్లు గమనిస్తే ఎల్ ఎన్ రావు, ఎల్ యన్ మూర్తి వగైరాలు పరిశోధిస్తే, లక్ష్మీ నరసింహరావుగా, లక్ష్మీనరసింహమూర్తిగా, ఎల్. ఎన్. సిన్హాలు, లక్ష్మీనర సింహులు. 'సిన్హా'గా మార్చుకున్న పేర్లుగా సింహళంలోని పేర్లలోనూ 'రణ సింహ, వీరసింహ' లాటి ఉచ్ఛారణలోనూ నృసింహస్వామి పేరు అంతర్గత మైవుంది. ఆంధ్రదేశంలోనే ఎన్నో నృసింహక్షేత్రాలు వుండగా ఇక అన్ని రాష్ట్రాలలోనూ, యావద్భరతంలోనూ లెక్కలేనన్ని వున్నాయి. ఆయా క్షేత్రాలనుబట్టి ఆనృసింహస్వామి దేవేరి అయిన లక్ష్మీ అమ్మవారి పేర్లుకూడా శ్రీలక్ష్మీ, రాజ్యలక్ష్మీ, లక్ష్మక్క, లక్ష్మీదేవి, చెంచులక్ష్మీలాటి పేర్లతో ప్రశిద్ధి చెందింది చాలా కుటుంబాలలో స్త్రీలపేర్లలో పై పేర్లు కలిశివుంటాయి మృగ రాజైన సింహం కొండగుహల్లో నివశించినట్లే, నృసింహస్వామి ఆలయాలన్నీ కొండగుహలలో, సహజ ప్రకృతి నిర్మిత గుహాలయాలుగానే వుంటాయి. తర్వాత భక్తులైన రాజులు, బౌద్ధులు వగైరాలు ఆ గుహలకు రాతికట్టడాలు, ద్వారాలు, శిల్పాలు వగైరా ఏర్పరచి వాటిని 'ఆలయ' ఆకారాలలోనికి మలచి నారే తప్ప, సహజంగా నృశింహస్వామి ఆలయం కొండగుహే.!

ఇక నృసింహస్వామి కొండ ఎక్కడ వుంటే అక్కడ, ఆ గిరిజనులు ఆ స్వామి ఆ క్షేత్రం ఆధారంగా జీవిస్తూ, తమ తరతరాల పేర్లూ, ఆస్వామినే దేవేరిగా పెట్టుకుంటారు. అంతేగాక తమ ఆడపడుచు అయిన "చెంచులక్ష్మీ"

ఆ స్వామి దేవేరి అని సగర్వంగా చెప్పుకుంటుంటారు భద్రాద్రి దగ్గరవుండే గిరిజనులు (కోయ దొరలు) తాము శ్రీరాముని బంట్లుగా చెప్పుకుంటూంటారు. శ్రీశైలం వద్దగల గిరిజనులు, శ్రీశైల భ్రమరాంభ తమ ఆడబడుచు అంటూ భక్తి శ్రద్ధలతో భ్రమరాంభ, మల్లిఖార్జున స్వాములను కొలుచుకుంటూ, తర తరాల ఆ పేర్లే తమ పామర భాష కనుగుణంగా పెట్టుకుంటుంటారు. (మల్లన్న, మల్లయ్య, మల్లక్క వగైరా) ఇక "చెంచులక్ష్మి" కథ ప్రసిద్ధ వీధినాటకంగా, వీధిభాగవతంగా, తోలుబొమ్మలాటగా, స్టేజి నాటకాలుగా, సినిమాలుగా వచ్చిందీ గిరిజనుల కథల ఆధారంగానే. ప్రహ్లాదుని రక్షించటానికి ఉగ్ర నృసింహమూర్తిగా అవతరించిన శ్రీనృసింహుడు, బ్రహ్మాది దేవగణ స్తోత్రాలతో గానీ, ప్రహ్లాదుని స్తోత్రంతోగానీ ప్రసన్నుడుకాక ఆ ఉగ్రరూపంతోనే ఆయన వనాలు, దుర్గాలు దాటుతూ, గర్జిస్తూ వెళ్ళుండగా, ఆస్వామి మెడలోని పుష్పమాలికలు తెగిపడిన ప్రదేశంలోనల్లా, నృసింహస్వామి అంశంగా శ్రీ నృసింహ దివ్యక్షేత్రాలు వెలిశాయని ఆయా క్షేత్రపురాణాలు తెలుపుతున్నాయి ఆ ఉగ్రస్వరూపం-లక్ష్మి అంశ సంభూతురాలైన "చెంచులక్ష్మి" (గిరిజనుల ఆడపడుచు) దర్శనంతో, స్పర్శతో, ఉపసంహరించబడి, ప్రసన్నలక్ష్మి నృసింహునిగా మారాడనీ ఆమె ఆయన దేవేరి అయిందనీ క్షేత్ర పురాణాలు తెలుపుతున్నాయి. స్వామితో సమంగా చెంచులక్ష్మికూడా పూజింపబడుతోంది నాటికి, నేటికీ, ఏనాటికి

అగస్త్య, నారద, వరాహ, కపిల, మార్కండేయ వగైరా మహర్షులెందరో ఆయా క్షేత్రపాలకులైన లక్ష్మీనృసింహస్వామినీ. జ్వాలారూపునిగా, మాలా రూపునిగా. క్రోడరూపునిగా, పరిపరి రూపాలలో వారివారి సాక్షాత్కార ప్రభావాన్నిబట్టి ప్రతిష్ఠించారనీ తెలుపుతున్నాయి ఆయా క్షేత్ర పురాణాలు. బ్రహ్మ మొదలు పై మహర్షులు, దేవగణాలు చేసిన సహస్రనామ స్తోత్రాలు వున్నాయి ఆ స్వామికి.

నృసింహస్వామి దీపాసన అనన్య సామాన్యమైనదిగానూ, అతి నిష్ఠాగరిష్ఠమైనదిగానూ, అత్యంత శుభప్రదమైనదిగానూ, నిజమైన నిష్కామ

భక్తులకది భక్తి, ముక్తి ప్రదాయకమైనదిగానూ వర్ణిస్తున్నాయి. నృసింహ పురాణాలు బ్రహ్మ, మార్కండేయ, నారదాది మహర్షుల సహస్రనామస్తోత్రాలు ప్రసిద్ధాలై ఉపాసకులకూ, పండితులకూ బీజాక్షరాలై ఆలయ పూజలలో విని పిస్తున్నాయి. ఆది శంకరాచార్యులు "శ్రీలక్ష్మీనృసింహ మమ దేహి కరావ లంబం' అనే మకుటంతో రచించిన ఇరవై ఐదు శ్లోకాలు, పండిత పామరు లందరికీ సులభగ్రాహ్యమూ, సులభంగా పఠనీయమూ అయి, బహుళ ప్రచారాన్ని పొందాయి.

"ఏకేనచక్ర మపరేణ కరేణ శంఖ,
మన్యేన సిన్ధుతనయా మవలబ్యతిష్ఠన్
వామేతరేణ వరదాభయ పద్మ చిహ్నం
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్"

అని శ్రీ శంకరాచార్యుని శ్లోకంలో లక్ష్మీసమేతుడై, శంఖచక్రాయుధ, అభయహస్తాలతో చతుర్భుజుడై, అశేష భక్తులను అపార కరుణతో రక్షించి వారందరికీ ఆపత్సమయంలో "కరావలంబ" మిచ్చి అభయమిచ్చే నృసింహ స్వామి సాక్షాత్కరిస్తాడు కాదా?

నృసింహస్వామి ఉపాసనాపరులు, నృసింహస్వామిని సాక్షాత్కరించు కుని, నృసింహ స్వరూపులుగా (ఆస్వామి స్వరూపులుగా) మారిపోతారని ప్రతీతి. (అయితే అన్ని రంగాలలోనూ ఈనాడూ 'కల్తీ' ఏర్పడి దొంగ సన్యాసులు, దొంగభక్తులు' దొంగ ఉపాసకులు, దొంగ దీక్షలు లాటివి ఏర్పడి ఏస్వామి పూజ అయినా ఎట్లా 'క్యాష్' చేసుకోవటమన్న ఆలోచనవున్న వారూ వున్నారు. అలాటి వారికి ఏ ఉపాసన అయినా ఒకటే)

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కవిగారి "వేయి పడగలు"లో కూచిపూడి భాగవతులు "నృసింహావతారం" ప్రదర్శించే ఘట్టం అత్యంత అద్భుతంగా వర్ణించారు. ఆ భాగం సుమారు ఇరవై సంవత్సరాల క్రితం వరకూ హయ్యర్ క్లాసుల తెలుగు పాఠ్యపుస్తకాలలో పాఠ్యభాగంగా వుండేది కూడానూ.

నృసింహస్వామి వేషంకట్టే కూచిపూడి భాగవతుడు, కేవలం నటనగా, వేషంగాగాక భాగవత ప్రదర్శనకుముందు ఒక రోజంతా కఠిన ఉపవాసంతో నృసింహస్వామి బీజాక్షర సహిత మూలమంత్ర జపంచేస్తూ, ఆస్వామిని తనలో ఆవహింప జేసుకొనివుంటాడనీ, రంగస్థలంలోనికి ఆ స్వామి ప్రత్యక్షమయ్యే సమయంలో ఆ ఉపాసకుడు నిజంగా నృసింహస్వామి అవతారంగానే ఆవిర్భవిస్తాడనీ జనం నిజమైన నృసింహుని చూచిన అనుభూతినే పొందుతారనీ విశ్వనాథవారు వర్ణిస్తూ, ఒక మారలాటి ఉపాసనా పూరితుడైన భాగవతుడు రంగస్థలంమీద హిరణ్యకశిపు పాత్రధారిని నిజంగానే చీల్చి చంపటంతో, ఆ తర్వాత నృసింహావతార ఘట్టం ప్రదర్శన సమయంలో ఆ భాగవతునికి తెర వెనుకాలనుంచి వెనక్కిలాగే విధంగా బంధించి హిరణ్యకశిపుని దరిదాపుల వరకూ వెళ్ళనిచ్చి, వెనక్కిలాగి అఖండజ్యోతి వెలిగించి హారతిచ్చి శాంతింప జేసి తెరదింపటంలాటి మార్పు చేశారనీ వ్రాశారు. మనోహరమైన వర్ణన అది.

శ్రీ నృసింహుని పూజించేవారికి ఏకొరతా, వ్యాధిభయమూ. గ్రహ భయమూ, వృశ్చిక పన్నగ విషబాధలూ, శత్రుభయము వుండవని ప్రగాఢ విశ్వాసం పాదుకొని వుంది ఆయా నృసింహస్వామి భక్తులలో. ఆభక్త కుటుంబాలలో! ఇక భోళాశంకరునిలానే నృసింహస్వామి కూడా భక్తుని ఆర్థిక, మానసిక శక్తి తెలిసి ఆ భక్తుడు భక్తితో సమర్పించే "పత్రం, పుష్పం, ఫలం, తోయం" ఏదైనా అమృతంగా భావించి స్వీకరిస్తాడనీ, హరిజనులైనా, గిరిజనులైనా, కోటీశ్వరులైనా, కూటికిలేని పేదలైనా, లక్షాధికారులైనా, భిక్షాటన చేసేవారైనా, ఆస్వామికి ఒకటేననీ, వారివారి భక్తిపరిపూర్ణతనిబట్టి వారివారి మానసిక పరిపక్వతనుబట్టి స్వామి కరుణ జాలు వారుతుందే తప్ప ఇహ సంబంధమైన తేడాలను బట్టి కాదని ఋజువు చేస్తుంటారు నృసింహభక్తులు.

ఆ స్వామి కొండమీదగానీ, నమ్ముకున్న వారి పట్లగానీ, ఏ నేరం ఎవరు చేసినా, కఠినశిక్ష తప్పదనీ చెబుతుంటారు భక్తులు. ఒక్కమాటలో చెప్పాలంటే ఆర్తిగా భక్తిగా "కో" అని పిలిస్తే "ఓ" అని పలికే స్వామి నృసింహస్వామి ఇక నృసింహ అవతార రూపమూ ప్రత్యేకమైనది. హిరణ్యకశిపునికి బ్రహ్మ

వరాలమూలంగా ఏదే., యక్ష, గంధర్వ, సిద్ధ, చారణ, విద్యాధర, మానవ, పిశాచ, రాక్షస, మృగ, పక్షిగణాల వల్లగానీ మరణం వాడికి లేదన్నది నిర్వివాదాంశం! అలాగే పగలు, రాత్రిల్లాటి కాలమానంలోగానీ, నీరు, నిప్పు, నింగి, నేల, ఆకాశంలాంటి పంచభూతాల స్పర్శలోగానీ, ఏఆయుధం, అస్త్రం శస్త్రం వలనగానీ, ప్రాణంవున్న వాటివలనగానీ, ప్రాణంలేని వాటివలనగానీ వాడికి మరణ భయంలేదు.

అంచేత వాడిలాటి సాధుహింసా పరాయణుడు, విష్ణుద్వేషి, ఆ ద్వేషంతో తన కన్న కొడుకునైనా సరే అమానుష హింసలకూ, హత్యకూ గురిచేయటానికి వెనుదీయని కర్కోటకుడు, నియంత అయిన వాణ్ణి చంపటానికి, సాధారణ సాధు అవతారం చాలదు. నడుము వరకూ మృగరాజైన సింహం రూపమూ, నడుము క్రింది భాగంనుంచీ మానవ రూపమూ కలిగి చతుర్భుజాలతో శంఖచక్రాది ఆయుధాలతోబాటు. కొండలనైనా చీల్చివేయగల తీక్షణభాగాలు (గోళ్ళతో) ఆవిర్భవించాడు నృసింహస్వామి (నఖములు) గోళ్ళు, కేశములు (జుట్టు) దంతములు (పళ్ళు) వగైరాలు శరీరానికి సహజంగా అమరివున్న వరకూ ప్రాణసహితాలు. శరీరంనుంచి విడివడిన తర్వాత (గోళ్ళు కత్తిరించాక జుట్టు కత్తిరించాక, పళ్ళు వూడిపోయాక) అవి ప్రాణరహితాలు. అంచేత హిరణ్యకశిపుని అత్యాశ వరాలకు తగినట్లుగా ఆ అవతార ఆవిర్భావం జరిగింది. భావితరాల నియంతలందరికీ, విష్ణుద్వేషులందరికీ, భక్తులను బాధించే కర్కోటకులందరికీ, సాధుపీడా పరాయణు లందరికీ గుణపాఠం అన్నట్లు సభా భవన స్తంభంలోనుంచి ఆవిర్భవించిన నృసింహస్వామి హిరణ్యకశిపుని సభా భవన ద్వారంలో నేల నింగికాని తన తొడలమీద (ఒడిలో) కి లాగి, పగలు, రాత్రి కానీ సంధ్యా సమయంలో తన వాడియైన గోళ్ళతో చీల్చి ఆ ప్రేవులు పూలమాలికలా ధరించి, యావత్ రాక్షస లోకానికి నియంతృత్వ పరిపాలకులకూ విష్ణుద్వేషులకూ, ''భయం" అన్నదేమిటో తెలిసే రీతిలో వధించాడు.

ఈ ఘట్టాన్ని నృసింహస్వామి ఆవిర్భావ స్వరూపాన్ని పోతన మహాకవి తన సహజ పాండిత్య ఝరిలో, భక్త్యావేశంలో నఖశిఖ పర్యంతం అక్షరాల

చిత్రలేఖనంతో, తరతరాల భక్తకోటి హృదయ తెరమీద మహాద్భుతంగా చిత్రించి చూపారు ప్రహ్లాద చరిత్రలో ఈ మహాద్భుత రూపాన్ని దర్శిస్తాం మనం అందరం.

పరుని భార్యను అధర్మంగా చెరబట్టిన రావణుడు, సపుత్ర, మిత్ర, బాంధవ, సపరివార సమేతంగా మరణించాడు శ్రీరామునిచేతిలో, వానరుల చేతుల్లో వాడి వరాలు, శివపూజ అడ్డు రాలేదు ఆ అధర్మపు పనికి.

హిరణ్యకశిపుడు భక్తుడైన బిడ్డను కూడా సహించలేక విష్ణుద్వేషాన్ని, నియంతృత్వాన్ని ప్రదర్శించి, నృసింహావతారం చేతిలో లోకభీకరంగా మరణించాడు.

కీచకుడు మరణించాడు భీమునిచేతిలో, మాంసపుముద్దలామారి, భయంకర రీతిలో, ఒక ధర్మబంధానికి కట్టుబడిన మహాపతివ్రత ద్రౌపదిని అవమానించి-కులస్త్రీని వమాఅనిస్తే జరిగే వధకు తార్కాణంగా. కురువంశమూ అకాణంగానే నాశనం అయింది.

ప్రతి పురాణ సన్నివేశంలోనూ అంతర్గత బోధవుంది. మానవాళికి ఇచ్చే మహత్తర సందేశంవుంది. మానవ మనుగడను తీర్చిదిద్దే సంస్కారంవుంది.

ఆ పురాణాలనీ, ఆ సన్నివేశాలనీ మనం ఆకళింపు చేసుకొనే మన సంస్కార పరిణామం, పరిణితినిబట్టి మన భాష్యం వుంటుంది ఆయా సన్నివేశాలకు అవునా?

o—o

# "భక్తి వెల్లువతో ప్రారంభమౌతున్న భాగవతుల కథలు"

పోతన భాగవతంలో షష్టమస్కంధంవరకూ, శుకయోగీంద్రుడు పరీక్షిత నరేంద్రుడికి చెప్పిన కథలలో ఎక్కువ భాగం బ్రహ్మచేసిన సృష్టిక్రమం మనువులు, ప్రజాపతులు వారివారి వంశాలలో ఉద్భవించిన మహాజ్ఞానులు విష్ణ్వాంశ సంభూతులై, శ్రీమహావిష్ణువు అవతారంగా భావించబడిన మహర్షులు, మహారాజులూ వారివారి వంశావళులూ, వారివారి జ్ఞానబోధలూ ఇమిడి వున్నాయి. అలాగే అతిగుహ్యమూ, గహనమూ అయిన వేదాంత రహస్యాలు సాంఖ్యయోగమూ, భక్తియోగముల్లాటి వివరణ వున్నది. మొత్తం మీద ఎక్కువ శ్రీహరి అవతారాలు. ఆ అవతారాలద్వారా (కపిలుడు, పృథు చక్రవర్తి, ఋషభుడు వగైరాలద్వారా) తెలువబడిన సాంఖ్య, రాజ, భక్తియోగాల వివరణ వుంది. వాటి మధ్యలో శ్రీమన్నారాయణుని కీర్తించే అవకాశాలు శ్రీహరి గుణగణాలను స్తోత్రంచేసే ఘట్టాలూ, పరిమితంగానే వున్నాయి, ఆ అవకాశాలువున్న సంఘటనలో పోతన మహాకవి ఘంటం భక్త్యావేశంతో పరుగులు తీసినా వేదాంత వివరణలు తప్పనిసరిగా పద్యాల సరళి మారిపోతూనే వుంది. కారణం ఆ కఠిన, గుహ్య రహస్యాలను, తేటతెలుగులో తేటతెల్లం చేయాలంటే అది పాఠకులకు అర్థం అయ్యే రీతిలో మలచాలి అన్నధ్యేయమే కనిపిస్తున్నది. అదీగాక అక్కడక్కడా భాగవతం మూలం (పోతనదే) నారయ్య, గంగయ్య మొదలైనవారు పూరించారనీ (భాగవత మూలతాళపత్రులు శిధిలమైపోగా) తెలుస్తోంది. అంచేతకూడా పోతన పద్యాలకు, ఆ పూరింపబడిన భాగాలకూ తేడా తెలుస్తూనే వుంటుంది.

సప్తమ స్కంధంనుంచి పోతన మహకవి ఘంటానికి అడ్డు అదుపూ లేవు. ఆయన భక్త్యావేశానికి ఏమరికగానీ, ఏల్లలుగానీలేవు కారణం ఇక్కణ్ణుంచి ప్రతిస్కంధంలోనూ భగవంతుడికీ భక్తునికీ భాగవతునికీగల సంబంధం ఆత్మీయత, అనురాగం. వాత్సల్యం కథకథలో తొణికిసలాడుతోంది. తన ఉనికిని తెలుపటానికి తనునమ్మిన భగవంతుడున్నాడని ఋజువుచేయడానికీ తననే నమ్ముకున్న ప్రహ్లాదునికాపాడటానికి భగవంతుడు వరుగున నృసింహావతారంతో

ప్రత్యక్షమైన "ప్రహ్లాద చరిత"తో, ప్రారంభమైన ఈ భక్త్యావేశం, "గజేంద్ర మోక్షం" ద్వారా పరిపక్వతచెంది. దశమస్కంధంలోని శ్రీకృష్ణావతారంతో పరాకాష్ఠనందుకున్నది ఒక్కోభక్తుని హృదయంతో పోటీపడింది పోతన మహాకవి హృదయం, ఒక్కొభక్తుని స్తోత్రంలో ఆభక్తుని తనలోనికి పరకాయ ప్రవేశం చేయించుకున్నాడు ఆమహాకవి ఆభక్త్యావేశంలో భక్తుడూ,భగవంతుడూ తానే అయిపోయాడు పోతన! అంతగా తాదాత్మ్యంచెంది పోయాడు. నిజమైన భక్తియోగపు పరిపూర్ణదశలో దృశ్యం, దృష్టి, ద్రష్ట మూడు వేరు వేరు కానట్లు. వాటికి బేధంలేనట్లు. భగవంతుడు, భక్తుడు పోతన వేరువేరు కాదనిపించే స్థాయికి చేరుకుందామనే హృదయం. అంచేత రాక్షసపాత్రలో భగవంతుణ్ణి నిందించినా అది భగవంతుని స్తోత్రమే అయింది! సాత్వికపాత్రలో భగవంతుణ్ణి స్తోత్రం చేసినా అది ప్రతి ఒక్కరూ తామే ఆస్తోత్రం చేస్తున్నట్లు అనుభూతి చెందేట్లు జాలువారాయి. ఆ పద్యాలు భగవంతుడు భక్తుని నుద్దేశించి ఏంచెప్పినా, ఏంచేసినా అది భాగవత కథలోని పాత్రలకుగాక, ఈనాడూ మన ఎదురుగా నిల్చుని మనకే చెబుతున్నట్లు అనుభూతి కలుగుతోంది. అందుకే మూలం (వేదవ్యాస మహర్షి వ్రాసిన సంస్కృత భాగవతం) లో "కాస్త౦త" శ్లోకాన్ని పోతన మహాకవి తనదైన భక్త్యావేశంలో కొండంతగా పెంచుకు పోయాడు పద్యం తర్వాత పద్యం గంగాఝురిలా సాగి, ఏ పద్యమూ అనవసరమనిగానీ విసుగనీగానీ అనిపించకుండా ప్రతిపద్యం ప్రతి గద్యం కంఠస్థం చేసేట్లు కంఠస్థం హృదయగతం అయ్యేట్లు మారింది కొన్ని ఘట్టాలకు ఘట్టాలే పెంచుకుంటూ పోయాడా మహాకవి.

ఉదాహరణకు నవవిధ భక్తులను గురించి మూలభాగవతంలో,

శ్లో॥ "శ్రవణం కీర్తనం విష్ణో స్మరణం పాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్యం ఆత్మనివేదనమ్."

అనేదానికి ప్రహ్లాదుని నోటివెంట

మ॥ "తను హృద్భూషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయున్, సంకీర్తనల్‌చింతనం
బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్ముస్, హరిన్నమ్మి, స
జ్జన డై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా"

అని పలికించి తొమ్మిది విధాలైన భక్తి మార్గాలనూ పండిత పామరుల నోట కంఠస్తంగా అప్పచెప్పించాడు ఆ మహాకవి!

శ్లో॥ "జహ్వేకీర్తయ కేశవం మురరిపుం చేతోభజ శ్రీధరం
పాణిద్వంద సమర్ప యాచ్యుతాకథా శ్రోతద్వయింత్వంశృణః
కృష్ణలోకాయ లోచనం హరేర్గచ్ఛాం ఘ్రియుగ్మాలయం
జిఘ్రిఘ్రాణ ముకుందపాద తులసిం! మూర్ధాన్న మాధోక్షజం"

అనే శ్లోకానికి ఇటు వామన చరిత్రలోనూ అటు ప్రహ్లాద చరిత్రలోనూ ఎన్నో అత్యద్భుత పద్యాలు అర్థం చెబుతాయి. హృదయాన్ని భక్తి భావరసం లో ముంచెత్తుతూ ఉదాహరణకీ పద్యం చూడండి.

సీ॥ కమలాక్షుకునర్చించు కరములు కరములు
శ్రీనాధువర్ణించు జిహ్వజిహ్వ!
సురరక్షకునిజూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరముశిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతువలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీది బుద్ధిబుద్ధి!

తే॥గీ॥ దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి! హరిజేరుమనియెడి తండ్రి తండ్రి!

అంటూ ఆ బాలగోపాలము ఈనాడూ మరేనాడూ అతి సులభంగా పాడుకొనే సీసపద్యాల వరుస ప్రారంభించాడు! ఆ వరుసలో ఏ ఒక్కటీ మరుపురాదు. ప్రహ్లాదుడు అనగానే ఆ పద్యాలు గుర్తుకు వస్తాయి. ప్రహ్లాద చరిత్రలోని ప్రతి పద్యం పామరులువేసే 'నృసింహావతారం' 'చెంచు లక్ష్మి' 'ప్రహ్లాద చరిత్రల్లాటి వీధి నాటకాలు మొదలు స్టేజి నాటకాల, సినిమాలవరకూ ఆయా సందర్భంలో ఎందరో గాయకులు తమ తమ సుసర్వ కంఠస్వరంతో గానంచేసి తరించినవే; తరిస్తున్నవే!

ఇలా సప్తమ స్కంధం మొదలు కృష్ణావతార పరిసమాప్తి వరకూ, పోతన మహాకవికి భక్త్యావేశంలో తన ఒళ్లు, తన హృదయం తనకు తెలియ లేదు అని ఆయన స్వాధీనంలోనూ లేవు భగవంతుని శ్రీచరణాలమీద లగ్నం అయిపోయాయి ఏకాగ్రతతో!

ఇక కవితాఝురి కూడా అలాగే సాగింది. కాళిదాసు మహాకవి కవిత్వ పోకడలతో.

> "చేటీ భవన్నిఖిలఖేటీ కదంబ వనవాటీషు నాకపటరీ
> కోటీర చారుతర కోటీమణీకిరణ కోటీకరంజితపదా!
> పాటీరగంధి, కుచశాటీ కవిత్వ పరిపాటీ మగాధిపసుతా
> ఘోటీకులాదధికధాటీ ముదార ముఖ వీటీ రసేన తనుతామ్"

అలా సాగిన కాళిదాసు కవిత్వంలో మకుటాయమానంగా చెప్పబడే కాళీస్తోత్రం ('మాణిక్యవీణాం ముపలాలయంతీం') దండకం ("సుధాసము ద్రాంత రుద్యన్మణి ద్వీప సంరూఢ బిల్వాటవీమధ్య కల్పద్రుమా కల్పకాదంబ కాంతార వాసప్రియే! కృత్తి వాసప్రియే; సాదరారబ్ధ సంగీత సంభావనా సంభ్రమాలోల నీవప్రసగాబద్ధ చూళీ సనాథాత్రిక! సానుమత్పుత్రికే") ఎల్లలు లేని భక్త్యావేశపు గగనగంగ ప్రవాహంలా.

పోతన మహాకవి పద్యాలు, గద్యం సాగాయి ఆయా సందర్భాలలో, అక్షరాల చమత్కారాలు, అంత్యప్రాసల అద్భుతాలు, పదవి విరుపుల సొగసులు

పద్యాలలోనూ, గద్యాలలోనూ సమానంగా సాగిపోయాయి. ఆయనకు తెలియకుండానే, తెలియనిస్థితిలోనే నృసింహావతార ఆవిర్భావ వర్ణన దాని కదేసాటి అక్షరాలలోనే నృసింహస్వామి రూపం చిత్రించి చూపాడా మహాకవి.

శా॥ రక్షోబాలురనెల్ల నీ కొడుకు చేరంజీరి లోలోన నా
శిక్షామార్గములెల్ల గల్లలని యాక్షేపించి తానందఱన్
మోక్షాయత్తుల జేసినాడు; మనకున్ మోసంబు వాటిల్లె; నీ
దక్షత్వంబున జక్కజేయవలయున్ దైతేయ వంశాగ్రణీ!

అంటూ అసుర గురుపుత్రులూ, ప్రహ్లాదుని గురువులూ అయిన చండామార్కులు హిరణ్యకశిపునికి విన్నవించుకోవటంలో 'క్ష' అనే అక్షర విన్యాసంతో బాటు అర్థంలోని ఆగురువుల ఆవేదన ప్రభువు శిక్షకు గురి అవుతామేమోననే భయం, ఇక తామేమీ చేయలేమనే నిస్సహాయతా 'నీ కొడుకు చదువుకూ, నీకూ, మాయీపౌరహిత్యానికీ ఒక్క నమస్కారం దేవుడో' అనే విరక్తి భావం అక్షరం అక్షరంలో పలికి, మనకి నవ్వు, హాయి, ప్రహ్లాదుని గడుసుదనంపట్ల ఆశ్చర్యం, ఆ గురువులపట్ల ఆశ్చర్యం, ఆ గురువులపట్ల జాలీ అన్నీ కలుగుతాయి కాదా?

ఇట్లా వాగాతీతమూ, వాక్యాతీతమూ అయిన కవిత అక్షరం, అక్షరంలో పెల్లుబికిన భక్తి భావ పూరితమైన కథలు ఎన్నో ఎన్నెన్నో!

అవి మనం తెలుసుకుందాం.

ముందస్తుగా 'ప్రహ్లాద చరిత్ర' లోకి వెళదాం! దితి పుత్రులైన హిరణ్యాక్ష, హిరణ్యకశిపులలో, హిరణ్యాక్షుని యజ్ఞవరాహమూర్తిగా వధించి లోకాల కా రాక్షసుని వలన "యుద్ధపీడ" ను తొలగించాడు శ్రీమన్నారాయణుడు.

ఇక వారిలో రెండవవాడూ హిరణ్యాక్షుని అన అయిన హిరణ్యకశిపుడు తన సోదరుడైన హిరణ్యాక్షుడు శ్రీహరి చేతిలో మరణించాడని తెలుసుకొని ఆగ్రహోదగ్రుడయ్యాడు. అసలే జన్మతః వైష్ణవ ద్వేషం ఏర్పడివున్న ఆ రాక్షసునికి ఈ సంఘటనతో ఆ విష్ణువును సంహరించిగానీ కంటినిండుగా నిద్ర పోకూడదనుకున్నాడు, విష్ణువు శక్తి వాడికి తెలుసు. అంచేత విష్ణువును జయించటానికి విష్ణువు తనని ఏవిధంగానూ చంపలేని విధంగానూ ఉగ్ర తపస్సు బ్రహ్మను గురించిచేసి, ఏయుగంలోనూ, ఏరాక్షస, మానవ, దేవ గంధర్వ గణాలెవరూ కోరని, కోరలేని, కోరబోని వరాలన్నీ ఓ జాబితాగా ఏర్పరచి మరీ వరం పొందాడు.

శ్రీహరి పార్శ్వచరులుగా వైకుంఠంలో వుండి సనకసనందన మహర్షు లిచ్చిన శాపం కారణంగా, మహాతపస్సంపన్నుడు, మహా పతివ్రత అయిన కాశ్యప మహర్షి, దితి దంపతులతు జన్మించిన హిరణ్యకశిపుడుజ న్మతః బ్రహ్మజ్ఞాని, భక్తికి కొదువలేదు. తపోదీక్షకు కొదువలేదు కఠిన నియమాలకు కొదువలేదు. స్త్రీలోలత్వం లాటి నీచగుణం లేదు! ఏటొచ్చీ వున్నదల్లా ఒక్కటే వైష్ణవ ద్వేషం (ఆ ఒక్కటీచాలు సర్వసద్గుణాలూ హరించటానికి) ఆ ఒక్కటే వాడిని రాక్షసునిలా, నియంతగా, సాధుద్వేషిగా, చివరకు కన్నబిడ్డనైనా చేతులారా చంపగలిగే కర్కోటకునిగా మార్చివేసింది.

అంతటి తపోబల సంపన్ననీ, జ్ఞానినీ, భక్తాగ్రేసరునీ, పూర్వజన్మ వైకుంఠ వాసునీ బ్రహ్మ వరప్రసాదునీ, కేవలం గుణం ఆధారంగా రాక్షసు డైన వాడిని పరిమార్చటానికి ఏ దేవతలూ చాలరు! సాక్షాత్తు విష్ణువే కావాలి రావాలి అందుకు ఆయన ప్రత్యేక అవతారాన్ని ఎన్నుకున్నాడు.

వర గర్వితుడైన హిరణ్యకశిపుడు వైకుంఠం మీదకూ వెళ్ళాడు విష్ణు వును జయించటానికి. వాడి వరాలననుసరించి వాడితో ఆ సమయంలో ఎదురు నిల్చి పోరాడే శక్తి విష్ణువుకూ లేదు. అంచేత ఆయన ప్రత్యక్ష చర్యకు (యుద్ధానికి) దిగక, పరోక్షంగా వాడిని దెబ్బకొట్టే ఉపాయంగా,

మ॥ ఎదురై పోర జయింపరాదితని గాకెందేనియుంబోవ, భీ
ప్రదుడై ప్రాణులఁదోలు మృత్యువు క్రియంబై వచ్చు నంచున్ క్రియా
విదు డబ్జాక్షుడు, సూక్ష్మరూపమున నావేశించె నిశ్వాస రం
ధ్రదిశన్, దైత్యు హృదంతరాళమున బ్రత్యక్ష క్రియాభీరుడై

ఆలా ప్రవేశించి వాడికీ లీలావతికీ "ప్రహ్లాదుడు" గా వైష్ణవాంశ పెరిగింది వాడి కుమారుని రూపంలో.

హిరణ్యకశిపుడు రాక్షస కృత్యాలకు తట్టుకొని నిలబడగలిగిన వైష్ణవ తేజం వైష్ణవ శక్తి అలా ప్రహ్లాదునిలో నిక్షిప్తమై వుంది కన్నతండ్రి మరణానికి కన్నకొడుకే కారణభూతుడైనాడు.

ఏ యుగంలోనయినా, ఏ నియంత పతనానికైనా, మరణానికైనా, ఇతరులంతాచేసే ఉద్యమం ఒక ఏత్తు! ఆ కుటుంబంలోనే ఆ ప్రభుత్వంలోనే ఏర్పడే ప్రతిఘటన ఒక్కటీ ఒక ఎత్తు! రావణాసురునికి విభీషణుడు (తమ్ముడు) "మరణ సాధనం" అయితే హిరణ్యకశిపునికి ప్రహ్లాదుడు మారణాయుధం! ఇది సృష్టి ధర్మం! ఆ ధర్మాన్ని తెలుపుతుంది ప్రహ్లాద చరిత్ర మనందరికీ నాటికీ, నేటికీ మరేనాటికీ గుర్తుండేలా.

## ప్రహ్లాద చరిత్ర — హిరణ్యకశిపుడు

ధర్మరాజు యాగంచేసే సమయంలో నారదమహర్షి ధర్మరాజుకు వివరంగా చెబుతాడు ఈ "ప్రహ్లాద చరిత్ర".

హిరణ్యాక్షుని మరణానికి అతని భార్యలు, కొడుకులూ, అతని తల్లి అయిన దితి చాలా దుఃఖపడుతుంటారు. ఆ సమయంలో హిరణ్యకశిపుడు తన తల్లి అయిన దితినీ, హిరణ్యాక్షుని భార్యలనూ, బిడ్డలనూ, ఓదార్చుతూ మహాద్భుతంగా వేదాంతం చెబుతాడు సకలజీవులకూ ఆత్మేశ్వరుడైన భగవంతుని

మహాద్భుతంగా వేదాంతం చెబుతాడు. సకలజీవులకూ ఆత్మేశ్వరుడైన భగవం తుని మహాద్భుతలీలలో ఈచావుపుట్టుకలన్నవి కేవలంస్వల్పమాత్రుపేతప్ప భగ వంతునికి సర్వచరాచర ప్రపంచమూ ఒకటేనని చెబుతూ పూర్వం ఉశీనరదేశా ధిశుడైన 'సుయజ్ఞుడనే' రాజు యుద్ధంలో మరణించగా ఆయన భార్యా బంధు వులు కూడా ఇట్లాగే దుఃఖిస్తూ ఆయన కళేబరానికి దహన సంస్కారం చేయక ఆలశ్యం చేయటంతో 'యముడు' బాలుని రూపంధరించి వచ్చి వాళ్ళందరికీ తత్వబోధ చేసిన విషయమూ ఆతత్వబోధ సారాంశమూ తెలిపి సోదరుడైన హిరణ్యాక్షునికి దహనసంస్కారాది కర్మక్రతువులు పూర్తిచేయిస్తాడు హిరణ్య కశిపుడు ఇంత వేదాంతం చెప్పి 'నా సోదరుని చంపిన హరిని చంపి, ఆరక్త తర్పణంతో నా సోదరుని ఆత్మకు శాంతి చేకూరుస్తానని' శపథంచేసి శ్రీహరిని ఎదుర్కొనేందుకు అవసరమైన 'శక్తి' కోసం "మందరగిరి'' కి వెళ్ళి ఉగ్ర తపస్సు ప్రారంభిస్తాడు బ్రహ్మను గురించి హిరణ్యకశిపుడు. అతని ఉగ్ర తపస్సులో భాగంగా అతని శరీరం చుట్టూరా పుట్టలు పెరిగాయి. గండు చీమ లాతని శరీరాన్ని తినటం ప్రారంభించాయి, తపస్సమాధినుంచి చలించలేదా దానవరాజు. వాయునిరోధంచేసి ఊర్ధ్వబాహుడై కేవలం అస్థిపంజరంగామారి న అతని మహోగ్ర తపస్సుతో పర్వతాలతో నిండివున్న భూమి కంపించి పోయింది, సప్త సముద్రాలూ అల్లకల్లోలమై పోయాయి. ముల్లోకాలూ ఆ తపో మహిమాగ్నికి మంటలు ఎగసాయి. తారక గ్రహాలు గతులు తప్పాయి. ఇంద్రాది దేవతలు భయపడి, బ్రహ్మవద్దకు వెళ్ళి ఆదానవరాజుకు ఏదో ఒక వరం ఇచ్చి వాడినా ఘోర తపస్సునుండి మరలిస్తే తప్ప తమకిక మనుగడ లేదని మొరపెట్టుకున్నారు. బ్రహ్మ హిరణ్యకశిపుని ఎదుట ప్రత్యక్షమై తన కమండలంలోని దివ్యజలాలు అతని మీద ప్రోక్షించి, మేల్కొలిపి ఇక ఆ ఉగ్రతపస్సు చాలించమనీ, ఇంతటి మహోగ్రతపస్సులోగా చేసినవారుగానీ ఇక ముందు చేయగలవారుగానీ లేరనీ, తాను మెచ్చాననీ, ఏ వరం కోరు కున్నా సంతోషంగా ఇస్తానని చెప్పాడు. (బహుశా బ్రహ్మకూడా వాడి వరాల జాబితా వూహించి వుండడా సమయంలో!)

వెంటనే హిరణ్యకశిపుడు బ్రహ్మను స్తుతించి బ్రహ్మ కమండల దివ్య జలం వలన తన వెనుకటి రూప, యవ్వన, తేజో, శక్తులన్నీ పొంది, తన మనస్సులో పదిలంగావున్న వరరూపకోర్కెల జాబితా చదివాడు.

శా॥ గాలిం, గుంభినిని, నగ్ని, నంబువుల, నాకాశస్థలిన్, దిక్కులన్
రేలన్, ఘస్రములన్, దమఃప్రబల, ఘూరిగ్రాహ రక్షో మృగ
వ్యాళాదిత్య నరాది జంతుకలహవ్యాప్తిన్, సమస్తాస్త్ర శ
స్త్రాళిన్, మృత్యువులేని, జీవనము, లోకాధీశ! యిప్పింపవే.

మరియు "రణంబులందు తన కెదురులేని శౌర్యంబును లోకపాలకులను నతిక్రమించు మహిమయును, భువనత్రయ జయంబును" కోరాడు ఏక కాలంలో ఇంత జ్ఞాపక శుద్ధితో ఇన్ని వరాలను కోరిన దానవుడుగానీ, గండు చీమలు శరీరమంతా తినివేస్తున్నా లెక్కచేయని ఉగ్రతపస్సా చరించిన దానవుడుగానీ చరిత్రలో మరొకడు కనపించడు. అంచేత 'హిరణ్యాక్ష వరాలు' గా ప్రసిద్ధి పొందాయి. కోరికల జాబితా చదివేవారి కోరికలు.

బ్రహ్మకూడా విభ్రాంతి పొందాడీ వర పరంపర తాలూకు కోరికలకు! అయినా సంతోషించి ఇవ్వక తప్పదు. గనుక ఆ వరాలన్నీ యిచ్చి చివరగా తన మనుమడైన హిరణ్యకశిపునిమీద కరుణతో హితవుకూడా చెప్పాడు.

శా॥ "అన్నా; కశ్య పుత్ర! దుర్లభము లీయర్థంబు లెవ్వారికిన్;
మున్నెవ్వారలు గోరరీ వరములన్!; మోదించితిన్ నీయెడన్;
నన్నున్ గోరినవెల్ల నిచ్చితి; ప్రవీణత్వంబుతో, బుద్ధి సం
పన్నత్వంబున నుండుమీ! సుమతివై భద్రైక శీలుండవై"

అన్నాడు బ్రహ్మ! ఆ హెచ్చరికతో "అబ్బాయి ఈదుర్లభ వరాల అపరిమిత శక్తితో లోక పీడకుడిలా కాకుండా బుద్ధి సంపన్నత సుమతితో శుభ ప్రదుడవై జీవించు!" అనే సందేశాన్ని తెలిపాడు.

కానీ విష్ణు ద్వేషంతో కళ్ళు, మనసు మూసుకుపోయిన హిరణ్యకశిపుడికి బ్రహ్మ వరగర్వం తోడైంది. తనకు ఏ జాతి ప్రాణుల వలనగానీ, రాత్రిగానీ, పగలుగానీ, ఏ అస్త్ర శస్త్రాలతోగానీ, నేలమీదగానీ, అంతరిక్షంలోగానీ,

అగ్ని, జలాలవలనగానీ, మృత్యువులేదనీ రాదనీ, మిడిసిపాటు వృద్ధి పొందింది యివి చాలక అతని ఎదురుగా నిలచి యుద్ధంచేయుగల శక్తి మరెవరికీ లేదు. హిరణ్యకశిపుడు ఇక విష్ణువుమీద విద్వేషంతో పగతో రగిలిపోతూ బయల్దేరాడు.

హిరణ్యకశిపుడు ఉగ్రతపస్సులో వుండగా అతని శరీరం చీమలకు ఆహారం అయిందనీ తెలుసుకున్న ఇంద్రుడు ఎప్పటిలానే వూరుకోలేక పోయాడు. తనవెంట కొందరు దేశవీరులను వేసుకొని హిరణ్యకశిపుని రాజ్యం మీద దాడిచేశాడు. ఆ సమయంలో తమ నాయకుడు లేకపోవటంతో రాక్షసులు ఇంద్రుని ధాటికి ఆగలేక, భార్యాబిడ్డలను వదిలి తలకో దిక్కుగా పారిపోయారు, ఇంద్రుడు రెట్టింపు ఉత్సాహంతో హిరణ్యకశిపుని అంతఃపురం ప్రవేశించాడు దేవగణాలతో. దేవగణాలు దానవరాజు అంతఃపుర సంపదలను కొల్లగొట్టారు. ఇంద్రుడు మాత్రం తనకు వదినగారూ, మాతృసమానురాలూ పెద్దమ్మ ఆయిన దితి కోడలూ, హిరణ్యకశిపుని భార్య అయిన లీలావతిని, గర్భవతిని బలాత్కారంగా తన స్వర్గలోకానికి ఈడ్చుకు పోవటం మొదలెట్టాడు. మహా పతివ్రత అయిన లీలావతి నిస్సహాయంగా విలపించటం ప్రారంభించింది. మరిడిచేత బలాత్కారంగా లాక్కుపోబడుతూ,

ఈ ఘట్టం జరుగుతుండగా నారదమహర్షి ఎదురైనాడు వాళ్ళకి నారద మహర్షి దేవేంద్రుని ఈ చర్యకు నిర్ఘాంతపోయాడు.

ఉ॥ "సర్వభువనాధినాథ! సురసత్తమ! వేల్పులలోన మిక్కిలిన్
నిర్భర పుణ్యమూర్తివి! సునీతివి! మానినిబట్టనేల? యీ
గర్భిణి, నాతురన్, విడువు కల్మషమానసురాలుగాదు నీ
దుర్భర రోషమున్నిలుపు దుర్జయుడైన నిలింపవైరిపై!"

అని వారించాడు ఇంద్రుణ్ణి "ఈమె గర్భస్థ శిశువు రెండో హిరణ్యకశిపునిగా తయారౌతాడేమో అంచేత ప్రసవ పర్యంతం ఈమెను బంధించి వుంచి ఆ పుట్టబోయే శిశువును నా వజ్రాయుధంతో చంపి ఆతర్వాత ఈమెను క్షేమంగా వదిలి పెళతాను మహర్షీ! నన్ను నమ్ము! అంటూ తన శౌర్యాన్ని తన

కొరుక్కొన్నాడు, తన బంధు పేరునూ, పెదింగారిపట్ల గౌరవాభిమానాలనూ, చాటుకున్నాడు. అందుకు నారదుడు నవ్వి,

శా॥ "నిర్భీకుండు, ప్రశస్త భాగవతుడు, నిర్వైరి! జన్మాంతరా
పిర్భూతాచ్యుత పాదభక్తి మహిమావిష్టుండు దైత్యాంగనా
గర్భస్థుండ గుణాలకుండు బహుసంగ్రామాద్యుపాయంబులన్
దుర్భావంబున, బొందిచావడు భవద్ధోర్దర్పవిభ్రాంతుడై"

అని ఆగర్భస్థ శిశువు మహిమ చెప్పి ఆమెను వదలమని హితవుచెపుతాడు ఇంద్రుడుకూడా నారదమహర్షి మాటలు మన్నించి తానూ విష్ణుభక్తుడే గనుక గర్భస్థశిశువు విష్ణుభక్తుడని తెలిసి లీలావతిని వదిలి తన దారిన తాను వెళ్ళాడు దిక్కులేని గర్భవతిగా నిలిచివున్న లీలావతిని నారదమహర్షి సగౌరవంగా తన ఆశ్రమానికి ఆహ్వానించి పిల్చుకుపోయి 'నీభర్త తపస్సుతో కోరికలు సిద్ధింపజేసుకొని వచ్చేవరకూ నీవు నా బిడ్డలా నిశ్చింతంగా నా ఆశ్రమంలో వుండు'! అని చెబుతాడు మహా పతివ్రత అయిన లీలావతి. నారదమహర్షి వెంట ఆయన ఆశ్రమానికి వెళ్ళి, మహర్షికి భక్తిశ్రద్ధలతో సేవలుచేస్తూ గర్భవతి అయిన తనకు నిశ్చింత అయిన ఆశ్రమం లభించటంతో భర్తరాకకోసం నిరీక్షిస్తూ కాలం గడిపింది. నారదమహర్షి ఇక నిద్రపోలేదు. భూత భవిష్యత్ వర్తమాన కాలాలు తెలిసిన జ్ఞాని హిరణ్యకశిపుని వరబలం ఎలాంటిదో తెలుసు గనుక లీలావతికి విష్ణుభక్తి యోగం బోధించసాగాడు. కానీ ఆమె యువరాజ్యానికీ అటుభర్తకూ అయినవారికీ దూరమై వచ్చిన్న జీవితం సాగిస్తున్న దశలో అలవాటులేని ఆశ్రమవాసం చేస్తున్న సమయంలో ఆమె మనస్సు ఆయన చెబుతున్న 'విష్ణుభక్తియోగం' మీదా వేదాంతమీదా లగ్నంకాలేదు భర్తరాక తప్ప ఆ పతివ్రత కోరేదేమీ లేదు గనుక నారదమహర్షి బోధను ఆమె ఆట్టే పట్టించు కోనూ లేదు, గుర్తుంచుకోనూలేదు. కానీ నారదమహరికూడా కేవలం తన బోధ ఆమెకు పరిమితం చేయలేదు. జీవి పుట్టుక మొదలు మరణంవరకూ గల యాతనామయు జీవితంలోగల మాయాపాశాలూ; విష్ణుభక్తితో ఆ మోహపాశాలను ఎట్లా వదిలించుకొవలసింది, అందుకు "అష్టాక్షరి" మంత్ర జపమనే

మహా ఆయుధాన్ని ఎలా భక్తిగా వశపరచుకోవలసిందీ కూలంకషంగా గర్భస్థ శిశువుకు బోధించటం సాగించాడు. జన్మ జన్మాంతరాల భక్తి సంస్కార విశేషాలు! ముఖ్యంగా ఒక నియంత అంతానికి సాధనరూపుడూ, అన్నిటికిమించి శ్రీహరి కృపాకటాక్ష వీక్షణ రక్షితుడూ అయిన ఆ శిశువుకూడా నారదమహర్షి, బోధను తు. చ. తప్పకుండా హృదయస్థం చేసుకున్నాడు. ఆ శిశువు సర్వావయవాలు మెదడు, మేధ, శ్రీమన్నారాయణునిపట్ల ప్రథగా భక్తి విశ్వాసాలతో, శ్రీమన్నారాయణ శ్రీచరణధ్యానంతో, శ్రీమన్నారాయణుని భక్తియోగంతో పరిపూర్ణమైపోయింది. ధృవునికి ఐదేండ్ల బాలుడుగా వున్నప్పుడు కేవల ఉన్నతస్థాన కాంక్షతో ప్రారంభమైన భక్తి నారదమహర్షి బోధ ఈ శిశువుకు తల్లి గర్భంలో వుండగానే అందింది! అదీ ప్రహ్లాదుని ప్రత్యేకత! ఆ బోధను అందుకుని తనకితాను శ్రీమన్నారాయణ స్వరూపునిగా రూపొందించుకున్నాడా మాతృ గర్భస్థ శిశురూప భాగవతుడు.

అనలే వరగర్వితుడు, విష్ణుద్వేషి అయిన హిరణ్యకశిపుడు లీలావతిని నిర్బంధించిన ఇంద్రుని వూరకే వదులుతాడా? సహజంగానే కాస్తంత పౌరుషం వున్న ఏ భర్తా తన భార్యనలా పరాభవించిన పరపురుషుణ్ణి క్షమించడు. ప్రహించడు. దానవభర్త ఈ తపోబల సంపన్నుడు, అజేయుడు అయిన హిరణ్యకశిపుడు సహిస్తాడా? వెంటనే సురలోకం మీదికి వెళ్ళి ఇంద్రునితోసహా దేవగణాలను తరిమి తరిమి కొట్టాడు దిక్పాలకులందరినీ చావచితకకొట్టి వాళ్ళ లోకాలని ధ్వంసం చేశాడు, ఇంద్రుడు రాజైన కారణంగా, దిక్పాలకులూ, దేవ, యక్ష, గంధర్వ, కిన్నెర, కింపురుష, పన్నగ, సిద్ధ, సాధ్య చారణులంతా ముల్లోకాలూ జయించిన హిరణ్యకశిపునికి మ్రొక్కవలసి వచ్చింది. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు తప్ప, మిగతా దేవతానీకమంతా హిరణ్యకశిపుని నియంతృత్వానికి దాసోహమంది.

క॥ కృశలై! సంప్రాపితదు-ర్దశలై, సర్వాంక షోగ్రదైతేయాజ్ఞా
వశలై, నిశలును, దివములు-దిశలెల్లను గట్టువడియె దీనతననఘా!

ఒక్కమాటలో చెప్పాలంటే సర్వ ప్రకృతి స్తంభించి పోయిందా ఉగ్ర దానవ భర్త అజ్ఞలముందు! ఋతువులు, దిక్పాలకులు ఒకటేమిటి? సర్వం అతని ఆజ్ఞానుసారం వర్తిస్తున్నాయి.

శా॥ "ఏ దిక్పాలురఁ జూచినేఁడలుగునో? యే దేవు బంధించునో?
యే దిగ్భాగము మీద దాడి చనునో? యే ప్రాణులం జంపునో?
యీ దైతేశ్వరుఁ"డంచు నొఁడొరులు దారింద్రాదు లాస్థానభూ
వేదిక్ మెల్లన నిక్కిచూతురు భయావిర్భూత రోమాంచులై!"

అట్లా వుంది దేవతల, మహర్షుల, మహనీయుల సాధువుల భయం! (మరి ఈనాడూ ఒక్కొక్క-నియంత పాలనలో ప్రభుత్వంలోని వారూ, ఉద్యోగులూ, ప్రజలూ-ఆనియంత తెల్లారితే తమ నెత్తిమీద ఏ "ఆర్డినెన్సు" రుద్దుతాడో, ఎవర్ని బదిలీ చేస్తాడో, ఎవరి ఉద్యోగాలు, మంత్రి పదవులు వూడగొడుతాడో అనే భయంతో బాధపడటంలేదూ? ఆ నియంత పాలనలో కరువులు తుఫాన్లు, భూకంపాలు లాంటి వాటితో ప్రకృతి నిరసన తెలుపటంలేదూ)

ఇక కన్నూ మిన్నూ గానని గర్వాంధుడు, విష్ణుద్వేషి సాధుహింసా పరాయణుడు తనకంటే వేరుదైవం లేనీ, తానేదైవాన్ననీ, తనకే మొక్కాలనీ శాసిస్తున్న హిరణ్యకశిపుని గర్వం మిన్నంటింది, నారద మహర్షి మాటలలో చెప్పాలంటే.

శా॥ లీలో ద్యానలతా నినాసములలో లీలావతీ యుక్తుడై,
హాలాపాన వివర్ధమాన మదలోలావృత్త తామ్రాక్షుడై,
కేళిందేలగ నేను, తుంబురుడు సంగీత ప్రసంగంబులన్
వాలాయంబు గరంగ జేయుదుము దేవద్వేషి నుర్వీశ్వరా."

నారద మహర్షి లాంటి లోకగురువుకూ, శ్రీమన్నారాయణ సంకీర్తనా గాన, సుధానిధికి, గంధర్వగాయకుడు తుంబురునికి పట్టిన దుర్గతి అదీ?

ఇక సాధారణ జనుల పాట్లేమిటో వూహకూ్కడా అందవు.

అట్లా హిరణ్యకశిపుడు నియంతృత్వ పరిపాలనను అవధులులేకుండా సాగిస్తుండగా, ఎన్నో సంవత్సరాలు గడిచి పోతున్నాయి వాడిహింసాకాండలో

ఉ॥ "ఎన్నడు మాకు దిక్కుగల? దెన్నడు దైత్యుని బాధమాను? మే
మెన్నడు వృద్ధిబొందగల?" మెవ్వరు రక్షకు? లంచు దేవతా
కిన్నర, సిద్ధ, సాధ్య, ముని, ఖేచరనాయకు లాశ్రయించి రా
పన్నగతల్పు, భూరిభవబంధ విమోచను; బద్మలోచనున్!

అంటూ ఆశలుడిగిన దేవతాగణమంతా అహంకార మమకారాలకు అతీతులై ఇక శ్రీమన్నారాయణుడు తప్ప తమకు దిక్కులేదనీ, ఏకాగ్రచిత్తులూ నిరాహారులూ అయి "దాసోహ" అంటూ శరణాగతి చెందారు!

## ఒక దానవ పితృ హృదయం - ఒక భాగవత పసిహృదయం

శరణాగతి చెందిన దేవతా గణాలకు శ్రీమహావిష్ణువు అదృశ్యరూపుడుగా తన దివ్యవాణి వినిపించాడు.

మ॥ "భయముం జెందకుడయ్య! నిర్జరవరుల్! భద్రంబు మీకయ్యెడున్;
జయమున్, లాభము, భూతిసంతతికి మత్సందర్శన ప్రాప్తి న
వ్యయమై చేరు; నెఱుంగుదున్ దితిసుత వ్యాపార భాషా విప
ర్యయముల్ కాలము గూడ జంపెద; జనుం డంధాక మీ త్రోవలన్.

ఆ॥ శుద్ధసాధులందు, సురలందు, శ్రుతులందు, గోవులందు, విప్రకోటియందు,
ధర్మపదవియందు, దగిలి నాయందు వాఁడెన్నడలుగు నాడె హింసనొందు.

శా॥ వేధోదత్త వరప్రసాద గరిమన్ వీడింతవాడై! మిమున్
బాధంబెట్టుచు నున్నవాడని మదిన్ భావింతు; భావించి నే
సాధింపం దతిగాదు గావున గడున్ సైరించితిన్; మీదటన్
సాధింతున్; సురలార! నేడు చనుడా! శంకింప మీకేటికిన్?"

అంటూ అభయమిచ్చాడా శ్రీహరి.

అయితే ఇక్కడ సకల మానవాళీ గ్రహించవలసిన నగ్నసత్యాన్ని బోధించారు భగవానుడు. దేవుడికి దుష్టశిక్షణక్కూడా ఒక అనువైన సమయం, సందర్భం అంటూ రావాలి. అవతల నియంతగా పరిపాలన చేస్తున్న దుష్టునికి "యోగబలం" అంటూ ఒకటుంటుంది. వాటి పూర్వపుణ్య బలంవల్లనో వాడి ఈ జన్మ తపోబలం వల్లనో వాడి తల్లిదండ్రుల పుణ్యంద్వారా, సంక్రమించిన ఆశీర్వాద బలంవల్లనో వాడికి ఒకానొక దివ్యశక్తి రక్షణగా వుంటుంది. ఆ ఆశీర్వాద బలం, ఆ తపోబలం, ఆ పుణ్యబలం, ఈ దుర్మార్గుని దుర్మార్గాలద్వారా కొంతకాలానికి క్షీణిస్తాయి. యోగబలం క్షీణించాకగానీ, దేవుడైనా వాడిని శిక్షించటానికి వీలౌతుంది? అందాకా ఆ దేవుడే అయినా ఏమీచేయలేడు. ఆలోగా ఏందరో మూగజీవులు, నిస్సహాయులు, అబలలు, సాధువులు ఆ నియంత నియంతృత్వ చర్యలకు బలికావలసిందే! కానైతే ఆ బలిజీవుల మూగవేదన తాలూకు ఒక్కో నిట్టూర్పు ఒక్కో ఆయుధమై; అస్త్రమై, వాడి చివరి క్షణాలకు తలోవేపునుంచి తరుముకు వస్తాయి. ఏ దేశచరిత్ర అయినా, ఏయుగపు చరిత్ర అయినా ఇందుకు బిన్నమేమీ కాదు. ఏ దానవ నియంత అయినా ఏ దేవేంద్రపదవి చేపట్టినవాడైనా, ఏ మానవ నియంత అయినా అసృష్టి నియమాన్ని తప్పించుకోలేరు.

హిరణ్యకశిపునికి నలుగురు కుమారులు పుట్టారు. వారిలో ప్రహ్లాదుడు ప్రసిద్ధుడు. లీలావతి గర్భస్థ శిశువుగావుండి నారదమహర్షి మంత్రోపదేశంతో అష్టాక్షరీ మంత్రరహస్యాన్ని కంఠస్థం, హృదయస్థం, అస్తిగతం చేసుకున్న ముక్తసంగుడైన బాలభక్తాగ్రేసరు డితడే! ఇక ప్రహ్లాద చరిత్ర మొదలైంది,

మొదలు పోతన మహాకవి ఘంటానికి అడ్డూ అదుపూ లేదు. ఆ భక్త్యావేశానికి హద్దూ, పద్దూ లేదు. పద్యం పద్యం, గద్యం గద్యం శ్రీమన్నారాయణ మంత్ర మయమై పోయాయి.

ఇక పుట్టిపెరుగుతున్న ప్రహ్లాదుడు తన సత్ప్రవర్తన, సచ్ఛీలము, సద్భక్తితో ఇటు పండిత పామరులను, అటు స్త్రీ, బాల, వయోవృద్ధులను ఆశ్చర్యపోయేట్లు చేస్తున్నాడు. హిరణ్యకశిపునికి పగవారైన ఇంద్రాది దేవ గణాలు కూడా ప్రహ్లాదుని సచ్చరిత్రను మనసారా స్తుతించేవిధంగా వుందా బాలుని ప్రవర్తన. ఐదు సంవత్సరాల బాలుడు ("పంచాద్బంబుల వాడు అని పద్యం వుంది) చెవప్పబడుతున్న ప్రహ్లాదుని వయోనిర్ణయం ఆ కాలమానం ప్రకారం చేయవలసిందే తప్ప, మన కాలప్రమాణం ప్రకారం చేస్తే కుదరదు.

సీ॥ ఆకార జన్మవిద్యార్థ వరిష్ఠుడై, గర్వసంస్తంభనంగతుఁడు;
వివిధ మహానేక విషయసంపన్నుడై పంచేంద్రియములచే బట్టుపడడు
భవ్యవయోబల ప్రాభవోపేతుడై, కామరోషాదుల గ్రందుకొనడు;
కామినీ ప్రముఖ భోగములెన్ని గలిగిన వ్యసనసంసక్తి నావంకబోడు;

ఆ॥ విశ్వమందు గన్న విన్న యర్థములందు
వస్తు దృష్టి జేసి వాంఛయిడడు,
ధరణినాథ! దైత్యతనయుండు హరిపర
తంత్రుడై, హతాన్య తంత్రుడగుచు.

(అని నారదుడు ధర్మరాజుకు ప్రహ్లాదుని గుణగణాలు వర్ణిస్తూ చెప్పిన పై పద్యంలోని అర్థం ప్రకారం అయితే ప్రహ్లాదుని వయసు యవ్వనంలోని యువకుల వయసుగా రూఢి అవుతుంది. అయితే తండ్రివలన హింసలు అన్నీ పడటం పూర్తయేసరికే తనకి యవ్వన వయసు వచ్చివుండవచ్చు.

ఇక బాలుడైన ప్రహ్లాదుడు సర్వప్రపంచం శ్రీహరి మయంగా భావించాడు, విశ్వసించాడు. సర్వ ప్రపంచంలో, సర్వ చరాచరాలలో శ్రీహరినే దర్శించాడు. అంటే ఆ బాలుడు,

శా॥ పానీయంబులు ద్రావుచున్, గుడుచుచున్, భాషించుచున్, హాసలీ
లా నిద్రాదులు సేయుచున్, దిరుగుచున్, లక్షించుచున్ సంతత,
శ్రీనారాయణ పాదపద్మ యుగళీ చింతామృతాస్వాద సం
ధానుండై మఱచెన్ సురారిసుతుడే తద్విశ్వమున్ భూవరా!

నిరంతరం హరిధ్యానంలోనే నిమగ్నుడై పోయాడు. ఏ పనిచేస్తున్నా తనలోతాను నవ్వుకుంటాడు శ్రీహరి కనిపించినట్లయి! తనలోతాను దుఃఖిస్తాడు శ్రీహరి తనకు సరిగా దర్శనమీయలేదనీ! తనలోతానే ఆనందాశ్రువులు కారిపోతుండగా హరినామ సంకీర్తనచేస్తూ పెద్దగా పాటలు పాడుతాడు. సమాధిస్థితిలో వున్న యోగిపుంగవునిలా, ఒక్కోమారు మౌనంగా, జడునిలా ఉన్మత్తునిలా వుండిపోతాడు గంటలతరబడి.

కుమారుని ఈవాలకం గమనించిన కన్నతండ్రి హిరణ్యకశిపుని గుండె చెరువై పోయింది. మరెవరి బిడ్డో అయితే వారికి తను సానుభూతి, జాలి, సాంత్వన ఈయవచ్చు కానీ తనలాటి వీరునికి తనలాటి దానవ సామ్రాట్టుకు తనలాంటి త్రిలోక విజేతకు ఇలాంటి జడుడు, ఉన్మత్తుడు అయిన కొడుకు పుట్టడం అవమానంగావుంది, బాధగావుంది. పితృహృదయం కోతగావుంది. తన శౌర్యం, బలపరాక్రమాలు, తన రాచరికం, రాజసం ఏదీ అర్థంగాని ఈ కుమారునికి కనీసం విద్యయందు కూడా ఆసక్తి లేకపోతే ఎలా అని బాధపడి

క॥ "చదువనివాడజ్ఞుండగు జదివిన సదసద్వివేకచతురతగలుగున్;
జదువగవలయును జనులకు జదివించెద నార్యులొద్ద జదువుము తండ్రీ!"

అని పిల్లవాడికి నచ్చచెప్పి శుక్రాచార్యుని కుమారులైన "చండామర్కులు" ప్రచండ వితర్కులు అనే ఇద్దరు గురువులను రప్పించి, పిల్లవాడిని

అప్పగించాడు రాక్షసరాజు. ప్రహ్లాదుడు కూడా వాళ్ళు చెప్పినట్లే చదివాడు చదువులు. ఒక నాడు హిరణ్యకశిపుడు కుమారుని విద్యాప్రావీణ్యత పరీక్షిద్దామని గురువులను, ప్రహ్లాదుని పిలిపించాడు "రాచరికానికి కావలసిన ఉత్సాహం, ప్రభుత్వం మంత్రాలోచనలాంటి శాస్త్రాలతోబాటు, వేదశాస్త్రాలు చదివావా? అంటూ మురిపెంగా ప్రశ్నించాడు. అందుకు ప్రహ్లాదుడు ఎల్ల శరీర ధారులు నావాళ్లు, నావారు' అనే భ్రాంతికిలోనూ గాకుండా, ఆ శ్రీమన్నారాయణుని చరణారవిందములు ఆశ్రయించి నిశ్చింతగా వుండటం మేలని' జవాబిచ్చాడు.

హిరణ్యకశిపుడు నవ్వాడు కుర్రావాడికి ఈ బుద్ధి ఎలా వచ్చింది? ఎవరు నేర్పారు? వైరులు బోధించారా! గురువులే పొరబాటుగా ఉపదేశించారా? వాడికే పుట్టిందా? ఇలా పరి పరి విధాలుగా ప్రశ్నించి ఇక తన రాక్షస ధర్మాలు మహాద్భుతంగా వర్ణించాడా దైత్యశిఖామణి!

మ॥ సురలందోలుటయో, సురాధిపతులం సుప్రక్కించుటో? సిద్ధులం
బరివేధించుటయో, మునిప్రవరులన్ బాధించుటో, యక్షకి
న్నర గంధర్వ విహంగ నాగపతులన్ నాశంబు నొందించుటో!
హరియంచున్ గిరియుంచునేల చెడ? మోహాంధుండవై పుత్త్రికా!

అన్నాడు. మరి-తనాచరిస్తున్న పై పనులే శ్రేష్ఠమైనవని నమ్మిన ఆ రాక్షసరాజు ఆ ధర్మాలుగాక మరేం బోధిస్తాడు బిడ్డకు?

ఈనాటి ఆధునిక కథానికలలో నవలల్లో కొందరు హీరోలకు ఏ మూడ్ రావాలన్నా, లేక కథ చెప్పాలన్నా, కథ వ్రాయాలన్నా, హీరోయిన్‌ని ఆదుకోవాలన్నా ఇలా ఏపని చేయాలన్నా స్నేహితులతో కలిసి, విస్కీ, సోడా కలిపి తీసుకుంటూ గొప్ప కార్యక్రమం చేస్తున్నట్లు అది వర్ణిస్తూ, కబుర్లు చెప్పే పాత్రలను సృష్టిస్తున్నారు చాలామంది రచయితలు. టీన్‌ఏజ్ పాఠకులలో అదోగొప్ప "థ్రిల్" అనే భావాన్ని కలిగించి పెడదారి పట్టించటం కాదా ఇది?

సరిగ్గా ఇలాగే రాక్షసరాజు సాధుహింస, దేవతాహింసల్లాటివి గొప్ప కార్యక్రమాలుగా వర్ణించాడు కన్నకొడిక్కి! వాడికి ఈ ఆధునిక, డిగ్రీ హోల్డర్సు అయిన హీరోలకీ, వారిని సృష్టిస్తున్న వారికీ తేడా వుందేమో ఆలోచించండి,

అయితే ప్రహ్లాదుడు ఈమారు తండ్రివేపు చూడక తన గురువులవేపు తిరిగి వారికి జవాబిస్తున్నట్లుగా

తే॥ ఇనుమయస్కాంత సన్నిధినెట్లు భ్రాంత మగు
హృషీకేశు సన్నిధి నావిధమున
గరగుచున్నది దైవయోగమునజేసి
బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంతమగుచు!

అని తన ప్రయత్నం లేకుండానే తన హృదయం శ్రీమన్నారాయణుని శ్రీచరణాలకు అంకితమైపోయిందని సవినయంగా తెలిపాడు. అంతేకాదు యావదాంధ్రుల హృదయాలలో చిరస్థాయిగా మళ్ళీ మళ్ళీ వినిపించే పద్యం.

సీ॥ మందార మకరంద మాధుర్యమునదేలు
మధుపంబువోవునే మదనములకు?
నిర్మల మందాకినీ వీచికలదూగు
రాయంచజనునె? తరంగిణులకు?
లలిత రసాలపల్లవ ఖాదియైచొక్కు
కోయిల చేరునే? కుటజములకు?
పూర్ణేందు చంద్రికా స్ఫురిత
చకోరకంబరుగునే సాంద్రనీహారములకు?

తే॥ నంబుజోదర దివ్యపాదారవింద-చింతనామృత పానవిశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జెరనేర్చు?-వినుత గుణశీల! మాటలు వేయునేల!

అంటూ స్పష్టంగా చెప్పాడా బాలభక్తుడు తన హృదయగత భక్తితాత్ప ర్యాలను. పాపం? దానవభర్త మాటెలావున్నా గురువులకు అది అగ్నిపరీక్ష అయ్యింది. 'ఐదేళ్ళ వయసుందో లేదో, ఇట్లా అతి వేదాంతం మాట్లాడి మేము చెప్పిన చదువులు అప్పగించక మీ తండ్రిగారిముందు మాకు అవమానం కలిగిస్తావా?'' అంటూ ఆ బాలుణ్ణి చీవాట్లు వేసి, ఈసారి భయపెట్టి క్రమశిక్షణ తో చదివిస్తామని ఆ రాజుగారికి మాటయిచ్చి మరీ ప్రహ్లాదుని పిల్చికెళ్ళారు వాళ్ళు. మరలా కొంతకాలానికి, రాజుగారి దగ్గరికి తీసుకొస్తూ, ఈమారైనా మా పరువు కాపాడమనీ, రాక్షసకులానికి వైరిఅయిన వైకుంఠుని స్తోత్రం చేయవద్దనీ ప్రాధేయపడ్డారా గురువులు. ప్రహ్లాదుడూ సరే నన్నాడు. హిరణ్య కశిపునితో "యిక ఈమారు నీకుమారుని విద్యాబలాన్ని పరీక్షించు'' అన్నారా గురువులు అమాయకంగా!

తండ్రి పొంగిపోయాడు. కుమారుని ప్రశ్నించాడు. ''నీ విద్యా విశే షాలు ఏపాటివో ఉదాహరణకు చూపించునాయనా;" అని

మరలా బాలభాగవతుడు పాతదారే పట్టాడు!

సీ॥ కంజాక్షునకుగాని కాయంబుకాయమే?
పవన గుంఫిత చర్మభస్త్రి గాక!
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే?
ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక;
హరిపూజనము లేని హస్తంబు హస్తమే?
తరుశాఖ నిర్మిత దర్విగాక?
కమలేశుజూడని కన్నులు కన్నులే?
తనుకుడ్యజాల రంధ్రములుగాక!

ఆ॥ చక్రిచింతలేని జన్మంబు జన్మమే? తరళ సలిల బుద్బుదంబుగాక!
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుడే? పాదయుగముతోడి పశువుగాక;

అన్నాడు నిర్ద్వంద్వంగా!

దానవభర్తకు మతిపోయిందా కుమారుని వాలకానికి! తన విరోధి అయిన వైకుంఠుని తనముందే యింత నిర్భయంగా స్తోత్రం చేస్తున్నది మరెవరోకాదు! సాక్షాత్తు తన కుమారుడు! మరెవరైనా అయితే ఈసరికి నరికి పోగులు పెట్టేవాడు! కానీ వీడు తన కన్న కుమారుడు ఆకారంలోగానీ గుణాలలో గానీ, తేజస్సులోగానీ ఏ మచ్చా, ఏ కల్మశమూ లేనివాడు. ఈ వైపరీత్యం ఏమిటి?

అదే ఆ సమయగలో ఆనియంతకు అర్థంగాని రహస్యం! తన నియంతృత్వానికి లక్షలాది సాధువులు, నిస్సహాయులు, దేవగణాలు బలిఅవుతుంటే తన కడుపున, తన యింట తన బిడ్డగా పుట్టిన ఈ బాలుడే తనపాలిటి మృత్యువు అయితీరాలని!

ఆ కోపం ఆ గురువుల మీదకు మరలింది. "నాబిడ్డనిలా మార్చి, నన్ను బాధించి, మీరు నాకు శత్రురూపంలో, పురోహితరూపంలో వున్న బ్రాహ్మణులు" అంటూ మండిపడ్డాడు. చండమార్కులు నెత్తినోరు బాదుకొని "నీబిడ్డకది సహజ గుణం! మేమెందు కాతనిని పెడత్రోవ పట్టిస్తామని" వాపోయారు.

ఇక హిరణ్యకశిపుడు పితృహృదయాన్ని, పితృహృదయ వాత్సల్యాన్ని పక్కకు నెట్టివేశాడు తాను చెప్పిందే వేదమన్న తన రాజ్యంలో తన మాట జవదాటితే మరణం తప్ప మరో శిక్షలేని తన శాసనంలో తన బిడ్డను తాను ఉపేక్షిస్తే అది తన సార్వభౌమత్వానికే మచ్చ. తన రాక్షస సిద్ధాంతాలకే మచ్చ.

ఆనాటి ఆ సార్వభౌముడు. తన బిడ్డను శిక్షలకు గురిచేయటానికి సిద్ధపడ్డాడు ఈనాటి చాలామంది పదవిలో వున్నవారు తమ బిడ్డలుచేసే ఘోర నేరాలను కప్పి పుచ్చుకోవటానికీ వారికి శిక్షపడకుండా తప్పించటానికి చట్టాలని వాడు కుంటున్నారు, ఎవరు దానవులు? ఆనాటి రాక్షసరాజా? ఈనాటి మన ప్రభువులా? ఆలోచిద్దామా.

## పసి భాగవతుని భక్తి - భగవంతుని శక్తి!

ప్రహ్లాదునిమీద పితృవాత్సల్యం వదులుకున్న హిరణ్యకశిపుడు తన దానవ ప్రముఖులనూ, మంత్రులనూ, సమావేశపరచి తన కడుపున "పుత్రాకారతన్ వ్యాధి జన్మించె" అంటూ, వైద్యుడు వ్యాధి గ్రస్తమైన శరీరవయావాన్ని ఖండించి మిగతా శరీరాంగాలనూ, శరీరాన్నీ రక్షించిన తీరులో తానూ తన కన్న కొడుకుని చంపి ఆ 'విష్ణుభక్తి' అనే వ్యాధికి సరైన చికిత్స చేసి తననీ, తన దానవ కులాన్నీ 'నిర్దోషంబు' గా చేస్తాననీ శపథం చేస్తాడు నిర్ద్వంద్వంగా, నిర్మోహమాటంగా. నిర్వికారంగా మమకారాల కతీతంగా బంధు ప్రీతికి ఆస్కారం లేనివిధంగా.

ఇక్కడ మనందరం ఒక్కక్షణం ఆనాటి "హిరణ్యకశిపుడనే" రాక్షస రాజు గురించి ఆలోచించవలసివుంది. ఒక దానవ సామ్రాజ్యానికి తన తపస్సుతో, పరాక్రమంతో మచ్చలేని సచ్ఛీలంతో సార్వభౌముడైన ఆ రాజు తన సిద్ధాంతానికి (విష్ణు ద్వేషానకి) దానవులందరినీ కట్టుబడివుండేలా చేసిన ఆ రాజు తన బిడ్డయినా ఆసిద్ధాంతాన్ని తృణీకరించిన సందర్భంలో తనమీద తన ప్రజలు పెట్టుకున్న ఆశలు, విశ్వాసం వమ్ముచేయకుండా కన్న మమకారానికీ అతీతంగా కన్నబిడ్డను అమానుష హింసలకు, మరణానికీ గురిచేశాడు. వాడు 'రాక్షసుడు' అంటున్నాం ఈనాడూ.

మరి ఈనాడు ఎందరో పదవిలోవున్న వివిధ రాజకీయ నాయకులు తమ పుత్రరత్నాల స్మగ్లింగ్, రేప్, మర్డర్ మరెన్నో మానవత్వంలేని ఘోర నేరాల తాలూకు కేసులు బయటకు రాకుండా, అటు ప్రభుత్వ యంత్రాంగాన్ని యిటు ప్రజల్ని మభ్యపెట్టి 'తమవారిని' కాపాడుకొని దాచుకుంటూన్నారు కాదా? మరి వీరి నేమనాలి? వీరందరికీ నిష్పక్షపాతం అంటే ఏమిటో, నిర్మోహత్వం అంటే ఏమిటో ఆశ్రిత పక్షపాతానికి అతీతమైనదేమిటో అదే రాజలక్షణం అని చాటిచెప్పిన ఆరాక్షసుడు వీరికంటే ఉన్నతుడు.

శీలవంతుడు, ప్రజాస్వామ్య పరిరక్షకుడు కాడా? కానైతే వాడి నిష్కారణ ద్వేషం సాధుహింస వాడి పతనానికీ, మరణానికి హేతువులైనాయి. మరినాటి ప్రజాస్వామ్య పలుకుల నకిలీ రాక్షసులకు ప్రజల్ని పరిపాలించే హక్కువున్నదా? ఆలోచిస్తే జవాబు దొరుకుతుందా మనకి?

ఇక ప్రహ్లాదునికి కఠిన శిక్షలు ప్రారంభమైనాయి. ఆ బాలభక్తుడు తన శరీరమూ, మనసూ, ఆత్మ, ఆ శ్రీమన్నారాయణునికి అంకితం చేశాడు.

ఉ॥ తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుడు మాటి మాటి "కో
పన్నగశాయి! యోదనుజభంజన!" యోజగదీశ! యోమహా
పన్నశరణ్య! యోనిఖిలపావన!" యంచు నుతించుగాని, తా
గన్నుల నీరుదేడు; భయకంప సమేతుడుగాడు భూవరా!

అనే మానకస్థితిలో వున్నాడు. అదీ విష్ణు భక్తుల ఆత్మార్పణభావం. అదీ విష్ణు భక్తుల శరణాగతి.

ఆస్థితిలో ఆ బాలుని చూచిన హిరణ్యకశిపుడు కూడా విస్మయం చెందాడు. శిక్షలలో మరింత క్రూరమైన మార్పులు చేయించాడు. మండుటెండలో గంటల తరబడి నిల్చోపెట్టడం, అతి శీతలమైన మంచులో నిలవేయించటం చుట్టూరా మంటలు పెట్టటం, సముద్రపు అలలలోనికి విసరి వేయించటం తుఫానులాటి పెనుగాలులకు అభిముఖంగా నిలవటం, విషంపెట్టించటం, ఏనుగులచేత తొక్కించటం, కొండచరియలమీదనుండి క్రిందికి దొర్లించటం లాటి క్రూర శిక్షలు అమలు చేయించాడు. అయినా ఆ బాలునిలో మార్పులేదు. ఆ బాలుని తపస్సు చెదరలేదు. హరినామస్మరణ మానలేదు.

విసిగి వేసారిన ఆ తండ్రి విస్మయము భయము కూడా చెందాడు.

ఉ॥ "ముంచితి వార్ధులం; గదలమొత్తితి; శైలతటంబులందు ద్రో
బ్బించితి; శస్త్రరాజి బొడిపించితి; మీదనిభేంద్రపంక్తి త్రొ
క్కించితి; ధిక్కరించితి; శపించితి; ఘోర దవాగ్నులందు ద్రో
యించితి; బెక్కుపాట్లనలయించితి; జావడిదేమి చిత్రమో.

క॥ అగ్రహమున నేజేసిన-నిగ్రహములు
వరులతోడనెటి నొకడున్
విగ్రహములనుచు బలుకడ
నుగ్రహములుగా దలంచునొవ్వడు మదిలోన్.

కాబట్టి వీడు మహా తపఃప్రభావ సంపన్నుడు వీడికి మరణమన్నది లేదు భయమన్నది లేదు. వీడే నాకు మృత్యువురూప పుత్రుడు. అని నిర్ణయించుకొని ఖిన్నుడై పోయాడు. తన రాచరికపు రీవి, తన త్రిలోక విజయం తాలూకు అహం, తన దానవ సామ్రాజ్యాదిపత్యం తాలూకు అహం, తన దానవ సామ్రాజ్యాదిపత్యం తాలూకు దర్పం, సర్వం అనుమానాస్పదంగా తోచాయి. అప్పుడు మరల చండామార్కులు ఆ రాక్షస రాజును పూరడించి, మరలా ప్రహ్లాదుని తమ వద్దకు పిల్చికెళ్ళారు, ఈమారు రాజులకు ముఖ్యంగా గృహస్థులకు అవసరమయ్యే ధర్మార్థ కామ సంబంధమైన శాస్త్రాలు బోధించమని రాజాజ్ఞ ప్రకారం. అవే బోధించటం ప్రారంభించారు. (దీనిని బట్టి ప్రహ్లాదుని వయసు ఈసరికి యవ్వనదశ అని నిర్ధారించవచ్చు).

కానీ ప్రహ్లాదుని కాధర్మాలు, చదువులు అవసరం లేదనిపించింది. తన స్నేహితులైన రాక్షస బాలురందరినీ చేరదీసి స్నేహిత ధర్మం సహజ రాజరికపు వారసత్వపు రీవీ జన్మతః వచ్చిన సంస్కార ప్రభావంతో వారి హృదయాలను ఆకర్షించి తనకు నారదమహర్షి తాను గర్భస్థశిశువుగా వున్న సమయంలో ఉపదేశించిన మహత్వ తత్వాన్ని అచంచల వైరాగ్యాన్ని శ్రీమన్నారాయణ తత్వాన్ని అద్భుతంగా వివరించటం సాగించాడు.

క॥ చిక్కడు వ్రతముల; గ్రతువుల
జక్కడు దానముల శౌచ శీలతపములన్
జిక్కడు; యుక్తిని భక్తిని-జిక్కిన
క్రియ నచ్యుతుండు; సిద్ధముసుండీ!.

అంటూ తన మాటలు విశ్వసించే వారు తనను అనుసరించమనీ విశ్వసించనివారు కర్మపుంజముపాలై పొమ్మనీ చెప్పాడా భక్త శిఖామణి.

ఈ వరుస చూచిన చండామార్కులు హడలిపోయి ఇక ఈ బాలుని బాధ్యత తాము వహించటం ప్రమాదకరమనీ భావించి హిరణ్యకశిపునికి ఆ బాలుని అప్పగించి ఒక్క నమస్కారం పెట్టారు.

ఇక హిరణ్యకశిపుని కోపానికి అంతులేదు. ఇక తానే స్వయంగా ఆ బాలుని సంహరించి తన వ్యక్తిత్వానికి రాచరికానికి అంటిన మచ్చ తొలగించుకోదలచాడు.

ఎవడురా నీకు బలం? ఇట్లా నన్నెదిరించటానికి? అన్నాడా తండ్రి!

క॥ బలయుతులకు దుర్బలులకు
బలమెవ్వడు? నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వడు? ప్రాణులకును!
బలమెవ్వండట్టి విభుడు బలమసురేంద్ర.

అనేశాడు నిర్ద్వంద్వంగా.

మరి ఆ హరి ఏక్కడ, ఏ ప్రదేశంలో వున్నాడురా? అన్నాడు తండ్రి మితిమించిన రోషంతో!

క॥ ఇందుగలడందులేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం;
డెందెందు వెదకిచూచిన నందందేకలడు దానవాగ్రణి! వింటే!

అని శ్రీహరి సర్వత్రావున్నాడని చెబుతూనే తండ్రి బ్రహ్మవరం గుర్తు చేస్తున్నట్టుగా.

మ॥ "కలడంభోధి! గలండు గాలిగల డాకాశంబునం, గుంభినిన్
గల డగ్నిన్, దిశలం, బగళ్ళ, నిశలన్, ఖద్యోత చంద్రాత్మలన్
గల డోంకారమునం దిత్రిమూర్తుల ద్రిలింగ వ్యక్తులందంతటన్,
గల డీశుండు గలండు తండ్రి వెదకంగానేల నీ యా యెడన్?

సర్వవ్యాపకుడైన శ్రీమన్నారాయణుడున్నాడని నిస్పందేహంగా ఎలుగెత్తి చాటి చెప్పాడా విష్ణు భక్తుడు.

ఇక ఈ ఘట్టం ఇలా సాగుతుండగా అటు శ్రీమన్నారాయణుడు కూడా ఇక ఆలశ్యం చేయదలచలేదు. హిరణ్యకశిపుని తపోబలం వాడి హింసాకాండలతో క్షీణించింది. వాడి వైష్ణవ ద్వేషం పరిపాకానపడింది. ప్రహ్లాదునిలాటి అచంచలభక్తి, ప్రహ్లాదునిలాటి అచంచల భక్తి ప్రపూరుడిని వాగాతీత హింసలకు గురిచేయటంలోనే వాడి సర్వ పుణ్యఫలాలు నశించి, సర్వ నరకయాతన ఆరంభమైంది. ఇక చివరగా "ఏడీ నీదైవం? ఎక్కడుంటాడు" అని ఆభక్తుని చంపటానికి ఉద్యుక్తుడౌతున్న సమయంలో ఆ భక్తుడు ఆక్లిష్ట పరిస్థితిలో కూడా మొక్కవోని ధైర్యంతో సడలని ఆత్మవిశ్వాసంతో, చెక్కుచెదరని దైవ భక్తితో "సర్వత్రా నిండివున్నాడు నా దైవం" అని చాటిచెబుతున్న టైంలో ఇక దైవం ఆ భక్తుని మాట నిలపకపోతే భక్తుని విస్వాసానికి ఋజువు చూపకపోతే భక్తుని హింసిస్తున్న వాడిని నిర్జించకపోతే ఆ దైవం దైవమూకాదు. అసలు దేవుడేకాడు. యుగాల భక్తికీ, భగవంతునికీ, భాగవతునికీ విలువా, ఉనికీ, కీర్తి కూడాలేవు, వుండబోవు, అంచేత బ్రహ్మవరాలు, హిరణ్యకశిపుని దురాశ, దుర్బుద్ధికీ అనుగుణంగా.

మ॥ హరి సర్వాకృతులం గలండనుచు ప్రహ్లాదుండు భాషింప, స<br>త్వరుడై, యెందునులేడు లేడని సుతున్ దైత్యుండు తర్జింప శ్రీ<br>నరసింహాకృతి నుండె నచ్యుతుడు నానాజంగమస్థావరో<br>త్కర గర్భంబుల, నన్నిదేశముల, నుద్దండ ప్రభావంబునన్.

అదీ దైవలీల! అదీ దైవ మహత్మ్యం, అదీ భాగవతుని భగవంతుడు రక్షించి తీరుతాడన్న ధృఢ విస్వాసానికి పునాది.

ఆ రాక్షసుడు ఏ ప్రదేశంలో దైవం వునికి చూపమని భక్తుణ్ణి నిలదీస్తాడో నని శ్రీ నరసింహాకృతి దాల్చి సర్వ స్థావర జంగమాలన్నిటిలోనిండి దైత్యుని నిర్జించటానికి సిద్ధంగా వున్నాడు, భగవంతుడు అనుకున్నంత అయింది

మూర్ఖుడైన దానవరాజు అడగనే అడిగాడు. "సర్వ ప్రదేశాలలో హరి వుంటా డని వాగుతున్న ఓ మూర్ఖుడా! ఈ స్తంభంలో చూపుతావా నీ హరిని? చూపక పోతే, నీ తల త్రుంచి వేస్తాను ఆ సమయంలో నీ హరి అడ్డు వస్తాడేమో చూస్తాను" అన్నాడు.

అందుకూ ప్రహ్లాదుడు అచంచల భక్తి విశ్వాసాలతో చెప్పాడు.

శా॥ "అంభోజాసనుడాదిగాగ తృణ పర్యంతంబు విశ్వాత్ముడై
సంభావంబుననుండు ప్రోడ విపులస్తంభంబు నందుండడే?
స్తంభాంతర్గతుడయ్యు నుండుటకు నే సందేహమున్లేదు; ని
ర్దంభత్వంబున నేడుగానబడు ప్రత్యక్ష స్వరూపంబునన్".

అన్నాడు అష్టమస్కంధంలోని గజేంద్రమోక్షం కథలో గజేంద్రుడు "కలడు కలండనెడి వాడు కలడో లేడో?" అని శంకిస్తాడు క్షణకాలం కానీ ప్రహ్లాదు డలాగాదు మృత్యువు తండ్రిరూపంలో చివరి క్షణాలలో ప్రశ్నించినా దైవం సర్వవ్యాపకుడై వున్నాడనే చెప్పాడు నిర్ద్వంద్వంగా.

పట్టరానికోపావేశాలతో సభాభవనంలోని స్తంభాన్ని తన అరచేతితో చరిచాడు హిరణ్యకశిపుడు నేటి కరాటే శిక్షణను పోలిన ఆ అరచేతి ప్రేటుకా స్తంభం నిలువునా రెండుగా చీలింది. అందులోనుంచి ప్రళయ భీకర రూపం తో అవిర్భవించాడు శ్రీ నరసింహస్వామి విస్ఫులింగాలు వెదజల్లుతున్న నేత్రాలు, విదిలిస్తున్న జూలు, అగ్ని జ్వాలలు వెదజల్లుతున్నట్లున్న నాలుక సింహపు ముఖం, నర శరీరం, శంఖ చక్ర గదా పాశధరములై వాడియైన గోళ్ళతో ఎంతటి కఠిన శిలనైనా చీల్చివేయగల వ్రేళ్ళు గలిగిన నాలుగు చేతులతో విచిత్రాకారముతో నరసింహమూర్తి అవిర్భావం సకల భువనాలకు అటు భయకంపితాలనూ ఇటు ఆనందోత్సాహాలనూ కలిగించింది. ఆ ప్రళయ భీకరమూర్తిని చూడగానే హిరణ్యకశిపుడు నిశ్చేష్టుడయ్యాడు.

ఉ॥ తెంపున బాలుడాడిన సుధీరత, సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపదలంచి యిందు నరసింహ శరీరముదాల్చి చక్రి, శి
క్షింపగ వచ్చినాడు; హరిచే మృతియంచుదలంతు నైననా
సొంపును; బెంపునందఱును జూడ జరింతు; హరింతుశత్రువున్,"

అని నిశ్చయించుకున్నాడు ఆ నరసింహమూర్తిని చూడగానే తనకు మృత్యువని గ్రహించాడు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని భక్తివిశ్వాసాలు బోధపడ్డాయి ఆరాక్షస హృదయానికి. దైవం వునికి భక్తుని ఆయన రక్షించే విధానం సర్వం తేటతెల్లమై పోయాయి. కానీ బొత్తిగా తనంత తానుగా లొంగిపోయినట్లు కాకుండా తన వారైన రాక్షసులముందు కేవలం (ఆత్మ విశ్వాసం కోల్పోయిన దశలో) యుద్ధ విద్యా కౌశలం ప్రదర్శించబోయాడా జీవన్మృతుడు.

నరసింహస్వామి ఎక్కువసేపు జాగుసేయక ఆ రాక్షసుణ్ణి, గరుత్మంతుడు పామును ఒడిసిపట్టుకున్నట్లు పట్టుకొని వాడి వరాలకు అనుగుణంగా సభాద్వారంలోని గడపమీద ఆయుధాలు అనదగని వాడి గోళ్ళతో సంధ్యా సమయంలో నింగీ, నేలాగాని తన ఒడిలో రాక్షసులందరూ గుండె లవిసి పరుగెత్తేలా లోకభీకరంగా చీల్చి వాడి ప్రేవులు కంఠమాలికలుగా ధరించి మరీ చంపాడు. అట్లా భక్తుడైన ప్రహ్లాదుని కాపాడి శత్రువైన హిరణ్యకశిపుని సంహరించి ఆ భీకరరూపంతో సభాసింహాసనా రూఢుడై కూర్చునివున్న నృసింహమూర్తిని బ్రహ్మ మొదలు దేవగణాలంతా స్తోత్రం చేశారు విడివిడిగా. శ్రీమహాలక్ష్మి కూడా ఆయన దగ్గరికి పోవటానికి సాహసించలేక పోయింది. బ్రహ్మాది దేవతల కోరికపై ప్రహ్లాదుడా స్వామిని స్తుతించి ప్రసన్నుణ్ణిచేశాడు.

ప్రహ్లాదుని భక్తికిమెచ్చి నృసింహస్వామి తన కరుణాభయ హస్తాన్ని ఆ బాలుని శిరసుమీద వాత్సల్యంతో వుంచి వరం వేడుకో మన్నాడు. తన కంటూ ఏ వరాలు అవసరం లేదనీ తన తండ్రిని క్షమించి మోక్షం ప్రసాదించమనీ వేడుకున్నాడా నిర్వికార భక్తుడు. నృసింహస్వామి నవ్వి తనచేతి

స్పర్శతోనే ఆ దానవునికి మోక్షం లభించిందనీ అతని ఇరవై ఒక్క-తరాలు పునీతమై పోయాయనీ చెప్పి ప్రహ్లాదుని దానవ రాజ్యాధినేతగా అభిషిక్తుని చేసి పాములకు పాలుపోసినట్లు ఇలాంటి దానవులకు అడిగిన వరాలన్నీ ఆలోచనారహితంగా ఇవ్వవద్దని కుమారుడైన బ్రహ్మకు హితవుచెప్పి అంతర్ధానమైనాడు.

భాగవతా గ్రంధానికి మణిపూస అయిన ప్రహ్లాద చరిత్ర భాగవతులకే అగ్రగామి మార్గదర్శకుడు అయిన ప్రహాదుడు నృసింహావతారం వర్ణన నృసింహవతార అవిర్భావ వర్ణన (స్తోత్రం- దండకంలా గద్యం) పోతన మహాకవి ఘంటంలో అమృతాక్షరాల రూపం సంతరించుకొని ఆ చరిత్రలోని విష్ణు వర్ణనకు సంబంధించిన ప్రతి పద్యం ఆచంద్రార్కం ఆంధ్రులకు కంఠస్థం హృదయ గతం అయి చిరంజీవత్వం సాధించుకున్నాయి ఏ పద్యమూ వదలి వేయవలసినదికాదు మరి ఒక అచంచల భక్తుని అనవసరంగా సాధించిన వాడికి ఏలాటి భయంకర మరణం ఉమరణా.కి స్వయంగా భగవంతుని ఆవిర్భావం ఋజువుచేస్తుందీ ప్రహాద చరిత్ర. శ్రీవైష్ణవులెందరో విష్ణుసహస్ర నామ స్తోత్ర పారాయణంలానే ప్రహాద చరిత్ర అక్షరం అక్షరం పారాయణం చేస్తున్నవారు ఈనాడూ వున్నారు. సగటున ప్రతి విష్ణుభక్తుల ఇంటా నాటికీ నేటికీ, ఏనాటికీ నృసింహవతారం ఒక ప్రత్యేకమైన భక్తి ప్రపత్తులతో పూజింప బడుతోంది నృసింహస్వామి కొండలకూ పేర్లకూ యావద్భారతంలో కొదువలేదు. నృసింహమూర్తిని చిత్తశుద్ధితో ధ్యానించే వారికి ఏలోటులేదు. రాదు. ఇది తెలుసు కోవటానికైనా పోతన భాగవతాన్ని ఒక్కమారు చదవ గలిగితే ప్రహ్లాద చరిత్రలోని రీతి, నీతి బోధపడతాయి ఎవరికయినాసరే.

## "నాటి ఇంద్రుడు! - నేటి ఇంద్రులు"

పురాణాలలో ప్రఖ్యాతులైన మహర్షులు దేవతలు మహాత్ములలానే "ఇంద్రుడు" ప్రత్యేకమైన వ్యక్తిత్వము, పదవి, లోకము, పనులు కలవాడు ఇంద్రుడు, దేవేంద్రుడు, మహేంద్రుడు ఇలాటి గౌరవ నామధేయాలతో

అప్సర గణాలకూ, దేవగణాలకూ అధిపతి ఇంద్రుడు. దిక్పాలకులకులైన యమ, కుబేర, వాయు, అగ్ని, వరుణాది అష్టదిక్పాలకులలో ఇంద్రుడు అగ్రేసరుడు అష్టదిగ్గజాలలో తలమానికం అనదగిన "ఐరావతం" అనేఏనుగు ఆయన వాహనం "వజ్రాయుధం" అనే ఒక ప్రత్యేక ఆయుధం ఆయనది "వజ్రాయుధుడు" అనే పేరుకూడా వుంది ఇంద్రునికి ఇంద్రలోకం ఇంద్ర పదవి అన్నవి చాలా గొప్పవి. స్వర్గలోకమనే ప్రత్యేకలోకం ఆయనది. అక్కడలేని భోగాలుగానీ, సౌఖ్యాలుగానీ, అందాలగానీ, నృత్యం, భోగం, నందనవనమనే అసమాన ఉద్యానవనం "దేవపారిజాత'' మనే ప్రత్యేక పుష్పవాటికలూ ఇంద్రలోక ప్రత్యేకతలు అవి ఎంతటి మహర్షులనూ ప్రలోభ పెడు తుంటాయి ఎంతోకాలం నియమనియమాది నిష్టలతో తపస్సుచేసిన మహర్షులు, స్వర్గలోకవాసము. రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమలాంటి కంద్రలోక అప్సరసలతో భోగాలు కోరుకుంటారు. భూలోకంలోనూ మానవులు చాలా పూజలు, జపాలుచేసి మరణించినపుడు స్వర్గంలో అపుణ్యం తాలూకు ఐశ్వర్య భోగాలు అనుభవించి పుణ్యం క్షీణించిన తర్వాత తిరగి భూలోకంలో జన్మిస్తారని "భగవద్గీత'' లో శ్రీకృష్ణుడు చెబుతాడు

ఒక యజ్ఞం పరిసమాప్తి కావాలంటే అందుకు యజ్ఞకర్త చాలా శ్రమ పడాలి. సంవత్సరాల తరబడి దీక్షాబద్ధుడై, నియతాహార విహారుడై వుండాలి. యజ్ఞసమయంలో యజ్ఞకర్తవలవగానీ, యజ్ఞం చేయించే ఋత్విజులవలన గానీ, యజ్ఞంలో జరిగే దానధర్మాది క్రియలలోగానీ కించిత్తు లోపం జరిగినా యజ్ఞం విఘ్నమై తీవ్ర దుష్ఫలితాల నిస్తుంది. అంచేత యజ్ఞం చేయడమంటే చిన్న పనికాదు. అలాటి వంద యజ్ఞాల నిష్కళంకంగా, లోకరహితంగాచేసి తన భక్తి ప్రపత్తులతో, తన తపశ్శక్తితో దేవతలను దైవాన్ని మెప్పించ గలిగిన వ్యక్తి ఇంద్ర పదవికి అర్హుడౌతాడు. ఈనాటి శంకరాచార్య పీఠం, కంచికామకోటి పీఠం, వగైరాలలానే ఇంద్ర పదవికూడా ఒక పీఠం లాంటిది. అర్హుడైన వ్యక్తి ఇంద్ర పదవికి రాగానే "కంద్రుడని'' పిలువబడతాడు.

అయితే పురాణాలలో ప్రముఖంగా కనిపించే ఈ ఇంద్రపాత్రలో అటు పదవికి తగిన ఔన్నత్యంతో పాటు, పదవికి తగని నీచత్వమూ సమంగా

గోచరిస్తుంటుంది. ఎక్కడ ఏ మహర్షి, ఏ రాక్షసుడు తపస్సు చేస్తున్నాడని తెలిసినా ముందస్తుగా ఇంద్రుడా తపో విఘ్నానికి బయల్దేరుతాడు. కారణం ఆ ఋషి, లేదా ఆ రాక్షసుడు తన పదవి కావాలంటాడేమోనని హడలు! అసూయ! వెంటనే తనవద్దవున్న సౌందర్యమూర్తులు, నాట్యమయూరీలు అయిన రంభ, మేనక, ఊర్వశి తిలోత్తమ ల్లాటి అప్సరసలను ఆ మహర్షి లేక రాక్షసుని తపస్సుకు విఘ్నం కలిగించమని పురమాయిస్తాడు. వారివలలో పడిన మహర్షు లెందరో పతనమైనారు. ఆ అప్సరస భామినుల వల్లకాకపోతే తానే స్వయంగా బయల్దేరి ఆ మహర్షి తల నరకటమో (వజ్రాయుధంతో) చేసి బ్రహ్మహత్యా పాతకాన్ని చేతులారా తలకుచుట్టుకొని తనకుతానేపదవీచ్యుతుడై యిక ఆ పాపపరిహారార్థం ఏదేవుణ్నో ఆశ్రయించి వేలాది సంవత్సరాలు తపస్సు చేస్తాడు. ఈలోగా ఖాళీ అయిన ఇంద్ర పదవిని మరో అర్హుడైన వ్యక్తి అధిష్టిస్తాడు. వాడూ ఏ తప్పోచేసి సింహాసనం దిగిపోయే వరకూ మొదటి ఇంద్రుడు అజ్ఞాతంగానూ ''మాజీ" గానూ మిగిలిపోవలసినదే. యిలా ఇంద్రులు చాలామంది మారుతుంటారు. ఇంద్రుని భార్య పేరుకూడా 'శచీదేవి' ఈ పేరు ఆ పీటంలానే శాశ్వతమైనది.

ఒక్కో సందర్భంలో అతి పరాక్రమం చూపి దానవులను జయించే ఇంద్రుడు ఒక్కొ-క్క-మారు ఆ దానవులచేతే దారుణంగా పరాభవింపబడి పిరికి పందలా పారిపోతుంటాడు త్రిమూర్తులనూ శరణువేడుతాడు. యిక కొన్ని పనులుచేసి ఇంద్రుడు అంతటి పరమ నీచుడు లేడనిపించుకొన్న సందర్భాలూ వున్నాయి.

రామాయణ కాలంలోని ఒక ఇంద్రుడు గౌతమమహర్షి ధర్మపత్ని అయిన అహల్యను ప్రలోభపెట్టి పరధార గురుపత్ని అని గౌరవభావం అయినా లేకుండా ఆమె శీలం దోచుకొని గౌతమమునికి పట్టుబడి, శాపగ్రస్తుడౌతాడు అహల్యను శిలా సదృశంగా చైతన్య రహితంగా మారిపోయేలా గౌతమ మహర్షి శపించే పరిస్థితి కల్పిస్తాడు.

"నహుషుడు" అనే ఇంద్రుడు, ఈలోగా పదవీచ్యుతుడైన ఇంద్రుని భార్య "శచీదేవి" సౌందర్యానికి మోహితుడై; ఉచితానుచితాలు మరచి, ఆమెను కోరుతాడు ఈ వైపరీత్యానికి బెదిరిపోయిన ఆశచీదేవి దేవగురువైన బృహస్పతి మహాముని సలహాతో ఈ నహుషుడిని నరవాహనం ముఖ్యంగా సప్తఋషులచేత మోయబడే నరవాహనంమీద ముందే ఇంద్రుడూ అనుభవించని గౌరవాన్ని అనుభవిస్తూ రమ్మని కబురు పంపుతుంది. మోహావశుడై ఉచితానుచితాలు మరచిన నహుషుడా ప్రకారమే చేసి శచీదేవి మందిరానికి దగ్గరగా రాగానే తన పల్లకీ మోస్తున్న మహర్షులలో ఒకరైన దుర్వాస మహామునిని 'సర్ప సర్ప' (త్వరగా త్వరగా) అంటూ కాలితో తంతాడు. అసలే ముక్కోపి అయిన ఆ మహాముని ఇంద్రుని ఈ అనుచిత చర్యకూ అహంకారానికీ మండిపడి 'వెయ్యి సంవత్సరాలు అజగరం (కొండచిలువ) వై పడివుండు అజ్ఞానంతో" అనిశపిస్తాడు. నహుషుడికి అప్పుడుగానీ తన పదవి యిచ్చిన అహంకారం. తాను తొక్కిన తప్పుత్రోవ అర్థంకావు మహర్షుల పాదాలమీద పడి క్షమాపణ వేడుకోగా భారతకాలంలో ధర్మరాజుచేత తత్సోప దేశం చెంది తిరిగి సాధారణ మానవరూపు ధరించేట్లుగా అనుగ్రహిస్తారు వాళ్ళు. అలా నహుషుడి ఇంద్రపదవి ఈనాటికీ, మంత్రి పదవులు, ముఖ్య మంత్రి పదవులు అధికారులు కొందరి ప్రవర్తనలకు అద్దం పడుతూనే వుంది.

ఇక తన గురువు తనపై ఆగ్రహించి గురు పీఠం త్యజించిపోగా మరో గురువు కోసం ఆతృతచెందీ, ఈలోగా రాక్షసులచేత చావు దెబ్బతిని గురువుగా 'విశ్వరూపుడు' అనే తపోనిధిని–రాక్షసుల బంధువును దైవాను దేశంగా తెచ్చుకొని ఆ గురువు కటాక్షంతో రాక్షసులను జయించి మరలా ఆ గురువే బంధువులైన రాక్షసులకు కొందరికి, రహస్యంగా హవిర్భాగాలలో కొంత యిస్తున్నాడని తెలుసుకొని ఆ గురువుని ధ్యాననిష్ఠలోవున్న వ్యక్తిని తల నరికి చంపిన ఘనత ఇంద్రునికే దక్కుతుంది చరిత్రలో.

హిరణ్యకశిపుడు ఘోర తపస్సు చేస్తున్న సమయంలో ఆ తపస్సుకు విఘ్నం కలిగించి విజయం సాధించలేక పోయిన ఒకానొక ఇంద్రుడు హిరణ్య కశిపుని భార్య అయిన "లీలావతి" ని నిండు గర్భవతిని మహా పతివ్రతను

బలాత్కారంగా తన లోకానికి ఈడ్చుకు పోతుంటాడు. ఎదురైన నారదుడు ఈ అనుచిత ప్రవర్తనేమిటని ప్రశ్నిస్తే "హిరణ్యకశిపునికి ఈమె ద్వారా కలగ బోయే బిడ్డ ఇంకెంత ప్రమాదకారి అవుతాడో దేవతలకు, కాబట్టి ఈమెను ప్రసవంవరకూ నాలోకంలో నిర్బంధించి ఆ బిడ్డను నా వజ్రాయుధంతో చంపి ఆ తర్వాత ఆ పతివ్రతను విడిచిపెడతాను" అంటాడు ముచ్చటగా. నారదుడు ఎలాగో నచ్చచెప్పి ఆ ఘోరం వారించి ఆమెను విడుదలచేయించి తనవెంట తన ఆశ్రమానికి పిల్చుకొని వెళతాడు. ఆమె గర్భవాసంలో వుండగానే నారద మహర్షి గురుబోధతో జన్మతః శ్రీమన్నారాయణ భక్తాగ్రేసరునిగా మారిన ప్రహ్లాదుడు ఇంద్రుని వజ్రాయుధ ధారను తృటిలో తప్పించుకున్న ధన్యుడు.

ఇక వృత్రాసురుడనే విష్ణు భక్తుడైన రాక్షసవధ కోసం "ధధీచి" అనే మహర్షి మహా తపస్సంపన్నుడు అయిన వ్యక్తియొక్క మంత్రపూతమైన "వెన్నెముక" మాత్రమే ఆయుధంగా మారాలి అనితెలుసుకున్న ఒకానొక ఇంద్రుడు ఆ "ధధీచి" మహర్షిని వెన్నెముక ప్రసాదించమని వేడుకోవటానికి వెనుదీయడు-తన ఇంద్రపదవి భద్రతకోసం, 'ధధీచి' అది దేవతలందరికీ శ్రేయస్సు గనుక నిస్సంకోచంగా ప్రాణత్యాగం చేసి తన వెన్నెముక ఇస్తాడు. ఆ వెన్నెముక వజ్రాయుధం ఒక మహోన్నత తపస్వి వెన్నెముక అది. ఆ వెన్నెముకలోని ప్రతి అణువులోనూ ఆమహాత్ముని వైష్ణవభక్తి అంత ర్లీనమై. అస్థిగతమై వుంది. ఆ వైష్ణవ తేజస్సే ఎందరో దానవులను నిర్జిం చింది. ఇంద్రుని చేతి ఆయుధంగా, ఇంద్రునిలోలేని మహత్యం ఇంద్రుని ఆయుధమైన "వజ్రాయుధం"గా మారిన ఆమహర్షి వెన్నెముకలోవుంది మరి.

తన పినతల్లి అయిన "దితి" ఇంద్రుని జయించే పుత్రుని ప్రసాదించ మని భర్తను వేడుకొని గర్భం ధరించి, భర్త ఆజ్ఞమేరకు కఠిననియమాలతో కాలం వెళ్ళ బుచ్చుతుండగా ఇంద్రుడామె నియమోల్లంఘన సమయంకోసం దొంగలా పొంచివున్నాడు. ఒకానొక సాయంసమయంలో నిండు గర్భిణి అయిన ఆమె అలసటతో అశుచిగా తలవేపు కాళ్ళు, కాళ్ళవేపు తల వుండేలా మంచంమీద పడుకొని వుండగా ఇంద్రుడు దొంగలా ఆమె గర్భంలో ప్రవే. శించి ఆ గర్భస్థ శిశువును తన వజ్రాయుధంతో ఏడు ఖండాలుగా చేస్తాడు

గొప్ప శౌర్యంతో, తన కామరూప విద్యా ప్రదర్శనతో ఆ ఖండాలు బాధతో రోధిస్తుండగా "మారుద మారుద" అంటాడు (ఏడవ్వొద్దు ఏడవ్వొద్దు) ఆ దితికి మెలుకువచ్చి జరిగిన ఘోరం తెలుసుకుంటుంది. ఇంపై ఒక్క ఖండాలుగా ఆ బిడ్డను నరికి పినతల్లి గర్భంనుంచి బయటపడి, మరలా ఆమె పాదాలు పట్టుకుంటాడు ఇంద్రుడు క్షమించమంటూ "దితి" తనచిన్న పొరబాటు ఇంద్రుని కిలాటి అవకాశం ఇచ్చిందని తెలుసుకొని ఇంద్రుని క్షమించి, ఆ తన బిడ్డలందరూ "మరుద్గణాల" పేరుతో ఇంద్రుని పక్షం వుండక తప్పదని తెల్సుకుని పూరట చెందుతుంది చేసేది లేక.

అయితే అక్కడక్కడా ఇంద్రుదు మంచిపనులు చేసిన దాఖలాలూ వున్నాయి రామాయణంలో అశోకవనంలో నిరాహారంగా వుండే సీతాదేవికి అమృత పాయసం (దివ్యపాయసం) అందించి రావణవధ పర్యంతం ఆమె ప్రాణాలు నిలిపింది ఇంద్రుడే రామరావణ సంగ్రామ సమయంలో రావణుడు రథంమీదా, రాముడు నేలమీదా వుండి యుద్ధం చేయటం సహించలేక తన దివ్యరథాన్ని, సారధిని రామునికి పంపినదీ ఇంద్రుడే. దేవగణాలందరికీ రాజై, మేఘాలనూ, పర్వతాలనూ, వాయువునూ, అగ్నినీ ఇలా చరాచరాల ప్రాణం కాపాడే పంచభూతాలను అదుపులో పెట్టేవాడు ఇంద్రుడే లోక కంటకులైన రాక్షసులను నిర్జించటానికి, శ్రీమన్నారాయణుని పురికొల్పటంలోనూ, ఆయనకు పరోక్ష సాయం తనవంతు చేయటంలోనూ ఇంద్రునిదే పైచేయి.

ఇంద్ర పదవి మహోన్నతమైనది. దానిని సక్రమంగా, ధర్మ బద్ధంగా కొనసాగించి ధన్యులైన ఇంద్రుడూ వున్నారు (వీరు కొద్దిమంది) ఆ పదవి ఇచ్చిన అహంతో, ఆపదవీ వ్యామోహంతో, ఆ భోగభాగ్యాల అహంకారంతో పదవీచ్యుతుడై శాపాలపాలైన ఇంద్రులూ (నహుషుడు ప్రముఖుడు) రాక్షసులచేత అస్తమానూ చావుదెబ్బలుతింటూ ఇంద్రరాజధాని అయిన "అమరావతి" నుండి ఇంద్రలోకం అయిన "స్వర్గం" నుండీ, మహేంద్ర సింహాసనం నుండి పారిపోయి దిక్పాలకులతో కూడా ఆరాక్షసులకూ వూడిగంచేస్తూ, శ్రీమన్నారాయణుని అవతారం ఆవిర్భవించేవరకూ దిక్కు మొక్కు లేకుండా పడివున్న

ఇంద్రులూ వున్నారు. (భ్రూణ హత్యలు మొదలు. బలాత్కారాలు, చౌర్యాలు, హత్యలు మానభంగాలు, తమహక్కుగా భావించిన పదవీ వ్యామోహపరులైన ఇంద్రులూ వున్నారు.

ఈ నాడు మనం చూస్తున్నాం అధికార దుర్వినియోగులైన కొందరు అధికార ఇంద్రులను. నరరూపరాక్షసులైన మరికొందరు పదవీవ్యామోహ పరులైన ఇంద్రులను పదవులలో కొనసాగుతూ, భ్రూణహత్యలు మొదలు స్మగ్లింగ్ వ్యభిచార గృహాలు నడపటం వరకూ సర్వనీచాలకూ ఒడిగడుతున్న కొందరు ఇంద్రులను, వీరంతా ఇంద్రపదవిని అయాచితంగా చేపట్టిన నహుషుడికి వారసులు. ఎందరో ఇంద్రుల ఆకతాయి తనాలకు, పతనాలకూ ప్రతిబింబ స్వరూపాలు! అవునా!

## అజామిళుడు

భగవంతునికీ, భక్తునికీ మధ్య వుండే అత్యంత సన్నిహితత్వం, భగవంతుడు భాగవతోత్తములకు దాసుడనే తత్వం, ప్రతి కథలోనూ, ప్రతి సన్నివేశంలోనూ బోధిస్తుంది భాగవతం. కొందరు ఘోర తపస్సుచేసి విష్ణు సాన్నిధ్యం సాధించిన భాగవతోత్తములు కాగా, మరి కొందరు గృహస్థులుగా కొనసాగుతూనే నిత్య నైమిత్తిక కర్మలు, వృత్తులు యధావిధిగా చేసుకుంటూ, విష్ణునామ సంకీర్తనంపట్ల మనస్సు లగ్నంచేసి, సంసారంలో వుంటూనే గృహస్థులయినవారుకూడా మోక్షం సాధించవచ్చునని ఋజువుచేసిన భాగవతోత్తములు ఇక "అజామిళుడు" లాంటి అధమ పురుషులు యాదృచ్ఛికంగా విష్ణుపాద సన్నిధిని పొందటంలాంటి విచిత్రమైన సంఘటనలూ వున్నాయి.

కన్యాకుబ్జ నగరంలో నివసిస్తుండిన "అజామిళు" డనే బ్రాహ్మణునికి లేని దుర్వ్యసనాలు అంటూలేవు చక్కని ఇల్లాలిని వదలి వాడు ఒకదాసీదాన్ని చేరదీసి దానివలన పదిమంది బిడ్డలను కన్నాడు. ఆ పుత్రులలో చివరివాడైన "నారాయణ'' అనే వాడిమీద అజామిళునికి అంతులేని ప్రేమ. అస్తమానూ

జూదం, వంచనా, దొంగతనాల్లాటి దుర్వ్యసనాలతో అతగాడు బ్రాహ్మణత్వాన్ని కోల్పోయి, అస్తమాను ఆ దాసీదాని కుటుంబాన్ని పోషించటంలోనే తన జీవితమంతా వ్యర్థం చేసుకున్నాడు భక్తి, భగవంతుడిమీద ఏలాంటి విశ్వాసమూలేని అజామిళునికి జీవితం దుర్వ్యసనాల బాటలో నడిచి, నడిచి వృద్ధాప్యం ముంచుకు వచ్చింది. అతగాడి ఆయుః ప్రమాణం పూర్తి కాగానే, యమభటులు అతని జీవుని తమ లోకానికి లాక్కుని పోదామని వచ్చారు. భయంకరా కారులైన యమభటులను చూడగానే మంచంలో చివరిదశలో వున్న అజామిళునికి భయమూ, దడ కలిగాయి ఆ సమయంలోనూ అతడికి దైవం గుర్తుకు రాకపోగా దూరాన ఆడుకుంటున్న దాసీపుత్రులలో చివరి వాడైన తనకు అత్యంత ఇష్టుడయిన కుమారుడు "నారాయణ" అనేవాడు తలపుకు వచ్చాడు. వెంటనే అజామిళుడు తనశక్తి అంతా కూడగట్టుకొని "నారాయణా! నారాయణా! నారాయణా!" అంటూ మూడుసార్లు పిలుస్తూ ప్రాణం వదిలాడు.

యమభటులు అజామిళుని ప్రాణం యమలోకానికి తీసుకు పోదామను కుంటున్నంతలో, విష్ణు భటులు అక్కడ ప్రత్యక్షమై అజామిళుని ఆత్మను విష్ణు లోకానికి తీసుకెళ్ళటానికి వచ్చామని యమభటులను నిరోధిస్తారు. ఇద్దరికి కొంతసేపు వాదం, యుద్ధంజరిగి యమభటులీ వైపరీత్యాన్ని యమ ధర్మరాజుకు తెలుపటానికి వెళతారు, యముడికి జరిగినదంతా తెలియజేస్తారు.

నిష్పక్షపాతంగా లోకంలోని జీవుల మరణాలను నీవు అమలుపరుస్తుండగా నీకింకరులమైన మమ్మల్ని ఆ విష్ణు దూతలు ఇలా అవమానించారు పాపిష్టి వాడైన అజామిళుని ఆత్మ విష్ణులోకాలకు వెళ్ళటానికి ఏ అర్హతవుంది అని వాపోతారు.

మహాజ్ఞాని అయిన యమధర్మరాజు తన భటులను వూరడించి భగవంతుడైన విష్ణువు మహాత్మ్యాన్ని, వైష్ణవుల మహాత్మ్యాన్ని చాలా చక్కగా వర్ణిస్తాడు.

అంతక్రితం యమదూతలతో విష్ణు దూతలు చెబుతారు.

ఆ॥ "బిడ్డపేరు పెట్టి పిలుచుట విశ్రామ కేలినైన, మిగుల గేలినయిన
బద్య, గద్యగీత భావార్థములనైన గమలనయనుదలప గలుషహరము.

ఉ॥ కూలినచోట గొట్టుపడి కందినచోట, మహాజ్వరాదులం
చోలినబేట సర్పముఖ పీడలనందిన చోట, నార్తులై
తూలినచోట విష్ణు, భవదూరుని బేర్కొనిరేని మీద న
క్కాలుని యాతనావితతి గానరు; పూనరు దుఃఖభారముల్.

అంటూ సరిగ్గా సుమధర్మరాజుకూడా విష్ణుమహిమలు విష్ణుభక్తుల మహిమలు
తెలియజెబుతాడు తన భటులకు.

చ॥ అభవు, నమేయు, నవ్యయు, ననంతు, ననారతు, బూనిమేనిలో
నుభయమునై వెలుంగు పురుషోత్తముగానరు చిత్రకర్మ వా
గ్విభవ గరిష్ఠులై, వెదకి వీటిడి ప్రాణులు సర్వవస్తువుల్
శుభగతి జూడనేర్చి తనుజూడగనేరని కంటి పోలికన్.

అంటూ విష్ణువు ఆదేశంతో విష్ణుదూతలు ముల్లోకాలలోనూ సంచరిస్తుంటారు
శ్రీవైష్ణవ భక్తులను కాపాడుతూ! విష్ణుభక్తులకు యముడినైన నా వలనగానీ
మృత్యువువలనగానీ యమభటులైన మీవలనగానీ ఏలాంటి భయమూకలగదు

మహా వైష్ణవమాయను గురించి శ్రీమహావిష్ణు మహిమలను గురించి
తెలియజెప్పగల వారెవరున్నారు? త్రిపుర సంహారకుడైన బ్రహ్మ, కార్తికే
యుడు, కపిలుడు, నారదుడు, భీష్ముడు, మనువు, బలిచక్రవర్తి, జనక
మహారాజు, ప్రహ్లాదుడు, శుకయోగీంద్రుడు, వ్యాసమహర్షి వగైరా పన్నెండు
మంది మహాభక్తులు అతి గుహ్యమైన విష్ణు మహత్యాలు, విష్ణుభక్తిని గురిం
చిన రహస్యాలు చెప్పగలరేమో.

సీ॥ శ్రుత్యంతవిశ్రాంత మత్యను క్రమణీయ
భగవత్ప్రసంగతుల్ భాగవతులు;
సనకాదిమునియోగిజన సదానందైక
పరమభాగ్యోదయుల్ భాగవతులు;
కృష్ణ పదధ్యాన కేవలాంమృతపాన
పరిణామయుతులు శ్రీభాగవతులు;
బహుపాతకానీక పరిభవ ప్రక్రియా
పరుషోగ్ర మూర్తులు భాగవతులు.

తే॥ భావతత్త్వార్థ వేదులు భాగవతులు
బ్రహ్మవాదాను వాదులు భాగవతులు!
సిరులు దనరంగ నెన్నడు జేటులేని
పదవి నొప్పారు వారు వో భాగవతులు.

క॥ అదిగాన విష్ణుభక్తుల గడియగజనవలదు మీరు; కరివరదు లస
త్పది పద్మ వినతి విముఖులదుదినంటగగట్టితెండు; ధూర్తులు వారల్!

అలాగే ఎగతాళికైనా ఇందిరారమణుని గురించి పలుకలేని దుర్భాషితులను కలలోనైనా శ్రీకాంతుని చరణకమలాలు దర్శింపనోపని పరమనీచులను పరిహాసంతోనైనా కృష్ణుని ప్రశంస వినని దష్కర్ణభాగ్యశవణులను కనీసం ఉత్సవ సమయాలలోనైనా విష్ణువు ఆలయమార్గం పట్టని వారినీ.

వె॥ బరమ భాగవతుల పాదధూళి సమస్త
తీర్థసార మనుచు దెలియలేని
వారి, వారి వారి వారి జేరినవారి
దొలుతగట్టి తెండు దూతలార!

అలాగే,

ఆ॥ వె॥ పద్మనయను మీది భక్తి యోగంబెల్ల
ముక్తి యోగమనుచు మొదలెఱుంగు
వారి, వారి వారి, వారిజేరినవారి
త్రోవ దలవవలదు దూతలారా!

తే॥ గీ॥ ఏది జపియింప నమృతమై యొసగుచుండు
నేదిసద్ధర్మ పథమని యెఱుగదగిన;
దదియె సద్భక్తి యోగంబు నలవరించు
మూర్తి మంతంబు దాఁహరికీర్తనంబు.

కాబట్టి,

తే॥ కంటిరే మీరుసుతులారా! కమలనేత్రు
భాగ్యమగు నామకీర్తన ఫలమునేడు
దవిలి మృత్యువు పాశబంధములవలన
"జాణతనమున నూడె నజామిళుండు."

అని తనదూతలను పూరడించి భగవద్భక్తి భాగవతుల తత్వం తెలియజెప్పి పంపిస్తాడు యమధర్మరాజు.

అజామిళోపాఖ్యానంద్వారా అందరూ అలా జీవితమంతా తప్పులుచేసి చివరి క్షణాలలో "నారాయణా" అని శ్రీమన్నారాయణుని ఒకసారి పిలిస్తే ముక్తి లభిస్తుందనే వెర్రి అర్థం తీసుకొనేవారి అజ్ఞానానికి మనమేమీ చేయలేము, చెప్పలేము. భాగవత కర్త అయిన వేదవ్యాస మహర్షిగానీ అది కమనీయమైన పద్యగద్య రూపంలో తేట తెనుగులో అందించిన పోతనకవిగానీ సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడేగానీ వారి అతి తెలివినీ అజ్ఞానాన్ని పోగొట్టలేరు

జీవితమంతా చెడుదారిలో వ్యర్థమయి పోయినా చివరిక్షణాలలోనూ తన కొడుకైన నారాయణుడినే పిలిచినా ఆ "నారాయణ" అష్టాక్షరి మహా మంత్రంలోని అక్షరాల ఉచ్చారణతో అజామిళునిలాటి పాపిష్టి వాడు

విష్ణుపథ లోకి వెళ్ళగలిగాడు. అలాగాక జీవితమంతా సత్ప్రవర్తన, సద్భక్తితో శ్రీమన్నారాయణుడిని శరణువేడితే ఇక ఆ భక్తునికి జరామరణ సంబంధ యాతనామయము పరంపరనుండి శాశ్వతముక్తి లభించి మహా యోగీశ్వరులు కోరుకొనే మహత్తర మోక్ష సిద్ధించి తీరుతుందని తెలియజెప్పటమే ఈ అభ్యాసం యొక్క సదుద్దేశ్యం. ఇంకా కూడా మృత్యువు అధిష్ఠాన దేవతయైన యమధర్మరాజు చేత చెప్పించటంలో విష్ణు భక్తునికి, మృత్యువైనా వెరుస్తుందనీ, సాధారణమైన ఈతిబాధలు, సాంసారిక బాధలు, ఒక లెక్కలోనివి కావనీ, కావలసింది చిత్తశుద్ధితో కూడిన భక్తి అనే ఈ కథలోని అంతర్యం. అర్థాన్ని తీసుకోవటమైనా, పెడర్థాన్ని గ్రహించటమైనా మన చేతులలో, మన చేతలలో, మన హృదయగత సంస్కారంలో వుంది అవునా?

## చిత్రకేతుడు - వృత్రాసురుడు

శూరసేన దేశాధిపుడైన "చిత్రకేతు" డనే మహారాజుకు వేలాదిమంది అందగత్తెలు, యవ్వనవతులు అయిన భార్యలున్నారు. కానీ ఆయనకు

ఉ॥ "రూపము, సత్ప్రతాపము, మరుత్పతి భోగము, యౌవ్వనంబు, సం
దీపిత చారువర్తనము, దిగ్విజయంబును, సత్యముం జగ
ద్వ్యాపిత కీర్తియున్, సతులు, వైభవ ముఖ్యములెల్ల మాన్పగా
నోపకయుండె నాన్నృపతినొందిన సంతతిలేని దుఃఖమున్."

అపరిమితమైన సంతానహీనత దుఃఖంతో తపించిపోయేవాడు. ఒక నాడు ఆంగీరస మహర్షిరాగా ఆయనకు భక్తి పురస్సరంగా పూజించి రాజు తనకు సంతానం ప్రసాదించమని కోరాడు, ఆంగీరస మహర్షి పుత్రకామేష్టి యజ్ఞంచేసి, ఆ దివ్య ప్రసాదాన్ని చిత్రకేతు మహారాజు పెద్దభార్య అయిన "కృతద్యుతి" అనే ఆమెకు ఇచ్చాడు ఆమె అది ఆరగించింది. ఆమె చక్కని మగపిల్లవాణ్ణి ప్రసవించింది. చిత్రకేతు మహారాజు మహదానందం పొందాడు

తనకు వంశాంకురాన్ని ప్రసాదించిన కృతద్యుతిమీదా, కొడుకుమీదా ఆయనకు ఎనలేని ప్రేమాభిమానాలు ఏర్పడ్డాయి. ఇది సహించలేకపోయారు మిగిలిన రాణులు. వారంతా కుట్రచేసి ఆ పిల్లవాడికి విషప్రయోగం చేయించి చంపించారు. లేక లేక కలిగిన ఒక్కగా నొక్క పుత్రుడు మరణించటంతో చిత్రకేతుడు పిచ్చివాడిలామారి, రోదించసాగాడు ఆ సమయంలో అక్కడికి అంగిరస మహర్షి, నారద మహర్షిని వెంటబెట్టుకువచ్చి ఆ మహారాజుకు ఎంతగానో వేదాంతబోధ చేస్తాడు కానీ రాజు ఊరట చెందడు. అప్పుడు నారద మహర్షి, ఆ మృతబాలునికి క్షణ లం జీవం ప్రసాదించి "నాయనా" నీతండ్రితో ఏమిచెబుతావో చెప్పు, నీవు బతికి, నీతండ్రి రాజ్యానికి వారసునిగా రాజ్యమేలి శేషజీవితం గడుపు" అంటారు. అందుకా బాలుని జీవుడు "ఈ లోకంలో నా తల్లెవ . ? తం డెవరు? ఈ జన్మ పరం పరలో జీవుడు తీసుకొనే తిర్యగ్జానుల ా ఎవరు తల్లి? ఎవరు త. డి? వావివరుస లేమిటి? సర్వసృష్టి స్థితి లయాలకూ కారణభూతుడైన శ్రమన్నారాయణుని మించిన బంధువెవ్వరీ సృష్టిలో.

క॥ "సతులెవ్వరు? సుతులెవ్వరు?
పతులెవ్వరు? మిత్రశత్రు సుజనప్రియ
సంగతులెవ్వరు? సర్వాత్మకగతుడై!"
గుణసాక్షయైన ఘనుడొక్కనికిన్!"

కాబట్టి ఆ పరమాత్మ స్వరూపుడనైన నాకు, మీకు ఏలాటి సంబంధం, బంధుత్వం లేదు" అని చెబుతాడు. ఇది విన్న చిత్రకేతునికి ఆత్మజ్ఞానం కలుగుతుంది. మోహపాశం తెగిపోతుంది. ఆ మృత శిశువుకు దహనసంస్కారంచేసి భవబంధాలను త్రెంచి వేసుకొని నారద మహర్షిని ప్రార్థిస్తాడు మౌనంగా.

ఎందరో మహర్షులకు మంత్రోపదేశం చేసిన నారద మహర్షి అపారమైన దయతో చిత్రకేతునికూడా 'భగవన్మంత్రం' విధిపూర్వకంగా ఉపదేశిస్తాడు

ఇక్కడ ఒక విషయం గమనించాలి. గురువులకు గురువు నారదమహర్షి అయితే ఆయన శిష్యుని హృదయ సంస్కార పరిణతిని చక్కగా అంచనా వేసుకోగల మహానుభావుడు. అంచేత ఏ నాగరికమాటా ఉచ్చారణ దోషం లేకుండా పలకలేని కరకుబోయకు "రామ" అనే రెండక్షరాల తారకం బోధించాడు. అదీ పలకలేక "మర" అనే మఱ్ఱివృక్షపు రూపమైన శబ్దోచ్చారణను పునశ్చరణ చేయించి "రామ" గా పలికించాడా బోధ గురువు! అల్లా ఈ సర్వ ప్రపంచానికి "వాల్మీకి" అనే మహర్షినీ ఆయన రచించిన ఆదికావ్యమైన రామాయణ మహాకావ్యాన్నీ తద్వారా మానవ జీవిత ధ్యేయాల వివరణనూ అందింపజేశాడు. ఆ బోయ తనపై వాల్మీకం పెరిగే పర్యంతం తపస్సుచేయవలసి వచ్చింది మంత్రసిద్ధికోసం. శిష్యుని హృదయ పరిపక్వత తెలిసిన గురువు నారదుడు ఇక బాలుడు అత్యున్నత పదవి మీద అత్యంత కోరిక వున్నవాడు అయిన ధృవునికి ద్వాదశాక్షర సమకలితమైన 'వాసుదేవ' మహామంత్రాన్ని ఉపదేశించాడా పరమగురువు. ధృవుని ధృఢ చిత్తం ఆరు నెలల వ్యవధిలో ఆ మంత్ర సిద్ధినీ, మంత్రాధిష్ఠాన దేవతా ప్రత్యక్ష సిద్ధినీ, పొందింది. ఆ బాలుని హృదయగత కాంక్షకు తగినట్లు ఏ యుగంలోనూ; ఏ ప్రాణులూ అధిష్ఠించలేని అత్యున్నత స్థానాన్ని పొందేట్లు చేశాడు.

ఇక చిత్రకేతునికి మోహవిచ్ఛేదం చేయించాడు మృతబాలుని వాక్కుల ద్వారా. తర్వాత తానే గురువుగా 'భగవన్మంత్రం' అనబడే శ్రీమన్నారాయణుని అనంతకోటి మంత్రాలలో ఒకటైన 'సంకర్షణ' బీజ మంత్రం ఉపదేశించాడు. అల్లా భక్తుల యొక్క హృదయ పరిపక్వత ఉపదేశింపబడే మంత్ర ప్రభావం ఆ శిష్యుని హృదయ గతమయ్యే కాలప్రమాణం అంచనా వేసుకోగలిగిన నిజమైన బోధగురువు లభించినప్పుడే శిష్యునికి భగవంతుని సాక్షాత్కారమూ, మనోరథసిద్ధి మోక్షము కలుగుతాయి. ప్రహ్లాదునిలాటి ముక్తసంగునికి గర్భస్థ శిశువుగా వుండగానే 'అష్టాక్షరి' మంత్రోపదేశం చేశాడీ నారద మహర్షి

చిత్రకేతుడు నారదమహర్షి ఉపదేశించిన ప్రకారం నిరాహారుడై సమాధి నియతుండై శ్రీమన్నారాయణ రూపంబైన విద్యను ఆరాధించి సరిగ్గా

ఏడురోజులు గడిచేసరికి అప్రతిహతంబైన 'విద్యాధరాధిపత్యము, గగనంలో ఎక్కడికయినా మనోవేగంతోనూ, మనోభిప్రాయానికి అనుగుణంగానూ ప్రయోగించే దివ్య విమానమూ పొందాడు. ఆ దివ్య విమానంలో విహరిస్తూ నిరంతరం శ్రీమన్నారాయణ ధ్యానం చేస్తున్న చిత్రకేతు డొకనాడు,

సీ॥ తారహార పటీరధవళ దేహమువాని
రమణీయ నీలాంబరంబువాని
మణికిరీట స్ఫురన్మస్తకంబులవాని
గంకణ కేయూర కరమువాని,
గర్పూరమయదీప్త కటి సూత్రములవాని,
దరళ యజ్ఞోపవీతములవాని,
నతి సుప్రసన్న వక్త్రాంబుజంబులవాని,
దరుణవివృత్త నేత్రములవాని.

ఆ॥ వె॥ సిద్ధమండలంబు సేవింప బుణ్యప్రసిద్ధివెలసినట్టి యిద్ధచరితు
బద్మలోచనునకు బాదపీఠంబైన ఫణుని బన్నగేంద్రుగాంచెనతడు.

అట్లా అనంతుని సాక్షాత్కారం పొంది మనసారా స్తోత్రం చేశాడు. ఆదిశేషుడు కూడా ఆనందించి స్థిరమైన విష్ణుభక్తి ఆ మహారాజులో నెలకొని వుండేట్లు దీవించి సకలచరాచరాలలోనూ విష్ణువు తప్ప మరోరూపమూ, గుణ మే లేదని తెలుసుకొనే మహాద్భుత జ్ఞానం ప్రసాదించి అంగీరస, నారదుల దయవలన ఇలాటి సాక్షాత్కారం నీకు లభించిందని తెలిపి మరీ అంతర్ధానమై పోయాడా భగవంతుడు.

చిత్రకేతుడుకూడా అలాగే దేహాభిమానం విడచి జితేంద్రియుడై ఆ దివ్య విమానంలో సంచరిస్తూ ఒకరోజు కైలాసంలో దిగాడు. ఆ సమయంలో బ్రహ్మాది దేవతలు అందరూ, ప్రమథగణాలు మహర్షులు అందరూ ఈశ్వరుని

చూట్టూరా పరివేష్టించి వున్నారు. ఈశ్వరుడు తన అంకపీఠంమీద కూర్చొని వున్న పార్వతిని కౌగలించుకుని కూర్చునివున్నాడు. ఆ దృశ్యంచూచిన చిత్ర కేతునికి పట్టరాని నవ్వుముంచుకు వచ్చింది. ఆ నవ్వు వెనుక "నేను జితేంద్రి యుణ్ణి, అనన్య సామాన్య హరి భక్తుణ్ణి" అనే అహంకారమూ వుంది.

"భార్యాభర్తల మధ్య ఎంతటి అనురాగం వున్నప్పటికీ, వాడు ఎంత నిర్గుణ, పరబ్రహ్మ స్వరూపులైన లోకగురుతుల్యులై నప్పటికీ, ఏకాంతంలో వున్నట్లుగా, ధర్మసభలలో బ్రహ్మాది దేవర్షిగణమంతా పరివేష్టించి వున్న సభ లో ఇట్లా మిధునరూపంలో వుండటం తప్పుకాదా? ఇది భ్రాంతికాదా? అన్నా డు పరిహసిస్తూ

ఈశ్వరుడు సర్వేశ్వరుడు తన మామగారైన దక్షుని దుర్భాషలనే స్తోత్ర రూపంగా స్వీకరించిన శాంతిస్వరూపుడు. మరి చిత్రకేతుని పరిహా సానికి కోపపడతాడా, మౌనంగా చిరునవ్వు నవ్వి వూరుకున్నాడా భోళా శంకరుడు. ప్రమథగణాలు గానీ, బ్రహ్మాది దేవతా గణంగానీ, మహర్షులుగానీ మారుపలకలేని కారణం చిత్రకేతుడు, అనితర సాధ్యంగా సప్తరాత్రులలో భగవన్మంత్రాన్ని సిద్ధిపొందించుకున్న అసాధారణ విష్ణు భక్తుడు. విద్యాధ రాధి పత్యం సప్తరాత్రులలో పొందటమేగాక దివ్యవిమాన రూఢుడై, మానవ శరీరంతోనే ముల్లోకాలూ పర్యటించగలిగిన విష్ణు వర ప్రసాదుడు.

కానీ జగన్మాత అయిన పార్వతి ఈ పరిహాసం తేలికగా తీసుకోలేక పోయింది. స్త్రీ సహజ స్వభావమైన కించిత్తులజ్జ, క్రోధావేశాలు ముప్పిరి గొన్నాయి ఆమెలో,

క॥ మముబోటి లజ్జలుడిగిన కుమతులకుంగర్తయగుచు గోపింపంగా
నమితా జ్ఞానిపుణుండగు శమనుండా నేడు వీడు జగములకెలన్.?

క॥ భృగునారద కపిలాదులు నిగమాంతజ్ఞులును యోగనిర్ణయ నిపుణుల్
త్రిగుణాతీతు మహేశ్వరు నగరెన్నడు వారు ధర్మనయుమెఱుగరొకో.

అంటూ కోపించి మహేశ్వరుని అంతటి విరాగిని సామాన్య సంసారిగా పరిగణించి జగన్మాతయైన తనను ఆ అంకపీఠంమీద మాతృభావంతో చూడక ఇట్లా పరిహసించినవాడు అసురుడై జన్మించుగాక! అంటూ శాపం ఇచ్చింది పార్వతి.

చిత్రకేతుడు మందహాసం చేశాడు. తల్లీ! అవశ్యం నీ శాపాన్ని శిర సావహిస్తాను. శరీరం ఏదైతేనేం? హృదయం శ్రీమన్నారాయణుని పాద పద్మాలకు అంకితంచేసిన వైష్ణవ భక్తులకు? సర్వశరీరాలలో పరమాత్మ స్వరూపంగా వెలిగేది ఆ వైష్ణవమాయేకాదా? అని నమస్కరించాడు. "శాప భయం నాకులేదు తల్లీ! కానీ జగజ్జననివైన నిన్ను నా వాక్కులతో బాధిం చాను గనుక ఆ తప్పుమాత్రం క్షమించు." అని ఈశ్వరునికి మ్రొక్కి బ్రహ్మా ది దేవతా గణాలకు మ్రొక్కి వెనుదిరిగి వచ్చాడు చిత్రకేతుడు.

చిత్రకేతుడు వెళ్ళిపోయాకా ఈశ్వరుడు పార్వతీదేవితో అన్నాడు "చూశావా దేవీ విష్ణుభక్తుల నిర్మోహత్వం, నిజమైన విష్ణుభక్తుని చలింప చేయలేవే శాపాలూ. ఏ దేవతలూ అందుకే ఆతని వాక్కులు కేవలం బిడ్డలు ముద్దుమాటలుగా భావించాను నేను, నువ్వు ఆగ్రహించావు" పార్వతీదేవి విస్మయించెంది, పశ్చాత్తాపపడింది. చిత్రకేతునికి ప్రతిశాపం ఇవ్వగల సామర్థ్యం వుంది. అతడు శాంతచిత్తుడై వెళ్ళిపోయాడని కూడా గ్రహించు కుంది జగన్మాత.

ఆ చిత్రకేతుడే జగదాంబ ఇచ్చిన శాపం కారణంగా త్వష్ట్ర ఇంద్రుని సంహరించటానికి చేసిన అభిచారహోమంలో 'వృత్రాసుర' రూపంతో ఉద్భ వించాడు. వైష్ణవ భక్తి పూరిత హృదయమూ, అసుర శరీరమూ అమరిన ఆ వృత్రాసురుడు ఏ అస్త్రాలకూ, ఆయుధాలకూ మరణించలేదు. అందుకోసం దధీచి వెన్నెముక కావలసి వచ్చింది ఆదే విశ్వకర్మ చేతిలో వజ్రాయుధ రూపం సంతరించుకొని, వృత్రాసుర మరణానికి సాధనమైంది,

—O—

# దధీచి వెన్నుముక

ఈ పుణ్యభూమి అయిన భారతావనిలో ఎందరో వీరులు, త్యాగులూ మహాత్ములూ మహర్షులూ, పరమభాగవతోత్తములూ జన్మించారు. జన్మిస్తూనే వున్నారు ఇకముందూ జన్మిస్తారు. అయితే వారిలో యుగాల పర్యంతం చిరంజీవులై, చిరయశస్సు పొంది వుండేవారు కొందరుంటారు. అట్లా త్యాగ నిధులుగా పేరుపొందిన వారిలో శిబిచక్రవర్తి, దధీచి. బలిచక్రవర్తి వగైరాలు కొందరున్నారు. తన శరీరాన్ని ఖండఖండాలుగా కోసి తాను అభయం యిచ్చిన పావురాయి ప్రాణం కాపాడటం కోసం, తులాభారంవేసి. అది దేవతల పరీక్ష కాబట్టి చివరగా తాను మొత్తంగా దేగకు ఆహారం కావటానికి సిద్ధపడినవాడు శిబిచక్రవర్తి. తన రాజ్యమూ, సంపదా; ఐశ్వర్యమూ సర్వం హరించటానికి యాచకునిగా వచ్చిన వామనమూర్తి "శ్రీహరి" అని తెలిసిన తర్వాత కూడా తానిచ్చిన మాటతప్పననీ, సర్వాంతర్యామి అయన శ్రీమన్నారాయణుడే యాచకునిగా తన దగ్గరకు రాగా, తాను ఇవ్వగలిగే అదృష్టం ఎందుకు వదలు కోవాలనీ అంటూ ఆ భక్తాగ్రేసరుడు, వామనరాజు, త్యాగమూర్తి తననితాను అధఃపాతాళానికి పతనమై పోవటానికి కూడా వెనుకాడడు బలిచక్రవర్తి.

ఇక దధీచి మహర్షి యుగయుగాల త్యాగమూర్తులకూ, భక్తాగ్రేసరులకు తలమానికం లాంటివాడు, "శ్రీమన్నారాయణ కవచ మంత్రాన్ని" ధ్యానించటంలో, జపించటంలో, ఆ మంత్రసిద్ధి పొందటంలో మనస్సు శరీరం పునీతం చేసుకోవడమే గాక, ఆ మంత్ర ప్రభావాన్ని "అస్తిగతం" చేయుగలిగిన మహా భక్తుడు మహా తపస్వి అయన. ఆ నారాయణ మంత్రం అయన అస్తికలుకూడా జపించాయి. ఆయనే ఆ మంత్రాన్ని త్వష్టకు బోధించాడు. త్వష్ట తన కుమారుడైన విశ్వరూపునికి బోధించాడు.

విష్ణు భక్తుడైన చిత్రకేతుడు, జగదాంబ అయిన పార్వతీదేవి శాపంతో త్వష్టచేసిన అభిచారం హోమంలోనుంచి 'వృత్రాసురునిగా' ఉద్భవించాడు.

వృత్రాసు[illegible] భయ[illegible] పరాక్రమా[illegible] [illegible] ఇంద్రాది దేవతలు సర్వం[illegible]లై పోయి శ్రీమన్నారాయణుని శరణువేడగా ఆయన 'దధీచి' మహర్షి వెన్నెముక ఆయుధంగా మలచి వృత్రాసుర సంహారం చేయమని ఇంద్రునికి మార్గం వుపదేసిస్తాడు.

తన ఇంద్రపదవి కాపాడుకోవటం కోసం మహర్షుల తపోవిఘ్నంచేసే ఇంద్రుడు, తన ఐశ్వర్య మదంతో, ఏ అకృత్యాలకైనా పాల్పడే ఇంద్రుడు సహజంగా ఏ దానవుల చేతనైనా సరే మొదటిగా చావు తన్నులుతిని స్వర్గం వదిలి పారిపోవటం అనవాయితీగా ఉండే ఇంద్రుడు. తన స్వార్థం కోసం గురువునైనా హత్యచేయటానికి వెనుకాడని ఇంద్రుడు, జీవితంలో అన్నీ తప్పులే చేస్తూ ఎప్పుడో ఒక్కసారి మాత్రం మంచిపనులు చేసే ఇంద్రుడు, ఈమారూ లోకాలమాట ఎలావున్నా తనలోకం మీదికి విరుచుకు పడుతున్న వృత్రాసురుని సంహరంచి తనదైన రాజ్యం; తనదైన సంపద, తనదైన అధికారం కాపాడుకోవటానికి దధీచి మహర్షి ప్రాణాలు పరోక్షంగా తీయటానికే సమకట్టాడు. ఇంద్రుడు యాచకునిగా దధీచి వద్దకు వచ్చాడు. ఇంద్రుని లాంటి నీచునికి యాచించ కూడని వస్తువేమున్నదీ ప్రపంచంలో? ముల్లోకాలలో 'దధీచి' ని మొసలి కన్నీళ్ళతో పూండిస్తున్నట్లుగానే ఇలా యాచిస్తాడు.

ఆ॥ వె॥ దేహిసుఖము గో దేహ బు ఘటియించు
దేహి; దుపలేడు [illegible] మె[illegible]డు;
దేహి; [illegible]స్మదీ[illegible] హ బు కొఱకునై
దేహ మీగదయ్య దే[illegible]తలకు.

క॥ అడుగంగరాని వస్తువులడుగరు బతిమాలి యెట్టియర్థులు; నిను నే
మడిగితిమి దేహమెల్లను గడునడిగెడువారి కేడ? కరుణ మహాత్మా!,

అంటూ. అయితే దధీచి లాటి మహోత్కృష్ట విష్ణుభక్తులకు తెలియని దేమున్నది. ఇంద్రుని నీచత్వంకంటే ఆయన కోరేది మిగతా దేవతాగణాల

శ్రేయస్సు వృత్రాసురుని ద్వారా పీడింపబడుతున్న దేవతా గణాలు సకల బాధలు పొందుతున్నారు. ఇంద్రునికేం పర్వాలేదు. చేతకాకపోతే పారిపోగల డు కానీ ముల్లోకాల వారెక్కడికి వెళ్ళగలరు. తన శరీరమూ వృద్ధాప్యంతో శిథిలావస్థకు చేరుకుంటోంది. ఎప్పుడైనా ప్రాణాలు "శ్రీహరి" లో ఐక్యం కావాలసిందే. నిర్జీవ కళేబరం అటు దహనం కావటమో ఖననం చేయబడి భూమిలోని చెదపురుగులకు ఆహారం కావటమో, లేక భూమిమీదే వదలివేయ బడిన కళేబరాన్ని కాకులు, గద్దలు, కుక్కలు, నక్కలు తినటమో జరుగు తుంది. తనలోని ఆస్తికలు అంతే.

తన ఆ నిర్జీవ కళేబరంద్వారా, తన వెన్నుపూసలద్వారా లోక కళ్యాణ కారకమైన ఒక మహత్తర పుణ్యకార్యం నెరవేరు తుందనుకుంటే అంతకు మించిన ఆనంద మేమున్నది నిస్సంగుడైన విష్ణుభక్తునికి అశ్వనీ దేవత లకు "అశ్వశిరోనామం" అనే బ్రహ్మ విద్యను ఉపదేశించినవాడూ, "త్వష్టకు" "శ్రీమన్నారాయణ కవచ మంత్రం" ఉపదేశించినవాడూ, తనని తాను ఆ మంత్రం విష్ణురూపునిగా మలచుకున్న వాడూ అయిన దధీచి ఇంద్రుని వాక్చాతుర్యానికి చిరునవ్వు నవ్వాడు.

ఆ॥ వె॥ ఎలమి బ్రదుక నిచ్చయించినవారికి
దేహమెల్ల భంగి దీపుగాదె?
యచ్యుతుండు వచ్చి, యర్థించెనేనియు;
దన్ను నిచ్చునట్టి దాతగలడె

అంటూనే ఇంద్రునికి చక్కని వాతవేశాడా మాటలలో.

సీ॥ అర్థంబు వేడెడు వర్థులు గలరుగా; కంగంబువేడెడి యర్థిగలడె?
తగు కోరికలనిచ్చు దానశీలుడు గల్గు; దన దేహమీ నేర్చుదాతగలడె?
యీనేర్చువాడు తన్నిచ్చిన రోయక చంపెరునట్టి యాచకుడుగలడె?
చంపియుబోవక, శల్యంబులన్నియు నేటి పంచుకపోవు వారుగలరే?

ఆ॥ రమణలోకమెల్ల రక్షించు వారికిహింస సేయుబుద్ధి యెట్టు వొడమె?
భ్రాంతియైనయట్టి ప్రాణంబుపై దీపు తమకు బోలె నెదిరి దలపవలదె

అని ఇంద్రుని స్వార్థాన్ని తన ప్రాణాల కోసం ఎదుటివారి ప్రాణాలు బలిగొనే తత్వాన్ని బహిర్గతం చేశాడు. అయితే ఇంద్రుడు మరలిపోతాడా? పోడుగాక పోడు. దేవతలందరి చేత ప్రార్థింపజేస్తాడు దధీచిని.

దధీచినవ్వి తనకు దేహాభిమానం లేదని తెలిం ఒక మహోత్కృష్ట కార్యానికి తన నిర్జీవ శరీరాన్ని సంతోషంగా తీసుకొమ్మని చెప్పి అప్పటి కప్పుడే శ్రీ మన్నారాయణుని ధ్యాన సమాధిలో లీనమై తన ప్రాణవాయువును ఆ శ్రీ చరణాలకు అంకితం చేసి, శరీరధారి ఒక జీర్ణ వస్త్రాన్ని వదిలి, మరో మంచి వస్త్రం ధరించినట్లుగా, నిర్జీవ కళేబరాన్ని భూమిమీద వదలి దివ్యజ్యోతి రూపం ధరించి శ్రీ మహావిష్ణువులో ఐక్యం అయిపోయి ముల్లోకాలలోనూ చిరంజీవి అయ్యాడు త్యాగమూర్తిగా ఆయన వెన్ను పూసలోని ప్రతి చిన్న అస్తికా, ఒక పిడుగు, ఒక అస్త్రంగా మారింది శ్రీమన్నారాయణ మంత్ర పూరితమైనందువల్ల ఇంద్రుడు తాను కోరినది సాధించి, ఆ వెన్నెముకతో వజ్రాయుధం విశ్వకర్మచేత తయారుచేయించి వృత్రాసురుని మీదకు యుద్ధానకి వెళ్ళాడు. విష్ణు భక్తుడైన వృతాసురుడు అన్ని అస్త్రాలలాగే ఈ వజ్రాయుధాన్ని ఇంద్రునికూడా తన భయంకరమైన నోటితో మింగివేశాడు. వృత్రాసురుని కడుపులో ఇంద్రుడు కేవలం శ్రీమన్నారాయణ కవచ మంత్ర ప్రభావంతో హరి రక్షితుడై వృత్రాసురుని ప్రేవులు వజ్రాయుధంతో ఖండించి బయటపడ్డాడు. వృత్రాసురుడుకూడా విష్ణు సాయుజ్యం చెందాడు.

ఈనాడూ దధీచికి వారసులెందరో వున్నారు. మనమధ్య మనం గమనిస్తే తమ జీవిత చరమాంకంలో తమ కళ్ళు 'బ్యాంక్'లకు దానంచేసే మహనీయులూ, తమ మరణానంతరం తమ నిర్జీవ కళేబరాలను ఎందరో వైద్య విద్యార్థుల పరిశోధనా నిమిత్తం (అస్తిపంజరాలుగా) పెద్దపెద్ద హాస్పిటల్సుకు దానం ఇవ్వమని బంధువులకు చెప్పి మరణించే మహోన్నతులూ తమసాటి మనిషి మూత్రపిండాల వ్యాధితో బాధపడ్తుంటే తమకుగల రెండు

మూత్రపిండాలలో ఒకటి దానం ఇచ్చి అవతలి వ్యక్తి ప్రాణం కాపాడే మహా త్యాగులూ, "బ్లడ్ బ్యాంకి" లకు తమ రక్తం దానమిచ్చి ఎందరో రోగుల, బిడ్డ, బాలింతల ప్రాణాలకు పరోక్షంగా ప్రాణం ప్రసాదించే మహామహులు వున్నారు. వారే లేకపోతే ఈనాటి ఎన్నో ప్రయోగాలు, ఎన్నో ప్రాణాలు నిలువుగా నిలచిపోతాయి వీరంతా దధీచికి ఏకలవ్య శిష్యులు. దధీచి ఆదర్శపు కొసలను పట్టుక ప్రపంచానికి "త్యాగం" విలువచాటేవారే.

ఇలా వెన్నెపూసల దానం "భారతంలో" నూ జరిగింది. భారత కావ్యం లోని శకునినీ, అతగాడి నూరుగురు సోదరులనూ, తండ్రినీ, దుర్యోధనుడు పరమ కిరాతకంగా భూ గృహంలో బంధించి అంతమందికీ రోజుకొక్క 'కబళం' అన్నం మాత్రం భూగృహంలో విసరి వేయిస్తుంటాడు. ఆ అన్నం మెతుకు లన్నీ ఏరి ఒక్క శకునిని మాత్రం తినమనీ ఆ కొద్ది ఆహారంతో జీవించి దుర్యోధనుని మాయోపాయంతో సాధించి అతడి వంశనాశనంచేసి మరీ మర ణించ మనీ కోరుతాడు శకుని తండ్రి. ఆ భూగృహంలో తన నూరుగురు సోదరులూ ఆకలితో పైశాచికంగా మరణించటాన్ని చూస్తూ కనులముందు ఆ దృశ్యాన్ని చూస్తూ ఆ 'కబళం' తింటూ మెతుకుమెతుకులో 'పగ' జీర్ణించు కుంటాడు శకుని 'మంత్రంలా, మంత్రజపంలా' అలాగే తన బిడ్డలందరూ చనిపోవటాన్ని కళ్ళారా చూస్తున్న శకుని తండ్రికూడ ఆ పగ మంత్ర జపం తోనే మరణిస్తాడు. మరణించే ముందు, శకునితో తన నిర్జీవ కళేబరంలోని మాంసాన్ని ఆరగించమనీ, అలా తనలో రగిలేపగను జీర్ణించు కోమనీ, ఆ నికృష్ట భోజనంతో ఇక బంధుత్వాలు, మమకారాలు, మానవత్వమూ మరచి "పగ" ఒక్కటే ధ్యేయంగా జీవించమనీ, తన వెన్నెముకతో 'పాచికలు' తయారు చేయించి ఆ పాచికలతో కురువంశాన్ని సర్వనాశనం చేయమనీ ఆ పాచికలే అతడి అస్త్రాలనీ బోధించి ప్రాణాలు విడుస్తాడు. పగనే తపస్సు గా సాధించిన ఆ మహారాజు శకుని తండ్రి ఆజ్ఞ తు.చ. తప్పకుండా అమలు జరుపుతాడు. ఒంటరిగా, ఒక్కడుగా మిగిలిపోయిన శకుని తనతండ్రి వెన్నె ముక పాచికలుగా మార్చి, ఆ అస్త్రాలతో కౌరవులచేత సర్వ అధర్మాలూ చేయించి వారందరినీ సపుత్ర, మిత్ర బాంధవంగా ఘోర కురుక్షేత్రంలో బలియిచ్చి తానూ మరణిస్తాడు. అదీ ఆ వెన్నుపూస పాచికల మహాత్మ్యం.

ఈనాడు ఆ శకునికీ, శకుని తండ్రి వెన్నెముక పాచికలు అస్త్రాలుగా గలవారూ వున్నారు.

డబ్బుకోసం పేదల రక్తాన్ని 'రక్తం దానం' పేరిటలాగి, వారికి డబ్బు చెల్లించక ఆ డబ్బు తాము మింగే నీచులూ, బ్రతికివున్న ఖైదీల, నిస్సహాయుల కళ్ళను పెరికి, ఆ కళ్ళని అమ్ముకొనే రాక్షసులూ, బ్రతికివున్న అనాథలను అమాయక బిడ్డలను హత్యచేసి ఆ అస్థిపంజరాలను దేశ విదేశ ప్రయోగశాలలకు పంపుతున్న వారూ, అమ్ముకుంటున్నవారూ, కిడ్నీకి ఏభై వేల రూపాయలు ఖరీదు కట్టి, ఇంద్రుడు దధీచిని కోరినట్లు కిడ్నీలు సేకరించే పరమ స్వార్థపూరితులూ మన కళ్ళముందే ఎందరో వున్నారు. వీరంతా ఆ దేవేంద్రునికీ శకుని పాచికల వెన్నుపూసలకూ వారసులు. కాదంటారా?

## "ఋషభుడు"

స్వాయంభువమనువు కుమారులైన ప్రియవ్రతుడు, ఉత్తానపాదులలో ఉత్తానపాదుని కుమారుడైన ధృవుని చరిత్ర లోక ప్రసిద్ధమయింది.

ప్రియవ్రతుడు ధృవుని పెద్ద తండ్రి– ఉత్తానపాదుని అన్న స్వాయంభువ మనువు కుమారుడు) సత్రయాగ సందర్భంగా నారదమహర్షి. దక్షుని కుమారులందరికీ అత్యద్భుతమైన భక్తి వైరాగ్య యోగాలు ఉపదేశిస్తుండగా విని తనుకూడా ఆ మార్గంలోనే కొనసాగాలని తండ్రి ఇచ్చిన రాజ్యభాగాన్ని స్వీకరించక వివాహం చేసుకోక వుండిపోతాడు. అందుకు బ్రహ్మతానే స్వయంగా ప్రియ వ్రతుని గృహస్థునిగా మారి, రాజ్యపాలన చేయుమనీ సంతానాభివృద్ధి చేయమనీ కోరటానికి బయల్దేరుతాడు నారద సమేతంగా వస్తున్న ప్రియవ్రతుడు తాత అయిన బ్రహ్మదేవునికి నమస్కరిస్తాడు, భక్తిగా బ్రహ్మ అతనిని ఆశీర్వదించి గృహస్థధర్మాన్ని ఆచరిస్తూ కూడా శ్రీమన్నారాయణుని పై మనసు లగ్నంచేసి మోక్షం పొందవచ్చునని ఈ తన మాటలు శ్రీమన్నారాయణుని వాక్కులుగా తలచి ఆ ప్రకారం నడచుకోమనీ బోధిస్తాడు.

ఉత్తానపాదుడిక కాదనలేక పోతాడు, విశ్వకర్మ ప్రజాపతి కుమార్తె అయిన "బర్హిష్మతి" అనే ఆమెను పెండ్లాడి, ఆమెవలన 'యాగ్నీధ్ర, ఇద్మజిహ్వ, యజ్ఞబాహు, మహావీరా, హిరణ్యరేతో, ఘృతపృష్ఠ, సవన, మేధాతిథి, వీతిహోత్ర, కవి" అనే నామాలుగల పదిమంది పుత్రులను 'ఊర్జస్వతి' అనే కుమార్తెను కంటాడు. ఆ పుత్రులలో 'కవి, మహావీర, సదను' లనే ముగ్గురూ బాల్య ప్రాయంలోనే శ్రీమన్నారాయణుని భక్తులై, విరక్తులై, భక్తియోగంలో అరణ్యాలకు వెళ్ళిపోతారు. ప్రియవ్రతుడు మహావిష్ణు భక్తుడు గనుక ఆయనకు కొన్ని అతీతశక్తులూ వచ్చాయి ఒకనాడు మేరు పర్వతానికి ప్రదక్షిణగా సాగిపోయే సూర్యునికి రాత్రివేళ అంధకారం లేకుండా తాను చేస్తానని ప్రతిజ్ఞబూని; సూర్యరథ వేగమూ, తేజస్సు గలిగిన రథం అధిరోహించి సూర్యగమనంతో సరిసమానంగా, వాయు వేగ మనోవేగాలతో ప్రయాణిస్తూ తన వైష్ణవ తేజస్సుతో రెండవ సూర్యునిగా వెలుగుతూ ఏడురోజులు ఆ రథాన్ని మేరు పర్వతం చుట్టురా ప్రదక్షిణగా తిప్పుతాడు. ఆ రథ చక్రాల రాపిడితో ఏర్పడిన అగడ్తలే సప్త సాగరాలుగా రూపొందాయి. ఆ సాగరాల మధ్య భూప్రదేశమే సప్త ద్వీపాలుగా మారాయి. ఆ ద్వీపాల పేర్లు వరుసగా "జంబూ, ప్లక్ష, శాల్మలి, కుశ, క్రౌంచ, శాక, పుష్కరము" లుగా ఏర్పడ్డాయి. ఇలా భూమి, అరణ్యాలు, పర్వతాలు ఒకదానితో ఒకటి కలసిపోకుండా, భూమిని ఏడు ద్వీపాలుగా సముద్రాలు ఎల్లలుగా విభజించాడా ప్రియవ్రతుడు. ఆ ద్వీపాలకు తన కుమారుడైన యాగ్నీధ్రుని జంబుద్వీపానికి, వరుసగా మిగతా ఆరుగురునీ ఆరు ద్వీపాలకు రాజులుగా చేశాడు ఆ తర్వాత శ్రీమన్నారాయణుని గురించి తపస్సు చేసుకొనే కోర్కెతో తపోవనాలకు వెళ్ళిపోయాడు ప్రియవ్రతుడు. ఆయన కుమార్తె "ఊర్జస్వతి" ని భార్గవుడు (శుక్రాచార్యుడు) వివాహమాడాడు. (వాళ్ళిద్దరి కుమార్తె 'దేవయాని' మృతసంజీవినీ విద్యకు శిష్యుడైన 'కచుని' కథ 'కచ దేవయాని' కథలో కథానాయికి అయ్యిందీమె) యాగ్నీంద్రుడు జంబూద్వీపమూ పరిపాలిస్తూ పుత్రునికోసం తీవ్ర తపమాచరించాడు. బ్రహ్మదేవుడు పంపగా వచ్చిన 'పూర్వచిత్తి' అనే అప్సరస కాంతను చూచి మోహించి వివాహమాడాడు. యాగ్నీంద్రుడికి, పూర్వచిత్తికీ నాభి, కింపురుష, హరివర్ష, ఇలావృతా, రమ్యక, హిరణ్యయు, కురు, భద్రాశ్వ, కేతుమాలులనే తొమ్మిది మంది పుత్రులు కలిగారు. వారంతా వరుసగా

మేరుదేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్రి, లత, రమ్య, శ్యామ, నారి, భద్ర, దేవవతి అనే పేర్లుగల తొమ్మిదిమంది కన్యలను వివాహమాడి తమతమ పేర్లతో జంభూ ద్వీపాన్ని తొమ్మిది భాగాలుగా విభజించుకుని పాలించారు.

యగ్నీధ్ర పుత్రులలో పెద్దవాడైన "నాభి" అనేవాడు తన భార్య అయిన మేరుదేవితోకూడా శ్రీమన్నారాయణుని విష్ణుస్వరూపుడైన పుత్రుడు కావాలనే కోర్కెలో తీవ్ర తపస్సు చేశాడు. ఆ దంపతుల తపస్సుకు మెచ్చి శ్రీమన్నారాయణుడు సాక్షాత్కరించి, "నాతో సమానుడైనవాడు, నేను తప్ప మరెవ్వరున్నారు, నాభీ మీరు కోరారు గనుక, నా అంశంతో కుమారుడు మీకు జన్మిస్తాడు." అని వరం ఇచ్చాడు. కర్దమ ప్రజాపతి, దేవహూతులకు కపిలుడు శ్రీమహావిష్ణువు అవతారం జన్మించినట్లే అత్రి, అనసూయ పుణ్యదంపతులకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వర అంశాలతో త్రిమూర్తి స్వరూపుడైన "దత్తాత్రేయ స్వామి" జన్మించాడు. బ్రహ్మకు మూడుతరాల తర్వాత మనవడు అయిన "నాభి" కి శ్రీమహావిష్ణువు 'ఋషభుడు' అనే బాలునిగా జన్మించారు. ఆబాలుని 'రూప, తేజశౌర్య, విలాసాలన్నీ విష్ణువును మరపింప జేసేవిగా వున్నాయి. ఋషభావ తారం' గా కీర్తింప పడ్డాడే, ఋషభుడు జంబూద్వీపంలోని తన పితృ పితామహ భాగమైన రాజ్యాన్ని ప్రజారంజకంగా పరిపాలిస్తుండగా, ఇంద్రుడు అసూయచెంది ఆ భాగమంతా అనావృష్టికి గురిచేసి దుర్భర క్షామం కల్పించాడు. ఇంద్రుని కుత్సితం తెల్సుకున్న 'ఋషభుడు' సాక్షాత్తు శ్రీమన్నారాయణ దివ్యాంశ సంభూతుడు గనుక తనదైన యోగవిద్యతో తపోశక్తితో వర్షాలు కురిపించి, భూమిని సస్యశ్యామలంచేసి క్షామం నివారించి ప్రజల్ని రక్షించాడు. ఋషభుడు పరిపాలించే భూభాగంపేరు 'అజనాభం'

సీ॥ భూవరుండడగు ఋషభుడు దన రాజ్యంబు
'గర్మభూమి' గ నాత్మగాంచి, జనుల
కండఱకును ప్రియంబగునట్లు
కర్మతంత్రంబెల్ల, దెలుపంగదలచి, కర్మ

ములు సేయుటకు, గురువులయొద్ద
వేదంబుసదివి వారలయనుజ్ఞ వహించి
శతమన్యుడిచ్చిన సతి జయంతీ కన్య
బరిణయంబై యట్టి పడతి వలన

తే॥ గీ॥ 'భరతు' డాదిగా సుతుల నూర్వురనుగాంచె
నట్టి భరతుని పేరను వవనితలము
పురవరా శ్రమగిరి తరుపూర్ణమగుచు
నమరి భారతవర్ష నామమున మించె!

ఆదీ కథ జంబూద్వీపాన్ని ప్రియవ్రతుని పుత్రులు (స్వాయంభువ మనువు మనుమలు బ్రహ్మ మునిమనుమలు) ఏడు ద్వీపాలుగా విభజింప బడగా పరిపాలించారు. వారి వారసుదు నాభి, నాభి పుత్రుడైన ఋషభుడు పరిపాలించిన జంబూద్వీప భూభాగం 'అజనాభం' ఋషభునిపుత్రుడైన భర తుడు పరిపాలించగా ఇది భారత వర్షంగా ప్రసిద్ధి పొందింది ఋషభుడుగా జన్మించిన శ్రీమన్నారాయణుడే ఈ జంబూద్వీపాన్ని 'కర్మభూమి' గా పేర్కొన్నాడు గుర్తించాడు. బ్రహ్మ సంతతివారు పరిపాలించిన ఈ జంబూ ద్వీపం 'భరతవర్షం' 'భరత ఖండంగా' పేరుగాంచినది. నాభి మనుమడైన భరతుని వలన.

ఆ తర్వాత చరిత్రలో చాలా వేల సంవత్సరాల తర్వాత దుష్యంతుడనే రాజూ, ఆ రాజు కణ్వమహర్షి దత్త కుమార్తె (విశ్వామిత్ర మహర్షి, మేనకలకు జన్మించిన బిడ్డ) అయిన "శకుంతల" ను ప్రేమించి గాంధర్వ వివాహం చేసుకొని ఆ తర్వాత ఆమె ఎవరో తనకు తెలియదని బుకాయించటం ఆశకుం తల దుష్యంతుల కుమారుడైన భరతుడు అడవులలో పెరిగి శౌర్యనిధియై భారతదేశాన్ని పాలించటం వగైరా కథలు జరిగాయి. ఈ భరతుని ద్వారా జంబూద్వీప ఖండానికి " భరతవర్షం " అనే పేరు వచ్చిందనే వాదనకంటే—

ఋషభ కుమారుడైన భరతునివలన భరతఖండం కర్మభూమిగా, వేద భూమిగా, తపోభూమిగా, జ్ఞానభూమిగా అనాదిగా గుర్తింపబడి, గౌరవింపబడి పూజింపబడింది, అని తెలుపుతోంది భాగవతంలోని ఋషభుని కథ ఋషభుని అవతార ప్రత్యేకత!

ఇక కపిల మహాముని తల్లికి జ్ఞానోపదేశం చేసినట్లే ఋషభుడు తన కుమారులైన భరతాది నూరుగురికీ, అత్యద్భుత రీతిలో పరమహంస మార్గమైన సకల మునిజన గుహ్యమైన భక్తియోగాన్ని బోధిస్తాడు. అట్లా కుమారులకు బోధించి భరతుని రాజ్యాభిషిక్తుని చేసి తాను నిరంతరం వాసుదేవ నామ స్మరణ, ధ్యానం యోగంతో దేహాభిమానానికి మానావమానాలకు, శీతోష్ణ స్థితిగతులకూ అతీతుడై, దిగంబరుడై, అణిమాద్యష్ట సిద్ధులలాటి మహిమలు మోక్ష మార్గానికి నిరోధాలు గనుక అవి సిద్ధించినా గ్రహింపక అవధూతయై 'గోంకవంక, పటకంబు' అని పిలవబడే దక్షిణ కర్ణాటక దేశములకు పోయి 'కుటకాచలో పవనము' అనే దుర్గమారణ్యంలో దావానలంలో దేహత్యాగం చేశాడు. అయితే అవధూతగా సంచరించిన ఆ మహాత్ముని అశుచి (స్నానం ఆచరించక పోవటం, సర్వ భక్షకత్వం) లాంటి పనులు కొన్ని కొందరు యోగక్రియలుగా మార్చి, కొత్తరకం అనాచార మతాన్ని ప్రోత్సహించి పాషండులై పోయారు. ఆ కాలం ఆ రాష్ట్రాధిపతి అయిన 'అర్హు' డనే రాజు 'ఋషభుని' మతానికి ప్రాధాన్యత ఇచ్చి తానూ అలా ప్రవర్తించాడు.

అయితే ఆసేతుహిమాచలం 'ఋషభుడు' చెప్పిన ఆత్మజ్ఞానం బోధించిన భక్తి మార్గం శాశ్వతంగా నిలచిపోయాయి. ఇక భరత ఖండానికి ఆ పేరు కల్పించిన ఋషభ కుమారుడైన భరతుని కథ తెలుసుతుందాం.

—o—

# భరతుడు - భరతవర్షం

మనిషి మనసులోని సంకల్పబలం చాలా గొప్పది. చాలా బలీయమైనది భగవంతుని సంకల్ప ప్రభావం వలన ఈ కనిపిస్తున్న సకల చరాచర సృష్టి జరిగినట్లే దాని వునికి, అంతమూ జరుగుతున్నట్లె మానవుని తీవ్ర సంకల్ప బలం వల్లనే అతని నాగరికతా, పరిశోధనా, చరిత్ర, మనో వికాసమూ అత్యద్భుత రీతితో మలచబడు తున్నాయి. అణువు మొదలు అటం బాంబు వరకూ మనిషి సంకల్ప బలంలో, "తపస్సులో" తపస్సులాటి పరిశోధనలో రూపుదిద్దుకున్నవే. భార్యా భర్తలలో అంతర్గతంగా ఏయే సంకల్పాల ప్రభావం, ఏయే ఆకృతుల ఆలోచనా వుంటుందో గర్భధారణ సమయంలో ఆ స్త్రీ పురుషులిద్దరి హృదయాలలో ఏయే భావాలు ఆ క్షణంలో కదలాడుతాయో, ఆ భావాలకూ, ఆ రూపాలకూ, అనుగుణమైన బిడ్డలు జన్మిస్తారంటారు పెద్దలు. గర్భిణి స్త్రీ వున్న ఇంట్లో ఎటుచూచినా చక్కటి బిడ్డల బొమ్మలు వుంచే పద్ధతి అనాదిగా ఆలోచనకు అనుగుణంగా ఏర్పడినదే. అసుర సధ్య వేళలో తప్పుచేస్తున్నానవే భావనతో, బాధతో కశ్యప మహర్షి కామం కళ్ళు కప్పి వేయగా మెదడు మొద్దుబారి పోగా అసురీ ప్రవృత్తితో దితి. ప్రవర్తించిన తీరులో హిరణ్యాక్ష, హిరణ్య కశిపుల జననం జరిగింది. ఇలా ఎందరో మంచి దంపతులకు రాక్షస బిడ్డలు పుట్టడం వారివారి హృదయాంతర్గత ఆందోళన, భావాలు భయాలు ఆధారంగా నేనని అధునిక పరిశోధకులూ అంగీకరిస్తున్నారు, ఈ భావాలే భాగవత, భారత, రామాయణాలలో మహర్షులు చెబితే మనలోని కొందరు ఆధునికులకు హేళనగా నిరసనగా వుంటుంది,

అలాగే మరణ సమయంలో మనిషి చివరి భావాలు ఆ వ్యక్తి జీవితమంతా ఏర్పరచుకున్న సంస్కారం ప్రభావం, ఆ వ్యక్తి ప్రవర్తన ప్రభావం ఆ వ్యక్తి సంకల్ప బలం ఆధారంగా, ఆ వ్యక్తి తర్వాత జన్మవుంటుందనీ

చెబుతున్నారు మహర్షులు! అదే తమ కావ్యాలలో, పురాణాలలో ఋజువు చేశారు కూడా అంచేత మనిషి జీవితమంతా సత్కర్మలతోనూ, సత్ప్రవర్తన తోనూ, భగవద్భక్తితోనూ తనదైన కర్తవ్యపాలనతోనూ, సన్మార్గాన, సదాశయాలతో పయనిస్తే చివరి క్షణాలలో ఆ ప్రభావం హృదయంమీద వుండి ఉత్తమ మానవజన్మ మరల లభిస్తుందనీ భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు బోధించాడు హృదయంలోని సంకల్ప బలాల తీవ్రతనుబట్టి ఆ వ్యక్తి యొక్క సంస్కారం రూపుదిద్దుకొని చివరిక్షణాలలో ఆ సంస్కార ప్రభావమే ఆ జీవి వెంట వస్తుందని దీని సారాంశం! భగవచ్చింతన, నామోచ్చారణ, మంత్ర జపం, తపస్సు, స్వధర్మాచరణంలోనే రోజూ నియమంగా ఏర్పాటు చేసుకున్న మానవుడు చివరి క్షణాలలో మృత్యువును ప్రశాంతంగానూ స్వీకరించగలరనీ ఆ మృత్యు ఘడియలలో భగవన్నామం స్మరించి ఆ శ్రీమన్నారాయణుడి శ్రీచరణాలు చేరవచ్చుననీ వివిధ మహర్షుల గంధర్వుల, విద్యాధరుల, పన్నగుల, క్రిమికీటకకాల, మృగపక్షుల, రాక్షసుల కథల ద్వారా బోధిస్తుంది భాగవతం. అదీ భాగవత ప్రత్యేకత అందులో భరతుని గాథ మరణ సమయపు సంకల్పాల ఫలితాలను ప్రతిబింబిస్తుంది.

ఋషభ కుమారుడైన భరతుడు ప్రజారంజకంగా రాజ్యం పరిపాలించాడు కొంతకాలం ఇంద్రుని గురువుగా వుండి ఆ ఇంద్రుని చేతిలోనే హత్య చేయబడిన "విశ్వరూపుని" కుమార్తె 'పంచజని' అనే ఆమె భరతుని ఇల్లాలు. తండ్రి అయిన ఋషభుని బోధ గురుబోధలా భరతుని హృదయంలో నాటుకొని పోయింది ధర్మమార్గంలో ఎన్నో క్రతువులు చేస్తూ చాతుర్మాస్య వ్రతములు చేస్తు వేదోక్త విధులను తాను ఆచరించి ప్రజల చేత ఆచరింపచేస్తూ "అజనాభం" అనే తన పరిపాలిత భూమండలాన్ని ప్రజారంజకంగా పాలించి "భరత వర్షం" అనేపేరు శాశ్వతం చేశాడు భరతుడు ఆయనకు, ఆయన భార్య అయిన పంచజని వలన 'సుమతి, రాష్ట్రభుక్, సుదర్శన, ఆచరణ, ధూమ్రకేతువునే ఐదుగురు పుత్రులు కలిగారు. చాలాకాలం రాజ్యంచేసి, సుమతికి రాజ్యాభిషేకం చేసి భరతుడు వృద్ధాప్యం రాగానే పవిత్ర సాలగ్రామ స్వరూపాలకు పుట్టినిల్లు అని 'కీర్తింపబడే' గండకీనదీ తీరాన వుండే పులహాశ్రమానికి చేరి గండకీనదీ తీరాన నిరంతరం శ్రీమన్నారాయణనామ స్మరణ

ధ్యాన, యోగాలలో మహర్షిలా మారిపోయాడు. ఒకరోజు ఆయన శ్రీమన్నారాయణుని ధ్యానం చేసుకుంటుండగా, గండకీ నది తీరానికి నిండు గర్భిణి అయిన ఆడజింక ఒకటివచ్చి నీళ్ళుతాగుతోంది. ఆ సమయంలోనే దగ్గరలో సింహ గర్జన వినిపించటంతో ఆ 'హరిణం' బెదిరిపోయి. హఠాత్తుగా కలిగిన ప్రాణభయానికి ప్రసవించి ఆ నదిలోపడి ఆవలి కొండ గుహలకేసి పరిగెత్తి అక్కడ అలసటతో చనిపోయింది. నది ఒడ్డున తల్లిని కోల్పోయి పడివున్న జింకపిల్లను చూచిన భరతుడు జాలితో, బాధతో ఆర్ద్రుడై, ఆ జింకపిల్ల పెంపకం బాధ్యత వహించాడు. ఇక దాని ఆలన పాలనలో రోజురోజుకూ మమకారం మోహం ఎక్కువై, రాత్రిం బవలు ఆ జింక మీదే ధ్యానం పడిపోయింది. భరతునికి ఋషభునిలాటి అవతార పురుషునికి జన్మించి, ఋషభునిచేత ఆత్మ జ్ఞానం బోధింపబడి సకల ప్రజారంజకంగా కొన్ని లక్షల సంవత్సరాలు తనివి తీరా రాజ్యపాలనచేసి తృప్తుడై కుమారుడైన 'సుమతి'కి రాజ్యభారాన్ని అప్పగించి మోక్షగామియై పవిత్ర గండక్ నదీ పుణ్యాశ్రమ ప్రదేశంలో తాపసియై కాలం గడుపుతున్న ఆ మహారాజు ఒక జింకపిల్ల మీద మమకార పాశంతో బంధింప బడ్డాడంటే ఇక సామాన్య మానవులు మోక్షగాములు కావటానికి ఎన్నిరకాల ప్రలోభాలు, ఆకర్షణలు మమకారాలు అడ్డు తగలగలవో వూహించుకోవలసిందే. చివరకారాజుకు భగవన్నామం కూడా మరుపుకు వచ్చి మరణం ముంచుకు వచ్చిన క్షణాల్లోనూ తను లేకుండా ఆ జింకపిల్ల ఎలా బ్రతుకుతుందన్న ఆలోచనా, ఆవేదనలతోనే దాని రూపే మనోచక్షువుల ముందు నిలువగా ప్రాణాలు విడిచాడు భరతుడు.

ఫలితంగా ఆయనకు హరిణ జన్మవచ్చింది. ఉత్తమోత్తమయిన మానవ శరీరం నుండి మరల చతుష్పాదులూ, వాక్కు, మెదడు లేని మృగ జన్మకు పతనమైనప్పుడుగానీ భరతునికి తన తప్పిదమేమిటో తెలిసిరాలేదు. గత జన్మ సంస్కారం, తపస్సు సుకృతం ఫలితంగా, పూర్వజన్మ జ్ఞానం కలిగిన ఆ హరిణ రూపంలో వున్న భరతుడు మిగతా హరిణాలతో కలవక పశు వృత్తి అవలంబించక నిరంతర శ్రీహరి ధ్యానంతో ఆ నదీ ప్రాంతంలోనే ఆ ఆశ్రమ ప్రాంతంలోనే నివశించి చివరగా ఆ నదీప్రాంతంలోనే దేహత్యాగం

చేశాడు. మూడవజన్మలో సద్బ్రాహ్మణుడైన అంగీరస గోత్రీకుడైన ఒక బ్రాహ్మణునికి రెండవ భార్యకి కుమారుడై జన్మించాడు. పెద్ద భార్య కుమారులు తొమ్మిది మంది ఈ రెండవ భార్యకు మరొక కుమార్తె కూడా కలిగింది.

భరతుడు పూర్వజన్మ స్మృతి కలిగి వున్నందువల్ల ఇదే తన చివరి జన్మగా మోక్షసాధనచేసి తీరాలనీ పట్టుబట్టి ప్రాపంచిక విషయాలు పట్టించుకోకుండా, జడునిలా, ఉన్మత్తునిలా, మౌనంగా ఉండి పోయాడు హరినామ స్మరణతో. అతని తండ్రి అతనికి వేదవిధి ప్రకారం ఉపనయనాది క్రియలూ వేదపారాయణం. గాయత్రీ మంత్రోపదేశం చేయించాడు. కానీ భరతునికి నిరంతర భక్తియోగంలో ఇవి కేవలం కర్తవ్యాలే తప్ప మోక్ష మార్గాలుగా అనిపించటం లేదు తండ్రి చనిపోవటంతో ఇక సవతి సోదరులంతా జడుడిలా వున్న భరతునిచేత ఇంటిపని అంతా చేయించ సాగారు. పనిలో పనిగా తమ పంట చేనుకు రాత్రివేళ కాపలా కాసేపని కూడా పురమాయించారు. అవధూత మనస్తత్వం కలిగివున్న భరతుడు, ఏది పెట్టినా తింటాడు. ఏమి అనినా సహిస్తాడు. ఏమి చెప్పినా చేస్తాడు.

చే... ...లా వున్న భరతుని "వృషలపతి" ఒకడు తనకు సంతానం కావాలని కాళిని అర్చించి నరపశువులను బలి ఇవ్వదలచి రాత్రికి రాత్రి మంచి మనిషిని బలిపశువుగా బంధించి తెమ్మని భటుల నాజ్ఞాపించాడు. వాళ్ళు చేను కావలికాస్తున్న భరతుని "చక్కగా వున్నాడని" బంధించి పట్టుకు పోయారు ఆ రాత్రికి రాత్రి వారంతా భరతుని బలిపశువుగా అలంకరించి కాళీమాతకు బలివ్వటానికి ఆలయం ప్రవేశించారు. ఆసమయంలోనూ భరతుడు చలించ లేదు, ఆయన మనసు శ్రీమన్నారాయణుని శ్రీచరణారవింద ధ్యానంనేలో సమగ్నమై వుంది నశ్చలంగా.

కానీ జగజ్జనని అయిన కాళీమాత ఈ దురాగతాన్ని సహించలేక పోయింది. ఒక బ్రహ్మర్షి సదుడు ఒకానొక మూఢ విశ్వాసానికి తనపాదాల చెంత బలి ఇవ్వటాన్ని ఆతల్లి చూస్తు వూరకుండలేక పోయింది. నిజరూపుతో

ప్రత్యక్షమై ఆ రాజునీ, వాడి పరివారాన్నీ చీల్చి చెండాడి భరతుని క్షేమంగా వదిలింది భరతుడు మరలా నిర్వికారంగా చేను కావలా కాస్తున్నాడు. మరో రోజు రాత్రి సింధు దేశాధీశుడైన రాజు "ఇక్షుమతి" నదీ తీరాన వున్న కపిల మహాముని వద్దకు తత్వబోధ కొరకు పల్లకిలో బయల్దేరాడు. ఆ పల్లకి మోస్తూన్న బోయీలలో కొందరు చేను కావలావున్న భరతునిచూచి "ఆరోగ్యంగా వున్న వీడిచేత కొంతసేపు పల్లకి కొమ్ము పెట్టారు. అందుకూ అభిమాన పడక మౌనంగా మోస్తున్న భరతుడు అలవాటు లేని ఆ నడక పల్లకి మోతలో తడబడసాగాడు. అతడు తడబడటంతో మిగతా బోయీల నడక శిబిక కూడా గతి తప్ప సాగాయి. పల్లకిలోని రాజుకు కోపం వచ్చింది. బోయీలను కసురుతున్నాడు. సరిగా మోయటండంటూ వాళ్ళంతా కొత్తగావచ్చి చేరిన భరతుడే అందుకు కారణమని నేరం అతనిమీద మోపారు. రాజు ఈ కొత్త బోయీని హేళనగా, నిరసనగా మాట్లాడటమేగాక, తన మాటలకు జవాబివ్వక మౌనంగా సాగుతున్న ఆ కొత్తవాడిని దండించగోరి, పరుష వాక్యాలతో తిట్టటం ప్రారంభిస్తాడు. "నీ వంకర టింకర నడక మాన్పించి, పక్రమంగా నడిపిస్తాను దుర్మతీ" అంటాడు రాజు.

అందుకు జవాబుగా భరతుడు వేదాంత అర్థ సంబంధంగా జీవునికి శరీరానికి గల సంబంధ బాంధవ్యాలు వివరించి, రాజుశిక్ష తన శరీరానికేగాని తనకు కాదనీ తాను పరమాత్మ స్వరూపమైన ఆత్మననీ. దానికి చావుపుట్టుకలు నేరములు, శిక్షలూ, హెచ్చు తగ్గులు లేవనీ చెప్పి మరలా పల్లకి భుజానికి ఎత్తు కుంటాడు. సింధు దేశాధిపునికి జ్ఞానోదయం కలిగి, పల్లకి దిగివచ్చి అవధూత స్వరూపుడైన భరతునికి మ్రొక్కి తత్వోపదేశం ప్రసాదించమని వేడు కుండాడు, అందాక తన జడత్వ ప్రవర్తనతో "జడ భరతునిగా" వున్న ఆ మహాజ్ఞాని, ఆ మహారాజుకు అద్భుత భక్తి యోగ తత్వోపదేశం చేస్తాడు.

సింధు దేశాధిపతి కూడా తృప్తుడై. గురుబోధ లభించి శ్రీమన్నారాయణుని నామ స్మరణ ఒక్కటే మోక్ష మార్గంగా గుర్తించి తన రాజధానికి తిరిగివెళ్ళి సన్మార్గంలో పయనిస్తాడు.

భరతుడుకూడా తన ఆఖరు జన్మలో శ్రీమన్నారాయణ దివ్యపద సన్నిధికి చేరుకుంటాడు. ఈ భరతుని పేర వెలసిన ఈ పుణ్య భారతంలో ఈనాటికీ ఎందరో అవధూతలు ప్రచ్ఛన్నంగా వున్నారు. ఎటొచ్చీ ఋషభుని అవదూత తత్వాన్ని "అనాచార మతంగా" స్వీకరించిన కొందరు దూర్తుల లానే, సన్యాసి వేషాలతో, అవదూత మోసాలతో తత్వమార్గాన్ని తప్పుదోవ పట్టించే వారిని వేరుచేయగలిగితే నిజమైన అవదూతలను గమనించగలం.

ఎందరో భాగవతోత్తములు కన్న పుణ్యభూమిగా, శ్రీరాముడు, సీత లాటి మానవోత్తములు తిరుగాడిన నేలగా, ధన్యభూమిగా, కర్మభూమిగా వున్న ఈ జంబూద్వీప భరతఖండంలో క్రిమిగానో, కీటకంగానో, పక్షిగానో మృగంగానో, వానరంగానో, జన్మించటమే గొప్ప తపస్సు అనుకోవలసి వుండగా మానవులుగా జన్మించిన వారందరూ గర్వపడాలి. మానవులలో చదువు, జ్ఞానం, నిత్యజీవితావసరాలు తీరే వనరూవున్న వారంతా తమ పూర్వ జన్మ సుకృతానికి సంతోషించాలి. ఈ పుణ్యభూమిలో పుట్టినా, మెట్టినా, గిట్టినా మహత్తర అదృష్టంగా భావించాలి. అవునా?

## "గజేంద్ర మోక్షణ కథ"

భాగవతంలో ప్రహ్లాద చరిత్రకు సరి సమానంగా తూగగల భక్తిరస ప్రధానగాథ "గజేంద్ర మోక్షణం" దీనినే "గజేంద్రమోక్షం" అంటూ ఈ నాటికీ రామాయణ, భారత, భాగవతాలు (కేవలం అవి మాత్రమే పఠించి లేక విని) కంఠస్థం, హృదయగతం అయిన బామ్మలు, మామ్మలు, తాతయ్యలు, హరిదాసులు పారాయణం చేస్తుంటారు. వరుసగా కష్టాలు ఒకదానివెంట ఒకటిగా వస్తునప్పుడు, ఆకష్టాలకూ, నష్టాలకూ అంతం లేదేమోనని భీతిల్లి నప్పుడు. గజేంద్రమోక్ష కథ రోజూ పారాయణం చేస్తే మండలం (నలభై రోజులు) రోజులలో ఆ కష్టాలనుంచి విముక్తి పొంది శ్రీహరి కృపకు పాత్రు లౌతారనే ప్రగాఢ విశ్వాసమూ చాలామందికి వుంది. కాస్తంత పూజా

పునస్కారాలు వున్న కుటుంబాలలో నేటికి రామాయణంలోని సుందరకాండ పారాయణంలానే భాగవతంలోని గజేంద్రమోక్షం పారాయణం చేస్తుంటారు. నిత్యం చాలామంది ఆస్తికులు కేవలం "కరి-మకరి" కి మధ్య జరిగిన పోరు గా గాక మోహపాశ బద్ధుడై అరిషడ్వర్గాల ఊబిలో దిగబడి సంసార బంధమనే మొసలిచేత జిక్కి పోరిపోరి దరిగానక చివరకు నిత్యము సత్యము అయిన పరబ్రహ్మస్వరూపం గురించిన జ్ఞాన జ్యోతి వెలుగగా ఆ దివ్యశక్తిని శరణు వేడి భవ బంధాలనుండి బయటపడిన, బయటపడవలసిన జీవుని కథగా కూడా ఇది ప్రసిద్ధమైంది.

మనువులు, మన్వంతరాలు. ఇంద్రపదవుల పీఠాలు, సప్తఋషుల పీఠాలు, మయపీఠాలు, బృహస్పతి పీఠాలు, విష్ణుపదవి ఇలా ఆయా పదవులు ఆయా పీఠాలు ఆయా సమయాలలో అత్యంత సమర్థవంతంగానూ, దైవీ శక్తులతోనూ నిర్వర్తించి, నిర్వహించిన మహర్షుల వివరాలు భాగవతం మెల్లిగా మనసుపుంచి చదివితే చాలా చక్కగా బోధపడుతుంది,

గజేంద్రమోక్షణ కథాకాలం నాటికి నాలుగవ మనువుకాలం జరుగుతోంది త్రిశిఖుడనే వాడు ఇంద్రుడు. హరి మేధుడు హరిణి అనే దంపతులకు జన్మించాడు శ్రీహరి.

క్షీరసాగరంలో "త్రికూటము" అనే పర్వతం ప్రకృతి రమణీయకతకు దివ్యశక్తులకు, అడవులు, పర్వతాలు, జలాశయాలు, సిద్ధ, చారణ, కిన్నెర, కింపురుష. యక్ష, నాగ, విహగ, మృగ గణాలకూ శ్రీహరి అనంతకోటి శక్తులకూ నిలయం ఆ పర్వతపు శిఖరం మీదే శ్రీహరి వైకుంఠధామం. శ్రీ మహా లక్ష్మితో శ్రీహరి వైకుంఠంలో స ల్లాపాలలో సరదాగా కాలక్షేపం చేస్తూనే ముల్లోకాలలోనూ తన భక్తులకు ఏ క్షణంలోనూ ఏ ఆపదా రాకుండా వచ్చిన ఆపదకు తాను అడ్డుపడుతూ, భక్తులను కాపాడుతున్నాడు మరోవైపు

ఆ పర్వతం మీద అత్యంత గహనమైన అడవులలో, లక్షలకొద్ది ఏనుగులు వున్నాయి. అవి అన్నీ ఒకనాడు కడుపారా నీళ్ళు త్రాగటానికి జలక్రీడ

ళాడటానికి బయల్దేరాయి, అవన్నీ మందలు మందలుగా కదలివస్తున్న కొండల్లావున్నాయి.

క॥ తలగవు గొండలకైనను, మలగవు సింగములకైన మార్కొనుకడిమిం
గలగవు పిడుగులకైనను, నిలబల సంపన్నవృత్తి నేనుగుగున్నల్.

ఆ కొండల్లాటి ఏనుగు గుంపులు కదలి వస్తుంటే పులులు, ఎలుగుబంట్లు నక్కలు, లేళ్ళు, ఎనుములు, కోతులు, పాములు, నెమళ్ళు ఒకటేమిటి? మిగిలిన మృగపక్షి గణాలన్నీ ప్రాణభయంతో పరుగులుతీశాయి.

వాటిలో ఒక గజేంద్రుడు తనను సేవిస్తున్న కరేణు (అడవి ఏనుగులు) కోటితో మందనుండి విడివడి ఒకానొక జలాశయం వేపు సాగిపోయాడు విధి ప్రేరితుడై.

మ॥ అటగాంచెన్ గరిణీవిభుండు నవపుల్లాంభోజ కవాహారమున్
నటదిందిందిర వారమున్ గమఠమీన గ్రాహ దుర్వారమున్
వటహింతాళ రసాలసాల సుమనోవల్లీ కుటీతీరమున్
చటులోద్ధూత మరాళ, చక్ర, బక, సంచారంబు గాసారమున్.

ఇక ఆ గజేంద్రునికి ఒళ్ళు తెలియలేదు. బలగర్వం, మదగర్వం, యవ్వనగర్వం, గజేంద్రత్వం ముఖ్యంగా ఆడ ఏనుగులు తనని సేవిస్తున్న గర్వం వుక్కిరి బిక్కిరి చేయగా ఆ జలాశయాన్ని తన పదఘట్టనలతో తొండంతో నీరు ఎగజల్లటంతో అతలాకుతలం చేసేస్తున్నాడు. ఆ కొలనులోని మీననక్రగ్రాహపాఠీనము లన్నీ ఎగసిపడుతున్నాయి గజేంద్రుని కోలాహలానికి.

అప్పుడు పట్టుకుంది ఒక పెను మొసలి గజేంద్రునికాలు. సాధారణమైన మకరిగా తలచి గజేంద్రుడా మకరిని విసిరికొట్టాడు. కానీ అది అసాధారణమైన మకరి. మరలా గజేంద్రుని కాలు పట్టుకుంది తన తీక్ష్ణదంష్ట్రలతో.

క॥ కరిఁదిగుచు మకరి సరసికి గరిదరికిని మకరి దిగుచు గరకరిబెరయన్
కరికి మకరి మకరికిగరి, భరమన నిట్లతలకుతల భటులదరిపడన్.

ఒకరినిమించిన బల ప్రదర్శనతో మరొకరు పోరాటం ప్రారంభించారు అట్లా రోజులు గడుస్తున్నాయి.

ఆ॥ మకరితోడ బోరు మాతంగవిభుని నొక్కరునిడించి పోవగాళ్ళురాక
కోరి చూచుచుండె గుంజరీయూథంబు మగలు తగలు గారె మగువలకును .

ఇక చేయగలిగిందేమీలేక మిగతా ఏనుగులన్నీ గజేంద్రుణ్ని అతని కర్మకు వదిలి వెళ్ళిపోయాయి దిగులుతో.

ఆ॥ జీవనంబు దనకు జీవనంబై! యుంట నలపుచలము నంతకంతకెక్కి-
మకరమొప్పె! డస్సె మత్తేభమల్లంభు బహుళపక్ష శీత భానుపగిది!

నీళ్ళలోవున్న మొసలి బలం తెలుసుకున్న గజేంద్రుడు ప్రాన్పడిపోయాడు ఆ మకరిని జయించగల మకరిపట్టు విడిపించుకొనగల శక్తి తనకు లేదని తెలిసి పోయింది.

ఉ॥ ఊహకలంగి జీవనపుటోలమునంబడి పోరుచున్ మహా
మోహలతా నిబద్ధపదమున్ విడిపించు కొనంగలేక సం
దేహము బొందు దేహిక్రియ దీనదశన్ గజముండె భీషణ
గ్రాహ దురంత దంత పరిఘట్టిత పాద ఖురాగ్ర శల్యమై

క॥ అలయక సొలయక వేసట నొలయక కరి మకరితోడ నుద్దండత రా
త్రులు సంధ్యలు దివసంబులు సలిపెన్ బోరొక్క-వేయి సంవత్సరముల్!

ఇక అప్పుడుగానీ గజేంద్రునికి ఆత్మజ్ఞానం మేల్కొనలేదు.

మ॥ వ్యధుశక్తిన్ గజమ్మా జల గ్రహముతో బెక్కేండ్లు పోరాడి సం
శిథిలంబై తన లావు వైరిబలమున్ జింతించి మథ్యామనో
రథ మింకేటికిః దీని గెల్వసరిపోరం జాలరాదంచు ప
వ్యథమై యిట్లను బూర్వపుణ్యఫల దివ్య జ్ఞాన సంపత్తితోన్!

పూర్వజ్ఞాన సంపత్తి వలననే ఆ క్షణంలోనైనా తనశక్తి మీద ఆశ వదలు కొని భగవంతుని శరణాగతి చెందాడు గజేంద్రుడు. ఇందాకా గజేంద్రమోక్షం కథ చదివేటప్పుడు ఆ కథలోని గజేంద్రుడు ఎవరోకాదు ఎవరికి వారం "మన మే సుమా" అనిపించేట్లు చేస్తుంది. పోతన మహాకవి కవితాఝరి! ప్రతి పద్యం ఒక తేనె సోనలా గంగా ప్రవాహం అయితే, ప్రతిక్షరం ఒక రస గుళిక. క్రమాలంకారాలు, కవితా చమత్కృతులు శబ్ద పదవిన్యాసాలు, అర్థ చాతుర్యాలు, వెల్లివిరిసి పోయాయి. అక్షరం అక్షరంలో ఇక గజేంద్రునిలో ఆత్మజ్ఞానజ్యోతి వెలిగింది. భక్తి వెల్లువైంది పోతన మహాకవి ఆత్మ ఆ గజేం ద్రుని లోనికి పరకాయ ప్రవేశం చేసింది.

మనమందరం గుర్తించాల్సిందొకటుంది. ఇక్కడివరకూ జరిగిన గజేం ద్రుని కథలో ఆ గజేంద్రుని పాత్రలో మనల్ని మనం పరిపోల్చుకుంటే ఈ నాడు మానవ జీవితం సాధించని సుఖంలేదు. సాధించని సైన్సు (విజ్ఞానం) లేదు. సాధించని సెక్సు పరిజ్ఞానం లేదు, సర్వం మానవుని అరచేతికి అందివ స్వర్గమైంది. ఆమైకంలో, ఆ ప్రలోభంలో. అపరుగులో ఎవరికివారు మైమరచి పోతున్న యుగమిది. అలాగే మనిషి చుట్టూరా ఆపదలు అనుక్షణం మోహ రించి వున్న యుగంకూడా ఇదే ధ్వని, వాతావరణ కాలుష్యాలు మొదలు రోడ్డు. బస్సు, రైలు, విమాన, అణుశక్తి ప్రమాదాలవరకూ అనుక్షణం పసి బిడ్డల మొదలు వృద్ధుల వరకూ వలయంలా ఏర్పడి వున్నాయి. ఎవరు ఏ యాక్సిడెంటు పాలవుతారో, ఎవరు ఏ ఆపదలో చిక్కుకుంటారో, ఎవరు ఏదుర్వృత్తి వలయపు ఊబిలో కూరుకుపోతారో, ఎవరే చక్రబంధంలోకి లాగ బడతారో, ఎవరు దుర్వ్యసన వలయంలో ఇరికించబడతారో ఎవరికి వారికి తెలియనిస్థితి ఇది. ఊహించలేని స్థితి ఇది వీటన్నిటికి మించి ఏరోజు కారోజు

గ్యాస్ స్టౌవు ప్రమాదాలు వరకట్న ప్రమాదాలు, లాకప్ మరణాలు, వుండనే వున్నాయి, అవదల వలయాలు దాటి క్షేమంగా ఇల్లు చేరుకోవటం అన్నది స్త్రీ పురుష బాల వృద్ధులందరికీ ఓ గొప్పవరం ఈనాడు. ఆ తర్వాత ఈనాటి సగటు కాంట్రాక్టు పద్ధతులలో కట్టబడుతున్న ఆ అంతస్తుల భవనాలలో ఏదీ కూలి దుర్మరణం పాలుగాకుండా ఏరోజు కారోజు "దిన దిన గండం, నూరేళ్ళ అయుషు సాధించుకోవటం రెండోవరం. ఇక కుటుంబ సభ్యులందరూ ఏదుర్వ్యసనాలకూ లోనుకాకుండా చదువు సంస్కారాలతో కాస్తంత సుఖప్రదమైన స్థిమితమైన అన్న వస్త్రాలకు లోటులేని ప్రశాంత జీవనం సాగించగలగటం మూడోవరం ఈజామని అతి విలాసాల ఊబివైపు ఆకర్షితులు కాకుండా తమని తాము అదుపులో పెట్టుకొనగలగటం అన్నదే ఈనాటి ఆత్మజ్ఞానానికి మొదటి సోపానం, మన చుట్టూరవున్న ప్రలోభాల ఊబిలో దిగబడి పోకుండా ప్రతి క్షణం మనల్ని మనం కాపాడు కోవటానికి అవసరమైన రక్షణ కవచం ఏదీ ఈనాటి వ్యవస్థలో లేదుగాక లేదు. ఉన్నది- యుగవాణిగా మహర్షులు బోధించినదే. కావ్యాల రూపంలో, ఇతిహాసాల రూపంలో మన చెవినిల్లు కట్టుకొని తెలిపినదీ. ఒక్కటే. అది భగవంతునికీ మన శరణాగతి ప్రతి మతం తెలిపేది ఇదే. అలాగని అస్తమానూ తపస్సుచేస్తూ ద్యూటి ఎగవేయమని కాదు. ఒక రోజులో ఇరవై నాలుగు గంటలలో ఒకే ఒక పది నిమిషాలు ఏస్తోత్రమో, ఏ మంత్రమో, ఏ ప్రార్థనో, మనసారా చేసి తన ఇష్టదైవం మీద సర్వభారమూ పడవేయగలిగితేచాలు ఆ పది నిమిషాలపూజే వజ్రాయుధంగా విష్ణుచక్రంలా మనల్ని కాపాడుతుంది. మనల్ని మనం ఏల్లవేళలా రక్షించుకొనలేని జీవన సమరంలో, భగవంతుని తోడ్పాటు, రక్షణ, మనకుండాలి వేయి సంవత్సరాల భీకర పోరాటం మకరితో సలిపిన గజేంద్రుడికి "పూర్వ పుణ్యఫల దివ్యజ్ఞాన సంపత్తితో" తనను రక్షించగల ఏకైక దివ్యశక్తివైపు మనసు మరలింది.

ఆ సంస్కారబీజం ఆ సంస్కార దీపం మనంకూడా మనలో వెలిగించుకోవటానికి ఇంతటనైనా కృషి సల్పుదామా? అయితే ముందుకు పదండి. గజేంద్రుడి మొర సాకుగా తీసుకొని పోతన భక్తి పారవశ్యపుటంచులకు వెళ్తూ కురిపించిన అమృత పద్యాలవైపు. అపద్యాలలోని ఆత్మార్పణ శరణాగతివైపు.

# కరి, మకరి శాపవిమోచనం

గజేంద్రునిలో జ్ఞాన నేత్రం తెరుచుకుంది. హృదయంలో భక్తి వెల్లువైంది.

ఉ॥ ఎవ్వనిచేజనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందు బరమేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వఁడనాది మధ్యలయు డెవ్వఁడు సర్వము దానయైన వా
డెవ్వండు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్,

క॥ ఒకపరి జగములు వెలివిడి
యొక పరిలోపలికి గొనుచు నుభయముదానై
సకలార్థ సాక్షియగు న
య్యకలంకుని నాత్మమూలు నర్థిదలంతున్,

క॥ లోకంబులు లోకేశులు లోకస్థులు దెగిన తుది నీలోకంబగు పెం
జీకటి కవ్వల నెవ్వడు నేకాకృత వెలుగు నతనినే సేవింతున్.

క॥ నర్తకుని భంగి బెక్కగు మూర్తులతో నెవ్వడాడు మునులున్ దివిజుల్
కీర్తింపనేర రెవ్వని వర్తన మెరుఁగెఱుగ రట్టివాని నుతింతున్.

క॥ యోగాగ్ని దగ్ధకర్ములు యోగీశ్వరులే మహాత్మునొండెఱుగక స
ద్యోగ విభాసిత మనముల బాగుగా నీక్షింతు రట్టిపరము భజింతున్.

క॥ కలడందురు దీనులయెడ గలడందురు పరమయోగి గణముల పాలం
గలడందు రన్నిదిశలను గలడు గలండ నెడువాడు గలడో లేడో.

అంటూ ఎలుగెత్తి మొరపెట్టాడు గజేంద్రుడు. అయితే కుంతీ స్తుతి "భీష్మస్తుతి" "ప్రహ్లాదస్తుతి" లానే గజేంద్రస్తుతి కూడా అత్యద్భుత రీతిలో సాగుతుంది అద్యంతం. ఎన్నోపద్యాలలో (షుమారు 19) స్తోత్రం చేసిన ఆస్తోత్రంలో మచ్చుకి కొన్ని పద్యాలు మాత్రమే పైవి అరు ఒకవైపు శ్రీ హరిని స్తోత్రం చేస్తూనే తనువున్న కష్టదశలో శంకాకులిత చిత్తుడై "కలడు కలండనెడువాడు కలడోలేడో?" అనే సందేహాన్ని కూడా వ్యక్తం చేశాడు గజేంద్రుడు. ఇంకా పరిపూర్ణశరణాగతి చెందలేదన్నమాట. అంచేత ఆ సందేహ పూరిత హృదయంగల భక్తుని చెంతకు భగవంతుడు పరుగెత్తుకురాలేదు. ప్రహ్లాదుడు నిర్ద్వంద్వంగా చెప్పాడు. 'కలడంబోధి కలండుగాలి కలడాకాశంబునన్ కుంభినిన్' అంటూ "ఇందు గలడందులేడని సందేహమువలదు చక్రి సర్వోపగంతుం డెందెందు వెదకిచూచిన అందందేగలడు." అంటూ మృత్యువుకు తన శిరస్సు అప్పగించేశాడు. అందుకే స్థంభం స్థంభంలో నుంచి ఉగ్రనరసింహావతారంతో శ్రీహరి ఉరికి వచ్చాడు. భక్తుని రక్షించటానికి మరల గజేంద్రునిలో అంతర్మథనం ప్రారంభమైంది, కలడో లేడో అనే సందేహాన్ని వదిలించుకుని 'కలడు కలడు' అనే అకుంఠిత విశ్వాసం చేకూర్చుకొని ఇక ఆ భగవంతుడు తప్ప తనకు మరోదిక్కు లేదుగాక లేదని నిర్ధారించుకొని ఆశ్రీచరణాలు తన హృదయంలో ప్రతిష్టించుకుని అత్మను లీనంచేసి.

శా॥ లావొక్కింతయులేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితః పరంబెరుగ మన్నింపన్ దగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా॥

క॥ వినుదట జీవుల మాటలు జనుదట చనిరాని చోట్ల శరణార్థులకో
యనుదట పిలిచిన సర్వము గనుదట సందేహమయ్యె గరుణావార్ధి

ఉ॥ ఓకమలాప్త యోవరద యో ప్రతి పక్షవిపక్ష దూర కు
య్యో కవి యోగివంద్య సుగుణోత్తమ యోశరణాగతామరా
నో కహః యోమునీశ్వర మనోహర యోవిపుల ప్రభావ రా
వే కరుణింపవే తలపవే శరణార్థిని నన్నుగావవే॥

అంటూ ఆర్తిగా కేకవేశాడు. అయితే గజేంద్రుని హృదయ కుహరంలో మాత్రమే ప్రతిధ్వనించిన ఆకేక ఏ ఇతర జీవజాలానికీ వినిపించేది కాదు. వినిపించదు అర్థిమై. అహంకార మమకార రహితమై. మోహావేశాలకు అతీతమై భగవంతుని శ్రీచరణాలపై మానసికంగా వాలిపోయి నిస్సహాయంగా నిశ్చింతగా నిర్ద్వంద్వంగా పెట్టిన ఆకేక ఒక్క భగవంతుని హృదయంలోనే ప్రతిధ్వనించింది, అది కొండలను గుండెలనూ చీల్చివేసే కేక, అది రాళ్ళనూ రాతి విగ్రహాలను కదిలించేకేక అది భూనభోంతరాళను ప్రతిధ్వనింపజేసి క్షణకాలం సకల చరాచర ప్రపంచాన్ని స్థంబింపచేసే కేక. అది నిశ్చలధ్యానంలో నుంచి పుట్టిన కేక. అది నిస్సహాయ దీనస్థితినుండి ఉద్భవించిన కేక అది భగవంతునికీ భక్తునికీగల అనుబంధాన్ని ఒరుపువేసి ఋజువుచేసే కెక అంచేత ఆకెకవిని కూడా ఏ దేవతలూ దేవుళ్లూ విననట్టూరుకున్న తరుణంలో,

మ॥ అలవైకుంఠ పురంబులో నగరిలో నామూలసౌధంబులో దా
వల మందార వనాంతరామృత సరః ప్రాంతేందు కాంతోపలో
త్పం పర్యంక రమావినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము 'పాహి' 'పాహి' యన గుయ్యాలించి సంరంభియై॥

మ॥ సిరికిం జెప్పడు శంఖచక్ర యుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁడ భ్రగపతిం బన్నింప డాకర్ణి కాం
తర ధమ్మిల్లము జక్క నొత్తడు వివాదప్రోద్ధత శ్రీ కుచో
పరిచేలాంచలమైన వీడడు గజ ప్రాణావ నోత్సాహియై॥

ఒక్క ఉదుటున ఆ కొలనువైపు పరుగు దీశాడు ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమహావిష్ణువు భక్త్యావేశంలో పోతన మహాకవి అక్షరశిల్పంలో ఈ పద్యాలు నిత్యనూతనమై ఎందరో చిత్రకారుల ఊహలకు ప్రాణమై శ్రీ మహా విష్ణువు ఆ రూపాన్ని యుగాల పర్యంతం భక్త జనుల మనోనేత్రాల ముందు సత్యంగా నిలిపాయి కదా? అంత

మ॥ తన వెంటనాసిరి లచ్చివెంట నవరోధవ్రాతమున్ దాని వె
న్కను బక్షీంద్రుడు వానిపొంతను ధనుః కౌమోదకీ శంఖ చ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీ కాంతుండు రావచ్చిరో
య్యన వైకుంఠ పురంబునం గలుగు వారాబాల గోపాలమున్॥

సాక్షాత్తు భగవంతుడే ఆర్తాదిక్కు దెలియని విధంగా సర్వం మరచి భక్తుని మొరఒక్కటే లక్ష్యించి పరుగెడుతుండగా ఇక వైకుంఠ ధామంలోని ఆయన సన్నిహితులు, హితులు, భక్తులు ఆశ్చర్యంగా ఆయన వెనుకాల పరుగెత్తుకు రావటంలో ఆశ్చర్యం ఏముంది.

ఇక క్షణం ఆలశ్యం చేయలేదా దీనులపాలిటి కల్పతరువు. సుదర్శన చక్రం చేతబట్టి మకరిని రక్షించి అభిమంత్రించి పంపాడు.

శా॥ భీమంబై తలద్రుంచి ప్రాణముల బాపెన్ జక్ర మాస్యక్రియన్
హేమక్ష్మాధర దేహముం జకిత వన్యేభేంద్ర సందోహమున్
గామక్రోధన గేహమున్ గరటి రక్తస్రావ గాహంబు ని
స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీ మోహమున్ గ్రాహమున్॥

మకరి పట్టునుంచి విడివడిన గజేంద్రుని శిరస్సుమీద తన అపార కృపాకటాక్ష వీక్షణాలు ఒరపి తన వరదాభయ హస్తంతో అతని శరీరాన్ని స్పృశించాడు శ్రీహరి భగవంతుని కరుణ కరస్పర్శ లభించిన వ్యక్తికి లోటేముంటుంది. తిరిగి జవసత్వాలు ఒక్కక్షణంలో సమకూరగా గజేంద్రుడు

భగవంతుని శ్రీచరణాలకు మ్రొక్కి మరలా స్తోత్రం చేశాడు. ఇక శ్రీహరి చక్రంతో చంపబడిన మకరికూడా తన జన్మ జన్మాంతరాల పాపప్రక్షాళనమై పోగా "హూ హూ" నామ గంధర్వుడుగా నిజరూపం ధరించి శ్రీహరికి మ్రొక్కాడు. పూర్వం దేవలుడనే ముని ఇచ్చిన శాపంవలన మొసలిగామారిన "హూ హూ" అనే గంధర్వుడు గజేంద్రుణ్ని బద్ధుణ్నిచేసి తద్వారా శ్రీహరి సుదర్శన చక్రంతో మకరి శరీరవిముక్తుడై తన లోకానికి వెళ్ళిపోయాడు. గజేంద్రుడుకూడా "ఇంద్రద్యుమ్నుడు" అనే ద్రవిళాధిపుడు విష్ణుభక్తుడు మౌనవ్రతంపట్టి విష్ణుధ్యానంలో కొండశిఖరంపై కూర్చుని వుండగా దుర్వాస మహాముని వచ్చాడు. ఆరాజు మౌనాన్ని ధ్యానాన్ని అహంకారంగా భావించి తనకా రాజు పరిచర్యలు చేయలేదన్న కోపంతో 'మదమత్త గజంగా జన్మించమని' శపించాడు. దాని ఫలితమే గజేంద్రుని ఈ జన్మ. చిత్రకేతుడనే విష్ణుభక్తుడు వృత్తాసురునిగా దేహధారణ చేసిన (పార్వతీదేవి శాపంతో) దుర్వాస మహాముని శాపంతో గజేంద్రునిగా జన్మించిన ఇంద్రద్యుమ్నుడనే విష్ణుభక్తుడైన రాజు తన ఆపదలో పూర్వజన్మ సంస్కారంతో చెడని విష్ణుభక్తితో విష్ణువును స్తుతించి మకరి పట్టునుండి సంసారబంధంనుండి శాపంనుండి విముక్తి చెంది నిజరూపం దాల్చి వెళ్ళిపోయాడు.

ఆ॥ కర్మతంతుడగుచు కమలాక్షు గొల్చుచును భయ నియతవృత్తి నుండెనేని
    జెడునుగర్మ మెల్ల శిథిలమై మెల్లన ప్రబలమైన విష్ణుభక్తి చెడదు॥

అని విష్ణుభక్తి ప్రాశస్త్యం నీతిగా అందించాడు వ్యాసమహర్షి. తేట తెనుగులో తియ్యగా చెప్పాడు పోతన మహాకవి.

చివరగా కనీసం భాగవతంలోని ఏఘట్టమైనా భక్తి ప్రపత్తులతో నిత్యం పారాయణం చేస్తే విష్ణుభక్తి (దైవభక్తి) ఆ మూలంగానైనా అలవాటు పడుతుందనే ఆశతో ప్రతి కావ్యంలోనూ మహర్షులు ఒక్కోఘట్టం పారాయణం చేస్తే జరిగే శుభాల జాబితా ఇచ్చారు. స్వార్థంతో ప్రలోభంతో ప్రయోగ కుతూహలంతోనైనా ప్రయత్నించి చూస్తారేమో ఈనాటి మానవులనే ఆశతో

అలా ప్రయత్నిస్తే దానంతటదే అలవాటుగా మారుతుందని తద్వారా మోహ పాశ విచ్ఛేదం జరిగి కొన్ని జన్మలకైనా కైవల్యం ప్రాప్తిస్తుందనే దూర దృష్టితో ఇంత శ్రమపడి వ్రాసిన కావ్యాలు పురాణాలు మానవ సకల జీవ రాసుల శ్రేయంః కామన తప్ప మరొకటి కోరని లేని మహర్షులు వాళ్ళు! అందుకే.

కII గజరాజమోక్షంబును నిజముగ బడియించునట్టి నియతాత్ములకున్
గజరాజవరదు డిచ్చును గజతురగ స్యందనములు గైవల్యంబున్II

అంటూ ఫలశృతి వివరించాడు.

ఈనాటి విలువల ప్రకారం గజతురగ స్పందనములనే కారు, బంగళా, ఫ్రిజ్, కలర్ టి. వి. లాంటివి అమరి నిజమైన స్థిమితమైన జీవితం ప్రసాదిం చేలా పై వాటికోసం అడ్డదారులు స్మగ్లింగ్, దొంగనోట్లు, దొంగ బంగారం, మాదక ద్రవ్యాల అమ్మకం లాంటివి కాకుండా, త్రొక్కకుండా. నియమంగా భక్తిపాటిస్తే భగవంతుడు అన్ని ఇస్తాడనీ చివరగా మోక్షంకూడా వస్తుందనీ స్వార్ధంతోనే మొదలెడుదాం. స్వార్ధంలేని పదార్ధం అహంకారములేని నిరహం కారం వుండవు ఎక్కడా, ఎప్పుడూ అవునా.

## మోహిని అవతారం - ఈశ్వరుని అవహాయకత్వం

ఈశ్వరుడు హాలహాలపానం చేసి నీలకంఠుడిగా కీర్తింపబడి పరమేశ్వరితో మరల కైలాసం చేరుకొని తన సహజయోగ సమాధిలో మునిగిపోయి. ఇక అతర్వాత క్షీరసాగరమధన కథ ఎలా మలుపు తిరిగినదీ పట్టించుకోలేదు. కానైతే మరీచాది మహామునులద్వారా శ్రీమహావిష్ణువు మోహినీ అవతారం దాల్చి దానవుల వంచించి దేవతలకు అమృతం పంపించిన మహాద్భుత ఘటన విన్నాడు ఈశ్వరుడు అంతమంది దానవులను ఇట్టే పరవశింపజేసిన

ఆ మోహినీ అవతారం ఎలా వుంటుందో చూడాలనే కుతూహలంతో ఒక రోజు పార్వతితో ప్రమథగణం అశేష శివభక్తులైన దేవ గంధర్వులంతా వెంటరాగా వైకుంఠధామం చేరుకున్నాడు. శ్రీమహావిష్ణువుకూడా పార్వతీ పరమేశ్వరులను ఉచితరీతిన గౌరవించి పూజించాడు. విష్ణువును కీర్తించాక ఈశ్వరుడు తన మనసులోని మాట బయటపెట్టాడు.,

మ॥ ఘనతన్నీమగ వోదుముల్ పలుమఱుంగన్నారమున్ వీనులన్
నినువిన్నారము చూడమెన్నడును మున్నీయాడు చందంబు మో
హిని వైదైత్యులగన్నుబ్రామి యమృతం బింద్రాది దేవాళి కి
చ్చిన నీ రూపము జూపుమా కుతుక వలన్ జిత్తంబునన్ బుట్టెడిన్॥

అంటూ అందుకు విష్ణుమూర్తి కూడా భావగంభీరంగా నవ్వి.

శా॥ శ్రీకంఠా నిను నీవ యేమఱకుమీ చిత్తంబు రంజించెదన్
నాకద్వేషుల డాగురించుటకునై నాడేనుగైకొన్న కాం
తాకారంబు జగన్నిమజ్జనము నీవై చూచెదే జూపెదన్
గైకోనర్హము లంద్రుకాముకులు సంకల్ప ప్రభూతార్థముల్॥

అని చెప్పి అంతర్థానమైపోయాడు.

ఇక్కడ మనమందరం ఒక్క విషయం గమనించాలి. మన్మధుణ్ణి జయించిన ఈశ్వరుడు నిర్వికారమూర్తి. సంకల్ప వికల్ప రహితుడు అయిన మహాయోగీశ్వరునికి కూడా ఒక్కొసారి చిన్నచిన్న విషయాలమీద కుతూహలము చూడాలనీ అనుభూతి పొందాలనీ ప్రలోభమూ కలుగుతుంటుందన టానికి ఈఘట్టం ఒక మచ్చుతునక. మాయలేడి ప్రలోభంలో రామాయణ కావ్యంలో సీతాదేవి రావణ వధకు నాంది పలికింది. రాక్షస సంహారానికి బాట వేసింది. తనకి తాను తెలియకుండానే ఈశ్వరుడు కూడా ఈఘట్టంతో ఎంతటి యోగిపుంగవులు కూడా కొన్ని ప్రలోభాలను ఒక్కొక్క సమయంలో దాటి పోలేదన్న నగ్నసత్యాన్ని చిరస్థాయిగా ఋజువుచేశాడు. విష్ణువు అంతర్థానమై

పోయాడేమిటాని అని నలుదిసలా పరికిస్తున్న ఈశ్వరునికి అల్లంతదూరాన ఒకానొక వనంలో తనదైన మహాద్భుత రూప సౌదర్య విశేషాలతో బంతిఆట ఆడుకుంటున్న ఒక దివ్యసుందరి దృశ్యా దృశ్యంగా దగ్గొచరమైంది. ఆ సుందరి లావణ్యం బంతి ఆటలో మునిగిపోయి ఆమె పయ్యెద తొలగి పాద మంజీరాలు ఘల్లు ఘల్లు మని మ్రోగుతుండగా తననితాను మరచి అటుఇటు పరుగెడుతున్న తీరు. మున్నెన్నడూ తాను చూచి ఎరుగని మహాద్భుత సౌందర్యం చూచిన ఈశ్వరుడు తన నిర్వికారిత మరచి తన అర్థాంగి అయిన పార్వతి భర్త ఈ చిత్త వికారానికి సిగ్గుపడుతుండగా ఆమెను మరచి తనను గమనిస్తున్న ప్రమథగణ భక్త బృందం దిగ్భ్రాంతిని మరచి ఆ మోహినీరూప లావణ్యవంతుడై పరుగుతీశాడు.

ఆ॥ వాలుగంటి వాడి వారుజూపుల తూలిధైర్యమెల్ల గోలుపోయి
తలిరి యెఱుకలేక మఱచె గుణంబుల నాలిమఱచె నిజగణాలిమరచె॥

అదీ ఈశ్వరుని మనస్థితి. ఇక ఆ స్త్రీమూర్తి చెట్టుచాటున దాగుతూ ఈశ్వరుని ఉనికి గమనించనట్లే తన విలాస భ్రమచాతుర్యం ప్రదర్శిస్తూ ముందుకు మున్ముందుకు కొనసాగిపోతుంది. వెంటపడి ఈశ్వరుడూ వెళ్తున్నాడు. ఆమె ఎగురవేసిన బంతిని పట్టుకోబోతున్నప్పుడు ఆమె వలువవీడి పడంగా మన్మదుణ్ణి జయించిన ఈశ్వరుడు స్వయంగా మన్మథ పరవశుడయ్యాడు.

ఆ॥ పదము సేరవచ్చు ఫాలాక్షుబొడగని చీరవీడిపడిన సిగ్గుతోడ
మగువనగచు దరులమాటున దాగెను వేల్పులేడు నబల వెంటబడియె॥

అట్లా వెళ్తుండగా ఆమె ఆయన చేతికి చిక్కినట్లే చిక్కింది. పర్వత కానన నదీ నదాలు దాటి వచ్చాక

తే॥ నిర్మలామోఘ వీర్యంబు నేలమీద బడినచోటెల్ల వెండియు బైడియయ్యె
ధరణి వీర్యంబు వడ దన్ను దాలెఱిగి దేవమాయ జడత్వంబు దెలిసె హరుడు॥

క॥ జగతాత్ముకుడగు శంభుడు మగిడెను హరినెఱిగి తనదు మహాత్మ్యమునన్
విగతత్రపుడై నిలచెను మగువ తనంబుడిగి హరియు మగవాడయ్యెన్॥

(ఇది భాగవతంలోని కథ. మోహినీ ఈశ్వరులకు సంబంధించినది. ప్రస్తుతం అయ్యప్పస్వామి జననం, మోహినీ ఈశ్వరులకు జన్మించిన శివ కేశవరూపంగా అభివర్ణించబడుతోంది.)

కామం అన్నది ఎంతటి అజేయమైనదో అది మహాయోగీశ్వరులను నిర్వికారులనూకూడా తృటిలో ఎలా లొంగదీసుకుంటుందో పరమేశ్వరుడైన ఈశ్వరుడే ఆ కామభావానికి క్షణకాలం ఎలా లొంగిపోయాడో తెలియజెప్పే కథ ఇది. అంచేత నిరంతరం సాధకులు స్త్రీ-కాంతా కనకాలకు దూరంగా వుండాలని ప్రబోధిస్తుంటారు పెద్దలు.

ఆ॥ కాముగెలువవచ్చు గాలారికావచ్చు మృత్యుజయము గలిగి మెఱయవచ్చు
నాడువారి చూపు టంపఱగెలువంగ వశముగాదు త్రిపురవైరికైన॥

అని నీతి చెప్పాడు భాగవతకర్త చివరగా.

మ॥ ఎలమిన్ దైత్యుల నాడురూపమున మోహింపించి పీయూషమం
జలితాపన్నులకున్ సురోత్తముల కుంజక్కన్ విభాగించి ని
ర్మలరేఖన్ విలసిల్లు శ్రీవిభుని దన్మాయావధూ రూపముం
దలతున్ మ్రొక్కుచు నాత్మలోన దురితధ్వాంతోగ్ర దీపంబుగన్-

అని మోహినీ అవతార శ్రీహరిని స్తుతించే భక్తులూ వున్నారు.

ఈ జరుగుతున్న తంతుకు భ్రాన్పడి పోయివున్న పార్వతిని ఊరడించి విష్ణు మాయను కీర్తించి ఈశ్వరుడు మరలా సతీ సమేతుడై ప్రమథ గణం వెంటరాగా కైలాసం చేరుకున్నాడు. ఇక "ఉషాపరిణయ" గాథలో బాణాసురుని భక్తికి బానిసై బాణాసురుని నగరానికి కాపలా దారుగా తరలి వెళ్లిన భోళాశంకరుని భక్తి వశంకరత మరోమారు చర్చించుకుందాం!

o—o

# క్షీరసాగర మథనానిక ప్రోద్బలం

నాల్గవ మనువు కాలంలో 'గజేంద్రమోక్షం' కథజరిగిందని తెలుసుకున్నాము కదా. ఐదవమనువు 'తామసు'ని తమ్ముడైన 'రైవతుడు' ఈ రైవతమనువు కాలంలో 'శుభ్రుడు' అనే తపోనిధికి "వికుంఠ" అని ప్రసిద్ధి పొందాడు. 'వికుంఠ' అనే అతని భార్యకూ శ్రీహరి జన్మించి 'వైకుంఠుడు' అని ప్రసిద్ధిపొందాడు. 'వైకుంఠ' మనే లోకాన్ని కల్పించారు. నాటికీ నేటికీ మరేనాటికీ శ్రీమహావిష్ణువు సహస్రకోటి నామాలలో ప్రసిద్ధమైనది వైకుంఠుడు. 'వైకుంఠం' శ్రీవైష్ణవులకు ముక్తిధామం. శ్రీవైకుంఠ లోకంలోకి ప్రవేశించే అర్హత పొందగలగటమన్నది మహాభక్తుల, మహర్షుల పికైకర్తవ్యం. ప్రతి విష్ణ్వాలయమూ విష్ణుభక్తుల పాలిటి వైకుంఠమే అయినా కలియుగ వైకుంఠంగా ఈనాడు 'తిరుపతి' పుణ్యక్షేత్రం ప్రసిద్ధికెక్కింది. శ్రీ వెంకటేశ్వరుడు కలియుగ వైకుంఠుడుగా పూజలందు కుంటున్నాడు ఆసేతు హిమాచలం. 'వైకుంఠ ఏకాదశి' హిందువులందరికీ పర్వదినం. ఆరోజు కులమతాల కతీతంగా వైష్ణవాలయాలన్నీ వైకుంఠ నామాలుగా వెలిగిపోతాయి. వైకుంఠ ఏకాదశిరోజు విష్ణాలయ ద్వారదర్శనం చేసినచాలు వైకుంఠానికి పోతామనే

అచంచల విశ్వాసంవుంది భక్త కోటిలో పరిసరాలలో విష్ణాలయం లేకపోతే శివాలయమైనా, అమ్మవారి ఆలయమైనాసరే ద్వారదర్శనం చేసుకుని వైకుంఠ ద్వార దర్శనం చేసుకున్న అనుభూతి పొందుతుంటారు భక్తులు "వైకుంఠ వాసా'' అని ఎలుగెత్తి పిలిచే ఆర్తుడైన భక్తునికీ, భక్తురాలికి ఆ స్వామి తక్షణం ప్రత్యక్షమై ఆదుకుంటాడు. గజేంద్రమోక్షంలోని 'అలవైకుంఠ పురంబులో నగరిలో ఆమూలసౌదంబు' అంటూ పద్యం ప్రఖ్యాతమైంది ఏమైనా శుభ్రుడనే ఆ మహోత్తమ తపస్వి 'వికుంఠ ' అనే ఆమె అదంపతుల పేర్లు చరిత్రలో ప్రసిద్ధిపొందలేదు. కానీ వారిబిడ్డగా జన్మించిన శ్రీహరి వైకుంఠుడుగా ఆయన లోకం వైకుంఠంగా శాశ్వతమైంది. అంతకంటే ఆ తల్లిదండ్రుల తపఃఫలానికి ఋజువేమిటి? ఇంతకుమించిన వరం ఏముంది ఏ తల్లిదండ్రులకయినా రామాయణకాలంలో దశరథుని కొడుకైన శ్రీరాముడు దశరథ రాముడుగా దైవంగామారి ఆయనవల్ల రఘువంశము కాకుత్స్థ వంశం ఇలా ఆ వంశకర్త లందరూ చిరస్థాయిగా చిరంజీవులై పోయారుకదా? వైకుంఠుని శ్రీమతి రమ. వైకుంఠ నామం, వైకుంఠధామం సర్వలోకప్రసిద్ధి పొందాయి.

ఇక ఆరవ మనువు 'చక్షువు' అనే తపస్వి కుమారుడు 'చాక్షుషుడు' అనే వ్యక్తి ఆ మనువు కాలంలో 'సంభూతి' అనే ఋషిపుంగవుని పుత్రునిగా జన్మించాడు శ్రీహరి, 'అజితుడు' అనే వ్యవహారనామంతో జన్మించిన శ్రీహరి క్షీర సాగర మథనానికి సూత్రధారుడూ, పాత్రధారీ అయి 'శ్రీకూర్మంగా' (కూర్మావతారం) మందరగిరిని తన వీపుపై మోస్తూ శ్రీమహావిష్ణువు అతిముఖ్యమైన దశావతారాలలో రెండవ అవతారంగా వెలిశాడు. ఈనాటికీ 'శ్రీకూర్మం' అనే ప్రసిద్ధ పుణ్యక్షేత్రం వుంది.

"నమ్మినవాడికి సొమ్ము నమ్మనివాడికి దుమ్ము' అని పెద్దలు నీతి చెబుతుంటారు. దైవం విషయంలో మనువులు మన్వంతరాలూ ఏమిటని

కొట్టిపారేసేవారికి, ఫలానా దంపతులకు జన్మించిన వ్యక్తి ఒక మానవుడు దేవుడు కావటం ఏమిటని విమర్శించేవారికి భాగవతం చదవటం, వినటం కూడా అనవసరమే. తిర్యగ్యోనులలో మానవ శరీరం ఒక్కటే పరిపూర్ణమైనది. ఈనాటి కంప్యూటర్స్‌ను మించిన యంత్రాంగమూ మేధ వుండటానికి వీలైనది మానవ శరీరం ఒక్కటే మనిషి దేవుడిగా మారినా, దానవునిగా మారినా పశుత్వంలోకి దిగజారినా మనిషి శరీరమే ఆలంబన. అంచేత మానవునిగా పుట్టిన మహానుభావునిగామారి దైవంగా విశేష మహత్యాలు పొంది దైవస్వరూపుడౌతాడు మానవుడు. ఆ ఒక్క సూక్ష్మమూ అర్థంచేసుకోగలిగే మానసిక పరిణితి సాధించుకున్నవారికే భాగవతం అయినా, రామాయణం అయినా బోధపడతాయి.

బలిచక్రవర్తి దానవరాజుగా వున్నాడా సమయంలో భక్తాగ్రేసరుడైన ప్రహ్లాదుని కుమారుడు వైరోచనుడి కుమారుడే బలి. అంటే ప్రహ్లాదుని మనవడు బలిచక్రవర్తి. తాతగారిలోని వైష్ణవభక్తి, వైష్ణవభక్తి వలన ఏర్పడిన నిష్పంగత్వం, నిర్మోహత్వం, అత్యద్భుత సత్యసంధత, దానగుణం బలిచక్రవర్తికి వున్న నైతిక ఆభరణాలు, అస్త్రాలు అయితే హిరణ్యకశిపుని లాంటి నియంత వైష్ణవ ద్వేషి దైవద్వేషికీ ఈబలి మునిమనవడుకూడా. అంచేత ఆధునిక "సైన్సు" ప్రకారం హిరణ్యకశిపుని తాలూకు రక్తకణాలు ('జీన్స్') కొన్ని బలికి సంక్రమించాయి వారసత్వంగా. అంచేత ఆ కాలంలో ఇంద్రపదవిలో వున్న "మంత్రద్యుముడు" అనే ఇంద్రుణ్ణి అతని తాలూకు దేవతా గణాలనూ తన సైన్యంతో తరిమితరిమికొట్టి ఇంద్రలోకాన్ని తన హస్తగతం చేసుకున్నాడు బలిచక్రవర్తి అతనికి అండగా ప్రచండ బలశాలులైన శంబరుడు, అరిష్టనేమి, జంభుడు, హయగ్రీవుడు, నముచి, తారకుడు బాణుడు, విప్రచిత్తి శకుని, విరోచనుడు, హేతి, ప్రహేతులు, మయుడు, మాలి, సుమాలి, కుంభుడు,నికుంభుడు, పేలోముడు,కాలకేయుడు, నివాత కవచాదులు

వజ్రదంష్ట్ర వగైరా రాక్షస ప్రముఖులు, రాక్షసప్రవృత్తి కలిగిన ఆజేయు పరాక్రమవంతులున్నారు. స్వభావసిద్ధంగా బలి మంచివాడే. అయినా, అతనిలో అంతర్గతంగా దాగివున్న కించిత్తు అసురప్రవృత్తి, తనవారైన, తన బంధువులైన అసురగణం కోరికమేరకు బలిచక్రవర్తికి దేవతలతో శతృత్వం తప్పనిసరి అయింది.

బలిచక్రవర్తిలో వున్నది ఒకేఒక బలహీనత, దానగుణం. అది ఆయనను అటు చిరంజీవిగానూ చేసింది. ఇటు పదభ్రష్టుణ్ణి చేసింది. అధఃపాతాలానికి పంపింది. అది వేరేకధ.

బలి శౌర్యపరాక్రమాలకూ అనుచరుల చావుదెబ్బలకూ తాళలేక దిక్కు-కొకరుగా పరిగెత్తిన దేవతలు ఎప్పటిలానే తమకు దిక్కు శ్రీమన్నారాయణు డొక్క-డేనని తెలుసుకున్నారు. తేల్చుకున్నారు. ఇంద్రుడు మొరపెట్టు కున్నాడు. దిక్పాలక దేవతాగణ సమేతంగా, మత్తకోకిల॥

మ॥ పట్టులేక బహుప్రకార విపన్న చిత్తుల మైతి, మే
మెట్టకేలకు నిన్ను గంటి మభిప్సిలూర్థము వచ్చె, బెన్
పెట్టయైనదవా నలంబుల వేగు నేనుగు మొత్తమొల్
నిట్టలేచిన గంగలోపల నీరుగాంచిన చాడ్పునన్॥

మ॥ నీకునేమని విన్నవింతుము! నీవు సర్వమయుండవై
లోకమెల్లను నిండియుండగ, లోక లోచన! నీవదా
లోకనంబు శుభంబు మాకును, లోక పాలకు, లేను, నీ
నాకవాసులు నీవవహ్నిదనర్చు కేతు తతిక్రియన్॥"

అప్పుడు, సరిగ్గా, ప్రహ్లాద చరిత్రలో ఇంద్రాదిదేవ, యక్ష, గంధర్వ, పన్నగ

విహగ సిద్ధా, చారణ, కిన్నెర, కింపురుష, మానవ గణాలంతా శ్రీమన్నా నారాయణుడిని ఎలుగెత్తి వేడుకున్న సమయంలో, హిరణ్యకశిపుని పీడ వదిలిస్తానంటూ, మేఘ గంభీర నాదంతో, శ్రీహరి అదృశ్యరూపుడై అభయ మిచ్చినట్లే, ఇప్పుడూ, శ్రీమహావిష్ణువు అదృశ్యరూపునిగా, ఒక మహాద్భుత దివ్యతేజఃపుంజంగా ప్రద్యుగ్గోచరుడైనాడు.

మ॥ ఒక వేయర్కులు గూడి కట్టి కదుపై. యుద్యత్ప్రభా భూతితో
నొకరూపై చనుదెంచుమాడ్కి, హరిదా నొప్పారె నావేలుపుల్
వికలాలోకనులై, విషణ్ణమతులై, విభ్రాంతులై, మ్రోలగా
వక శంకించిరి కొంత ప్రొద్దు, విభుగానం బోలునేవారికిన్!"

అదిదైవ తేజస్సు ఆదివ్యతేజస్సును బ్రహ్మాదిదేవతలే దృష్టించి చూడ లేక పోయారంటే "ఫలానా రూపంగా" గుర్తించలేక పోయారంటే ఇక సాధా రణ మానవునిలా దివ్యతేజస్సును ఎలా గుర్తించాలి! అందుకే అపార కరుణతో దైవం తనకంటూ, తనదంటూ ఒక రూపాన్ని ఏర్పరచుకొని (అదే అవతారం అంటారు) తన భక్తులకు దృగ్గోచరుడౌతాడు చర్మ చక్షువులకు' ఆరూపానికి ప్రతిబింబాలే ఆ అవతారాలూ, ఈ ఆలయాలూ, ఆ ఆలయాల లోని విగ్రహాలు; పుణ్యక్షేత్రాలు! "రాతివిగ్రహం" దేవుడా! అని హేళన చేసేవారికి, పారే నీరు పవిత్రమైనదా? దానిలో పాపాలను క్షాళితం చేసే గుణం వున్నదా?" అని తర్కించే వారి కోసమే, పై పద్యంలో "ఒక వేయ ర్కులు (వేయి సూర్యుళ్ళ కాంతి!)" కాంతిగా వర్ణించే-ఆ కాంతిని ఈ చర్మ చక్షులు చూడ లేవు గనుకా, ఆ మహర్షులు వ్రాసిన పురాణాలలో, ఆ కాంతి పుంజంలోని కొద్ది భాగాలూ ఒక ఆకారంగా ఏర్పడి, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు ఈశ్వరుడు, దేవీ, ఇలా ఎవరి మానసిక పరిణతిని బట్టి వారు ఆ రూపాన్ని

కొలుచుకొని తరించే, విధానంలో వర్ణించి మరీ మరీ చెప్పారు యుగవాణిగా అప్పుడా తేజఃపుంజం పలికింది.

క॥ ఓనలువః యోసురేశ్వర! యోనిటల తటాక్ష!
యోసురోత్తములారా!
దానవులతోడనిప్పుడు, మానుగబోరామి గలిగి
మనుటేయొప్పున్!

క॥ ఎప్పుడు దనకును సత్యము చొప్పడు నందాక,
రిపులజూచియు, దన, మై,
గప్పికొని యుండవలయున్నొప్పగ, నహి,
మూషకమున కొదిగిన భంగిన్!"

అంటూ బ్రతుకుతెరువు ఉపాయం సహనం బోధించి, అమృతం సాధించి, అదిత్రాగి, అజరామరత్వము సాధించి ఆ తర్వాత రాక్షసుల పీచ మడచమని సలహా ఇచ్చాడు. అమృతం పుట్టేందుకు ఉపాయము తానే చెప్పాడు ఆ ఆర్తత్రాణపరాయణుడు.

"పాలమున్నీటిలోపల (క్షీరసాగరం) సర్వౌషధి వృక్షాలను మూలికలను వేసిన మందరగిరి కవ్వంగా, "వాసుకి" అనే నాగరాజు కవ్వపుతాడుగా చేసి, మీరు క్షీర సాగర మధనం చేయండి. మీవెనుక అదృశ్యరూపునిగా నేనుండి, కాపాడుతాను అమృతం సాధించే పర్యంతం" అని శలవిచ్చాడు శ్రీమన్నారాయణుడు. వెంటనే ఇంద్రాది దేవతలు శ్రీహరికి మొక్కి తమ కర్తవ్యపాలనలో మునిగిపోయారు. అగర్భ శత్రువైన ఇంద్రుడు బలిచక్రవర్తిని, ఆతని సచివులైన రాక్షసులనూ మంచిచేసుకున్నాడు. క్షీర సాగర మధనానికి వారందరినీ ఒప్పించాడు. ఇంద్రుని కుట్ర తెలియని

బలిచక్రవర్తి తన వారందరినీ ఆపనికి అంగీకరింపజేశాడు. మందరగిరిని మోసుకువచ్చారు దేవదానవులు, ఆ తేవటంలో కొందరు దాని క్రిందపడి దెబ్బ తిన్నారు.

క॥ "ఏలా హరికడకేగితి? మేలా దొరకొంటి
మధికహేలన, శైలో
న్మూలనము చేసి తెచ్చితి మేలా పెక్కండ్రు మడిసి
రేలా నడుమన్

క॥ ఏటికి మము బనిపించేన్నేటికి మనబోటి వారి
కింతలు పను లిం
కేటికిరాడు రమేశ్వరు డేటికుపేక్షించె మఱవ నేటికి
మనలన్?"

అంటూ వాపోయారు. అప్పుడు శ్రీహరి

మ॥ "గరుడారోహకుడై, గదాదిధరుడై, కారుణ్యసంయుక్తుడై
హరికోటిప్రభతో "నోహో వెఱకుడీ" యంచుం బ్రదీపించి,
తద్గిరి గేలన్నొవకుండ, గందుకము మాడ్కిన్ బెట్టి,
పక్షీంద్రు పై
గరుడాలోకసుధన్ సురాసురుల ప్రాణంబుల్
సమర్థింపుచున్!"

ఆ గిరిని ఒక బంతిలా బట్టుకుని, పక్షీంద్రుడైన గరుత్మంతుని మూపు మీద పెట్టగా, ఆయనా గిరిని పాలసముద్రం వరకూ అవలీలగా మోసుకుని

వచ్చి, దానిలో పడవేశాడు. ఇక్కడ శ్రీమన్నారాయణుని వాహనం అయిన గరుత్మంతుని కాశక్తి ప్రసాదించి, తన వాహనశక్తిని కూడా ఋజువు చేశాడు దైవం. అందుకే "గరుడాల్వారు"గా పూజింపబడతాడు గరుత్మంతుడు.

ఇక వాసుకి తాడుగా చేశాడు. తోక రాక్షసులు పట్టుకొనటానికి ఇష్ట పడలేదు. నీచంగా భావించి తిరస్కరించారు! అది కేవలం విధి ప్రేరితం దేవతలు తోకను పట్టుకున్నారు. దానవులు వాసుకి పడగలవేపు పట్టుకున్నారు క్షీరసాగరమథనం ప్రారంభమయింది. పాలకడలి చుక్కలు వియన్మండలానికి ఎగసాయి. ఆ మహాద్భుత దృశ్యం చూడటానికి బ్రహ్మాదిదేవతలు గుమి కూడారు. కాని మందరగిరి బుడుంగునమునిగింది క్షీరసాగరంలో. అది చూచి దేవతలు హాహాకారాలు చేశారు. అప్పుడు ప్రత్యక్షమైనాడు శ్రీమహా విష్ణువు కూర్మావతారంతో.

o—o

# "కూర్మావతారం - మహాలక్ష్మి ఆవిర్భావం లక్ష్మీ నారాయణుల కళ్యాణం"

"సీ॥ నవరసై లక్షయోజనముల వెడలుపై,
కడుగఠోరంబైన కర్పరమున,
నడసైన బ్రహ్మాండమైన నాహారించు,
ఘనతరంబగు, ముఖ గహ్వరంబు
సకలచరాచర, జంతురాసులనెల్ల,
మ్రింగి, లోగొనునట్టి, మేటికడుపు
విశ్వంబుపై వేఱు విశ్వంబుపైబడ్డ,
నాగిన గదలనియట్టి కాళ్ళు,

తే॥ వెలికి లోనికి, జనుదెంచు విపులతుండ,
మంచు జంబుల, బోలేడి, యక్షియుగము
సుందరంబుగ విష్ణుండు సురలతోడి,
కూర్మిచెలువొంద నొక మహా కూర్మమయ్యె!"

అట్లా ఆవిర్భవించాడు శ్రీమహావిష్ణువు "శ్రీమహాకూర్మం" రూపంలో! క్షీరసాగరంలో ఓషధీరాసులు వడవేసి, మందరగిరి కవ్వముగా వాసుకి మహాసర్పం చిలుకుత్రాడుగా చేసి దేవదానవులు అమృత మథన కాంక్షితులై చిలుకుతుండగా, సముద్రగర్భంలోకి మునిగిపోతున్న మందరగిరిని శ్రీమహాకూర్మమై, తన వీపుమీద నిలుపుకుని, ఇక క్షీరసాగర మథనం కొనసాగించమని ఆనతిచ్చాడా ఆర్తత్రాణ పరాయణుడు. నిజానికి ఆ మహాద్భుత శక్తి చూచిన బ్రహ్మాది సురలు, సకలచరచరాలు శ్రీహరి విచిత్రలీలకు అచ్చెరువు పొందాయి.

కII తరిగొండ్రలోననొకడట, తరికడవకు
గుదురు నాకత్రాడును జేరల్
దరిగవ్వంబును దానఁట, హరిహరి చిత్ర
లీల, హరియే యెఱుగున్!

ఆII గొల్లవారి బ్రతుకు గొఱతనవచ్చునే?
గొల్లరీతిఁబాలకుప్పద్రచ్చి,
గొల్లలైరి సురలు, గొల్లయ్యెవిష్ణుండు
చేటులేని మందు, సిరియుగనిరి:"

అంటూ దశమస్కంధంలో ప్రారంభంకాబోయే శ్రీకృష్ణావతారంలో గోపాలునిగా శ్రీకృష్ణుడూ, ఆయనకు ఆత్మార్పణ చేసుకొన్న మూఢ భక్తులైన గొల్లలు (గోపాలకులు, గోపికలు) అయిన దేవతాగణాన్ని వర్ణించాడు తేటతెనుగులో, పోతన మహాకవి.

ఇక క్షీరసాగరంలో నుండి ముందస్తుగా వాసుకి ఫణాలనుంచి కక్కిన విషం దావానలమై, హాలహాలంగా మారి ఉద్భవించింది దానిని దేవతలందరి కోరికపై ఈశ్వరుడు మ్రింగి తన కంఠంలో ఓ ప్రక్కగా నిలిపి, నీలకంఠునిగా, గరళ కంఠునిగా ప్రసిద్ధిచెందినాడు సురాసుర పూజలందు తున్నాడు. లోక కళ్యాణం కోసం, భర్తను విషంమ్రింగమని చెప్పిన పార్వతి, "సర్వ మంగళ" గా శాశ్వత కీర్తి పొందింది మహా పతివ్రతగా! జగజ్జననిగా, ఆ తర్వాత "సురభి" అనే మహాద్భుత రూపంగల "కామధేనువు" పుట్టింది. "అగ్నిహోత్రి" అనే పేరు పెట్టుకుని ఆ కామధేనువును మహర్షులు తీసుకున్నారు అపురూపంగా, వారి స్వార్థం కొరకుకాదు. తమ వద్దకు వచ్చే అశేష సాధువులకు, సత్పురుషులకు మహారాజులకు, వారి స్థాయికి తగిన ఆతిథ్యం ఇచ్చి, విందు భోజనం ఏర్పాట్లు చేసేందుకు కామధేనువును కోరారా ఋషులు, ఈ కామధేమవునే చిత్రకారులు, శిల్పులు,

స్త్రీ మొఖము, రెండు కొమ్ములు. పెద్ద జడతో పొదుగునుంచి సర్వపదార్థాలు జల్లిస్తూ చిత్రిస్తుంటారు. ఆలయ శిల్పాలలో కూడా అదే రూపంతో వుంటుంది. ఈ కామధేనువు సంతతీ, వశిష్ట మహర్షి, విశ్వామిత్రునికి (గాధిరాజుగా వున్నపుడు) షడ్రసోపేతమైన విందు సమకూర్చేందుకు సాయపడగా, విశ్వామిత్రుడా ధేనువును తనకిమ్మని కోరటంతో, వశిష్టుడు తిరస్కరించటంతో, విశ్వామిత్రుని అకారణవైరానికి, తపోదీక్షకూ, కారణభూతమైంది రామాయణంలో అలాగే భరద్వాజ మహర్షి తన తపోశక్తితో, కామధేనువు సాయంతో భరతునికీ, భరతుని వెంటవచ్చిన వేలాది అయోధ్యా నగర వాసులకూ, లక్షలాది సైన్యాలకూ విందు భోజనం, షడ్రుచుల పానీయాలు వగైరాలన్నీ సమకూర్చి తనదైన తపఃప్రభావాన్ని అటు భరతునికి, ఇటు సర్వప్రపంచానికీ చాటుతాడు రామాయణంలో జమదగ్ని మహర్షి, కార్తవీర్యార్జునికీ, అతని పరివారానికి ఈ కామధేనువు సాయంతోనే మహాద్భుత విందు భోజనం సమర్పించగా, కార్తవీర్యార్జునుడా కామధేనువును బలత్కారంగా లాక్కుపోవటమూ! అది వెనుదిరిగి రావటమూ! జమదగ్నిని కార్తవీర్యార్జునుడు, శిరసును ఖండించగా, జమదగ్ని భార్య అయిన రేణుక "రామా! రామా!" అంటూ ఇరవై ఒక్కమార్లు ఆర్తిగా అరుస్తుంది. కుమారుని కోసం! ఆ రాముడే పరశురాముడై, ప్రళయకాల రుద్రుడై, ఇరవై ఒక్కమార్లు రాజులందరినీ హతమార్చి, తండ్రికి క్షత్రియ రాజ రక్తతర్పణంలో ఊర్ధ్వలోకాలు కల్పించి పరశురామావతారంగా కీర్తింపబడ్డాడు. ఈ కామధేనువు సంతతే! ఇంద్రుని స్వర్గంలోనూ మరెందరో మహర్షుల ఆశ్రమాలలోను వుండి, నిస్వార్థంగా ఇతరులకు సర్వ కోరికలు తీర్చే "కామధేనువుగా" చిరస్థాయిఅయింది ఈనాడూ తన్నకుండా, పొడవకుండా, చక్కగా పాలిచ్చే ఆవులు, గేదెలు వున్న ఇల్లును "కామధేనువు వున్న ఇల్లు" అంటుంటారు పెద్దలు ఆ పాడి, పంటలకు సంతోషించి. "సురభి" అగ్నిహోత్రి" "కామధేనువు" గా నిలిచిపోయింది ఆ గోమాత.

"ఉచ్చైశ్రవము" అనే మహాద్భుతమైన "అశ్వం" ఉద్భవించింది

పాలకడలిలో నుంచి, ఆ గుఱ్ఱం రూపం, తోక అన్నీ సుందరంగా వున్నాయి. ఈ గుఱ్ఱం తోక రంగు గురించే పన్నగుల తల్లి అయిన కద్రువ. గరుత్మంతుని తల్లి అయిన వినత పందెం వేసుకొని, గరుత్మంతుడు అమృత కలశం స్వర్గం నుంచి తెచ్చి, తన పిన తల్లికిచ్చి, తన తల్లిని చిరదాస్యం నుంచి విడిపించిన కథ ఉత్పన్నమైంది. ఆ గుఱ్ఱాన్ని చూచి, ఏ అందమైన వస్తువైనా సరే తనదేకావాలని సహజంగా ప్రలోభపడే ఇంద్రుడు స్వంతం చేసుకోవాలని తలచగా, శ్రీహరి వారించటంతో బలిచక్రవర్తి తాను తీసుకున్నాడు ముచ్చటపడి! అత్యద్భుతమైన శైలేంద్రంలా, "ఐరావణ" మనే ఏనుగు ఉద్భవించింది పాలకడలిలో! ఇది దిగ్గజాలలో ఒకటిగా పేరు గాంచింది. అష్ట దిగ్గజాలలో "ఐరావతం" ఒకటి!

తే॥ ఎల్ల ఋతువులయందు నెలరారి పరువమై
యింద్రు విరులతోట కేపు దెచ్చి,
కోరి వచ్చు వారి కోర్కెల నీనెడు
"వేల్పుమ్రాను", పాలవెల్లి బుట్టె!

కల్పవృక్షం, కామధేనువు అన్నవి జంట పదాలేగాక తోబుట్టువులు. ఈ కల్పవృక్షాలు ఇంద్రుని తోటలోనేగాక ఇతరలోకాలలోనూ ప్రస్తావించ బడతాయి. రామాయణ భాగవతాది గ్రంథాలలో ఎక్కడ నిస్వార్థదాతృత్వం వుంటుందో అక్కడ కల్పవృక్షము, ఎక్కడ నిష్కపట అతిథిసేవ వుంటుందో అక్కడ కామధేనువు వున్నట్లే ఈనాడయినా మరేనాడయినా!

మరల మహాద్భుత సౌందర్యరాసులైన "అప్సర స్త్రీలు" జన్మించారో పాలజలధిలో వారందరిని వివిధ దేవతాగణాలూ తమ తమ లోకాలకు ఆహ్వానించారు వారేదైవసేవలో తమ కళను అంకితంచేసే కళాకారిణులు "దేవ దాసీలు" అపురూప శిల్ప కళకు మూలమైన సౌందర్య నిధులు. కాల క్రమేణా పవిత్రమైన "దేవదాసీ" పేరు అపవిత్రతత సంతరించుకోవడమే

దురదృష్టం! ఆ అద్భుత సౌందర్యాన్ని దైవపరంగాగాక భోగపరంగా మార్చటంలోనే ఆ యుగాలలోనూ ఈనాడూ పురుష జాతి మహా తప్పిదం చేసింది.

పాలకడలిలో మంచి చల్లని చంద్రుడు ఉద్భవించాడు. బ్రహ్మ అనుమతి మీద తన యథాస్థానమైన "చంద్రలోకం" లో నిలిచిపోయాడు.

ఇట్లా క్షీరసాగరమథనంలో మహాద్భుతాలెన్నో ఉద్భవించాయి. ఆ అద్భుతాలలో ఒకటిగా "శ్రీమహాలక్ష్మి" ఆవిర్భావము జరిగింది.

క్షీరసాగరమథనం అంతా ఒక ఎత్తు అయితే శ్రీమహాలక్ష్మి ఆవిర్భావ ఘట్టం ఒక్కటి ఒక ఎత్తు. యుగాల పర్యంతం లక్షలాది చిత్రకారుల కుంచలలో కోట్లాది శిల్పుల ఉలులలో జీవంపోసుకున్న "గజలక్ష్మి" రూపం పోతన మహాకవి అక్షర శిల్పంలో అమ్మ వారి భక్తులందరి హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోతుంది

పాలకడలిలోని మీగడ, శరత్కాల మేఘాలచాటు మెరుపుతీగెల సమూహమూ, చిగురాకులతోపిండిన తమలపాకు తీగెలు, అరటి బోదెలు, బంగారు చంపకములు ఇలా ఏ అవయవానికా అవయం తీర్చిదిద్దినట్లు బ్రహ్మ సృష్టించినట్లుగావున్న ఆ భువన మోహనరూపం శ్రీ మహాలక్ష్మిది. ఆమెకు మంగళ స్నానానికిగానూ అనర్ఘ రత్న మణిమయ పీఠం ఇంద్రుడు ఇచ్చాడు. దేవతా స్త్రీలు పుణ్యజల కలశాలు తెచ్చారు. భూమి చిగురుటాకులు పరిచింది, పంచగవ్యాదులిచ్చాయి గోవులు. వసంతుడు మధువు తెచ్చాడు. మహర్షులు ఆశీర్వచనాలు పలుకుతుండగా మంగళతూర్యా నినాదాలు మిన్నుముట్టగా, గంధర్వ స్త్రీ పురుషులు నృత్యగీత వాద్యాది స్వాగతాలు పలుకగా, క్షీర సాగర తనయ" ముల్లోకాలనూ తన చల్లని చూపులతో కలయజూస్తూ కూర్చుంది అప్పుడే.

కం॥ పండిత స్తూక్తులతోడుత, దుండంబులు సాచి
తీర్థతోయము లెల్లన్
గుండముల ముంచి దిగ్వేదండంబులు
జలకమార్చె దరుణీమణికిన్

అదీ "గజలక్ష్మిదేవి" సాక్షాత్కారం : ఇరువేపులా రెండు పెద్ద పెద్ద ఏనుగులు తొండాలతో జలకలశాలలోని నీరు గుమ్మరిస్తుండగా, పెద్ద పద్మాకారపు పీఠంలో (పద్మంలో) భాసింపట్టు వేసుకుని ఎదురుగా కూర్చుని, తన చల్లని చిరునవ్వులతో ముల్లోకాలనూ చల్లగాచూస్తూ, ఒక చేతిలో ధనము, మరో చేతిలో పద్మమూ ధరించివుండే " గ జ ల క్ష్మి " అమ్మవారి ఫోటోలు, శిల్పాలు, చిత్రపటాలులేని ఇళ్ళు, ఆలయాలు అరుదు మన ఈ భారత దేశంలోని హిందూ కుటుంబాలలో!

ఇక ఆ తల్లి రూపలావణ్య విశేషాలు ఇలావుండగా, ఆమెను చూచిన దేవ పురుషులంతా ఈమె ఎవరి ఇల్లాలు అవుతుందోనని కుతూహలంతో చూస్తున్నారు. ఆమె చూపు, ఆలోచన మరో విధంగావుంది ఆమె తన పాణిగ్రహణ అదృష్టంకోసం అర్రులుచూస్తున్న దేవయక్ష గంధర్వ సిద్ద చారణ గణాదులలోని పురుషులని కలయజూచింది ఇలా ఆలోచించుకుంది

సీ॥ ఐదువనై యుండ, నలవడదొకచోట
నొకచోట సవతితో నోర్వరాదు
తగనొకచోట సంతత వైభవంగా,
దొకచోట వేడిమిమండవోల
దొకచోట గరుణలేదొక్కింత వెదకిన,
నొకచోట దగ్గతి యుంటబెట్ట,
నెఱయంగ నొకచోట నిలుకడ చాలదు,
చర్చింపనొకచోట జడత గలదు!

ఆ॥ కొన్నిచోట్లు కామగుణ గరిష్ఠంబులు
కోధసంయుతములు కొన్ని యెడలు
కొన్ని మోహలోభ కుంఠితంబులు కొన్ని
ప్రమద మత్సరాను భావకములు"

అంటూ లక్ష్మి వుండతగని, వుండటానికి ఇచ్చగించని ప్రదేశాలు వితర్కించింది ఆమెచూపు శ్రీ మహావిష్ణువుమీద పడింది ఆమె విశ్రాంతి పొందింది-వితర్కించుకుంది.

సీ॥ అమరపుత్తైదువనై యుండవచ్చును
వరునకు సవతులెవ్వరునులేరు!
వెలయంగ నశ్రాంత విభవమీతని యిల్లు,
శృంగార చందన శీతలుండు!
గలగడెన్నడు శుద్ధకారుణ్యమయమూర్తి,
విమలుండు! గదిసి సేవించవచ్చు!
నెఱినాడి తిరుగడు; నిలుకడ గలవాడు,
సకల కార్యములందు జడతలేదు,

ఆ॥ సాధురక్షకుండు, షడ్వర్గ రహితుండు
నాథుడయ్యెనేని నడవనోపు
నితడె భర్త! యనుచు నింతి సరోజాక్షు
బుష్పదామకమున, బూజసేసె!

ఉత్తమ వంశ, శీల సంజాత అయిన ఏ స్త్రీ అయినా తన కాబోయే భర్తకు పై లక్షణాలు ఉండాలనే కోరుకుంటుంది. అలాటి భర్త లభ్యమయితే ఇక ఎన్ని కష్టాలయినా చిరునవ్వుతో భరిస్తుంది ఆమె తనజీవితాన్ని తమ దాంపత్య జీవితాన్ని సార్థకం చేసుకుంటుంది. దురదృష్టవశాత్తూ

అలాటి భర్త లభ్యంకాని స్త్రీలో ఎన్ని కళలున్నా వ్యర్థమే! ఆమె ఎన్ని కష్టాలు సహించినా లోకం గుర్తించదు. ఆమె జీవితం ముళ్ళకంచెకు అల్లుకున్న పూలతీగెలాగా నిష్ప్రయోజనమూ నిస్సారమూ అవుతుంది. యుగాల పర్యంతం ఇది నగ్నసత్యం. నడుస్తున్న సత్యం.

క॥ హరిసూచిన, సిరిసూడదు,

సిరిచూచిన హరియుజూడ, పిగ్గును బొందున్!

హరియును సిరియునుఁదమలో,

సరిచూపులఁజూడ, మరుడు సందడి వెట్టెన్!

ఎందరో ఈనాటి సినిమా పాటల కవుల పాటలలోని శబ్దప్రయోగాలకు మూల పురుషుడైన పోతన మహాకవి అక్షర శిల్పాలు వెదజల్లిన ఘట్టాలెన్నిటిలోనో, ఈ ఘట్టమూ, ఈ పద్యమూ ఒకటి! ఒకటి మాత్రమే!

జనాలకు తండ్రియైన శ్రీ మహా విష్ణువు, జగముల సంపదలకు తల్లియైన ఆ మహాలక్ష్మిని చేపట్టి, తన హృదయపీఠంమీద నిలుపుతున్నాడు. సర్వ దేవతాగణం, మానవులు, మహర్షులు, సర్వలోకాలు పుష్పవర్షం కురిపించారు. లక్ష్మీ నారాయణుల వివాహ సందర్భంగా!

క॥ ఆ పాలవెల్లి కూతురు, తీపుల జూపులను దోగి, తిలకించి ప్రజల్

చేపట్టిరి సంపదలను, ప్రాపించెను మేలు, జగము ప్రబికె నరేంద్రా!

అంటూ క్షీరసాగరమథన కథనూ, క్షీరసాగరంలో ఉద్భవించిన మహాద్భుత వస్తు సముదాయాన్ని, శ్రీ మహాలక్ష్మి ఆవిర్భావాన్ని లక్ష్మీ నారాయణుల కళ్యాణాన్ని వర్ణించాడు శుకయోగీంద్రుడు, పరీక్షిన్మహారాజుకు.

## "అమ్మవార్ల అగచాట్లు ఒక అక్షర శిల్పం"

సాధారణ మానవుల ఇల్లాళ్ళకే గాక, సాక్షాత్తు దేవుళ్ళ ఇల్లాళ్ళకు కూడా ఒక్కొక్క మాట ఎలాంటి సంకట పరిస్థితులు, సంశయాలు, భయాలుఎదురౌతాయనేది భాగవతా, రామాయణ, కావ్యాలలో ఎంతో హృద్యంగానూ, అపరోక్షంగానూ చెప్పారు మహర్షులు.

ఉదాహరణకు పుట్టింటి మీది మమకారంతో, భర్త అనునయించినా వినకుండా, మొండిగా పుట్టింటికి వెళ్ళిన దాక్షాయణి, అక్కడ జరిగిన అవమానానికి, ఇక తిరిగి "దక్షరాజతనయ" గానూ, "దాక్షాయణి" గానూ భర్త దగ్గరకు రాకూడదనే కఠోర నిర్ణయంతో తనని తాను ఆత్మాహుతి చేసుకొని సతీదేవిగా మారింది. మరు జన్మలో పర్వతరాజ పుత్రి పార్వతిగా జన్మించి, ఈశ్వరుని భర్తగా పొందడానికి కఠోర తపస్సాచరించి, కోరివరించిందా పరమేశ్వరుని. ఆమె తపస్సుకు, ప్రేమకు ముగ్ధుడైన ఈశ్వరుడు, తానూ ఆమెకు అంతగానూ అంకితం చేసుకొని "అర్థనారీశ్వరునిగా" అపురూప, అసాధారణ గౌరవం ఇచ్చాడామెకు!

అయితే అంతగా కోరి చేసుకున్న ఆ భర్తతో కాపురం. ఆమెకు అనుక్షణం ఎంతటి ఆనందాన్ని, ఆత్మసంతృప్తినీ, ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మగౌరవాన్ని, పూజనీయ స్థానాన్ని, సర్వలోకైక జనని స్థానాన్ని ఇచ్చాయో, అంతటి కష్ట నష్టాలనూ చవిచూపాయి ఒకే నాణేనికి గల బొమ్మ బొరుసులా, అత్యంత భర్తృవాత్సల్యాన్ని పొందినస్త్రీ ఆభర్తతో బాటు అనేక బాధలూభరించక తప్పదు. ఇది ప్రకృతి నియమం. సీతారాముల విషయంలోనూ రామాయణం ఈ నగ్నసత్యాన్ని ఋజువు చేస్తుంది.

భోళాశంకరుడు, భక్తులు కోరికోరగానే, వరాలు ఇచ్చేస్తాడు. ఆదాయన అమాయకత్వానికి, నిష్కాపట్యానికి, నిర్మోహత్వానికి, భక్తపరాధీనతకూ నిదర్శనం అయితే, ఆక శర్వాణి కష్టాలు అప్పట్నుంచే ప్రారంభమౌతాయి. ఆయన అర్థాంగిగా! భస్మాసురునికి వరం ఇచ్చిన ఈశ్వరుడు, బాణాసురుని కోటకు "కాపలాదారు" గా తననితాను

అంకితం చేసుకున్న ఈశ్వరుడు, రావణాసుర్ని పూజలకు మైమరచే ఈశ్వరుడు, మరెందరో రాక్షసులకు భక్తసులభుడై వరాలిచ్చి, పీకల మీదికో లోకం పీకలమీదికో సమస్త వస్తుందన్న ఆలోచనకూడా చేయని ఆ నిర్వికల్ప ఈశ్వరుడు, తానెక్కడున్నా, ఏ స్థాయిలోకి వెళ్ళినా, ఏ పని చేస్తున్నా, ఉచ్చనీచాలు, అనుకోడు! సమాధి స్థితిలో నిశ్చలంగా వుండ గలగడు! కానీ ఆభర్త భార్యగా, ఆయనను తిరిగి తనకు దక్కించుకోవ టానికీ కైలాసానికి తెచ్చుకోవటానికి అమ్మవారు పడేపాట్లు ఎవరికీ అర్థం కానివి! తన సోదరుడైన శ్రీమన్నారాయణుని, మోహిని రూపంతో భస్మా సురుని పీడ! బాణాసురుని పీడ వదిలించుకోగలిగిందా ఇల్లాలు.

ఇక లక్ష్మీదేవి, శ్రీమహావిష్ణువు భార్యగా పొందే కష్టాలు అన్నీ ఇన్నీ కావు! ఆర్తత్రాణపారాయణుడైన శ్రీహరి, భక్తులకు ఏ ఆపద, ఏ సమ యంలో వచ్చినా పరుగెత్తుకు వెళతాడు. ఆ సమయంలో తనకో ఇల్లుందని కూడా గుర్తించలేడాయన! ఒక నియంతను అంతంచేయడానికి శ్రీమహా విష్ణువు వివిధ అవతారాలూ ధరిస్తాడు. ఆ రాక్షసుని వరప్రభావం గుర్తించి ఒక్కోసారి రాక్షసుని వరప్రభావం, యోగబలం, తపోబలం దుర్నిరీక్షణంగా రూపొందిన సమయంలో, ఆ రాక్షసుని కంటపడకుండా, సమయం వచ్చే వరకూ అదృశ్యరూపుడుగా వుంటాడు. భర్తృవియోగాన్ని భరించటమేగాక, ఆ సమయంలో ఆ రాక్షసునికి సకల సంపదలు సమకూర్చి, అతని కొలువులో పరోక్షదాసీనత్వం చేస్తుండే దుస్థితి కూడా మహాలక్ష్మిదే! శ్రీమహావిష్ణువు ఏదో ఒక అవతారం దాల్చి ఆ నియంతను అంతం చేసే పర్యంతం, ఆమె ప్రచ్ఛన్నంగా, పడరాని కష్టాలు పడవలసిందే!

ప్రహ్లాద చరిత్రలో హిరణ్యకశిపుడు నియంతగా మారాక, శ్రీహరి అదృశ్య రూపుడై పోయాడు! వాడి యోగబలం, వరబలం అంతటిపిమ!! బ్రహ్మ, మహేశ్వరుడు తప్ప మిగతా దేవతాగణాలంతా వాడికి ప్రణమిల్లాయి విధిలేక! ఆ దేవతాగణాలలో లక్ష్మీదేవి కూడా వుంది! అందుచేత ఆ రాక్షసునికి విజయలక్ష్మి, సంపద లక్ష్మి, సర్వ ఋతువులలో పుష్పించి, ఫలించే సస్య,

వనలక్ష్మి, సార్వభౌమాధికారలక్ష్మి, అత్యంత భోగలక్ష్మి, సర్వం ఒన గూడాయి! ఆమె తన అష్టైశ్వర్య కళలు, వాడికి ధారాదత్తం చేయక తప్పలేదు. నృసింహావతార ఆవిర్భావంతో హిరణ్య కశిపునికి మరణం సంప్రాప్తించింది సర్వ దేవతాగణాలతో బాటు లక్ష్మీదేవికూడా బాని సత్వ చెరవీడింది బ్రహ్మాది సర్వదేవతలూ ఆ ఉగ్ర నరసింహమూర్తిని స్తుతించారు అయినా నరసింహస్వామి "ఉగ్రం" తగ్గలేదు. అప్పుడు దేవతలందరూ కలిసి శ్రీమహాలక్ష్మీదేవికి విన్నవించుకున్నారు.

కII హరికింబట్టపుదేవివి! హరిసేవాని
పుణమతివి: హరిగతివి! సదా
హరి రతివి! నీవు సని, నరహరి
రోషము డింపవమ్మ! హరివీర మధ్యా!

అంటూ. ఆమెకూడా ఎంతో ఆశతో ఆ ఉగ్రమూర్తి వేపు నడిచింది. తనాయన ఉగ్ర స్వరూపం ఉపసంహరించ గలననే ఆత్మ విశ్వాసంతో! కానీ, ఆ క్షణంలో ఆ నరసింహ స్వరూపాన్ని చూచిన ఆమె చేష్టలుడిగి పోయింది! తీవ్రమైన ఆలోచనలో పడిందా రూపాన్ని చూస్తూ: మనసులో ఇలా అనుకుంది.

"సీ॥ ప్రళయార్క బింబంబు పగిదినున్నది గాని,
నెమ్మోము పూర్ణేందు నిభముగాదు!
శిఖశిఖా సంఘంబు చెలువుచూపెడుగాని,
చుడ్కి, ప్రసాద భాసురముగాని
వీరరౌద్రాద్భుత వేశమొప్పుడుగాని
భూరి కృపారస స్ఫూర్తిగాదు!
భయద దంష్ట్రాంకుర ప్రభలు గప్పెడు
గాని, దరహాసి కాంబుజాతంబుగాదు!

తే॥ కఠిన నఖర నృసింహ విగ్రహముగాని,
కామినీజన సులభ, విగ్రహముగాదు!
విన్నదియుగాదు, తొల్లినే విష్ణువలన!
గన్నదియుగాదు! భీషణాకార" మనుచు!

నిజమే! ముగ్ధ అయిన ఏ గృహిణి అయినా తన భర్త అలాంటి భీకర రూపంలో వున్నపుడు కోపంలో వున్నపుడు అలాగే నిశ్చేష్టిత అయిపోతుంది.

క॥ పలికెదనని గమకము గొను, బలికిన
గడునలిగి విభుడు ప్రతివచనములం
బలుకడని నిలుచు శశిముఖి, బలువిడి
హృదయమున జనవు, భయమును గదురన్!

ఆమె ఆయనను సమీపింపలేక పోయింది భయంతో! అప్పుడు ప్రహ్లాద స్తుతితో శాంతించిన నృసింహుడు లక్ష్మీసమేతుడై ప్రసన్నుడై వైకుంఠానికి వెళ్ళాడు అప్పుడే ఆ ఇల్లాలికి స్థిమితం చిక్కింది.

ఇక "గజేంద్రమోక్షణం" కథలో వైకుంఠునికి ఒళ్లే తెలియలేదు గజేంద్రుని దీనమైన పెనుకేకతో! ఆయుధాల మాట అలావుంచి, సరస సల్లాపాలలో వున్నపుడు, ఆమె పైటచెరగు పట్టుకోని వున్నవాడల్లా, ఆ చెంగు తన చేతిలోనే చిక్కివున్న స్పృహ అయినా లేకుండా పరుగెడుతున్నాడు, గజేంద్ర రక్షణకు! ఆ సమయంలో ఆమె ఆయనవెంట పరుగుతీస్తోంది:

ఎలా! ఏమిటి సరిగాలేని తన వక్షస్థలం తాను దాచుకుంటూ, భర్త ఇంతటి వేగంతో ఆందోళనతో ఎందుకు ఎక్కడికి పరుగెడుతున్నాడో తెలియని ఆందోళనతో, పుణ్యలోకవాసులూ ఈ దృశ్యాన్ని వింతగానూ, విడ్డూరంగానూ చూస్తున్నారన్న సిగ్గుతో-తాను జగజ్జననియే అయినా ఆ సమయంలో ఒక స్త్రీని కదా అనే కించిత్తు లజ్జతో-మనసులోని డోలాందోళనతో.

మ॥ "తనపేంచేయి పదంబు బేర్కొన, దనాధ స్త్రీ జనాలాపముల్
వినెనో! బ్రహ్మచ్చులు బ్రముచ్చిలించిరా
ఖిలుల్ వేద ప్రపంచంబులన్?
దనుజానీకము దేవతానగరి పైదండెత్తెనో, భక్తులం
గని, "చక్రాయుధుడేడి? చూపు" డని
ధిక్కరించిరో దుర్జనుల్!"

అంటూ తన భర్త అవతార అవసరాలు, ద్రౌపది, మత్స్యావతారం, నృసింహావతారం, వృత్రాసుర వధల్లాటి వీరోచిత, ఆర్తత్రాణ పరాయణత్వపు గాధలన్నీ మననం చేసుకుంటూ.

శా॥ తాటంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్ల బంధంబుతో
శాటీ ముక్తకుచంబుతో, నదృఢ చంచత్కాంతితో, శీర్ణలా
లాటా లేపముతో, "మనోహర" కరాల గ్నోత్తరీయంబుతోఁ
గోటీందు ప్రభతో. సురోజ భర సంకోచద్వలగ్నంబుతోన్!"

అలా పరుగెడుతోందా ఇల్లాలు! ఎంతటి అద్భుత దృశ్యమో, పోతన మహాకవి అక్షర శిల్పంలోని ఆ మనోహర రూపం ఏ జగజ్జనని భక్తుల హృదయాలలో చిరముద్ర వేసుకోదు మరి?

ఇక ఆ భర్తగారి పరుగు కారణం తెలుసుకుందామని ఆమె పడే బాధ అంతా ఇంతా కాదు!

క॥ అడిగెదనని నికడువడిజను! నడిగిన దను
మగుడనుడుగండని, నడయుడుగున్!
వెడవెడ సిడిముడి దడబడ, నడుగిడు!
నడుగిడదు, జడిమనడుగిడు నెడలన్!"

అహో! ఏం అక్షర విన్యాసమో! ఎంతటి శబ్దశిల్పమో! (ఈనాటి సినిమాలలో ఒక్క పాట అంత్యప్రాసలతో వ్రాసిన కవిగారిని (వారు మిగతావన్నీ పరమబూతు, పాటలు వ్రాసినా!) అందలం ఎక్కిస్తున్న మనం, ఆనాటి పోతనకవి ఈ అక్షర శిల్పానికీ, శిల్పాకృతులకూ, ఆయన హృదయపు భక్తి భావతరంగాలకూ సాగిలబడి మ్రొక్కవలసిన అవశ్యకత, బాధ్యత లేదా? ఆలోచించండి క్షణకాలం!

శ్రీమన్నారాయణుడు మకరిపట్టు నుండి కరిని విడిపించి. రెంటికీ శాపవిమోచనం అయ్యాక దేవతాగణ పూజలందుకుని, అప్పుడుగానీ, తన పరుగు గురించి, తన వెనకాల అలావరుగెత్తి వచ్చిన ఇల్లాలిని గురించి ఆలోచించలేదు; ఆలోచిస్తే ఆయనసలు భగవంతుడూ కాడు!

తిరిగివెళ్తూ, ఏకాంతంలో తన ఇల్లాలిని అనునయిస్తూ అంటాడు. శ్రీమహావిష్ణువు వెన్నెలలాటి నవ్వులు కురిపిస్తూ భార్యపట్ల జాలి, అముగ్ధపట్ల ప్రేమ, తన మతిమరుపుపట్ల బాధ ముప్పిరిగొనగా,

క॥ బాలా! నావెను వెంటను, హేలన్
విను వీధినుండి యే తెంచుచు నీ
చేలాంచలంబు బట్టుట, కాలో, నేమంటినన్ను! సంజభోము!భీ

క॥ ఎఱుగుదు తెఱవా! యెప్పుడు మఱవను,
సకలంబు నన్ను మఱచిన యెడలన్
మఱతునని యెఱిగి మొఱగక, మఱవక
మొఱయిడిరయేని, మరి యన్యములన్!

అన్నాడు ఆ భక్త జనులపాలిటి కల్పతరువు!

అయితే జగజ్జనని, జగన్మాతృస్థానంలో వున్న ఆ తల్లికి తెలియదా భక్తపరాధీనత? భక్తుడైన బిడ్డ ఆర్తి తీర్చవలసిన బాధ్యత గల

తలితండ్రులుగా తామిద్దరూ ఆ మాత్రం కష్టనష్టాలు భరించాలి అని అందుకే ఆమె జవాబిస్తుంది వినయంగా మృదువుగా, భర్తపట్ల అతిశయించిన ప్రేమాభిమాన గౌరవాలతో అలాంటి భర్తను పొందగలిగిన తన అదృష్టానికి గర్వంతో, సంతోషంతో.

క॥ దేవా! దేవర యడుగులు భావంబున
 నిలిపి కొలుచుపని నా పనిగా
 కో, వల్లభ: యేమనియెద! నీ వెంటనే,
 వచ్చుచుండి నిఖిలాధిపతీ!

క॥ దీనుల కుయ్యాలింపను, దేనులరక్షింప,
 మేలు దీవెనబొందన్
 దీనావన! నీ కొప్పును! దీన పరాదీన!
 దేవదేవమహేశా!"

అని భర్త హృదయంలో తన స్థానాన్ని మరింత సుస్థిరంచేసుకుందా ఇల్లాలు! దాంపత్య జీవితంలో తామిద్దరూ ఒకరికొకరుగా ప్రాణంగా వుండటమన్నది. గొప్ప అదృష్టం వరం. తామిద్దరూ అలా శాంతిగా వున్నాక, ఇతరులను గురించి, వారి కష్టాలు, సమస్యలు కొంత కొంత తీర్చ గలిగే అవకాశం వచ్చినప్పుడు, ఆ సాయంచేయగలగటమన్నది మరో అదృష్టం. వరం! అలాగాక, భర్త వాత్సల్యం పొందీ, ఇంకా ఏదో అతగాడు తమకు అందివ్వలేదని (ఆలస్యంగా వచ్చి సినిమాకు తీసికెళ్ళలేదనో, ఈ జామనీ సాధించుకురాలేదనో ఎక్కువ నగలు, చీరెలు అమర్చలేదనో) అనవసరమైన సమస్య సృష్టించుకొనే కొందరు గృహిణులు నిజంగా అన్ని అదృష్టాలు పొందీ, తమ అదృష్టం ఏమిటో తెలుసుకోలేని వెర్రివారు!

తన సీత కారణంగా, సకల రాక్షసులను నిర్జించిన శ్రీరాముడు దేవుడైనాడు. అలా మహర్షులకు రాక్షసపీడ తొలగిన కారణంగా సీత దేవత అయ్యింది భర్తను గరళం మ్రింగమన్న సర్వ మంగళ- ఆది దేవతగా అనేక రూపాలతో కొలవబడుతోంది (అది లోక కళ్యాణం కోసం గమక!)

అలాగే ఒక్కో రాక్షసుని, కియంత అంతానికి వివిధ అవతారాలు ధరించే శ్రీ మహావిష్ణువు ఇల్లాలు జగజ్జనని అయ్యింది

కాబట్టి అమ్మవార్ల కష్టాలు అమ్మవార్లకున్నాయి!

సాధారణ గృహిణుల కష్టాలు సాధారణ గృహిణులకు వున్నాయి! ఏయుగంలో నయినా.

## అమృతకలశం మోహిని అవతారం

క్షీరసాగరమథనకథనంలో భాగంగా శ్రీలక్ష్మీనారాయణుల కళ్యాణం కూడా జరిగిపోయింది లోక కళ్యాణకారకంగా! చివరగా అమృతకలశం చేతులతో పట్టుకుని విష్ణుస్వరూపునిలా "ధన్వంతరి" అవతరించాడు. ఆయనే సకల ఆయుర్వేదశాస్త్రానికి ఆదిదేవుడు, ఆదిపురుషుడు! ఆయన వైద్యశాస్త్ర నిర్మాత, నిర్ణేత! అందాకా క్షీరసాగరమథనంలో వున్న దేవాసురులంతా చూశారా మహానుభావుణ్ణి అసురుల గబుక్కనపుచ్చుకున్నారు ఆ అమృత కలశం బలం ప్రదర్శిస్తూ దేవతలు దిగ్భ్రాంతిపొందారు. ఇంతటి కష్టమూ మట్టిపాలైందన్నట్లుగా, మరల శ్రీమన్నారాయణునికి మొరపెట్టుకున్నారు దేవతలు "అమృతం అసురపాలైంది స్వామి" అంటూ! అప్పుడు శ్రీమహా విష్ణువు వాళ్ళకు మరల అభయమిస్తూ, ఇక "కలి" ప్రవేశింపబోతోందిగనుక స్వాతి ప్రవృత్తితో దేవతలు నర్తిల్లాలి గనుకా, అసురులు అణిచి వేయబడాలి కనుకా, అమృతం దేవతలకు పంచివ్వాల్సిన ఆవశ్యకత తనకు తెలుసునంటూ దేవతలను ఓదార్చి అదృశ్యుడై పోయాడు అదే సమయంలో దానవులు ఆ అమృతభాండాన్ని ఒకరిచేతిలోనుండి మరొకరు లాక్కుంటూ నానా రభస చేస్తున్నారు.

ఆ సమయంలో ఆవిర్భవించాడు శ్రీ మహావిష్ణువు "జగన్మోహిని" రూపంలో! ఆ మహాద్భుత రూప లావణ్యరాశియైన స్త్రీనిచూచి, అసలే కామ

ప్రవృత్తి కలిగిన రాక్షసులు! మోహపాశబద్ధులై! ఆమె వద్దకే అమృతభాండం తెచ్చి! ఆమె చేతికిచ్చి!

క॥ వనిత! కశ్యపు సంతతివారమేము
భ్రాతలము సురలకే మిద్ధపౌరుషులము
జ్ఞాతులకు, మాకు, నేకార్థ సంగతులకు,
బాలుదీరని యర్థంబుపంచియిమ్ము!"

అన్నారు ఓరకంగా ఆలోచిస్తే, ఈ ఘట్టంలో రాక్షసులు చాలా అమాయకులు మోహినీరూప పరవశులు! శారీరక బలమే తప్ప బుర్రలో దురాలోచన లేనివారు. ఆ అవకాశం కోసమే చూస్తున్న మోహిని వారిని తన రూపలావణ్యాలతో కవ్విస్తూ.

క॥ పలుకులు మధురసధారలు, దలపులు
నానా ప్రకార దావానలమున్
సెలుములు, సాలా వృకములు! చెలువల
నమ్మంగ వేదసిద్ధాంతములే!"

అని హెచ్చరిస్తూనే, "నా చేతనైనంత వరకూ మీకు జాగ్రత్తగా అమృతం పంచుతాను సురాసురులకు" అంది

క॥ ఆకాంతాలోకనములు, నాశీతల
భాషణములు నాలాలితముల్
రాశిపరంపర లగుచును పాశములై
వారినోళ్ళు బంధించెనృపా!"

అదీ అతికాముకత్వ ఫలితం! ఏ యుగంలోనయినా, ఈనాడయినా ఏ పురుషుడు తన కర్తవ్యధ్యేయం మరచి, కామ, మోహములకు మాత్రం ప్రాధాన్యం ఇస్తాడో, వాడి కష్టం అంతా వృధాఅవుతోంది వాడి శారీరక మానసిక శక్తియుక్తులన్నీ నశిస్తాయి. వ్యర్థమైన శ్రమమాత్రం పొంది,

అమృత భాండంలాటి అభివృద్ధిని జారవిడుచుకుంటారు! ఆ ఒక్క నీతి యుగ పర్యంతం ఋజువుచేస్తుందా చిన్నపద్యం ఒక్కటీ! మహర్షుల తపోవిఘ్నానికైనా, మహాత్ముల కర్తవ్య పాలనా నిరోధానికి అయినా, పైరకం మోహపాశమే కారణమౌతుంటుంది తరచూ!

రెండు వరుసలలో కూర్చున్న సురాసురులలో, మోహిని అమృతాన్ని గబగబ సురులకు పంచేసింది. తాము త్వరపడితే ఆ వడతికి కోపం వస్తుందేమో తమకా సౌందర్యాలో లోకానికి అవకాశం పోతుందేమోననే కామ మోహిత మనస్కులు, విమూఢ చిత్తులు అయిన రాక్షసులు అలా చూస్తూ కూర్చుండి పోయారు జరుగుతున్న మోసం గ్రహించిన రాహువు, తానూ దేవతలతోవచ్చి కూర్చుని అమృతం త్రాగాడు కొద్దిగా. అది గమనించిన సూర్యచంద్రులు మోహిని రూపంలోవున్న శ్రీ మహావిష్ణువుకు సైగచేయగా సుదర్శన చక్రంవచ్చి వాడి తల త్రుంచేసింది. కానీ అమృత పానంవల్ల ఆ శిరస్సు మాత్రం అమరత్వం పొందింది. బ్రహ్మ ఆ రాహువు శిరస్సును గ్రహంగా రూపొందించి గౌరవించాడు ఒక్కబొట్టు అమృతంకూడా రాక్షసులకు చిక్కకుండా దేవతలకు పంచిన శ్రీహరి అదృశ్యుడై మోహిని అవతారాన్ని యుగాల పర్యంతం శాశ్వతంచేసి తన నిజరూపం దాల్చాడు. ఇక్కడ మరల ఓ మహాద్భుత నీతి, సూక్తి కథలో భాగం, తేటతెనుగులో చెబుతాడు పోతన మహాకవి.

క॥ దానవులమృతము ద్రావంబూని,
పయోరాశిఁ దచ్చి, పొగిలిన మాడ్కిన్
శ్రీనాధ పరాఙ్ముఖులగు, హీనులు
నొందంగజాల రిష్టార్థంబుల్!"

దైవం కరుణ, దైవంమీద విశ్వాసం, దైవంపట్ల శరణాగతి వున్నవారికి ఏర్పరచుకున్నవారికి లభ్యంకానిదంటూ ఏమిలేదు అవి తపవారికి. కుతర్కాలతో కాలం వృధా పుచ్చుకొనేవారికి, దానవులలో శ్రమ తప్ప, మిగిలేదేమీలేదు. అదీ క్షీరసాగరమధనంలోనూ, మోహినీ అవతారఘట్టంలోనూ చెప్పదలచిన, చెప్పిన రహస్యం.

ఇక అమృతం తమకు చుక్కయినా దక్కలేదనీ, తాము దేవతలచేత వారికి రక్షకుడైన శ్రీమన్నారాయణునిచేతా మోసగింపబడ్డామనీ తెలుసుకున్న రాక్షసులు మండిపడ్డారు బలిచక్రవర్తికూడా కోపం వచ్చింది సకలాయుధ సన్నద్ధులైన తన రాక్షస సేనవెంట బలిచక్రవర్తి యుద్ధానికి వచ్చాడు,

మ॥ అరుదై, కామగమై, మయాసుర
కృతంబై, లోకితాలోక్యమై
వర శస్త్రాస్త్ర సమేతమై, తరళమై
వైహాయసంబై మహా
సుర యోధాన్వితమైన, యానమున,
సంశోభిల్లె, బూర్ణేందు, సు
స్థిర కాంతిన్, బలి, చామరధ్వజ
చమూ దీప్తస్థితిన్ ముందటన్

ఆనాటి మయాసురకృత విమానాన్ని కామగమనంగలిగి, శస్త్రాస్త్ర సమేతమైన విమానాన్ని పైపద్యం వివరిస్తోంది. రామాయణ కాలంలో "పుష్పకం" విమానం కూడా పైరకందే! మరి ఆనాడూ ఈనాటిని మించిన శాస్త్రవిజ్ఞానం; పరికరాలు, 'ఇంజనీరింగ్ స్కిల్ వుందనీ, అదే ఈనాటి శాస్త్ర విజ్ఞానానికి మూలమని గుర్తించాలి అలాగాక "ఆనాడూ వున్నాయిష!" అని వెక్కిరింపు ధోరణిలో మాట్లాడేవారికి భాస్కరగణితం, లీలావతి గణితం, వాత్స్యాయన కామ సూత్రాలు, వాస్తుశిల్ప శాస్త్రాలు, అరవై కళల మీదా, వేదవేదాంతాలమీదా (వ్రాసిన వ్యాఖ్యానాలు ఏవీ పరిగణనలోకిరావు!)

దేవాసుర యుద్ధం ఘోరంగాసాగుతోంది, బలిచక్రవర్తి పరాక్రమం ముందు, దేవేంద్రుని పరాక్రమం ఆగటం లేదు, సాగటం లేదు. అలాగే, ప్రాణాలకు తెగించి, కోపం కొద్ది పోరాడుతున్న రాక్షససైన్యం ధాటికి దేవతా సైన్యం ఆగలేకపోతుంది. మరలా శ్రీమన్నారాయణుని వేడుకున్నారుతారు.

మ॥ విహగేంద్రాసనరూఢుడై, మణిరమా
 విభ్రాజితోరస్కుడై।
బహుశస్త్రాస్త్ర రథాంగ సంకలితుడై
 భాస్వత్కిరీటాది, దు
స్సహుడై। నవ్య పిశంగచేలధరుడై,
 సంపుల్ల పద్మాక్షుడై,
విహితాలంకృతితోడ మాధవుడు,
 దాంపేంచేసె నచ్చోటికిన్।

(పోతన మహాకవి అక్షరశిల్పంలో) శ్రీనాథుడు ప్రత్యక్షమైనాడు. గజేంద్రారూఢుడై। స్వాత్విక తపోతేజోనిధికి పుట్టినిల్లయిన శ్రీహరిరాకతో, అసురమాయలన్నీ పటాపంచలయిపోయాయి శ్రీహరి తన భక్తివున్నచోట, ఆపదలు కూడా ఇలాగే పటా పంచలయిపోతాయి. శ్రీహరి తన చండవిక్రమంతో, కాలనేమి, మాలి, సుమాలి, మాల్యవంతుడు వగైరా రాక్షసులను వరుసగా హతమార్చాడు తన సుదర్శన చక్రంతో ఇక అప్పుడు ఇంద్రునికి ధైర్యం వచ్చింది వెనకాల తనకు అండదండగా శ్రీమన్నారాయణుడున్నాడన్న గర్వంతో బలిచక్రవర్తిని హేళనచేస్తాడు "మాయల్ సేయుటగాదు, దాయా! చిక్కితివి!" అంటూ దంభోక్తులు పలుకుతాడు.

అందుకు బలిచక్రవర్తి స్థితప్రజ్ఞుడు, విష్ణుభక్తుడు కాబట్టి, ఇంద్రుని అహంకార పూరిత మాటలకు జవాబుగా.

శా॥ నీవే పోటరివే సురేంద్ర! తెగడన్నీకేల?
 గేల్పోటముల్
లేవే? యెవ్వరిపాలు పోయినవి!
 మేల్కీడుల్, విరించ్యాదులున్
ద్రోవంజాలుదు, రెవ్విధానముః న?
 సంతోషింప, శోకింప, నా
దైవంబేమి కరస్థలామలకమే?
 దుర్బోధకు లుంటాడియో?

ఆ॥ జయము లపజయములు, సంపదలాపద
లనిల చలిత దీపికాంచలములు!
చంద్రకళలు మేఘచయము, తరంగలు
మెఱుగు రమరవర్య! మిట్టిపడకు!"

అంటూ బలిచక్రవర్తి యుగవాదిగా పలికాడు ప్రతి ఒక్క మనిషికి కనువిప్పు కలిగేట్లుగా.

ఆ యుద్ధంలో ఇంద్రుడు బలిసచివుడైన జంభుని హతమార్చాడు. నారదమహర్షి పనిగట్టుకునిపోయి అతని సోదరులకు ఈ వార్త చేరవేస్తాడు. జంభుని సోదరులైన "పాక బల, నముచి" అనేవారలు దేవేంద్రుని మీదకు యుద్ధానికివస్తారు కోపోద్రిక్తులై. పాక, బలలనేవారిని హతమారుస్తాడు ఇంద్రుడు కానీ "నముచి" కి ఇంద్రుని వజ్రాయుధానికి మరణించడు. అప్పుడు ఆ శరీరవాణి "వీడు అర్ద్ర, శుష్కములతో చావకుండా వరం పొంది వున్నాడని పలుకుతుంది ఇంద్రుడు క్షణకాలం ఆలోచిస్తాడు. "ఆర్ద్రము, శుష్కమూ కానిదేమిటా అని "ఫేనము" (నురుగు) కనిపిస్తుంది! క్షీర సముద్ర తీరాన జరుగుతున్న ఈ దేవాసుర యుద్ధంలో "ఫేనము" (నురుగు) కూడా ఒక ఆయుధంగామారి ధర్మరక్షణకు, దుష్ట శిక్షణకు తోడ్పడుతుంది ఆ ఫేనము నముచిమీద మీద కుప్పతెప్పలుగా పడవేస్తాడు ఇంద్రుడు నముచి మరణిస్తాడు. శ్రీహరిని స్తోత్రం చేస్తారు దేవతలందరూ. ఆయన వెళ్ళిపోతాడు పూజలందుకుని. ఇంకా ఇంకా రాక్షసుల మీదకు వెళ్తున్న ఇంద్రుణ్ణి నారదుడే వారిస్తాడు.

శా॥ సిద్ధించెన్ సురలార! మీ కమృతమున్, శ్రీనాథ సంప్రాప్తులై
వృద్ధింబొందితి రెల్లవారలను, విద్వేషుల్ మృతిబొంది, రి
యుద్ధం బేటికినింక? చాలి బనిలేదాహా పురే!" యంచుసం
బద్ధావములాడి, మాన్చె, సురలం, జాండవ్య వంశా!

శత్రువులైనా పరాజితులై వున్నప్పుడు తరిమితరిమి కొట్టడం భావ్యం కాదని ఇంద్రునికి సూచన ప్రాయంగా తెలియజేస్తాడు.

దేవతలందరూ తమ తమ నిజస్థానాలకు "త్రివిష్టపమున"కు వెళ్ళిపోగా ఓటమి పొంది విచారమగ్నుడై, తన సచివులలోని బలశాలులు కొందరు యుద్ధంలో మరణించటంతో మరింత బాధ పడిన బలిచక్రవర్తి, మిగిలివున్న తన రాక్షస సైన్యంతో తనదైన పశ్చిమశిఖరి శిఖరంబునకు చేరుకుంటారు. గురువైన శుక్రాచార్యుని అనుగ్రహంతో తన శరీర గాయాలన్నీ మాన్పుకొని ఆయన "మృతసంజీవిని" విద్య ఆధారంగా చనిపోయిన రాక్షసవీరులందరినీ తిరిగి పునరుజ్జీవితులను జేసుకొని, విష్ణుభక్తుడు, యుక్తాయుక్త విచక్షణజ్ఞానం తెలిసినవాడు అయిన బలిచక్రవర్తి జరిగిన కథకు శోకింపక, నిశ్చలంగా వుండిపోతాడు,

ఈ క్షీరసాగరకథను గురించి ఆలోచిస్తే మనసులో మధిస్తే ఎన్నో నగ్న సత్యాలు బోధపడతాయి. మహర్షులు ధర్మాధరాలు ధర్మసూక్ష్మాలు, వేదవేదాంత రహస్యాలు. సృష్టిలోని సర్వచరాచర నియమితధర్మాలు అన్నీ తమ తమ తపస్సు. అనుభవాలు. మహత్తర విజ్ఞానంతో మధించి రామాయణం, భాగవతం, భగవద్గీతల్లాటివి ఎన్నో అమృతభాండాలు తయారుచేసి వుంచారు. యుగాల పర్యంతం మనందరి కోసం శంకరాచార్యుడు ముప్పై రెండేళ్ళ వయసులోగా, సర్వతీర్థాలు, సర్వశక్తి పీఠాలు, సర్వక్షేత్రాలు దర్శించు స్తోత్రాలెన్నిటినో అమృతభాండంగా పొందుపరచాడు ఆ భాండాలన్నీ శ్రీవిష్ణు, శ్రీశివ, శ్రీదేవి స్తోత్రరత్నాకరాలుగా మన కళ్ళ ముందే వున్నాయి ఎవరి నమ్మకాన్ని, ఎవరి పరిధినిబట్టి వారు ఆయా భక్తి మార్గాలను అనుసరించడానికి వీలుగా వారెన్ని కష్టనష్టాలకు, ఎన్ని ఆపదలకు కఠోరతపస్సుకు గురైనారో ఆ అమృతం సాధించటానికి మనందరికోసం. ఆ అమృత భాండాలను అందుకుని త్రాగగల అర్హతైనా సాధించు కోలేమా? అమృతభాండంలోని అమృతం అంతా త్రాగలేకపోయినా కొంతయినా

కనీసం ఒక్కచుక్క అయినా త్రాగలేని అర్భకత్వమూ, అసమర్థతా మనతో వుందా? తయారుచేసి సిద్ధంగావుంచిన "సిద్ధామృతాన్ని" కూడా మనం త్రాగి భక్తిధర్మం, దైవం అనే మానవత్వపు మహోన్నత ధ్యేయాలను తెలుసుకొనే కొద్దిపాటి శ్రమకూడా చేయలేమా? క్షీరసాగర మథనకథ ఈ ప్రశ్నలన్నిటినీ మన ముందుంచుతోంది. ఆలోచించండి! మనకు మనమే వరికి వారంగా జవాబు చెప్పుకోవలసిన ప్రశ్నలివి!



## "మరల దానవ పరాజ్యం"

ఏడవ మనువు వైవస్వతుడు! ఈయనే "శ్రద్ధదేవుడు" అనే పేరుతోకూడా వ్యవహరింప బడుతుంటాడు. పరీక్షిత్తు మహారాజుకు శుక యోగీంద్రుడు భాగవతం బోధించేనాటికి, ఏడవ మనువైన వైవస్వతుడున్నాడు. ఈ నాడూ మనం దేవాలయాలలో, ఇంట్లో దేవతార్చన సమయంలోనూ, "వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే, జంబుద్వీపే, భరతవర్షే, భరతఖండే, మేరూ దక్షిణ దిగ్భాగే-అంటూ పూజా సంకల్పవిధి వింటూంటాం. శ్రద్ధ దేవుడనబడే వైవస్వత మనువుకు పదిమంది కుమారులు వారు "ఇక్ష్వాకుడు, నభంగుడు, దృష్టుడు, శర్యాతి, నరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, కరూశకుడు, పృషధ్రుడు, వసుమంతుడు, అనే రాజులు, వైవస్వత మనువు కాలంలో "పురందరుడు" అనే వ్యక్తి ఇంద్రుడు, ఇంద్రపదవి, ఇంద్రపీఠం స్వర్గాధిపత్యం ఆతనిది ఇక "ఆదిత్యుడు, మరువు, అశ్వి, వసువు, రుద్రుడు" సంజ్ఞ అనేవారు దేవతలు, సప్తఋషులుగా గౌతముడు, కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, జమదగ్ని భరద్వాజ, వశిష్ఠులను పేర్లుగల మహర్షులు!

క్షీరసాగరమథనం, అమృతపానం వగైరా ఘట్టాలలో పరాభవంపొందిన దానవులలో, బలిచక్రవర్తి పశ్చిమ గిరిశిఖరానికి వెళ్ళాడు తన బలగంతో

అని విన్నాం కదా! బలిచక్రవర్తి తీవ్ర తపమాచరించాడు భార్గవులకు (శుక్రాచార్యుల పీఠం-శుక్రాచార్యులె గురుత్వం, వంశ పారంపర్య గురు పీఠం) సేవ శుశ్రూష చేశాడు! భార్గవులు బలిచేత "విశ్వజిద్యాగంబు" అనే యాగాన్ని భక్తిశ్రద్ధలతో చేయించారు. ఆయాగాగ్ని కుండంలోనుండి, అద్భుత వాయువేగమనోవేగం గల దేవగురులు ఖూన్చిన రథమూ, రథానికి సింహధ్వజమూ, మహామహమాన్వితమైన దివ్య ధనస్సు, అక్షయతూణీరము, అభేద్య కవచము, ఉద్భవించి, అగ్నిదేవుడని స్వయంగా బలి చక్రవర్తికి ఇచ్చాడు బలి తాత అయిన ప్రహ్లాదుడు ప్రత్యక్షమై వాడని పద్మమాల ప్రసాదించాడు. శుక్రాచార్యుడు శిష్యుని దీక్షకు మెచ్చి చంద్రుని బోలిన శంఖం ఇచ్చాడు. అట్లా బలి

"క॥ పాణియు, రథియు, గృపాణియు, దూణియు, ధన్వియును
స్రగ్వి, తురగియు, దేహ
త్రాణియు, ధికృత విమతప్రాణియు,
మణికనకవలయపాణియునగుచున్,

మ॥ పలుదానంబుల విప్రులదనిపి, తద్భద్రోక్తులంబొంది, పె
ద్దలకున్ మ్రొక్కి, విశిష్ట దేవతల సంతర్పభక్తి ఖూచించి, ని
ర్మలు బ్రహ్మనుని జేరి, నమ్రశిరుడై, రాజద్రథారూఢుడై
వెలిగెన్ దానవభర్త! శైల శిఖరోద్వేలదవాగ్ని ప్రభాన్"

(పోతన మహాకవి అశర శిల్పకవితా విన్యాసాన్ని గమనించండి! ఈనాటి ఎందరు సినీ కవుల అక్షరాల చమక్కుల, గారడీల, పారడీల పాటల కదిమూలమో గమనించండి! పది చరణాలపాట కాస్తంత అక్షర విన్యాసాలతో వ్రాయగానే, ఆ సినిమా కవిగారికి వూరూరా, సన్మానాలు చేసేస్తూ, మతల్ని మనం అభినందించు కుంటున్న కాలంలో, ఆ అక్షర నాట్యానికి పద్యంపద్యం గద్యం గద్యం ఒక ఉదాహరణగా మలచిన పోతన మహాకవికి ప్రతిరోజూ, ప్రతిక్షణం ఆంధ్రులందరంరం నీరాజనం పట్టవలసిన బాధ్యత లేదా?

ఆ నీరాజనం సభలూ, సంస్మరణలూ, సన్మానాలుగాక, ఆయన విరచిత భాగవత గ్రంథాన్ని ఆమూలాగ్రం ఒక్కసారి, ఒక్కమారు, ఈ జీవితం ముగిసేలోగా, చదివి ఆ కవితాఝరిలో మనం పునీతులం కావటం ఒక్కటే నిజమైన నీరాజనం!)

బలిచక్రవర్తికి అటు స్వతఃసిద్ధమైగే తపస్సు వుంది. ప్రహ్లాదుని వంటి భక్తాగ్రేసరునికి మనవడు కావటం వలన, హిరణ్యకశిపునిలాటి జితేంద్రియుడు త్రిలోక విజేతకు మునిమనవడు కావటంవల్ల శౌర్యపరాక్రమాలూ, దేవతా ద్వేషమూ సమపాళ్ళలో వచ్చాయి. ముఖ్యంగా, ఇంద్రుడు క్షీరసాగరమధనానికి ముందు తన దానవులతో నటించిన కపటమైత్రి, క్షీరసాగరమధనాంతరం అమృత విభజనలో తనవారు అమాయకంగా మోసపోయిన తీరూ, ఆ తరువాత అమృతపాన బలాఢ్యులైన ఇంద్రుడి దేవతలవలన తన దానవులెందరో మరణించటం, ఎలాగో శుక్రచార్యుని మృతసంజీవిని విద్యతో వారిలో కొందరిని మాత్రం తాను బ్రతికించుకోగలగటం, తామంతా కళత్ర, పుత్ర, మిత్ర, పరివార సమేతంగా పశ్చిమ గిరి శిఖరానికి పారి పోవటంలాటి అవమానాగ్ని దహిస్తూనే వుందాయనను! ఈ రథంతో, తన దానగుణంతో, విప్రుల ఆశీర్వచన ప్రభావంతోతిరిగి అజేయుడైన బలిచక్రవర్తి, ముందస్తుగా స్వర్గం మీదికి దండయాత్రకుపోయి, ఇంద్రుని ఆయన దేవగణాలను చావ చితక గొట్టేశాడు తన అవమానానికి ప్రతీకారంగా! ఇంద్రుడు తన గురువైన బృహస్పతి రాజనీతిని, యుద్ధనీతినీ, వర్తమానాన్ని సమన్వయ పరుస్తూ ఇటు తపోనిధిగానూ, అటు రాజకీయ గురువుగానూ చక్కటి సలహా ఇస్తాడు.

సీ॥ వినవయ్య దేవేంద్ర! వీనికి సంపద,
　　　బ్రహ్మవాదులు భృగుప్రవరులర్థి
నిచ్చిరి, రాక్షసు నెదిరింప, వారింప,
　　　హరిఈశ్వరుడు దక్క, నన్యజనులు
నీవును, నీవముల్, నీకంటె నధికులు
　　　జాలరు! రాజ్యంబుసాలు నీకు,
విడిచిపోవుట నీతి విబుధ నివాసంబు!
　　　విమతులునలిగెడు వేళనూచి,

తే॥ మరలి మఱువాడు వచ్చుట మా మతంబు।
విప్ర బలమున వీనికి వృద్ధివచ్చె।
వారిగై కొన కిరుమీద వాడి చెడును।
దలగు మందాక; రిపుపేరు తడవవలదు।

క॥ పరుగెలువ వలయు నొండెను।
సరి పోరగవలయునొండె। జావలెనొండెన్,
సరి గెలుపు, మృతియు, దొరకమిc పరసొంబుగ
మున్నెతొలగిచనవలె నొండెన్।"

అని ఘంటాపథంగా చెబుతాడా దేవగురువు. అదీ గురుస్థానం! సమయోచితమైన రాజనీతి, ధర్మనీతి, శాస్త్రనీతి నిర్దేశించిన తపోనిధులైన ఆనాటి గురు పీఠాలు అందువలననే శాశ్వతం అయ్యాయి; ఆ గురు పరంపర గురునామంతో చిరంజీవత్వం సాధించుకుంది మంత్రమనీ, తంత్రమనీ, రాజనీతి అనీ, సాంఘిక నీతి అనీ, తెలిసీ తెలియని గురు బోధలు, సలహాలు, తాము ఆచరించకుండా వాచా వేదాంతం బోధించే గురువులూ, గురు పీఠాలు అనుక్షణం మనం చూస్తున్నాం ఈ రోజు! అలాగే శిష్య పరమాణువులు కూడా ఆ గురువులకు. నిజమైన సలహాలకు, అహంకారంతో తల ఎగర వేయుటమూ చూస్తున్నాం ఈనాడు! శిష్యుని ఆపద, ఆర్తి, శక్తి, పరిబితి. దూరదృష్టి తెలిసి సమయంలో చక్కటి సలహా ఇచ్చేవాడు బోధగురువు అది నిష్కపటంగా, నిశ్చింతగా, నిర్ద్వంద్వంగా ఆచరించేవాడే నిజమైన శిష్యుడు. లేనపుడు బోధగురువులు, అహంకారపు శిష్యులు మాత్రమే మిగులుతారు చరిత్రలో!

బృహస్పతి సలహా పాటించి ఇంద్రుడు, తన దేవతాగణంతో "త్రివిష్టపము" (స్వర్గం") విడిచి వెళ్ళిపోయాడు. కామరూపులైన దేవ సైన్యం అంతా తలో దిక్కుకూ వెళ్ళిపోయారు.

బలిచక్రవర్తి దానిని ఆక్రమించుకొని, శిష్యునిమీద అపరిమితమైన ప్రేమవున్న భృగువులాతనిచేత నూరు "అశ్వమేధయాగములు" చేయించారు.

శా॥ అర్థుల్ వేడరు, దాతలుం బెడరు!
సర్వారంభముల్ పండు, ప్ర
త్యర్థుల్ లేరు! మహోత్సవంబులను,
దేవాగారంబులన్ వొల్చు; ఖా
ర్థార్థుల్ విప్రులు; వర్షముల్ గురియఁ,
గాలార్హంబులై, ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరాత్వ, మసు
రేంద్రాదీశు రాజ్యంబునన్!"

అదీ ప్రజారంజకమైన, ధర్మ సమ్మతమైన రాజ్యపాలన అంటే! దానికి బహుమానంగా ప్రకృతి ఇచ్చే బహుమతే, సస్యశామలమైన పైర్లు, పంటలు, ఏ క్షణమూ వట్టిపోని పాడి, కరువు కాటకాలు, తుఫాన్లు, వరదలు లాటి ప్రకృతి భీభత్సాలులేని ఋతువులు, సుఖశాంతులతో కూడి, అహంకారులుగాక సంతృప్తులైన ప్రజలు, పశువులు. ప్రకృతి వగైరా!

అలాటి సాత్వికుడు, శౌర్యనిధి, తపోనిధి, ముఖ్యంగా దానగుణం అన్నది తన శరీరంగాలలో ఒకటిగా జీర్ణింప జేసుకున్నవాడూ, దాన గుణాన్ని ఒకానొక వ్యసనంగా మార్చుకున్న వాడూ, ఆ దానాలవల్ల, పుచ్చుకున్నవారి మనః పూర్వక దీవెన, ఆశీస్సుల అజేయబలం పొందిన వాడూ అయిన బలిచక్రవర్తిని నిర్జించటానికి ఏ శక్తులూ, ఏ అస్త్రశస్త్రాలు, ఏ తపోబలమూ చాలదు. ఏ దేవుడికీ ఆ శక్తి లేదు! ఒక్క వైకుంఠుడే చేయగలడావని! ఎలా? యుద్ధక్రియతో కాదు. కారణం బలిచక్రవర్తి ధర్మ వర్తనుడు, దైవమార్గానుసారి! శస్త్రాస్త్రాలతో కాదు. కారణం బలికివున్న, శస్త్రాస్త్రాలు తపస్సుకూ, ధర్మాచరణకూ, దానానికే,విప్రదీవెలకూ సంబంధించి వాటన్నిటితో పునీతమైన దివ్యాస్త్రాలవి. వాటిని మించిన అస్త్రాలు లేవు.

ఏ ప్రపంచంలో ఏ యుగంలోనయినా! బలిని నిగ్రహించేందుకు సాక్షాత్తు నారాయణుడు, ఓ ప్రత్యేక అవతారం తీసుకోవలసి వచ్చింది. అదే వామనావతారం.

అడుగడుగునా, అక్షరం అక్షరంలో తేనెసోనలూరె తెలుగు పద్యంలో, తన భక్తి ప్రపత్తులను రంగరించి భాగవతం తెనిగించిన పోతన కవి "అక్షర" అక్షర శిల్పానికి ప్రతిక్షణం మ్రొక్కవలసి వుండగా, ఆ పోతన మహాకవి, ఆ కాళిదాసు, ఆ ఆది శంకరాచార్యుడు వగైరా మహాత్ములే, వారి వారి కవితారీతులే మా ఈనాటి కవితలకు, సినిమా పాటలకూ పారడిలకూ గారడీలకూ మూలం అని సగర్వంగా చెప్పుకోలేని కొందరు కవులను ఏమను కోవాలి! ఈనాటి ఈ గారడీ అక్షర విన్యాసం తమ సొంతం అని ప్రగల్భాలు పలికే వారినేమనుకోవాలి! ఆ మేరకు అహంకరించే వారిని గురించి ఏమను కోవాలి? ఆ అహంకారానికి "మూడ్" రావటానికి "మేంతాగుతాం!" అని గర్వంగా చెప్పుకొనే వారినేమనాలి!

భక్తి త్రాగిన పోతన కవి, శరణాగతి అనే భావనను త్రాగిన వ్యాస వాల్మీకి, కాళిదాస, శంకరాచార్య, పోతనలాటి మహామహులైన ఎందరో మహా కవుల మహర్షుల ఘంటాలలో ప్రాణం పోసుకుని, సజీవమై, చిరంజీ వత్వం సాధించుకున్న కావ్యాలు- "ఈ దేశం మనకిచ్చింది!" అవునా!



## "వా మ నా వ తా ర ం"

బలిచక్రవర్తి స్వర్గాన్ని ఆక్రమించుకొనే నాటికి, కశ్యప మహర్షి తపో భూమి నుండి తిరిగివచ్చాడు ఆయన భార్యలైన దితి, అదితిలలో దితి బిడ్డలు హిరణ్యాక్ష హిరణ్యకశిపులు. ఆమె సంతానములో ఎక్కువ మంది దైత్యులుగా మారారు తమ ప్రవర్తనతో. "కపిలుడు" జన్మించి విష్ణ్వంశతో ఆమెకు మోక్షం ప్రసాదించాడు చివరగా. ఇక అదితి సంతానమైన దేవతలలో,

ఇంద్రుడు ఒకడు. తన బిడ్డలకు జరిగిన పరాభవానికి, సహజ మాతృ మమతతో అదితి తల్లడిల్లిపోసాగింది. ఆ సమయంలోనే కశ్యప మహర్షి, ఆమె దగ్గరకు వచ్చాడు. ఆఖరికి బలిదైత్యుని నెమ్మదిగా పదవీచ్యుతునిచేసి, తిరిగి ఇంద్రునికి ఇంద్రలోకం, దేవతలకు శాంతి ప్రసాదించవలసిన బాధ్యత శ్రీమన్నారాయణునికి అప్పగించబడింది ఎప్పటిలానే! బలిచక్రవర్తి ఒక్కడే అయితే భరించవచ్చు. కానీ ఆయన వెనకాల వున్న రాక్షసగణం, దేవతలను పీడించడమే పనిగా పెట్టుకున్నారు కదా! బలిచక్రవర్తిని అధఃపాతాళానికి పంపితే తప్ప, రాక్షస పీడ దేవలోక వాసులకు భూలోక వాసులకూ తప్పేలా లేదు. కశ్యప అదితిల రంగస్థలం తన జన్మభూమిగా రూపొందించుకున్నాడు శ్రీహరి! కశ్యప మహర్షి రాగానే, తన భార్య అయిన అదితిని కుశల ప్రశ్నలడిగాడు.

మ॥ తెలుపా! విప్రులుపూర్ణులే! జరుగునే
దేవార్చనాదారముల్?
తలితో వెలుతురే గృహస్థులు?
సుతుల్ ధర్మాను సంధానులే?
నెటి నభ్యాగత కోటికన్నమిడుదే!
నీరంబునుం బోయుదే!
మఱితే కర్థుల రాసులన్,
సుజనులన్ మన్నింపుదే పైదలీ?

ఆ॥ అన్నమైనఁదోయమైన ద్రవ్యంబైన
శాకమైన దనకు జరుగుకొలది,
నతిథి జనుల కడ్డమాడక యిడరేని,
లేమ! వారు కలగినేని వారు!"

అంటూ! అదీ ఆనాటి కుశల ప్రశ్నలతీరు! గృహిణి గృహస్థ ధర్మాల తీరు యుగపర్యంతం గుర్తుంచుకోవలసిన ధర్మాచరణ నిబంధనలతీరు,

ఈనాటి సగటు గృహస్థు ఏ క్యాంప్ నుండి అయినా తిరిగివచ్చి, భార్యను ప్రశ్నించే తీరు ఎలా వుంటోంది. "కోళాయిలో మూడు రోజుల తర్వాతయినా నీళ్లొచ్చాయా? పిల్లలు నువ్వూ వారానికో మారైనా స్నానం చేయగలిగారా? పక్కింటి వాడు మనకివ్వాల్సిన బాకీ తీర్చాడా? కొత్త బాకీ ఇవ్వలేదుగదా నువ్వు! ఈ రాజకీయ చదరంగంలో నా ఉద్యోగం ఈనాటికి భద్రంగా, ఇక్కడే వున్నందుకు సంతోషిస్తున్నాను ... "అలా సాగుతాయి. ఇక గృహిణి "గ్యాస్ సిలిండరు రాలేదు. స్టాకులేదట, కిరోసిన్ ఇవ్వలేదు అదీ డిటో! నీళ్లా! అవి బంగారు చుక్కలు. ఎలాగో మీకు ఓ బక్కెట్టు వుంచాను అతిథులంటూ వచ్చి పడి ఈ ఇరుకు ఇంట్లో వాళ్లతో ఈ పది రోజులూ చచ్చాననుకోండి! పదిమార్లు మొక్కుకున్నాను దేవుడికి వాళ్ళు వెళితే చాలని!" అంటుంది. ఇవి సగటు జీవితాలు కానీ, అన్నీ అమరిన అదృష్టవంతులూ వున్నారీనాడు. "వారు కలిగిలేని వారు!" ఏ కొరతా లేదు వారికి. బుద్ధి సంపన్నత లేకపోవుట మొక్కటే లోపం! ఆ గృహస్థుకూ, గృహిణికీ అన్ని సౌకర్యాలు సంపద దేవుడిచ్చాడు కోట్లాది రూపాయల ధనం, బంగళాలు, కార్లు, బంగారు నగలు, ఇంటినిండా ఆధునిక యంత్రసామగ్రితోకూడిన వస్తు సముదాయం బస్తాల కొద్దీ ధాన్యం పప్పులు, పిండి వంటలు అన్నీ వున్నా' ఇంట్లోకి ఒక్క అతిథి వస్తే విసుక్కొనే ఆధునిక ఇల్లాళ్ల నెందరినో చూస్తున్నాం ఇల్లాలికి మూడు పూటలా షడ్రసోపేతమైన భోజనం, విశ్రమించటానికి డన్‌లప్ బెడ్స్, కాలక్షేపానికి కలర్ టి. వి షికారుకు కారు అమర్చి, ఆమెకిక ఏ బాధ్యతా, అతిథికి అన్నం పెట్టాల్సిన అవసరమూ, ఆకాస్తంత శ్రమకూడా లేకుండా చేయుటమే తన భర్తృ ప్రేమకు నిదర్శనంగా భావించే గృహస్థులూ వున్నారు. వారు అతిథులను హోటళ్లలో తినిపిస్తారు! హోటళ్లలో టీ పార్టీలు డిన్నర్లు ఇస్తారు. ఇంటి వద్ద అన్ని వసతులూ; అవకాశమూ, ప్రదేశమూ వున్నప్పటికీ, అయితే కలియుగ ధర్మాన్నిబట్టి, ఆ మాత్రం దాతృత్వం, అతిథి సేవకూడా చేయని వారెందరో వుండగా వీరే పుణ్యాత్ములు కొంత వరకూ!

స్వయంగా అతిథికి వండి పెట్టడం, అతిథి తృప్తి పడేలా కన్నతల్లిలా ఆప్యాయతతో వడ్డించటం, తమకు లేని సౌకర్యాలుగాక, అదే పనిగా వచ్చే "పనిలేని అతిథులకుగాక, వితరణతో తమకున్నదానిలో అతిథినీ, ఇంటి బాధ్యతలనూ, పనివారినీ తృప్తి పొందించటమన్నదే గృహస్థ బాధ్యతలలో ఒకటిగా మనం ఈనాడు అన్వయించుకోవాలి! తాము పదిమార్లు టిఫిన్లు, పండ్లు, వివిధ రకాల పదార్థాలు తింటూ, ఆ పాత్రలు శుభ్రం చేసే పనిపిల్లకూ మనం తింటున్నపుడు చూస్తూ, తినాలనే కోర్కె అణచుకుంటూ తన పని తానుచేసుకు పోతుండే పని పిల్ల, పనిపిల్ల, వృద్ధురాలు-అయిన సేవకుల విషయంలో అతి పొదుపు పాటించే లక్షాధికార్లయిన గృహస్థులు, గృహిణులు వున్నారు! పది లడ్డూలు మనం ఒక్కళ్లం తినగల అవకాశం, అదృష్టం భగవంతుడు మనకు ప్రసాదించినపుడు, ఒక లడ్డూ పనివారికి మనస్ఫూర్తిగా పెట్టగలగటమన్నదే కలియుగంలో దాతృత్వ లక్షణం. ముక్తికి సోపానం ఆనాటి కశ్యపుని కుశల ప్రశ్నలలో తొంగి చూచిన వేలవేల "ఉప ప్రశ్నలు" ఆ చిన్న పద్యాలలో వ్యాసుడు పొదుపుగా ప్రశ్నిస్తే, పోతన మహాకవి మహా వివరణ ఇచ్చాడు ఒక్కో అక్షరంతో!

చివరగా

ఆ॥ నెలత! విష్ణునకును నిఖలదేవాత్మున
కాననంబుఁ శిఖియు, నవనిసురుడు
వారుదనియ, దనియు, వనజాతలోచను,
డతడుదనియ జగములదనియు ॥

అని సద్బ్రాహ్మణులు తృప్తి చెందితే, జగన్నాథుడు తృప్తి చెందినట్లని చెబుతాడు. కశ్యప ప్రజాపతి, మహర్షి! (సద్బ్రాహ్మణులు అంటే సత్వం కల్వం, సదాచరణ, సచ్ఛీలము, వగైరా అద్భుత తపస్సు ఎవరిలో వుంటుందో వారెవరైనా బ్రాహ్మణులే, అదిలేనివారు బ్రాహ్మణులు కారుగాకకారు!)

అదితి తనబిడ్డలైన ఇంద్రాదిదేవతలు, బలిచక్రవర్తి, అయన రాక్షస గణంచేత చావుదెబ్బతిని, ఎలా దిక్కుకొకరుగా పారిపోయిందీ, బలి ఎట్లా

త్రిలోక విజేత అయి దుర్నిరీక్షుడైంది గోడుగోడునవీడుస్తూ భర్తకు విన్న వించుకుంటుంది! కశ్యప మహర్షి దివ్యదృష్టితో, దూరదృష్టితో విలోకించి ఆలోచించి, అతిదికిలా చెబుతాడు.

భగవంతుం బరమున్, జనార్దను గృపా పారీణు సర్వాత్మకున్
జగదీశున్, హరిసేవసేయుము, మతడున్ సంతుష్టినిం బొంది, నీ
కగు నిష్టార్థము లెల్లనిచ్చు, నిఖిలార్థావాప్తి చేకూరెడిన్,
భగవత్సేవల బొందరాదే! బహు సౌభాగ్యంబులన్ బ్రేయసీ!

ఆమెకు "పయోభక్షణం" అనే వ్రతం ఉపదేశిస్తాడు కశ్యపమహర్షి. ఫాల్గుణమాస, శుక్లపక్ష ప్రథమదివసం (పాఢ్యమి) మొదలు పన్నెండు దినములు (ఏకాదశి వరకూ) ఆమె అతి నియమంతో భర్త బోధ గురుబోధగా ఆ వ్రతం ఆచరించింది. ఆమె మంత్ర సిద్ధి, వ్రతసిద్ధి పొందింది. శ్రీమహా విష్ణువు స్వయంగా ప్రత్యక్షమై, తాను ఆమె గర్భవాసాన కుమారునిగా జన్మించి, ఆమెకు దుఃఖనివారణ, దేవతలకు శాంతి ప్రసాదిస్తానని అభయం ఇచ్చాడు. చిత్రకేతుడు ఏడు అహోరాత్రాలలో "భగవన్మంత్రాన్ని" సిద్ధి పొందించుకున్నట్లు, ధృవుడు ఆరుమాసాలలో వాసుదేవ ద్వాదశాక్షర సమా కలిత మహామంత్రాన్ని సాధించినట్లు, అదితి పన్నెండురోజులలో పయూభక్షణ వ్రతాన్ని పూర్తి చేసి, శ్రీమహావిష్ణువును ప్రత్యక్షం చేసుకుంది. భాగవతంలో ఈనాటి కొలమానంతో అయితే పది డిగ్రీలు ఏ చదువులూ లేని స్త్రీ ఆమె! ధర్మాచరణ; భర్తను దైవంగా గురువుగా కొలుచుకొనే పాతివ్రత్యం, మూఢ భక్తి తప్ప మరేమి ఎరుగని పిచ్చి ఇల్లాలు మరి! తర్కాలు తెలియని వెర్రి ఇల్లాలు తర్కాతీతమైన ధర్మాన్ని ఆచరించే మహా ఇల్లాలు! ఆమె ఆనందించింది. గర్భం ధరించింది.

మ॥ రవి మధ్యాహ్నమునందుజరింప గ్రిహతారాచంద్రభద్రస్థితిన్,
శ్రివణ ద్వాదశినాడు, శ్రోణ నభిజిత్సంజ్ఞాత లగ్నంబునన్,
భువనాధీశుడుపుట్టె, వామనగతిం, బుణ్యప్రిశోపేతకున్,
దివిజాధీశ్వరు మాతకుల, బరమ పాతివ్రిత్య విఖ్యాతకున్!"

అట్లా శ్రీమహావిష్ణువు వామనాకారుడుగా అవతరించాడు. దేవతాగణా లన్నీ సంతోషించాయి తల్లిదండ్రులు పరమానందం పొందారు. ఆ అవతార వామనమూర్తికి, మహర్షులు, కశ్యప ప్రజాపతిచేత ఉపనయనాది కర్మలు చేయించి, ద్విజత్వం ప్రసాదింపజేశారు. సవిత (సూర్యుడు) "సావిత్రి" మంత్రాన్ని ఉపదేశించాడు. బృహస్పతి యజ్ఞోపవీతాన్ని ప్రసా దించాడు. కశ్యప మహర్షి ముంజిని, తల్లి అయిన అదితి కౌపీనాన్ని భూదేవి కృష్ణాజనాన్ని (జింక చర్మం), చంద్రుడు దండంబు, గగనాధిష్టానదేవత గొడుగును, బ్రహ్మదేవుడు కమండలాన్ని సరస్వతీదేవి అక్షరమాలి (జపమాల) ను సప్తర్షులు కుశలు (దర్భలు) తమతమ తపో శక్తులతో పాటుగా ఇచ్చారు. ఆవిధంగా శ్రీమన్నారాయణుని అవతారమూర్తికి తమ విధేయత చాటు కున్నారు. ఇక ఉపనయన కర్మలోని ప్రధానాంశమయిన భిక్షపాత్రము కుబేరుడు ఇచ్చాడు. అంతటి బాలవటువునకు తొలిభిక్ష. పర్వతరాజపుత్రి. పరమేశ్వర అర్ధాంగి. సాక్షాత్తు అన్నపూర్ణ అయిన భవాని పెట్టింది. ఆ వటువు బలిచక్రవర్తిని అణచే కార్యక్రమానికినాందిగా అమాయకంగా బ్రాహ్మణులను అడిగాడు. "మీరు ఎక్కడికి వెళ్తున్నారు? ఏయే సంపదలను ఏయే దానవ రాజులనుంచి దానమడిగి తేగలరు? అంటూ అందుకా బ్రాహ్మణులు "ఎందరో దాతలు, మహారాజులున్నారుగానీ బలిని మించినదాత ముల్లోకాల లోనులేడు. అయన్ని అడిగి నీక్కావలసిన సంపదలు పొందవచ్చు. ప్రస్తుతం శుక్రాచార్యుడు గురువుగా యజ్ఞంచేస్తున్నాడాయన, అక్కడికి వెళ్ళు!" అని సలహాఇచ్చారు పాపం! వామనమూర్తి బయల్దేరాడు వారి మాటమన్నిస్తూ!

క॥ హరి హరి! సిరియురమునగల హరి!
హరియుకొఱకు దనుజునడుగన్ జనియెన్
బరహిత రతమతియుతులగు, దొరలకు
నడుగుటలు, నొడలి తొడవులు పుడమిన్

(మనమూ వామనుని వెంట బలియజ్ఞశాలకు వెడదామా మనస్సుతో)



## బలిచక్రవర్తి దానగుణ వ్యసనం

వామన మూర్తి అవతరించిన శ్రీమహావిష్ణువు, ఆ అవతారానికి అనువైన రూప, విన్యాస నడకలతో బయల్దేరాడు. ఉపనయన కర్మకాండ అంతక్రితమే జరిగింది గనుక నున్నగా గీచిన బోడి గుండు, ఆ బోడి తలమీద సాంప్రదాయం ప్రకారం వుంచిన పంచశిఖలతో కూడిన చిన్న పిలక, చిన్ని చేతిలో చిన్న దండం, మరో చేతిలో కమండలం, చంకలో మడిచి పెట్టిన జింక చర్మం, మెడలో, సర్వ విద్యలకు, కళలకు మూలపుతల్లి అయిన సరస్వతి ఇచ్చిన దివ్యాక్షమాల, సర్వలోకాలకూ, సర్వయోగ యోగీశ్వరులకూ, బ్రహ్మ మహేశ్వరులకూ, సకలచరాచర జీవకోటికీ శరణ్యాలయిన బుల్లి చరణాలకు పావుకోళ్లతో ముఖవర్చస్సు వెలిగిపోతుండగా, బలిచక్రవర్తి యజ్ఞశాల ప్రవేశించాడు. బుల్లివటువైన వామనమూర్తి!

శా॥ "శంభుండో! హరియో! పయోజభవుడో, చండాంశుడో! వహ్నియో
దంభాకారత వచ్చెగాక! ధరణిన్‌ధాత్రి సురుండెవ్వఁడీ
శుంభద్యోతనుడీ మనోజ్ఞతను" డంచున్, విస్మయభ్రాంతులై
సంభాషించిరి, బ్రహ్మచారిగని, తత్సభ్యుల్ రహస్యంబుగన్!"

కొందరు పసిబిడ్డలను చూచినా, స్త్రీ, పురుష, వృద్ధులను చూచినా, వారి వారి అంతర్గత దైవశక్తి వలన అలాటి విభ్రాంతి కలుగుతుంటుంది ఈనాడూ మనకు! యాగశాలలో సాగుతున్న సామగానాన్ని వింటూ, మంత్రితం త్రార్థాలు వింటూ, హోమగుండంలోని త్రేతాగ్నిని పరికిస్తూ, తడబడే అడుగులతో, బాల్యచాపల్యంతో చంచలిస్తున్న చూపులతో, ఆ వటుడలా నటిస్తుంటే, తమని తాము మైమరచారు బలి యజ్ఞశాలలోని సభ్యులూ, సర్వజ్ఞులూ కూడా! నేరుగా దానపరాజైన బలిచక్రవర్తి వద్దకు వెళ్లాడు వామనుడు. తన కుశపవిత్రాక్షర సంయుతంబైన కుడిచేయిసాచి, బలిని, స్వస్తి ప్రియాయామ సారం దీవించాడు! ఆపడుగు రూపానికీ, అతని వర్చస్సుకు, ఆ దీవెన దీవించే తీరుకు అబ్బురపడిపోయాడు బలిచక్రవర్తి. ముచ్చటపడిపోయాడు.

శ్రీమహావిష్ణువు ఆ సమ్మోహన రూపసందర్శన మోహజాలంలో, తనకుతాను తెలియకుండానే మునిగి, తననితాను మరచాడు దానవభర్త. ఆ వటునికి పాదాలు కడిగి, బ్రహ్మమహేశ్వర దేవతాగణాలకు కూడా ఎప్పుడో, ఎన్నడో, అపురూపంగా తప్ప దొరకని, ఆ పాదతీర్థాన్ని తన శిరసు మీదకు చల్లుకున్నాడు. వెంటనే "నాయనా! ఎవ్వరి వాడవు? నీ నివాసస్థలంబేది? నీపేరేది? అంటూ కుశల ప్రశ్నల వేసి,

మ॥ వరచేలంబులో, మాడలో, ఫలములో, వన్యంబులో, గోవులో
హరులో, రత్నములో, రథంబులో,
విమృష్టాన్నంబులో, కన్యలో
కరులో, కాంచనమో, నికేతనములో, గ్రామంబులో, భూములో
దరణీఖండమో, కాక యేమడిగెదో, ధాత్రీ సురేంద్రోత్తమా!"

అంటూ తాను దానం ఇవ్వగలననుకున్న వస్తు సముదాయాన్ని, ఆవడుగు కోరదగిన కోరికల్నికూడా ఏకరువు పెట్టాడు బలిచక్రవర్తి! ఆ వచ్చిన యాచకుడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువని ఎరుగని బలిచక్రవర్తి, తనలోని అహంకూడా కొంత అలా ప్రదర్శించుకున్నాడు. ఇక ఇక్కణ్ణుంచి పోతన మహాకవి తనదైన భక్త్యావేశంతో దృష్టి, దృశ్యం, ద్రష్టగా తానే మారిపోయాడు తన కవిత్వ రీతులలో. "సర్వాంతర్యామినైన నాకు జన్మస్థలం ఏదని చెప్పగలను? ఎవరికీ నేను చెందను. అందరూ నావారే! నాకు తెలియనిది లేదు. ఒంటరివాణ్ణి! సిరి ఇంతక్రితం వుండేది. సహృదయుల హృదయమేనా నివాస స్థలం!" అంటూ తన పరిచయం ఒక సీస పద్యంలో చెబుతాడు వేదాంత పరంగా. ఆ తర్వాత "నీ తాత ప్రహ్లాదుడు మహావిష్ణు భక్తుడు. నీ ముత్తాత హిరణ్యకశిపుణ్ణి ఏ విధంగానూ అంతం చేయలేనని తెలుసుకున్న శ్రీమహావిష్ణువు, సూక్ష్మ రూపమున ఆత్మ విశ్వాసంతో ప్రవేశించి, ప్రహ్లాదునిలో ప్రవేశించి, నృశింహావతారంలో సంహరించాడు! ఆ వంశజుడవు నీవు!

ఆ॥ "ఒంటిహాడ వాఁడు, నొకదిరెండడుగుల
మేరయిమ్మ, సొమ్ము మేర, యెల్లఁ
గోర్కెదీర బ్రహ్మ కూకటిముట్టెద!
దానకుతుక సాంద్ర! దానవేంద్ర!"

అన్నాడు. బలిచక్రవర్తికి నవ్వు ముంచుకువచ్చింది! వడుగు అమాయకత్వం మీద జాలిముంచుకు వచ్చింది. తన ఐశ్వర్య, దాతృత్వ గుణాలమీద అహం ముంచుకువచ్చింది అందుకే

ఆ॥ ఉన్న మాటలెల్ల నొప్పును విప్రుండ
సత్యగతులు వృద్ధసమ్మతంబు
లడుగదలచి, కొంచెమడిగితివో చెల్ల!
దాతపెంపు సొంపుదలప వలదె?

మ॥ వసుధాఖండము వేడితో, గజములన్ వాంఛించితో, వాజులన్
వెసనుహించితో, కోరితో, యువతులన్, వీక్షించి కాంక్షించితో,
పసిబాలుండవు నేరవీవడుగ! నీభాగ్యంబులీపాటిగా.
కసురేంద్రుండు పవిత్రియుంబడుగ, నీయల్పంబునీ నీర్చునే,"

అంటూ తన త్రిజగద్రాజ్య ఐశ్వర్య ఆహ్వాన్ని, తన దానగుణ అతిశయాన్ని- ఆ సర్వాంతర్యామి ముందు చెప్పాడు!

ఆ మాయావటువు నవ్వాడు. సర్వచరాచర సృష్టిస్థితి సంహారకారకుడైన ఆలీలామానుష విగ్రహానికి ఈ దానాలు ఒక లెక్కా! ఈ దర్పం ఒక లెక్కా? ఈ సాత్విక అహం క్షమార్హమైంది అందుకే!

మ॥ గొడుగో, జన్నిదమే, కమండులువో,
నాతుస్ ముంజియో, దండమో,
వడుగేనెక్కడ? భూములెక్కడ,
కరుల్ వామాక్షులశ్వంబు, లె

క్కడ! నిత్యోచిత కర్మమెక్కడ!
మదాకాంక్షమితంబైన మూ
డడుగుల్ మేరయ త్రోపకిచ్చుటయె,
బ్రహ్మాండంబునా పాలికిన్!"

క॥ వ్యాప్తిం బొందక వగవక, ప్రాప్తం
బగు లేశమైన బరివేలనుచున్,
దృప్తింజెందని మనుజుడు, సప్త
ద్వీపములనైన జక్కంబడునే!

శా॥ ఆశాపాశము దా గడున్నిడుపు, లేదంతంబు రాజేంద్ర! వా
రాశి ప్రావృత మేదినీ వలయ సామ్రాజ్యంబు, చేకూడియుం,
గా సింబొందిరి గాక, వైన్య, గయ, భూకాంతాదులు, న్నర్థకా
మాశన్ బాయగ నేర్చిరే! మును నిజాశాంతంబులన్ జూచిరే!"

అన్నాడు ఇచ్చిదాత ఐశ్వర్యాన్ని బట్టి కాదు, ఇస్తానన్న వస్తు సముదాయాలన్నిటి మీద ఆశపడకూడదు, తనక్కావలసినదీ, అవసరమైనదీ మాత్రమే పుచ్చుకొనగల వాడే నిజమైన యాచకుడు-విప్రుడు! అలా గాక ఎదుటి వారిచ్చే ప్రలోభాలకు లొంగిపోయే మానవుడి ఆశకు అంతం ఎప్పుడు? వాడి యాచకవృత్తి హీనమైనది. నిజమైన యాచకుని విలువ-దాతకంటే గొప్పది!

ఆ సరికి, ఆ వచ్చినవారు సాధారణ, సామన్య వటువు యాచకుడు కాదనీ, దేవకార్యం తీర్చటం కోసం శ్రీమహావిష్ణువే ఈ రూపంలో వచ్చాడనీ, దానవ రాజ గురువైన శుక్రాచార్యుడు గ్రహించాడు! అందుకే తన శిష్యుడైన బలికి మేలుగోరి, "ఈతడు సాక్షాత్తు శ్రీమహావిష్ణువేగానీ, మరొకడు కాడు. మూడడుగులతో భూమి ఆకాశం ఆక్రమించవచేస్తాడు. ఆ తరువాత నీవు ఎట్లా? ఎక్కడ బ్రతకగలవు? ఏదానంవల్ల సర్వం నాశనమైతుందనపిస్తుందో, అది

దానముకాదు. ఆ దాత ఆడి తప్పినా, అది పాపకారమూకాదు. తనమమాలిన ధర్మంవద్దు" అని చెబుతాడు.

కొందరికీనాడు సిగిరెట్లు వ్యసనం, కొందరికి త్రాగుడు వ్యసనం. మరి కొందరు బండబూతులు మాట్లాడే వ్యసనం. ఇంకా కొందరికి స్త్రీవ్యసనం. అలాగే బలిచక్రవర్తికి దానగుణం అన్నది గుణంగాక వ్యసనం.

అంచేత శుక్రాచార్యుడు ఎంతగానో చెప్పి చెప్పి.

అ॥ వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్తమాన భంగమందు,
జకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘముపొంద డధిప!"

అని మొత్తుకున్నా వినలేదు బలిచక్రవర్తి.

శా॥ కారేరాజులు రాజ్యముల్ గలుగవే. గర్వోన్నతిన్ బొందరే!
వారేరీ? సిరిమూటగట్టుకుని పోవంజాలరే భూమిపై?
పేరైనన్‌గలదే! శిబిప్రముఖులం, బ్రీతన్ యశఃకాములై
యీరేకోర్కెలు! వారలన్ మఱచిరే? యిక్కాలమున్ భార్గవా!

అన్నాడు అంతటితో ఆగక.

శా॥ ఆదిన్ శ్రీసతికొప్పుపై, దనువుపై, నంసోత్తరీయంబుపై
పాదాబ్జంబులపై, గపోలతటిపై, పాలిండ్లపై, నూత్నమ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీదై నా కరంబుంట, మే
ల్గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే!
కాయంబు నాపాయమే!

అంటూ కొట్టిపారేశాడు. తనకు రాబోయే ఆపదను గురించిన పూహ మాత్రపు ఆలోచనకూడా కలగలేదు బలికి, సాక్షాత్తు శ్రీమహావిష్ణువే దూాప

కునిగా లభించిన తన దాతృత్వ అతిశయానికి, ఈ అవకాశానికీ, అదృష్టానికీ మేరకలేవని భావించాడు? ఆ వ్యసనం అలాటిది మరి! అంతేగాక

మ॥ నిరయంబైన నిబంధమైన, ధరణీ నిర్మూలనంబైన, దు
ర్మరణంబైన, గులాంతమైన, నిజమున్ రానిమ్ము, కానిమ్ము,పో;
హరుడైనన్, హరియైన, నీరజభవుండ భాగ్యవంతుడైన నే;
దిరుగన్నేరదు నాదుజిహ్వ! వినుమా, దీవర్య వేయేటికిన్!"

ఆ॥ బ్రతుకవచ్చుగాక బహుబంధములైన
వచ్చుగాక, లేమి వచ్చుగాక,
జీవధనములైన జెడుగాక, పడుగాక
మాటదిరుగ లేరు మానధనులు!"

అని నిర్ద్వంద్వంగా చెప్పేశాడు. అక్కడ గురుధిక్కారం అనిపించ లేదాయనకు తన దాతృత్వం తాలూకు సత్యసంధతకి కట్టుబడి పోయాడు బలిచక్రవర్తి. అంచేత సాక్షాత్తు విష్ణువే ఈ యాచకుడైతే, తానడిగినదే నేనిచ్చినప్పుడు నన్నెందుకు బధనలోకి త్రోస్తాడు? ఒకవేళ బంధించినా తానే విడిచి పుచ్చుతాడు పొమ్మంటాడు. సహజ భక్తునికి గల స్థితి ప్రజ్ఞత్వం ప్రకటితమౌతుంది! శుక్రాచార్యునికి కోపంవచ్చింది. త్వరలోనే నీవు పద భ్రష్టుండవై పోతావు" అని బలిచక్రవర్తిని శపిస్తాడు. గురువు వలన శాపం పొందికూడా! బలి

క॥ మేరువు తలక్రిందైనను, వారావారంబులింకబాఱిన, లోలో
ధారుణి రజమైపోయిన, దారాధ్యము
ఖండమైన దప్పకయిత్తున్!"

అని నిశ్చయించుకుని, తన భార్య అయిన మహా పతివ్రత "వింధ్యావళి" జలకలశంతో నీరు తీసుకురాగా, ఆ చిన్ని వటుని పాదాలు కడిగి, శిరసున జల్లుకొని,

"విప్రాయ! ప్రకటవ్రతాయ! భవతే! విష్ణురూపాయ, వే
దప్రామాణ్యవిధే! త్రిపాదధరణిందా స్వామి!"

అంటూ ఆత్మార్పణభావంతో, నిశ్శంకిత హృదయంతో, ధారవోశాడు. శుక్రాచార్యుడు ఇంకా ఆ ప్రయత్నం ఆపువామనే ఆశావేశంతో వింధ్యావళి చేతిలోని కలశధారకు, సూక్ష్మరూపంతో అడ్డుపడతాడు. అది గమనించిన వామనమూర్తి తన చేతిలోని కుశాగ్రం (దర్భపుల్ల)తో కమండలరంధ్రం పొడవగా, శుక్రుని ఒక కన్ను పోయింది. జలాధార నిరాటంకంగా విష్ణుమూర్తి చేతిలో పడింది. దానం ఇచ్చిన చేయి (బలిది) మీదై, సర్వ ప్రపంచాలకూ అభయ హస్తం అయిన విష్ణుహస్తం ఆ క్షణం క్రిందైంది లోకకళ్యాణార్థం!

ఆ॥ కమలనాభునెఱిగి, కాలంబుదేశంబు
నెఱిగి, శుక్రమాటలెఱిగి, నాశ
మెఱిగి, పాత్రమనుచునిచ్చె దానము బలి
మహి వదాన్యుడొకడు, మఱియుగలడె!

అంచేత దానగుణంతో శిబి, దధీచివంటి మహాత్ముల సరసన తానూ చిరంజీవి అయ్యాడు బలిచక్రవర్తి!

ఈ వామన చరిత్రలో పోతన మహాకవి మూలంలోలేని కొన్ని భావా లను తన కవితాకాశంలో భక్త్యావేశంతో చొప్పించి, వాటికి చిరస్థాయి అయిన కీర్తి చిరంజీసత్వం తెచ్చాడు.

వాటిలో ఒకటిగా

క॥ బలిచేసిన దానమునకు నళినాక్షుడు
నిఖిలభూత నాయకుడగుటన్
గలకలమనె దశదిక్కులు, భళిభళియని
పొగడె భూతపంచక మనఘా!"

అనే పద్యం ఒక ఉదాహరణ మాత్రమే బలిదాన ప్రవృత్తికీ, వటువు పుచ్చుకొన్న "బుల్లి దానానికీ" సిద్ధగంధర్వకిన్నర యక్ష దేవతాగణాలన్నీ పుష్పవృష్టి కురిపించాయి. మూడడుగులు మేరనీ ఇచ్చవచ్చినచోట కొలుచుకో మన్నాడు బలి.

ఇక వామనావతారం పరిసమాప్తమైంది. ఎందరో చిత్రకారుల, శిల్పుల హృదయాలలో చిరంజీవమైందా వామనావతారం!

త్రివిక్రమావతారం ప్రారంభమైంది!



# త్రి వి క్ర మా వ తా ర ం

బలిచక్రవర్తి ఇచ్చిన మూడడుగుల మేర కొలిచేందుకు వామనమూర్తి అయిన శ్రీమహావిష్ణువు, త్రివిక్రమమూర్తిగా పెరగటం ప్రారంభించాడు.

పోతన కవి అద్భుతాక్షర శిల్పంలో ఆ మూర్తి స్వరూపం ఇలావుంది.

మ॥ ఇంతింతై, వటుడింతయై, మఱియుఁదానింతై నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రునికంతయై, ధ్రువునిపై నంతై, మహర్వాటిపై
నంతై, సత్యపదోన్నతుండగుచు, బ్రహ్మాండంత సంవర్థియై!

మ॥ రవిబింబం బుపమింపఁబాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతమై, గళాభరణమై, సౌవర్ణకేయూరమై,
ఛవిమత్కంకణమై, కటిసలి నుదంచద్వస్త్రమై, నూపుర
ప్రవరంబై పదపీఠమై, వటుడుదా బ్రహ్మాండమున్నిండుచోన్!"

శ్రీమహావిష్ణువు త్రివిక్రమాకార చిత్రాలు శిల్పాలు ఎక్కడెక్కడ వున్నాయో, అవన్నీ పై వర్ణనకు ప్రతిబింబాలే!

ముందుగా మాయాపటువు త్రివిక్రమునిగా పెరగటం ప్రారంభిస్తాడు. ఆ పెరగటంలో భూమ్యాకాశాలు దాటిపోయిందాయన కాయం, రూపం! మొదట గొడుగులా అమరింది సూర్యబింబం! ఆ తర్వాత అదే శిరోరత్నంగా మారింది! మరల అదే చెవిపోగుగా కుంచించుకుపోయింది! ఆయన మెడలోని కంటెగా, మారింది! ఆ తర్వాత దండకడియంగా మారింది, తర్వాత ముంజేతి కంకణంగా రూపుదిద్దుకుంది. ఇంకా క్రిందకు దిగి నడుముకుచుట్టే చిన్న ఉత్తరీయంలా మారింది. ఆ తర్వాత మొలత్రాడుగా మారి, చివరగా పాదపీఠంగా మారిపోయింది! సూర్యబింబమే అట్లా ఆకృతి చెందినపుడు, ఇక ఆయన త్రివిక్రమమూర్తి మొదలు, తుది ఏర్పరచగలిగిన యోగీశ్వరు లెవ్వరున్నారు!

> ఆ॥ ఒక పదంబుక్రింద నుర్విపద్మమునంటి
> కోనిన బంకనము, కోమరుదాల్చె!
> నొకటిమీదదమ్మి, కోదదిన కేటినా
> వెలసెమిన్ను! నృప! త్రివిక్రమమున!"

రెండడుగులకే భూమ్యాకాశాలు సరిపోయాయి.

బలిచక్రవర్తి సచివులలో ముఖ్యులైన దానవవీరులు, విప్రచిత్తి, రాహుహేతి, ప్రహేతి మొదలైనవారంతా, జరిగిన మోసానికి ప్రతీకారం తీర్చుకుందామని క్రోధావేశులై వివిధాయుధధారులై వచ్చారు శ్రీహరి త్రివిక్రమావతారంమీదకు! అది చూచి దేవతలుకూడా యుద్ధసన్నద్ధులైనారు శ్రీహరి అండవుందనే ధైర్యంతో కానీ బలిచక్రవర్తి అడ్డుకున్నాడు దానవ వీరులను. శుక్రాచార్యుని శాపం ప్రకారం తాము వదభ్రష్టులయి తీరాలి! పైగా దైవం స్వయంగా అండగా వున్న దేవతలను ఈ తరుణంలో ఓడించటం అసాధ్యమనీ ఆయన గ్రహించాడు. అనవసరమైన జీవహింసకు తావివ్వకుండా వారందరినీ అనునయించాడు చేసేది లేక, దానవులంతా రసాతలానికి పారిపోయారు. ఇక మిగిలివున్న బలిచక్రవర్తిని వారుణాస్త్రంతో

బంధించాడు ఇంద్రుడు. ఆ బంధనాన్ని కూడా ఈశ్వరాజ్ఞగా శిరసావహించాడు బలి. అపుడు త్రివిక్రముడు "మూడవ అడుగు భూమి ఎక్కడ ఇస్తావని" అడిగాడు!

ఆ॥ సూనృతంబకాని, నుడియదునా జిహ్వ
బొంకజాల, నాకు బొంకులేదు!
నీతృతీయ పదము, నా శిరమున
నెలవుసేసి పెట్టు నిర్మలాత్మ!

ఆ॥ నిరయమునకుఁబొవ్వ నని గ్రహంబుకును,
బదవిహీనతకును, బంధమునకు,
నర్థభంగమునకు, నఖిల దుఃఖమునకు
వెఱవ. దేవ! బొంకవెఱచినట్లు!"

అని చెప్పాడు బలిచక్రవర్తి. అంతటితో ఆగలేదు. ఆ త్రివిక్రమ పదం తన శిరసుమీద నిజంగా వుంచితే, తానేమైపోతాడో ఆయనకూ తెలుసు! అపారమైన వైరాగ్యం, నిర్మల భక్తితత్వమూ, శ్రీమన్నారాయణుని కీర్తించే అవకాశము కలుగగా,

మ॥ చెలియే మృత్యువు? చుట్టమే యముడు? సంసేవార్థులే కింకరుల్?
శిలలంజెసెనె బ్రహ్మాదన్ను? ధృఢమే జీవంబువోచెల్లరే?
చలితంచేట యెఱుంగరీ, కపటసంసారంబు నిక్కంబుగా,
దలచున్ మూఢుడు, సత్యదాన కరుణా
ధర్మాది నిర్ముక్తుడై!" అంటాడు

ఈలోగా బలిచక్రవర్తి భార్య వింధ్యావళి పరుగుపరుగున వచ్చి, శ్రీమన్నారాయణుని దీనంగా వేడుకుంటుంది. తనభర్త శిరసు కాపాడమనీ, ఆయనకు మరణం కలుగనీయవద్దనీ, ప్రహ్లాదుడూ వస్తాడు. వరుణపాశ బద్ధుడైన బలి, తాతగారికి నమస్కరించలేక, శిరసు వంచుతాడు భక్తిపూర్వకంగా, ప్రహ్లాదుడు కూడా, వామనమూర్తియై, త్రివిక్రమావతారుడైన

శ్రీహరికి మ్రొక్కి, తన మనవని వదాన్యత తాలూకు అహంకారం, రాజ్యాధికారం తాలూకు దర్పం వదిలి పోయాయనీ, ఇకాతని కాపాడమనీ వేడుకుంటాడు.

శ్రీమహావిష్ణువు ప్రసన్నుడౌతాడు. విష్ణుతత్వంలోని రహస్యం ఇలా వివరిస్తాడు ప్రహ్లాద, బలి ప్రముఖులందరికీ!

సీ॥ "ఎవ్వని గరుణింప నిచ్ఛయించితి;
వాని యఖిలవిత్తంబునే నపహరింతు!
సంసార గురుమదస్తబ్ధుడై యెవ్వడు,
దెగడిలోకము, నన్ను ధిక్కరించు,
నతడెల్లకాలంబు నఖిలయోనులయందు,
బుట్టుచు దుర్గతిబొందు, బిదప,
విత్తవయోరూప విద్యాబలైశ్వరకర్మ
జన్మంబుల, గర్వముడిగి,

తే॥ యేక విధమున విమలుడై యెవ్వడుండు,
వాడు నాకూర్చి రక్షింప వలయువాడు
స్తంభలోకాభిమాన సంసారవిభవ
మత్తుడై చెడనొల్లడు, మత్పరుండు!"

అదీ విష్ణుభక్తులకు శ్రీమహావిష్ణువు ఇచ్చే కానుక! వారిని సన్మార్గానికి తెచ్చే పద్ధతి! బలిచక్రవర్తిని కరుణించి, నీవు సావర్ణి అనే మనువు కాలంలో ఇంద్రపదవికి ఇంద్రునిగా రాగలవు అందాకా రసాతలంలో నిరంతరం, శ్రీహరినైన నాధ్యానంలో కాలం గడుపుతూ వుండు. నీకు మాత్రం ప్రత్యక్షం అవుతూ, నిన్ను నిరంతరం కాపాడుతుంటాను నిన్ను ధిక్కరించే వారెంత వారైనా వారిని నాచక్రా యుద్ధంతో నిర్జిస్తుంటాను నా ధ్యానంతో నీ శరీర కారణమైన రాక్షస భావాలు అంతరించి, నీ ఆత్మ స్వరూపం నా స్వరూపంగా మారుతుంది. సుతల లోకంలోవుండు నిశ్చింతగా!" అని

అనతిచ్చాడు. ప్రహ్లాదునిలానే బలిచక్రవర్తి కూడా శ్రీహరిని వేనోళ్ళ స్తుతించి, ఆయన అనతిచ్చిన ప్రకారం సుతల లోకం (భూమిక్రింద) చేరుకుంటాడు. ప్రహ్లాదునికూడా అక్కడే వుండమంటాడు శ్రీహరి. తాను స్వయంగాగదా, పాణియై రక్షింస్తుంటానని అభయం ఇస్తాడు ప్రహ్లాదుఁడుకూడా వెళ్ళి పోతాడు, శుక్రాచార్యుని చూచి, వామనమూర్తి. మిగిలివున్న యజ్ఞం పూర్తి చేయమని ఆజ్ఞాపిస్తాడు! శుక్రాచార్యుడుకూడా శ్రీహరిని కీర్తించి, ఆ యజ్ఞం పరిసమాప్తి చేస్తాడు. చివరగా వామనమూర్తి అయిన త్రివిక్రమావతారాన్ని వేనోళ్ళపొగడి, పోతన మహాకవి

ఆ॥ కడుపు బరువుగాగ గొడుకుల గనుకంటె,
తల్లికొకడే చాలు బల్లిదుండు!
త్రిదశగణముగన్న యదితి కానుపుదీర్చి,
చిన్నియేటి వడుగు గన్నయట్లు!"

అంటాడు! నిజమే మరి! సత్పురుషులను, మహా వీరులనూ, మహా త్యాగులనూ కన్న తల్లులు ధన్యజీవులు కదా? అలాంటి లక్షలాది తల్లులను గన్న ఈ భారతావని మరింత పుణ్యభూమి కాదా!



# శ్రీ కృష్ణావతారం

యదువంశరాజు శూరసేనుని కొడుకు వసుదేవుడు "భోజ" వంశరాజు ఉగ్రసేనుని కొడుకు కంసుడు. ఆ భోజవంశ ఉగ్రసేనుని తమ్ముడయిన "దేవకుని" కూతురు దేవకిదేవి!

మధురానగరంలో దేవకి వసుదేవుల వివాహం వైభవంగా జరిగింది. దేవకుడు తన కుమార్తె అయిన దేవకిదేవికి 'అరణంగా' పద్దెనిమిది వందల రథాలను, నాలుగువందల ఏనుగులను, పదివేల గుర్రాలను, అతి సౌందర్య చతురులైన దాసీ యువతులను రెండువందల మందిని, అన్నిటికీ, అందరికీ తగిన ధనకనక వస్తు సముదాయాన్నిచ్చి, వైభవంగా ఆ వధూవరులకు సమర్పించాడు. దేవకిదేవి పెదనాన్న (ఉగ్రసేనుడు) కొడుకు! దేవకికి అన్న వరస అయ్యేవాడు. బలమూ, దర్పము, సౌందర్యము, క్షాత్రము సమపాళ్ళలో వున్నవాడు అయిన కంసుడు, తన చెల్లెలు దేవకినీ, బావగారైన వసుదేవుని, అతిఉల్లాసంగా రథంలో కూర్చొబెట్టుకుని, తానే స్వయంగా బావమరది హోదాలో రథంనడుపుతూ, నూతన వధూవరులను తమదేశం పిల్చుకువెళ్తున్నాడు. త్రోవలో హఠాత్తుగా ఆశరీరవాణి దిక్కులు పిక్కటిల్లేలా ఇలా పలికింది.

క॥ తుష్టయగు భగినిమెచ్చగ, నిష్టుడవై
రథముఁగడపె, దెఱుగవు, మీద
శిష్టయగు నీ తలోదది, యష్టమగర్భంబు
నిన్ను హరియించుఁజుమీ!"

అంటూ ఆ అశరీరవాణి వాక్కులు వింటూనే కంసుడు త్రుళ్ళిపడ్డాడు నిశ్చేష్టుడయ్యాడు అంతే! అందాకా వాడిలోవున్న క్షాత్రం రాక్షసత్వంగా మారిపోయింది క్షణకాలంలో లోలోపల అణగి మణగివున్న రాక్షసత్వం పెల్లుబికింది ఒక్కసారిగా! ఆ క్షణంలోనే వాడు రాక్షసునిగా మారిపోయాడు

స్వభావరీత్యా! రథం ఆపాడు. కిందకిదూకి కత్తి ఝుళిపించాడు కొత్త కూతురైన దేవకీదేవిని చెల్లెలనే వాత్సల్యంకూడా లేకుండా జుట్టుపట్టి రథం నుంచి కిందికి ఈడ్చాడు ఆమెను చంపటానికి కత్తి ఎత్తాడు. అదేసమయంలో అసరికే పన్నెండుమంది భార్యలకు భర్త షుమారు అరవైమంది పిల్లలతండ్రి (ఆ కాలం వయః ప్రమాణం ప్రకారం అప్పటికీ నిత్యయవ్వనుడూ, కొత్తపెళ్ళి కొడుకుఅయిన వసుదేవుడు జరగబోయే ఘోరం ఆపటం కోసం తానూ రథంలోనుంచి క్రిందికిదూకి

ఉ॥ అన్నవునీవు! చెల్లెలికినక్కట, మాడలు చీరెలిచ్చుటో
మన్ననసేయుటో, మధుర మంజుల భాషలనాదరించుటో,
మిన్నుల మ్రోతలే మేలని, చంపకుమన్న! మానిరా
వన్న! సహింపుమన్న! దగదన్న! వధింపకుమన్న! వేడెదన్!"

అంటూ పరిపరివిధాలుగా శాంతింపజేస్తాడు. అంతేగాదు "ఈమె అష్టమ గర్భంవలనకదా నీకు ప్రమాదమని నీవు భయపడుతున్నావు ఈమెకు కలిగే బిడ్డలందరినీ నీకు సమర్పిస్తాను. వాళ్ళని చంపు నీకికభయుంవుండదు అని తాత్కాలికంగా ఉపాయం చెబుతాడు. లోలోపల ఆ పుట్టబోయే బిడ్డలను "బలి" ఇస్తాననిచెప్పి, ప్రస్తుతం ఈ నా భార్యను రక్షించుకోవటం నీతి, ఆ అల్పాయుష్షులయితే ఎలాగైనా మరణిస్తారు లేదా "వాటి కొక్కదైవములేదే!" అని ఆలోచిస్తాడు వసుదేవుడు కంసుడు శాంతిస్తాడు చెల్లెలిని చంపక వదిలి, వెనుదిరిగి వెళ్ళిపోతాడు వసుదేవుడు "బ్రతుకుజీవుడా" అని భార్య దేవకితో నగరానికి చేరుకుంటాడు వసుదేవుడు తనకు దేవకికి పుట్టిన మొదటి కొడుకును తీసుకుని కంసుని వద్దకు వచ్చి ఆబిడ్డను చంపమని ఇస్తాడు వసుదేవుని సత్యసంధతకు భార్య దేవకిపట్ల అతనికిగల ప్రేమకు చలించిపోయిన కంసుడు "దేవకి అష్టమ గర్భం గురించిగదా నేను భయపడాల్సింది! ఈ బిడ్డను చంపను తీసుకవెళ్ళు" మని చెబుతాడు. వాడిలో తాత్కాలికంగా మానవత్వం చోటుచేసుకుంది.

కానీ నారదమహర్షి ఊరుకోడు. లోకకళ్యాణార్థం, రాక్షస సంహారార్థం, ఆయన ఏదో ఒక విపరీతాన్ని సృష్టిస్తూనేవుంటాడు. నారదుడు వనిమాలి ఒక రోజు కంసునివద్దకువెళ్ళి నీవు పూర్వం శ్రీహరి చేత మరణించిన "కాలనేమి" అనే రాక్షసుడివి. ఈమారు కంసునిగా జన్మించావు వసుదేవుడు, నంద గోకులంలోని "నందుడు" వగయిరా యాదవులు, వారి భార్యలు, బిడ్డలు, అంతా దేవతల అంశాలనీ, శ్రీకృష్ణుడు తప్పక దేవకీదేవి గర్భవాసాన జన్మించి నిన్ను సంహరిస్తాడని" చెబుతాడు, ఓపికగా చెప్పి కంసునిలో వగ, విష్ణుద్వేషంరగిల్చి ఆ ద్వేషాగ్నికి ఆజ్యంపోసి మరీవెళతాడు.

ఇక కంసుడు క్షణం ఆలస్యంచేయడు. తన తండ్రిఅయిన ఉగ్రసేనుని బంధించి; రాజ్యాధికారం తాను తీసుకుంటాడు. అలాగే దేవకీ వసుదేవులను బంధించి చెరసాలలో వేయిస్తాడు. దేవకీ వసుదేవులకు పుట్టిన ఆరుగురు కొడుకులను క్రూరంగా చంపేస్తాడు ఏడవమారు "సంకర్షణుడు" దేవకికడుపులో వుండగా శ్రీహరి ఆ బిడ్డను కాపాడదలచి "యోగమాయ"ను ఆహ్వానించి ఆ దేవకి సప్తమగర్భాన్ని నందగోకులంలోని వసుదేవుని భార్య అయిన రోహిణి గర్భంలోనికి మార్చమని ఆజ్ఞనిస్తాడు. "యోగమాయ" అట్లాగే చేస్తుంది. ఇక్కడ దేవకికి సప్తమ గర్భస్రావం అయిందని భావిస్తారు కంసుడు వగయిరాలు. కానీ నందగోకులంలో రోహిణి "సంకర్షణుడు" బలరామునిగా బలభద్రునిగా జన్మించి పెరుగుతున్నాడు. యోగమాయ చేసిన దైవ కార్యానికి సంతోషించి, శ్రీమహావిష్ణువామెకు "నీవు దుర్గ, భద్రకాళి, విజయ వైష్ణవి, కుముద, చండికి కృష్ణ మాధవి, కన్యక, నారాయణి, ఈశాని, శారద, అంబిక" అనే పద్నాలుగు నామాలతో మానవులచేత కీర్తింపబడుతూ పూజలందుకుంటావు ఆయాస్థానాలలో అని వరం ఇస్తాడు.

బాణుడు, భౌముడు, మహాశన, కేశ, ధేనుక, బల, ప్రెలంబ,తృణావర్త చాణూర ముష్టిక, అరిష్ట, ద్వివిద, పూతన వగైరా రాక్షసులందరినీ తన అనుచరులుగా చేసుకొని కంసుడు ఇటు మధుర శూరసేన రాజ్యాలను లోబరచుకుని నియంతగా రూపొందుతాడు. ఇక ఆయా దిశాదీశులంతా కంసుని

రాక్షస బలానికి తట్టుకోలేక యాదవులలో చాలా మంది తమ తమ దేశాలూ, రాజ్యాలూ వదిలి, నిషధ, కురు, కోసల, విదేహ విదర్భ, కేకయ, పాంచాల సాళ్వదేశాలకు వలసవెళ్ళిపోయారు ప్రచ్ఛన్నంగా కొందరూ గోపాలక వృత్తితో వెళ్ళిపోయారు గోసంపదలతో, మరి కొందరు మథురలోనే తలవంచి బ్రతుకులు వెళ్ళబుచ్చుకుంటున్నారు. అలాటి క్లిష్ట పరిస్థితిలో, ఒకానొక నియంత రాజ్యాధికారంలో, వసుదేవుడు: దేవకి చెరసాలలో బంధింపబడి వున్నారు దేవకి అష్టమ గర్భం ధరించి వున్నందువలన ఏ క్షణాన ఆ బిడ్డ పుడితే, ఆ క్షణాన ఆవార్త తనకు తెలిపితే, ఆ పురిటి కందును "సంహరిస్తానని" భటులకు ఆజ్ఞఇచ్చి సిద్ధంగా వున్నాడు వీరకంసుడు: వాడు పుట్టబోయే ఆ శ్రీహరి రూపాన్ని రాత్రింబగళ్ళు ఎలా ధ్యానిస్తున్నాడండే-పగతో

క॥ తిరుగుచు: గుడుచుచు, ద్రావుచు
నఱుగుచు, గూర్చుండి, లేచు చనవరతంబున్
హరి దలచి, తలచి జగమూ హరిమయమని
తలచి గంసు, డారనియులుకన్:

సీ॥ శ్రవణ రంధ్రములనే శబ్దంబు విన
బడు, నది "హరిపలు" కని, యూలకించు:
నక్షిమార్గమున నెయ్యది చూడబడు
నది "హరిమూర్తి" గానో పువంచు, జూచు:
దిరుగుచో దేహంబు దృణమైననోకిన,
"హరి కరాఘాతమో:" యనుచు, గలుగు:
గంధంబులేమైన, ఘ్రాణంబు సోకిన,
"హరిమాలికా గంధ" మనుచు, నదరు:

ఆ॥ బలుకు లెవ్వియైన బలుకుచో హరి పేరు
పలుకబడియె ననుచు, భ్రమసి పలుకు:
దలపు లెట్టివైన దలచి, యాతలపులు
హరితలంపులనుచు నలుగదలడు:"

కంసునికి సర్వం హరిమయంగా కనిపిస్తోంది! జగత్తంతా హరిరూపు గానే కనిపిస్తోంది అదీవైర భక్తి! సర్వాంతర్యామిని స్థంభంలో చూడమన్న హిరణ్యకశిపునికి, ఈ కంసునికి తేడావుందా? లేదు శ్రీహరి తీసుకున్న అవతారాలలోని కాస్తంత తేడా అంతే.

ఇక బ్రహ్మాది దేవతలందరూ చెరసాలలోని దేవకీ గర్భస్థ శిశువుగావున్న శ్రీహరిని స్తోత్రంచేశారు ఇక జన్మించి తమందరి. భూభారపు కష్టాలను తీర్చుమని: పోతనమహాకవి అక్షరశిల్పంలో ఒక్కో పద్యం ఒక్కో రసగుళిక. చివరగా.

మ॥ గురుపాఠీనమవై, జలగ్రహమవై, కోవంబవై, శ్రీనృకే
సరివై రిక్షుడవై! హయాననుడవై, క్ష్మాదేవతా భర్తవై,
ధరణీ నాథుడవై, దయాగుణ, గణో దారుండవై. లోకముల్
పరిరక్షించిన నీకు మ్రొక్కెద, మిలా భారంబు వారింపవే!

అంటూ దశావతారస్తోత్రం చేశారు (ఒక్క పద్యంలో) ఆ రాత్రి దేవకీదేవి ప్రసవించింది! భూభారం అణచటానికి శ్రీ కృష్ణుడు జన్మించాడు కృష్ణపక్ష అష్టమి అర్థరాత్రి అటు రాక్షసులందరికి అష్ట కష్టాలు తేవటానికి. శ్రీకృష్ణుడు చెఱసాలలో జన్మించాడు! వసుదేవునికా శిశువు శంఖచక్రగదా ధరుడైన శ్రీ మహావిష్ణువుగా సాక్షాత్కరించాడు, వసుదేవుడు చేతులు మోడ్చి స్తోత్రం చేశాడు దేవకీదేవిస్తోత్రం చేసింది. భక్తి పారవశ్యతతో! అప్పుడా స్వామి వారి ననుగ్రహించి, పూర్వజన్మలో దేవకీదేవి "పృశ్ని" అనే మహాపతి వ్రతఅనీ, వసుదేవుడు స్వాయంభువ మన్వంతరమున "సుతపుడు" అనే ప్రజాపతి అనీ వారిద్దరూ శ్రీహరిని గూర్చి ఘోరతపస్సుచేసి, శ్రీహరిని కొడుకుగా పుట్టమని కోరగా, "పృశ్నిగర్భుడుగా" మొదటి జన్మ రెండవ జన్మ కశ్యప, అథితిలకు వామనుడుగా, ఇక ఇప్పుడు మూడవ జన్మలో దేవకీ వసుదేవులుగా జన్మించి, ఇకవారి జన్మరాహిత్యం ప్రసాదించాననీ – ఇప్పుడు చేయవలసిన పని ఇది "అంటూ వసుదేవునకు తెలిపి మరల చిన్న శిశువుగా

మారిపోతాడు శ్రీకృష్ణుడు; వసుదేవుడు శ్రీహరి ఆజ్ఞ ప్రకారం ఆ శిశువును ఒక చిన్న గంపలో పెట్టుకుని, కావలివారికి యోగనిద్ర ఆవహించగా, చెర సాల తలుపులు అవే తెరచుకొనగా ఆదిశేషుడు ఆ పాపకు ఛత్రం పట్టగా, ఉప్పొంగుతున్న యమునానది త్రోవే ఇవ్వగా నందగోకులం చేరాడు. వసు దేవుని ప్రాణమిత్రుడైన నందుని భార్య యశోద. ఆమె రాత్రే ఒక ఆడ శిశువుని ప్రసవించింది ఆ శిశువు ఎవరోకాదు శ్రీహరి ఆజ్ఞ ప్రకారం శిశు రూపం ధరించిన యోగమాయ ఆ యోగమాయా ప్రభావంతో నందగోకులం కూడా మాయలాటి నిద్రలో మునిగిపోయింది వసుదేవుడు నిరాటంకంగా నందుని ఇంట్లోకి, యశోధపురిటింటిలోకి ప్రవేశించి, తన బిడ్డ అయిన శ్రీకృష్ణుని యశోదప్రక్కలోవుంచి యశోద కన్న ఆడ శిశువును తానుతీసుకుని యథాప్రకారం మధురానగర చెరసాలలోకి ప్రవేశించి!శ్రృంఖలాబద్ధుడైనాడు! అందాకా సర్వులనూ ఆవహించి వున్న యోగ మాయాప్రభావ నిద్రతెర అప్పుడు తొలగింగి శిశువు ఏడుపువిని, దేవకీదేవి ప్రసవించిందని తెలుసుకొని కావలి భటులు వెళ్ళి కంసునికి చెప్పారు ఆ కబురు, ఆ అర్ధరాత్రితత్తరపడుతూ. కంసుడు కత్తి తీసుకొని చెరసాలకు వచ్చాడు దేవకీదేవి.

ఉ॥ అన్న శమింపుమన్న! దగ దల్లుడుగా అది మేనకోడలే
మన్ననసేయుమన్న! ఏమి! మాలిని జంపుట రాచపాడిగా
దన్న! సుకీర్తివై మనగదన్న! మహాత్ములు పోవుత్రోవ బో
వన్న! భవత్సహోదరిఁగదన్న. నినున్ శరణంబువేడెదన్!"

అంటూ దీనంగా ఏడుస్తున్నా లెక్కచేయకుండా, ఆ శిశువును లాక్కొని పైకి ఎగురవేస్తాడు చంపటానికి కానీ ఎగురవేసిన శిశువు-అందరిలా నేలమీద బడక, నింగి కెగసి "అష్టభుజ" యోగమాయాదేవి''గా సాక్షాత్కరించి, "ఓరీ! కనికరం లేకుండా పోయిన నీకు-నాతోబుట్టు వొకడు, నాతోబాటు జన్మించి,

పెరుగుతున్నాడు! వేరొకచోట వాడి చేతిలో నీమరణం తథ్యం" అని పలికి "భద్రాత్మి"కగా వివిధ రూపాలతోశక్తి పీఠాలలో పూజలందుతుంది శాశ్వతంగా!

ఇక కంసునికి అప్పుడు పశ్చాత్తాపం కలిగింది సోదరిమీద, బావగారి మీద! హిరణ్యకశిపుడు చెప్పినట్లే అద్భుతంగా వేదాంతం చెబుతాడా అర్థ రాత్రి! వాళ్ళిద్దరినీ బంధవిముక్తులను చేసి, మధురానగరంలోనే వారి ప్రత్యేకాంతఃపురంలోకి పంపిస్తాడు కానీ ఆరాత్రి తెల్లారేసరికి. వాడివేదాంతం మాయమైంది. సూర్యోదయంతో బాటు వాడి పగకూడా పదునెక్కింది! తన సహచరులు, విశ్వాసపాత్రులూ అయిన రాక్షసులను పిలిపించి అర్థరాత్రి యోగమాయ పలికిన పలుకులు తెలిపి, కర్తవ్యం ఆలోచించమంటాడు వాళ్ళు కూడా, రాజుకు తగిన సచివులుగా! పట్టణాలలో, పల్లెలలో. అలమందలుండే ప్రాంతాలలో ఇప్పటికి పుట్టిన శిశువులందర్నీ విచక్షణారహితంగా వివిధోపాయాలతో హత్య చేసేటట్లు సాధుహింస, గోబ్రాహ్మణ హింస విష్ణువుంటాడని శృతులుచెప్పే యజ్ఞ యాగ బ్రాహ్మణ గోసాధు, తపో శ్రద్ధా, శాంతుల ధ్వంసం చేస్తామని చెబుతారు. కంసుడు సంతోషించి ఆయా రాక్షసులను పంపిస్తాడా పనులమీద! అక్కడ నందగోకులంలో నందుడు యశోదకు మగపిల్ల వాడుపుట్టాడని తెలిసి ఆనందించి, అత్యంతానందంతో పిల్లవాడి జాతకర్మలు చేయిస్తాడు.

"జో! జో! కమలదళేక్షణ" జోజో మృగరాజమధ్య! జో!జో! కృష్ణా! జో!జో! పల్లవ కరపద! జో!జో! పూర్ణేందువదన! జో!జో! యదుకులతిలక!" నంద గోకులంలోని గోపికలంతా జోలపాడారు ఆ శ్రీమన్నారాయణునికి!

శ్రీ కృష్ణుడు అవతరించాడు అలా ఆగొల్ల వారి ఇంట!

+ ○ +

## "కాళీయ మర్దనం గోవర్దనోద్ధరణం"

ఒకనాడు యశోద చల్లచితుకుతున్నది చిన్ని కృష్ణుడు తనకు ఆకలిగా వుంది పాలిమ్మన్నాడు. చల్లచితకటం ఆపి పాలిస్తున్న ఆతల్లి పొయ్యిమీద పాలు పొంగి పోతాయనితోచి, పిల్లాడిని కిందకూర్చోబెట్టి పాల కుండ దించి వచ్చింది, ఈలోగా అలిగిన కృష్ణుడు ఆ మజ్జిగ కుండను తన్ని ముక్కలుచేశాడు యశోదవచ్చేసరికి ఇల్లంతా మజ్జిగ, వెన్న ఏరులై పారు తున్నాయి పిల్లాడి అఘాయిత్యానికి నిజంగానే కోపం వచ్చింది యశోదకు. ఈలోగా తల్లి కోపం తెలుసుకున్న శ్రీకృష్ణుడు పరుగు లంకించుకున్నాడు వెంటబడింది. యశోద! జప, తప ధ్యాన యోగ సమాధులతో నిష్ఠనైన మహా యోగింద్రులకు పట్టుబడని ఆ శ్రీమన్నారాయణుడా వెర్రితల్లికి చిక్క కుండా పరుగులు తీస్తున్నాడు. పరుగెత్తి పరుగెత్తి అలసిపోయిందాతల్లి! ఒళ్ళంతా చమటలుపట్టి రొప్పువచ్చిందా తల్లికి! ఇక బాల కృష్ణుడు ఆమెపై జాలిపడి, తల్లి పట్టుకు చిక్కాడు. వెర్రి యశోద తాను పిల్లాణ్ణిపట్టుకోగలిగా ననుకొని! గర్వంగా ఇలా అన్నది

క॥ పట్టిన పట్టుబడని నిను బట్టెదమని, చలముకొనిని
బుట్టుటబెట్టే పట్టు వడ
వంద్రుపట్టి! పట్టుకొనన్ నాకుగాక, పరులకు వశమే!"

ఆమె తన ఇంటి ఆవరణలో ఓమూలగావున్న పెద్ద రోటికి కట్టివేసింది తాడుతో శ్రీ కృష్ణుని!

క॥ చిక్కడు సిరికౌగిటిలో! జిక్కడు సనకాది యోగి చిత్తాబ్జములన్,
జిక్కడు శ్రుతిలతికావళి; జిక్కెనతడు లీల దల్లి చేతన్రోలన్!

అయితే ఇక్కడా ఒక మహాద్భుత లీల చూపాడు శ్రీ కృష్ణుడు ఆమె ఎంత పెద్ద తాళ్లు తెచ్చినా ఆయన బొజ్జ తిరిగిరావటంలేదు. అటా అలసిపో తున్న తల్లికి జాలితో తాడు సరి పెట్టుకున్నాడు శ్రీ కృష్ణుడు.

తాముతిని! తమ ఎంగిలి శ్రీకృష్ణునికి పెట్టి, మూఢభక్తితో తరించి పోయారు అట్లా! బకాసురుని తమ్ముడు అఘాసురుడనేవాడు, కొండచిలువ రూపంతో వచ్చి గోపబాలకులను మ్రింగుతుండగా వాడిని సంహరించి గోపాలకులను కాపాడాడు శ్రీ కృష్ణుడు.

బ్రహ్మదేవునికి హఠాత్తుగా అహంకారం వచ్చింది తానే సృష్టికర్తనని, గోపాలురను గోవులనూ, గోవత్సాలనూ తన మాయతో దాచేశాడు శ్రీకృష్ణుడు తన గోవులు, తోటి నేస్తాలు కనిపించకపోవటంతో ఇది బ్రహ్మదేవునిపని అని తెలుసుకొని ఆయనకు కనువిప్పు అయ్యేట్లుగా తానే గోపాలకుల గోవుల గోవత్సాల రూపాలతో తమ తమ ఇళ్ళకు వచ్చేట్లుచేశాడు

> క॥ రూపంబులతెల్ల, బహురూపకుడిట, బాలవత్సరూపంబులతో
> నేపారుటేమిచోద్యము! రూపింపనతనికి తర రూపముకలదే!"

అట్లా ఒక సంవత్సరం శ్రీకృష్ణుడు లీలచేసి, మరల గోవర్ధనగిరి ప్రాంతంలో తన అసలు గోవులు గోపాలకులనుచూచి నవ్వుకున్నాడు.

ఈలోగా బ్రహ్మ ఆ బాలకులు గోవత్సాలన్నిటితో శ్రీమన్నారాయణుని దర్శించి తన అహంకారానికి పశ్చాత్తాపపడి, శ్రీకృష్ణుని కీర్తించి వెళతాడు.

యమునానదీ ప్రవాహ ప్రాంతంలో అరణ్యంలో "కాళిందీ" మడుగు అనే తటాకం ఒకటి వున్నది ఆ తటాకంలో "కాళీయుడు" అనే మహా సర్పం తన సంసారంతో నివసిస్తున్నది. ఆ కాళీయుని విషానల జ్వాలల వలన కాళిందీ హ్రదం విషపూరితమై ఆ జలం పానయోగ్యం కాకుండా పోయాయి తెలియుని వారెవరయినా ఆ హ్రదంలోకి దిగితే కాళీయుని విషానల జ్వాలలకు బలికావలసిందే.

శ్రీకృష్ణుడా జలాశయాన్ని సర్వజనులకు సర్వపశుపక్షి గణాలకూ పాన యోగ్యం చేయదలచాడు. ఒకరోజు మధ్యాహ్నం వేళ గోపాలకులందరూ

చూస్తుండగా శ్రీకృష్ణుకా జలాశంలోకిదూకాడు కాళీయ సర్పం బుసలు కొడుతూ పైకిలేచిందా కృష్ణుకిపాటుకు అదిరిపడి మహాకోపంతో గోపాలకులు భీతావహులై ఇళ్ళకు పరుగెత్తి ఈ వార్త నంద యశోదాది గోపాలక బృందాలకు చెప్పారు. వారంతా శ్రీకృష్ణుడు కాళీయునిచేత మరణించి వుంటా డని రోధిస్తూవచ్చారు. ఈలోగా కాళీయుని విషజ్వాలలకు తట్టుకొని కాళీయుని శిరస్సులమీదనిలచి శ్రీకృష్ణుడు నాట్యం చేయసాగాడు ఆయన పదఘట్టానికి కాళీయుని బలం అంతరించటమేగాక ప్రాణాలు కడగట్టాయి. కాళీయుని భార్యలువచ్చి శ్రీకృష్ణుని శరణువేడారు. తమ భర్తను రక్షించమంటూ!

పూర్వం గరుత్మంతునివలన ప్రాణభయంతో కాళీయుడీమడుగులో తలదాచుకున్నాడు "ఇక ఇప్పట్నుంచీ శ్రీకృష్ణపాద చిహ్నాలు ఆ పాము ఫణిమీదచూచి గరుత్మంతుడు నిన్నేమీచేయదు నీవు ఈ హ్రదంవదలి వెళ్ళ" మని ఆజ్ఞఇచ్చాడు శ్రీకృష్ణుడు కాళీయునికి, కాళీయుడు తన భార్యలతో హ్రదంవదలి వెళ్ళిపోయాడు.

శా॥ కుక్షిన్ లోకములున్న గౌరవముతో, గోపాకృతిన్నున్న, యా
రక్షోహంతపడిన్! మహాఫణి ఫణారంగ ప్రదేశంబుపై
నక్షీణోద్ధతి నాడు వాడు జెలగున్! హాసంబుతోడన్, బ
ప్రక్షేపంబులుసేయు, గీతగతులన్! బ్రాహ్మైన శేషంబుగన్!"

పోతనకవి అక్షర శిల్పాలతో కాళీయమర్ధన చిత్రాలు మనకళ్ళముందు మెదులుతాయి. ఎందరో కవుల శ్రీకృష్ణ భక్తి పాటలలో, కృష్ణలీలలలో, కృష్ణ నాట్యభంగిమలో ప్రముఖంగా వినిపించేది కనిపించేది ఈ కాళీయ మర్ధన ఘట్టం!

ప్రలంబాసురుడనే వాడు! గోపాలక వేషంతో వచ్చి
ఆటల పరుగు పోటీలు కల్పించి, బలరాముని ఎత్తుకొని పరుగెత్తు
తాడు. బలరాముడారాక్షసుని పీకనొక్కి చంపి తిరిగివస్తాడు

హఠాత్తుగా ఒకరోజు కార్చిచ్చు ఆవ
రించగా ఆదావాగ్నిని శ్రీకృష్ణుడు
మ్రింగి గోవులకు, గోపాలురను కాపాడుతాడు.

క॥ అభ్రంకషధూమాయిత, విభ్రాంత మహాస్ఫులింగ వినరోగ్రశిఖా
విభ్రష్ట, దగ్ధలోకా దభ్రంబై వచ్చెచూడు దవశిఖ కృష్ణా!"

అనే పద్యంలో కోత నమహాకవి అక్షరవిన్యాసం, పదప్రయోగ సౌందర్యం వీరభద్రావతో ఘట్టంలోలా ఎంత మహోన్నతంగా ఉందో గమనించండి

యవ్వనంలోకి అడుగిడుతున్న శ్రీకృష్ణుడు: గోపికాకాంతల మానస చోరుడై గోపికావస్త్రాపహరణం "రాసలీలలు" లాది క్రీడలీలలుచేసి మధుర భక్తి నొంది పలికాడు. రాసలీలలలోని "గోపికాగీతాలు" భ్రమరగీతాలు, గోపికా విరహాలు అన్నీ మధురభక్తికి పరాకాష్ఠలు భక్త మీరా, జయదేవుడు వగయిరాలు మధురభక్తిని అనుసరించిన భక్తశిఖామణులుకాగా, కొందరు కపటయోగులు శ్రీకృష్ణుని మధుర భక్తిని తమ స్వార్థానికి అనువుగా మలచుకొని మధురభక్తిని కళంకితంచేశారు చేస్తున్నారు.

ఒకనాడు ఇంద్రుడు గర్వించి వారం రోజులు ఎడతెరిపిలేకుండా కుంభ వృష్టి, రాళ్ళవాన కురిపించాడు హడలిపోతున్న గోగణాన్ని, గోపాలకులను శ్రీకృష్ణుడు గోవర్ధనగిరిని తనచేతివేలిమీద ఛత్రంలా నిలిపి వారికి రక్షణ కల్పించి ఇంద్రుని గర్వభంగంచేశాడు.

శా॥ బాలుండీతడు, కొండదొడ్డది మహాభారంబు సైరింపగా
జాలండోయని, దీనిక్రింద నిలువన్ శంకింపగా బోల, నీ
శైలంబోనిధి జంతుసంయుత ధరాచక్రంబుపై, నా
కేలల్లాడదు: బంధులార: నిలుడీ: క్రిందన్: ప్రమోదంబుతోన్:

అన్న శ్రీకృష్ణుని భరోసాతోబాటు "గోవర్ధనగిరిధారి" గా సాక్షాత్కరించాడు శ్రీకృష్ణుడు!

ఇట్లా బాల్య, యవ్వనారంభదశలలో ఎన్నో మహాద్భుతలీలలుచేసి నందగోకులాన్ని తన వాత్సల్యమహిమలతో కాపాడి, ఎందరో రాక్షసులను సంహరించిన శ్రీకృష్ణుని ఉనికి వైనం కంసునికి తెలిశాయి! ఎలా? నారద మహర్షిద్వారా!

+ ○ +

## మౌనభక్తుడు అక్రూరుడు
## మధురానగరంలో శ్రీకృష్ణుడు

బృందావనంలో శ్రీకృష్ణ బలరాముల వలన వారి బాల్యలీలా క్రీడల లోనే ఎందరో అజేయులైన రాక్షసులు మరణించారు. ఎప్పటికప్పుడు కంసునికి వృత్తాంతాలు తెలుస్తూనే వున్నాయి కానీ నారదుడు పనిమాలీ వచ్చి శ్రీకృష్ణ బలరాముల జన్మ గురించి వివరాలన్నీ చెప్పివేశాడు కంసునితో

చ॥ ఘనుడొకనాడు నారదుడు కంసుని తోడ, యశోదకూతుదా
గమటయు, జక్రి దేవకికి గర్భజు డౌటయును, మున్ను రోహిణీ
తనయుడు "రాము" డౌటయును,
దద్విభులిద్దరు, మంద, నున్నవా
రని యెఱుగంగ జెప్పిన, "మహాద్భుత"
మటంచు, జలించె, గిన్కతోన్!"

అంతే! దేవకీ వసుదేవులు తననిలా మోసగించారని తెలుసుకున్న కంసుడు మరల వసుదేవుని చంపుతానని కత్తిపట్టుక బయల్దేరాడు అనారదుడే వారించి, శాంతింపజేశాడు, దేవకీ వసుదేవులను మరల లోహశృంఖలా బద్ధులను చేయించాడు కంసుడు. ఇక ఆలస్యం చేయకుండా, ముందుగా, "కేశి", వ్యోమాసురులనిద్దరిని బలరామకృష్ణులను చంపి రమ్మని పంపాడు.

తర్వాత సభచేసి, తన వద్ద కలచాణురక. ముష్టికులనే ఇద్దరు మల్లయుద్ధ మహా యోధులను, "కువలయాపీడనమన్, మత్త గజ చోదకుడ్నీ, మిగతా సాళ్వ కోసల వగైరా ప్రముఖులందరినీ పిలిపించి, బలరామ కృష్ణులను చంపటానికి, చతుర్దశి నాడు "ధనుర్యాగం" చేయించి, మల్లయుద్ధంలో పోటీలు పెడుతున్నట్లు రాజ్యమంతటా ప్రకటించి, శ్రీకృష్ణబలరాములను ఆ పోటీలలో పాల్గొనేటట్లు పిలిపించేట్లుగా ఒక అద్భుత ఉపాయం వేశాడు. "అక్రూరుడు" అనే యాదవ ముఖ్యుణ్ణి పిలిచి శ్రీకృష్ణ బలరాముల జన్మ వృత్తాంతాలు చెప్పి, వారినెలాగైనా ధనుర్యాగానికి పిల్చుకువచ్చేట్లుగా బృందావనం వెళ్ళిరావలసిందిగా ఆజ్ఞాపించాడు. కంసుని లాటి నియంత రాజ్యంలోనే, తమ సాధుత్వాన్ని తమలో ఇముడ్చుకొని జీవిస్తున్న ఎందరో శ్రీకృష్ణ భక్తులలో అక్రూరుడు ఒకడు. అక్రూరుడు శ్రీకృష్ణుని దైవంగా భావించే విష్ణు భక్తుడు

అంతేకాదు కంసుడు తన ప్రజానీక అంతా తేటతెల్లంగా చెప్పాడు

సీ॥ "ఆ రామ కేశవులంతరించిన, వసుదేవ
ముఖ్యులజంపి, తెగువ, మెరసి,
వృష్ణి. భోజ దశార్హ వీరుల దెగటార్చి,
ముదుకడు, రాజ్యకాముకుడు, ఖలుడు,
నగు "న్యగసేను, మాయయ్య గీటణ
గించి, పిన తండ్రి "దేవకు" పిలుకు మార్చి,
మరియు వైరుల సెల్ల మద్దించి, నే,
జరాసంధ, నరక, బాణ, శంబరాది

ఆ॥ సఖులతోడ భూమిచక్ర మేలెద! బొమ్మ!
తెమ్ము వేగము; వసుదేవసుతుల;
మఖము పేరు సెప్పి, మంత్రభేదము సేయ
వలయు! బెంప జనదు వైరిజనుల!"

అంటూ తన భవిష్యత్తు ఆలోచన, నియంతృత్వ ధోరణి, రాజ్యకాంక్ష సర్వం వెల్లడించాడు కంసుడు అక్రూరుడితో! ఆ సమయంలో అక్రూరుడు కేవలం ఒక "అసమర్థ పెద్ద" గానూ, తన రాజ్యంలో తనకు భయపడుతూ బ్రతికే ఒకానొక "బలహీన పేరునిగానూ'' మాత్రమే కనిపించాడు కంసుని కళ్ళకు మనసుకు.

అక్రూరుడు కూడా కాదనలేదు. ''నీవు పొమ్మంటే పోక తప్పుతుందా? మానవులు తమకు రాబోయే పరిణామాలు వూహించకుండా ఏవో ఆలోచనలు చేస్తారు. ఈశ్వరేచ్ఛా జరిగితీరాలి; తప్పక వెళ్ళి వారిని పిల్చుకువస్తాను!" అని పైకి చెప్పి, లోలోపల ఈ అవకాశంతో తాను శ్రీకృష్ణుని కళ్ళారాచూచి, నోరారా స్తోత్రంచేసే అవకాశం లభించిందని పొంగిపోతాడా నిస్పృహాయ భక్తుడు. కంసుని క్రూర ఆలోచన తెలిసీ తనని మరణానికి అభిముఖంగా పిలవటానికి వచ్చాడీ అక్రూరుడని శ్రీకృష్ణుడు తనని నిరాదరిస్తాడో లేక-ఎం దరో రాక్షసులను సంహరించిన ఆ మహానుభావుడు కంసవధకు రంగంసిద్ధ మైందని ఆనందించి, తన వెంట వస్తాడోనని డోలాందోళిత మానసుడౌతూనే బయల్దేరుతాడు అక్రూరుడు శ్రీమన్నారాయణ ధ్యానంచేస్తూ రథంలో.

ఇక్కడ బృందావనంలో గుఱ్ఱం రూపం ధరించి "కేశి"ని సంహరిస్తాడు శ్రీకృష్ణుడు. వ్యోమాసురుని సంహరిస్తాడు బలరాముడు ఆ సమయంలో దేవతలు పుష్పవృష్టికురిపిస్తారు. నారదుడు స్వయంగా అక్కడికివచ్చి శ్రీకృష్ణుని స్తోత్రంచేసి-ఇక ముందు ముందు భూభారం తగ్గించే పాత్ర వహించవలసిం దిగా హెచ్చరిక చేసి వెళతాడు ఆ సరికే యావద్రాజ్యానికీ, శ్రీకృష్ణ బల రాముల జన్మవృత్తాంతాలు తేటతెల్లంగా తెలిసిపోయాయి! అక్రూరుడు బృందావనంవచ్చి, నందగోపాలురచేత స్వాగత సత్కారాలు అంది తాను వచ్చిన పని చెబుతాడు! శ్రీకృష్ణునితో! శ్రీకృష్ణుడు నవ్వి నందగోపాలురంద రితో, ధనుర్యాగతి చూడటానికి ''పన్ను" కట్టడానికి అందరూ తమ తమ వాహన యానాలతో సిద్ధం కమ్మని ఆజ్ఞ ఇచ్చి, తాను, బలరాముడు అక్రూ రుని వెంట మధురా నగరానికి ప్రయాణం అవుతారు. అమాయకులు, మూఢ భక్తులు అయిన గోపికా స్త్రీ లందరూ,

మ॥ హరినవ్వుల్, హరిమాటలున్, హరి
　　　　మనోజ్ఞాలాపముల్ లీలలున్,
　　హరివేడ్కలే, హరి మన్ననల్, హరి
　　　　కరాబ్జాలంబనాహ్వానములు!
　　హరిణీలోచన లందఱున్, దలచు
　　　　పాయం, బెట్లోకో యంచు
　　నెరియన్ ముచ్చటలాడి రంతగముల్లై!
　　　　యేకాంత గేహంబులన్

అంటూ విలపిస్తారు. శ్రీకృష్ణుడు వారందరినీ వూరడించి. తన జన్మ కర్తవ్యానికి తొలి అవనికగా భాసించిన బృందావన సౌందర్య సీమలనూ, నిష్కలంక భక్త హృదయాలను తరింపజేసి, మధురానగరంవేపు, కంస వధకు, ఒక నియంత అంతానికి అభిముఖంగా, ఒకానొక రాజకీయ సుస్థిర రాజ్య స్థాపనకు నాందీగా, యవ్వన దశలోని తన అజేయ పరాక్రమాన్ని బుజువుపరచే రంగస్థలిగా ధనుర్యాగ మండపానికి తెరువ అవుతూ, వ్రేపల్లె గొల్లవాని, గొల్లకాపరి స్థాయినుండి మధురానగర అతి నాగర యువకునిగా రాజ్యవారసునిగా బయల్దేరాడు రెండవ ఘట్టంలోనికి!

అక్రూరుడు బలరామ కృష్ణులను కూర్చోబెట్టుకుని యమునానది దాటించాడు రథం అక్కడ సంధ్యవార్చి వస్తాననిచెప్పి, యమునలో దిగి ముఖం కాళ్ళు చేతులు కడుక్కుంటూ ఆ యమునానదీ జలాల్లో ముందుగా సర్వ భూభారాన్ని మోస్తూ, అనంతకోటి మణిమయ పడగలతో అలరారుతున్న ఆది శేషుని దర్శించాడు ఆ ఆదిశేషుని తల్పంమీద శంఖచక్ర గదాధరుడై, లక్ష్మీ సమేతుడై, తన దరహాసంతో సర్వజగాలను రక్షిస్తున్న శ్రీమన్నారాయణ మూర్తినిచూశాడు ఆ మూర్తి ఎవరోకాదు సాక్షాత్తు శ్రీకృష్ణుడే! తత్తరపాటుతో దూరంగా నిలిచివున్న రథంవేపు చూశాడు అక్రూరుడు. రథంలో శ్రీకృష్ణ బలరాములు కూర్చునివుండటం స్పష్టంగా కనిపిస్తోంది

అక్రూరుడు భక్తితో తలమునకలై పోయాడు! పోతన మహాకవి ఇక్కడ అక్రూరుని పాత్రలోనికి పరకాయ ప్రవేశం చేశాడు గద్యంలో మహాద్భుత "శ్రీమన్నారాయణ దండకం" చేశాడు చివరగా.

మ॥ కలలంబోలెడి పుత్రమిత్ర వనితాగారాది సంయోగమున్,
జలవాంఛారతి నెండమావులకు, నాసక సేయు చందంబునన్,
దలతున్, రుచనామురంచుమూఢుడ! వృథాతత్త్వజ్ఞుడన్! నాకు,నీ
విలసత్పాద యుగంబుజూపి: కరుణన్ వీక్షింపు లక్ష్మీపతి"

అంటూ, ఏ ఆడ, మగ, బాలవృద్ధులయినాసరే మనసారా తేలికగా పలికి కొలవగల పద్యంచెప్పి, తన మనోవాంఛ తెలిపాడు అక్రూరుడు. తర్వాత యమునాజలంలోని శ్రీకృష్ణుని మూర్తికి నమస్కరించి మరల రథం అధిరోహించాడు అక్రూరుడు.

ఈనాడూ మనంచూస్తున్న ఎందరో నియంతల కొలువుల్లో, హృదయం నిండా భక్తి, పైకి కనబరచలేని నిస్సహాయత, కాలం కలిసివచ్చేవరకు సహనంవహించే క్షమ, భగవంతునిపై అచంచల భక్తివిశ్వాసాలు కలిగివున్న "అక్రూరు" లెందరో వున్నారు. వారు పైకి కనిపించరు అట్టహాసంగా మౌనమునిపుంగవుల్లా కాలప్రవాహం ముందు గడ్డిపోచల్లా వినమ్రంగా తల వంచి వుంటారు! కంసునిలాటి ఈనాటి పదవీ వ్యామోహ నియంతలూ, ఆ అక్రూరులను ఓ మనుషులుగాకూడా గుర్తించరు లెక్క పెట్టరు. కానీ నియంతలు అంతరిస్తారు. అక్రూరులు నిలిచిపోతారు చిరంజీవులుగా యుగాల పర్యంతం భక్తుల భగవంతుని హృదయాలలో!

మధురానగరం చేరగానే, తన ఇంటికి అతిథిగా రావలసిందిగా శ్రీకృష్ణ బలరాములను ఆహ్వానిస్తాడు అక్రూరుడు. కంసవధ తర్వాత వస్తానని మాట ఇస్తాడు శ్రీకృష్ణుడు

శ్రీకృష్ణ బలరాములు మధురానగర వీధులలో విలాసంగా విహరిస్తున్నారు శ్రీకృష్ణుని చూచిన మధురాపుర సుందరీమణులు తమ తమ మేడల మీదనుంచి ఇలా అనుకుంటున్నారు తన్మయులై పోతన మహాకవి హృదయాక్షరాల శిల్పంతో.

సీ॥ వీడటే! రక్కసి విగతజీవగ, జన్ను
 బాలు ద్రావిన, మేటి బాలకుండు,
 వీడటే! నందునివెలదికి, జగమెల్ల
 ముఖముందుజూపిన, ముద్దులాడు,
 వీడటే! మందలో వెన్నలు దొంగిలి
 దర్పించి మెక్కిన, దావరీడు!
 వీడటే! యెలయించి వ్రేతల మానంబు
 చూఱలాడిన, లోకసుందరుండు!

తే॥ వీడు లేకున్న పురమటవీస్థలంబు
 వీని బొందని జన్మంబు విగతఫలము
 వీని బలుకని వచనంబు విహగరుతము
 వీని జూడని చూడ్కులు, వృథలు వృథలు

అట్లా మధురానగరి ఆకర్షితమౌతోంది భగవంతుడైన శ్రీకృష్ణునిపట్ల!

+ ○ +

## "ఉ ప శ్లో కు డు"

రామాయణంలో ఆదికవి వాల్మీకి, "ఊర్మిళ" లాటి మహాసాధ్వి! లక్ష్మణుని ఇల్లాలు అయిన మహా పతివ్రత, భర్త, ఆయన అన్నగారైన శ్రీరామునితో వనవాసంచేస్తూ పధ్నాలుగు సంవత్సరాలు సాధారణ సేవకునిలా సేవలు చేస్తుంటే, అంతఃపురంలో భర్తరాకను నిరీక్షిస్తూ యోగనిద్రలోకి జారిపోయి, చైతన్య రాహిత్యస్థితిలో జీవించిన ఒకానొక మహాఇల్లాలిని గురించి విపులంగా వ్రాయటం విస్మరించాడో, లేక పాఠకుల ఊహకు ఆసాధ్వీమ తల్లి చరిత్రను మనసుల్లో చిరంజీవత్వం ఆపాదించదలచాడో మనబోటి సామాన్యుల ఊహకు అందని విషయం.

అలాగే భాగవతంలో శ్రీకృష్ణ బలరాములు, కంసవధ నిమిత్తం, మధురా నగరంలో ప్రవేశించినది మొదలు, ఎన్నో విచిత్ర సంఘటనలు జరిగాయి తమకు మంచి వస్త్రాలు ఇమ్మని కోరగా, ఇవ్వక, గేలిచేసిన రజకుని, ముష్టి ఘాతంతో చంపుతాడు కృష్ణుడు. ఒక నాయకుడు శ్రీకృష్ణ బలరాములను చక్కని వస్త్రాభరణాలు భక్తితో సమర్పిస్తాడు అతడి పేరేమిటో భాగవతంలో లేదు. అతనికి శ్రీకృష్ణుడు తక్షణమే అనంతమైన సంపద ప్రసాదిస్తాడు. ఇక "త్రివక్ర" అనే కుబ్జ అనే స్త్రీ పాత్ర భాగవతంలో కొద్దిసేపే కనిపిస్తుంది. కంసునికి పరిమళ చందనాది లేపనాలు తీసుకొని అంతఃపురానికి వెళ్ళేఆగూని వికృత రూప అయిన "త్రివక్ర" అనే పేరు గల కుబ్జ (మరగుజ్జు, గూని, శరీరంతో వికృతరూపం ఆమెది) అంతఃపుర స్త్రీలకు చందనాది లేపనాలు పూయుటంలో ప్రావీణ్యంగలది. ఆమెను చూచి శ్రీకృష్ణుడు.

> క॥ ఎవ్వరిదానవు? లేపము లెవ్వరికిం గోరి కొనుచునేగెదు?
> రెవ్వతె? మాకిమ్మెన్నియు; నివ్వటి లెదు చక్కనగుచు నీరజనేత్రి"!

అంటాడు అందుకు కుబ్జ శ్రీకృష్ణుడు తన వికృతరూపాన్ని పరిహసిస్తున్నాడని లోలోపల బాధపడ్తుంది అయినా ఆమెన్కు శ్రీకృష్ణునిపై అపారమైన భక్తి వుంది ప్రేపల్లెలో, బృందావనంలో గోపికలతో అతడు సలిపిన రాసకేళి వగైరాలన్ని మధురానగర స్త్రీ లందరికి తెలిసినట్లే ఆమెకూ తెలుసు. శ్రీకృష్ణుని మనోహర రూపాన్ని ఆమె ఉక్షణంలో తనకళ్లెదుట చూస్తోంది

అందుకే కాస్త నిష్ఠురత - వినయము కలగలుపుగా

> ఉ॥ చక్కని వాడ వౌదు! సరసంబుల నొంపకు, మెల్లవారికిన్
> జక్కఁదనంబు లెక్కడివి? చారుశరీర! "త్రివక్ర" యండ్రు. నే
> నిక్కము! కంసుదాసిని! వినిర్మలలేపన విద్యదాన, నన్
> మిక్కిలి రాజుమెచ్చుఁ! దగ మీరు విలేపనముల్ ధరింపరే!

> క॥ గొల్లలకున్ శృంగంబుల్లును, జెల్లునుగట్టంగ, గఱకు చీరలు నింతే,
> మెల్లనే లాడెదొయుల్లంబున! నడుగనిట్లు నుచితమె మీకున్?"

అంటుంది. అందుకు కృష్ణుని చిరు నవ్వు సమ్మోహనాస్త్రంగా జవా బివ్వగా, ఆమె ఆచందన పరిమళ లేపనములు శ్రీకృష్ణునికి మనస్ఫూర్తిగా సమర్పిస్తుంది అవి గ్రహించి, కృష్ణుడామెను తన పాదం ఆమె పాదం త్రొక్కిపట్టి గడ్డం క్రింద చెయ్యివేసి ఆమెను లేవనెత్తడంతో, ఆమె మనో హరాకార అయిన స్త్రీ మూర్తిగా మారిపోతుంది! తనకు మనోహరమైన రూపలావణ్యాలనూ, యువ్వనాన్ని ప్రసాదించిన శ్రీకృష్ణుని ఆమె హృదయంలో తన భర్తగా, దైవంగా భావిస్తుంది అందుకే శ్రీకృష్ణుడామెను ఏదైనా వరం కోరుకోమని అడిగినపుడు

క॥ వేం చేయమునా యింటికి! పంచశరాకార! "అని కాం...
కోరుకుంటుంది. ఆమె కోరిన కోరికలోని అంతరార్థం శ్రీకృష్ణునికి అవగతమై కంసవధ తర్వాత నీ ఇంటికి వస్తానని మాట ఇస్తాడు. ఆమె శ్రీకృష్ణునిరాక కోసం క్షణమొక యుగంగా నిరీక్షిస్తుంటుంది శ్రీకృష్ణుడు కంసవధ, దేవకీ వసుదేవులను చెరసాలనుండి విడిపించటం, తన తాత ఉగ్రసేనునికి రాజ్యం ఇవ్వటం, తన గురువు "సాందీపని" వారి మరణించిన కొడుకును వెదకి తేవటం, బృందావనంలోని గోపికలకు తాను వారిని మరచలేదనీ, మరువ వనీ-సందేశం పంపటంలాటి రాచకార్యాలన్నీ పూర్తిచేసిన తర్వాత, తాను మాటఇచ్చిన కుబ్జ ఇంటికి, ఉద్ధవుని వెంటబెట్టుకుని వెళతాడు శ్రీకృష్ణుడు. ఆ సరికి కుబ్జ శ్రీకృష్ణుని రూపం, నామం ఎన్ని కోట్లు జపం, ధ్యానంచేసి వుంటుందో, ఆమె హృదయానికి. ఆ దైవానికే తెలుస్తుంది. సామాన్య మానవులకు అంతుపట్టనిదా తపస్సు! అందుచేత చాలామంది వెక్కిరింతగా,

మ॥ సనకాదుల్ తలపోసి కానని విభున్, సర్వప్రభున్, దుర్లభున్,
మనుదానిచ్చిన, యంగరాగ, సుకృతామోదంబునన్! గూడియున్
"ఘననిర్వాణ విభూతియిమ్మనక యాకంజాక్షి, యే బాయం బా
ల నమం, గొన్ని దినంబులంగభవ లీలందేల్పవే!"నాపుడున్!

క॥ ఏ పేదంబులుగానని, దేహోత్తముంగాంచి,
ముక్తి తెరువడుగక, రా
జీవేక్షణ రతి యడిగెను, భావింపందడీయ
కర్మ ఫలమెట్టిదియో!"

అనుకుంటారు హేళనగా! భౌతికంగా ఆలోచిస్తే, ఆమె కోరిన కోర్కె హేళనగానే వుంటుంది కానీ, ఆధ్యాత్మికంగా ఆలోచిస్తే, కృష్ణునితో ఆమె సలిపిన "రతి" శ్రీకృష్ణుడామెకు ఇచ్చిన రతి ఆధ్యాత్మికానందంలోని తురీయావస్థనకు దాటిన "బ్రహ్మరతి" అని అర్థంచేసుకోవచ్చును. అలాగే శ్రీకృష్ణుడు కూడా ఆమెకు ప్రసాదించిన సౌఖ్యంలోని సర్వ కళలూ

ఉ॥ జాతియుఁగాలముం, గళయు, సత్యము, దేశము, భావచేష్టలున్,
ధాతువుఁబ్రాయమున్, గుణముఁ దద్దశయున్, హృదయంబు,
జూడ్కియున్,
బ్రీతి, విశేషముందెలిసి; పెక్కు విధంబుల దొయ్యలిన్, మనో
జాత, సుఖంబులన్దనిపె, శౌరి! వధూహృదయాప హారియై!"

కామకేళిలోని సర్వరసాల సమ్మేళనమేగాక, మూలాధారం నుండి సహస్రారం వరకూ గల ధ్యానయోగ ప్రక్రియలోని "కామకేళీతరంగితా!" అనే లలితా సహస్రనామ స్తోత్రంలోని నామాన్ని, అనుసరించిన వైఖరి అది! అది మహా యోగులు తెలుసుకొని అనుభవించి, ఆనందించే రతి!

తాను కురూపిననీ, తాను ఏ పురుషునీ ఆకర్షించలేననీ, తనలో పురుషుని ఆకర్షించే ఏ అందచందాలూ లేవని కుమిలి పోతున్న కుబ్జ, శ్రీకృష్ణుని కర స్పర్శతో సుమనోహర కోమలాంగియై, ఆ విశ్వసృష్టిస్థితిలయ కర్త అయిన ప్రభువులో ఐక్యం అయి తనని తాను ఆత్మార్పణ చేసుకున్న ఘట్టం అది! తర్వాత శ్రీకృష్ణుడు వెళ్ళిపోయాడు. ఇక కుబ్జ పాత్రతో ఆయనకూ, భాగ వతానికి కూడా అవసరం తీరిపోయింది కానీ ఆ కుబ్జకు కలిగిన కుమారుడు "ఉపశ్లోకుడు" ఇతడి పేరూ భాగవతంలో ప్రముఖంగా కనిపించదు శ్రీకృష్ణుని మనసా, వాచా, కర్మణా ఐక్యం అయిన కుబ్జకు, శ్రీకృష్ణుడు ఆమెకు ప్రసాదించిన "బ్రహ్మరతి" ద్వారా కల్గిన ఈ ఉపశ్లోకుడు- భాగవతంలో ప్రముఖపాత్రధారి, సూత్రధారీ, కనీసం పదే పదే కవిపించే పాత్ర కాక పోయినా, మహా యోగుల సరసన స్థానం సంపాదించగలిగిన మహాయోగి

అయ్యాడు శ్రీకృష్ణుని వంశ వర్ణన చేస్తూ, భాగవతంలో ఆయన పదహారు వేలమంది భార్యల ద్వారా (నరకాసురవధానంతరం, నరకుడు చెరబట్టిన స్త్రీ లందరినీ అనాధలను చేయక, తాను చేబట్టి, తన భార్యలుగా సంఘంలో గౌరవం, ఉనికి, రక్షణ కల్పించిన మహనీయుడు దైవం- శ్రీకృష్ణుడు) కన్న బిడ్డలు - ఒక్కొక్క భార్యకు పది మంది చొప్పున పదహారువేలు X పది మంది పదహారు లక్షల మంది కొడుకులు. వీరు గాక రుక్మిణి, సత్యభామ జాంబవతి, లక్ష్మణ, మొదలైన అష్టభార్యలకూ! ఒక్కొక్కరికి పది మంది పుత్రులు పుట్టగా ఇంత మందిలోనూ పద్దెనిమిది మంది (18) మంది పుత్రులు మాత్రం కాస్తంత పేరులోకివచ్చారు. వారు, "ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, దీప్తిమతుడు, భానుడు; సాంబుడు, మిత్రుడు, బృహద్భానుడు, మిత్రవిందుడు వృకుడు, అరుణుడు, పుష్కరుడు, దేవలాహుడు, శృతదేవుడు, సునందనుడు, చిత్రభానుడు, వరూధుడు, కవి, న్యగ్రోధుడు," అనేపేర్లు గలవారు. వీరిలోను ఉషాపరిణయం వలన "అనిరుద్ధుడు" ప్రభావతీ ప్రద్యుమ్న అనే చిరు చరిత్రతో "ప్రద్యుమ్నుడు" శ్రీకృష్ణునిలానే ఒక కన్యను అపహరించబోయి, దుర్యోధనాధులచేత చెరబట్టబడి - శ్రీకృష్ణుని చేత విడిపించబడిన "సాంబుడు" లాటివారు కొంత చరిత్ర సృష్టించారు తర్వాత యాదవ వంశం తనని తాను ముసలంతో నాశనం చేసుకున్న సమయంలో ఈ శ్రీకృష్ణుని కొడుకులూ, తామరతంపరగా పెరిగిన వారి వారి కొడుకులు మనుమలూ- పేర్ల లోనికి కూడా రాలేదు.

అయితే కుబ్జ కొడుకైన ఉపశ్లోకుడు, తల్లి భక్తి రక్తి, తండ్రి శ్రీకృష్ణుని ఆధ్యాత్మిక శక్తి ముక్తి - పుణికిపుచ్చుకున్న వాడు! తల్లి శ్రీకృష్ణ తత్వాన్ని జీర్ణింప జేసుకున్నదై- ఆమె గర్భంలో పెరిగిన ఉపశ్లోకుడు- శ్రీవైష్ణవ తత్వాన్నే తనలో జీర్ణింప జేసుకున్నాడు తన తండ్రి అయిన శ్రీకృష్ణుని రాజకీయ, సామాజిక గౌరవాలలో అతడేనాడూ పాలు పంచుకోవాలను కోలేదు. ఆ క్షణభంగురగౌరవాలనూ, అంతఃపురాలనూ కోరనూలేదు అతడు తండ్రి అయిన శ్రీ కృష్ణుని చరణారవిందాలే తన సర్వస్వంగా భావించాడు. ఎందరో మహనీయులకు గురు బోధ చేసిన మహద్గురువు - నారదమహర్షికి

శిష్యుడై నాడు అఖండ దివ్యజ్ఞాన బోధాత్ముడై వాడు. ఆ కాలంలో వేదాలు ఉపనిషత్తులు, వేదాంతమూ స్త్రీలకూ, సామాన్య జనులకూ అందుబాటులో లేదు. అర్థమయ్యేది కాదు అంచేత స్త్రీలకూ శూద్రులకూ, సామాన్య మానవులందరికీ అర్థమయ్యేరీతిలో, ఒక్కసారి స్మరణ చేసినంత మాత్రాన ముక్తి లభించే విధంగా, స్త్రీ, శూద్ర, దాస, దాసీ జనాలకు సైతం మోక్షం ప్రసాదించే తీరులో "సాత్వత తంత్రము" అనే పేరుతో "వైష్ణవ స్మృతి, రచించాడు! అంటే ఏమీ తెలియని విద్యరాని స్త్రీలు, శరీరకష్టంతో జీవితాలు జీవితాంతం వెళ్ళ బుచ్చి, మోక్షమార్గ ఆసక్తి వున్నా, సాధనకు, ధ్యానానికీ, పూజకూ, జప తపాలకూ వీలుకాని కష్ట జీవులు, అక్షరాస్యులుగాని పురుషులూ, సామాన్యులూ, అందరూ ఆ "సాత్వత తంత్రము" ను స్మరించిన మాత్రాన" విన్న మాత్రాన ముక్తికీ మోక్షానికి అర్హులయ్యే విధంగా ఆ "వైష్ణవస్మృతిని" రూపొందించాడు ఉపశ్లోకుడు! ఒక కురూపి అయిన దాసీ పుత్రుడు!

ఇప్పుడాలోచించండి! కుబ్జ కోరిన కోరిక తుచ్ఛమైనదా?

కుబ్జ పుత్రుడైన ఉపశ్లోకుడు - శ్రీకృష్ణుని పట్టపరమైన భార్య లందరి కొడుకులకంటే - ఏవిషయంలో తక్కువవాడు? నిజానికి వాళ్ళందరి కంటే మహోత్తముడు! మహోన్నతుడు! చిరంజీవి! మహాయోగి. అయితే ఈ ఉపశ్లోకుని చరిత్రగానీ-ఉపశ్లోకుని గొప్పదనంగానీ భాగవతంలో మరెక్కడా వర్ణింపబడలేదు రామాయణంలోని ఊర్మిళ పాత్రలానే మహనీయులెప్పుడూ నివురుగప్పిన నిప్పుల్లా, ఆకాశంలో దూరాన ప్రకాశించే నక్షత్రాల్లా వుంటారు అలాటి మహనీయుడు కుబ్జ - శ్రీకృష్ణుల కుమారుడు ఉపశ్లోకుడు.



# కంస, కాలయవనుల వధ

## ద్వారకానగర నిర్మాణం

శ్రీకృష్ణ బలరాములిద్దరూ ధనుశ్శాలకువెళ్ళి, అక్కడ వీరులు మాత్రమే ఎత్తవచ్చునని చెప్పబడే ఒక బ్రహ్మాండమైన విల్లును శ్రీకృష్ణుడు అవలీలగా ఎత్తి విరచివేస్తాడు ధనుశ్శాల కావలివారు అడ్డగించగా వారందరినీ తన ముష్టిఘాతాలతో చంపుతాడు. మధురానగరంలోకి శ్రీకృష్ణుడు ప్రవేశించింది మొదలు ఈ విల్లు విరచటంవరకూ జరిగిన విశేషాలన్ని వింటూనే వున్నాడు కంసుడు. ఈలోగా రాత్రి అయ్యింది

అ॥ "కళలుగలుగుగాక, కమలతోడగుగాక,
శివుని మౌళిమీద జేరుగాక,
నన్ను నొల్లఁదవనుడైన మత్పతి" యని
సాధ్విభంగి, కమలజాతి మొగిడెః

ఇక రాత్రి కంసునికి భయంతో నిద్రపట్టలేదు. మృత్యువు రాబోయే ముందు కలుగుతాయని పెద్దలు చెప్పే అపశకునాలు, అపభ్రంశాలు అన్నీ అతనికి కనబడటం మొదలయినాయి తెల్లవారింది. మల్లయుద్ధ రంగ స్థలం సిద్ధమయింది కంసుని కొలువులో, శ్రీకృష్ణ బలరాములు తమతోటి గోపాలకులు వెంటరాగా రంగస్థలంవైపు వచ్చారు. రంగస్థల బహిర్ ద్వారం వద్ద "కువలయా పీడన" మనే కొండలాటి మత్తగజాన్ని, కంసుని ఆజ్ఞ ప్రకారం శ్రీకృష్ణుని మీదకు ఉసిగొల్పాడు మావటివాడు ఆపద గమనించిన శ్రీకృష్ణుడు క్షణకాలంలో కొదమసింగంలామారి, ఆ ఏనుగును మర్దించిచంపి పెద్ద పెద్ద దూలాలలాటి ఆ ఏనుగు తెల్లని దంతాలను పెరకి వేశాడు ఆరెండు దంతాలను ఇద్దరూ భుజంమీద పెట్టుకుని రంగస్థలం వద్దకు వచ్చారు. సింహా సనం మీదవున్న కంసుడా ఇద్దరినీ ఆ రూపంలోచూచి నిర్వీర్యునిలా నిర్ఘాంత పోయాడు లోలోపల.

చాణూరక ముష్టికులనే ఆ మల్లులిద్దరూ పోతపోసిన ఉక్కు విగ్రహాల్లా వున్నారు. శ్రీకృష్ణ బలరాములు అటు బాల్యంవదలి, ఇటు యవ్వనారంభ

దశలోవున్న యువతుల్లా వున్నారు. మధురానగర ప్రజలకు, మల్లయుద్ధం చూడవచ్చిన దేశదేశాల ప్రజలకూ, కంసుని ఈ దురాగతం చాలా అన్యాయంగా తోచింది. లోలోపల కంసుని శాపనార్థాలు పెట్టారు.

ఈలోగా చాణూరకుని శ్రీకృష్ణుడు, ముష్టికుని బలరాముడు మల్లయుద్ధంలో ఓడించి చంపేశారు! ఆ విచిత్రంచూచిన సభాసదులయిన ఇతర రాజులు, ప్రజలు శ్రీకృష్ణ బలరాములను స్తోత్రంచేశారు కంసుడు తప్ప అందరూ మ్రొక్కారు ఇక తనకుకాలం సమీపించిందని తెలుసుకున్న కంసుడు

ఉ॥ వల్లవబాలురన్, నగరివాటికిన్ వెడలంగ ద్రొబ్బుడీ!
గొల్లలముట్టి కోల్గొనుడు! క్రూరుని నందునిగట్టు డుర్వికిన్
దెల్లముగా గనేడు వసుదేవుని జంపుడు! తండ్రిగాడు, వీ
డెల్ల విధంబులన్ బరులకిష్టుడు! కావకు డుగ్రసేనునిన్!"

అంటూ తన క్రూరత్వం, చివరి ఆజ్ఞలు జారీ చేస్తున్నాడు శ్రీకృష్ణుడు గరుత్మంతుడు పామును పట్టినంత లాఘవంగా సింహాసనం మీద వున్న కంసుని మీదకు లంఘించాడు! చావుతెలివిలా కంసుడు కత్తి ఝుళిపిస్తూ యుద్ధంచేయబోయాడు కానీ శ్రీకృష్ణుని రూపం, ఆలోచన, శౌర్యం మరణ భయంతో ఆసరికే జీవన్మృతుడయివున్న కంసుడు, క్షణంలో విగతజీవుడై నేలమీద పడ్డాడు వాడి కళేబరాన్ని శ్రీకృష్ణుడు నేలమీద ఈడ్చుకుంటూతెచ్చి రంగస్థలం మధ్య పడేశాడు. వాడి అనుచరులయిన, న్యగ్రోధుడు గహ్వుడు మొదలైనవారంతా నానాయుధాలతో రాగా వారందరినీ బలరాముడు చంపాడు.

ఇట్లా కంసవధ జరగగానే దేవతలు పుష్పవృష్టి కురిపించగా నారదుడు తనపని పూర్తిఅయినట్లు సంతోషంతో

క॥ చేతుల దాళములొత్తుచు, జేతో మోదం
బుతోడసిగముడి వీడన్,
బాతరలాడుచు మింటను, గీతము
నారదుడువాడె "గృష్ణా" యనుచున్!

ఇక శ్రీకృష్ణ బలరాములు దేవకీ వసుదేవుల చెరవదిలించి వారిని మంచి మాటలతో సంతోషపెట్టారు. యయాతి, యధువు, (తన ముసలితనం స్వీకరించని కారణంగా) కిచ్చిన శాపం కారణంగా యదువంశస్థులు రాజ్యార్హత లేనివారనిచెప్పి శ్రీకృష్ణుడు తన తాతవరసఅయ్యే ఉగ్రసేనునే మధుర సింహాసనంమీద అధిష్టింపజేశాడు పెద్దరికంగా మిగతా బంధువులందరినీ వారి వారి స్థాయికి తగినట్లు తన మాటలతో సంతోషపెట్టాడు. అక్రూరుడు కోరిన విధంగా, అతని ఇంటికివెళ్ళి, ఆయన ఆతిధ్యం స్వీకరించి సంతోషపెట్టాడు. ఉద్ధవునిద్వారా గోపికలకు మనసు స్థిమితం కలిగేలా మంచి మాటలుచెప్పి పంపాడు. ఇలా కంసవధ తర్వాత శ్రీకృష్ణుడు దేవకీ వసుదేవుల బిడ్డగా, రాజుగానిరాజుగా స్థిరపడి వారి వంశాచారం ప్రకారం కాశీకి వెళ్ళి "సాందీపని" అనే గురువువద్ద లోకరీతిగా విద్యాభ్యాసంచేసి తిరిగివచ్చారు శ్రీకృష్ణ బలరాములు. గురువుగారు కోరగా గురుదక్షిణగా ఆయన మృత కుమారుని మరల తెచ్చిఇచ్చి తన భగవంతుని మహిమ చూపాడు శ్రీకృష్ణుడు ఆ విప్రకుమారుడు సముద్రంలో స్నానంచేస్తుండగా మహామీనం ఒకటి ఆ కుర్రవాడిని పట్టుకుంది "పంచజనుడనే" రాక్షసుడా బాలుడ్ని మింగాడు పంచజనున్ని చంపాడు శ్రీకృష్ణుడు వాడి ఉదరంలో గొప్ప "శంఖం" వున్నది ఆదే "పాంచజన్యం"గా పేరుపొంది, శ్రీమహావిష్ణువుచేతి శంఖంగా మారింది కాలక్రమేణా!

విప్రబాలకుడు పంచజనున కడుపులో లేకపోవటంతో "సంయమనీ" పురమనే యమపురానికి వెళ్లి, పాంచజన్య శంఖారావం చేశాడు శ్రీకృష్ణుడు. ఆ శంఖారావానికి త్రుళ్ళిపడి యముడు స్వయంగావచ్చి శ్రీకృష్ణ బలరాములను శ్రీమన్నారాయణుడు ఆదిశేషువుగా గుర్తించి, వారుకోరిన విప్రబాలుని మరల ఇచ్చాడు. "సాందీపని"కి ఆ బాలుని గురుదక్షిణగా సమర్పించి, ఆయన దీవెనలొంది, మధురకు వచ్చారు బలరామకృష్ణులు.

ఈలోగా కంసుని భార్యలయిన "అస్తి" "ప్రాప్తి" అనే వారిద్దరూ తమకు శ్రీకృష్ణుని వలన వైధవ్యం ప్రాప్తించిందని. తమ తండ్రి అయిన "జరాసంధుని" వద్దకువెళ్ళి విలపించారు. "మగధ" ఏలుతున్న జరాసంధుడు

అపరిమిత బలపరాక్రమాలుగల మల్లయోధుడు. గిరివ్రజపురం అతని రాజధాని. జరాసంధుని పుట్టుక విచిత్రంగా జరిగింది. బృహద్రధుడనేవాడు అజమీడుని వంశంవాడు. అతనికి బిడ్డలులేకపోగా మరో భార్యకు రెండు ఖండాలుగా ఒక శిశువు జన్మించాడు. ఆతల్లి ఆ శిశువును పారవేయించింది కోట వెలుపల. " జర " అనే రాక్షసి అతని ఖండాలను సంధించగా శిశువు మామూలు శిశువులా మారాడు. జరచేత సంధింపబడిన ఆ బిడ్డ "జరాసంధుని" గా పేరుబడ్డాడు.

ఆ జరాసంధునికి, కాలయవనుడు వగైరా రాక్షసరాజులెందరో స్నేహితులు వారివద్ద కొన్ని వేల అక్షౌహిణీల సేన వున్నది జరాసంధుడు శ్రీకృష్ణునిమీదకు దండెత్తి వచ్చాడు మొదటిమారుగా ఇరవైమూడు అక్షౌహిణీల సేనతో! శ్రీకృష్ణుడు బలరామునితో, రాజకీయనీతిగా "వీణ్ణి ఇప్పుడే చంపితే, ఈ రాక్షససేనతో ముందుముందయినా బాధే! వీడిసేనను మాత్రం చంపుదాం!" అని చెబుతాడు. అలాగే సైన్యాన్నంతటినీ చంపేస్తారు. జరాసంధుడు తనను తరముగా పారిపోయినట్లు నటిస్తాడు శ్రీకృష్ణుడు. జరాసంధుడు శ్రీకృష్ణుడు ఓడిపోయి పారిపోయాడని హేళనచేసి వెళ్ళిపోతాడు. అట్లా పదిహేడుమార్లు, కొన్ని వందల అక్షౌహిణీ సేనలతో జరాసంధుడు రావటం, వాడిసేనను చంపి శ్రీకృష్ణుడు పారిపోవటంలాటి రాజకీయ చతురతతో, వాడి రాక్షసబలగాన్ని అంతటినీ అంతమొందించాడు శ్రీకృష్ణుడు పదిహేడవసారి ఒక వేపు జరాసంధుడు, మరోవేపునుంచి కాలయవనుడు తమ తమ సైన్యాలతో మధురను చుట్టుముట్టగా, శ్రీకృష్ణుడు బలరామునితో ఆలోచించి విశ్వకర్మను పిలిపించి, సముద్రమధ్యలో పన్నెండు యోజనాల పొడుగు పన్నెండు యోజనాల వెడల్పు గల దుర్గమ ప్రదేశం సంపాదించి, దానిపై "ద్వారకా నగర" నిర్మాణంచేయమని చెబుతాడు విశ్వకర్మ అత్యద్భుతంగా ఆనాటి ఇంజనీరింగ్ ఫీట్‌తో

ఆ॥ "వరుణ పురముకంటె, వాసవపురికంటె
ధనదుప్రోలికంటె, దండధరుని
నగరికంటె, బ్రహ్మనగరంబుకంటె, బ్ర
స్ఫుటము గాగ నొక్క పురముజేసె!"

ఏడెనిమిది అంతస్తుల ఆకాశహర్మ్యాలతో, విశాలమైన వీధులతో, సుందరవన, జలాశయ, వాపీ, కూప తటాకాలతో, అత్యద్భుతంగా నిర్మించాడు విశ్వకర్మ ద్వారకానగరాన్ని (రామాయణంలో కుబేరుడు నిర్మింపజేసిన లంకా నగరంలానే!) మరో మూడు రాత్రులలో మధురాపురి జనాలను, అంతఃపుర జనాలను బలరాముని వెంట యోగమాయ ప్రభావంతో ద్వారకా నగరానికి తరలించాడు శ్రీకృష్ణుడు. ఈ వారం రోజులుగా కోట వెలుపలికి రాలేదు శ్రీకృష్ణుడు కాలయవనుడు శ్రీకృష్ణునికోసం ఎదురు చూస్తున్నాడు ఏడవ రోజు కోట ద్వారాలు తెరచుకొని శ్రీకృష్ణ బలరాములు వచ్చారు బలరాముడు సైన్యాన్నంతటినీ సంహరించసాగాడు శ్రీకృష్ణుడు, కాలయవనునికి కనిపిస్తూ మాయమౌతు, అతనిని గిరి కాననల దారులు పట్టించాడు చివరగా ఒక గుహలో యోగనిద్రలో శ్రీకృష్ణధ్యాన సమాధిలో యుగాల పర్యంతం పడు కుని వున్న "ముచికుంద" మహాముని వద్దకు వెళ్ళి గుహలో ఓ మూలగా నిల్చున్నాడు శ్రీకృష్ణుడు కాలయవనుడు శ్రీకృష్ణుని తరుముతూ ఆ గుహ లోనికి వచ్చి నిద్రిస్తున్న వ్యక్తి శ్రీకృష్ణుడే అనుకొని, కాలితో తన్నాడు.

ఆ ముచికుంద మహాముని, ఇక్ష్వాకు వంశస్థుడైన "మాంధాత" కుమా రుడు ఒకసారి దేవాసుర యుద్ధంలో, దేవతలకు సాయపడిన ముచికుందునికి దేవతలు వరం ఇస్తామనగా, తనకు మోక్షం కావాలంటాడు ముచికుందుడు. అయితే మరోవరం కోరుకోమనీ, మోక్షం తామివ్వలేమనీ అంటారు దేవతలు అందుకు ముచికుందుడు యోగనిద్ర ప్రసాదించమని వేడుకుంటాడు దేవతలు ప్రసాదిస్తారు. శ్రీహరి ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడుగా వచ్చి మోక్షమిస్తాడని చెబుతారు.

ఆ ముచికుందుడు, నిద్రాభంగమై, కాలయవనుని వేపు చూడటంతో వాడు అక్కడికక్కడే నీరై పోయాడు! ఆతర్వాత శ్రీకృష్ణుడాయనకు దర్శనం ఇచ్చాడు ముచికుందుడు శ్రీకృష్ణుని స్తోత్రంచేసి, ఆయన ఆజ్ఞతో, నరనారా యణ నివాసంబైన బదరికావనం చేరుకొని తపోనిష్ఠలోకి వెళతాడు కాల యవనుని పీడవదిలించిన శ్రీకృష్ణుడు, మరల జరాసంధునికి కూడా అలాగే కాదిరిస్తూ మధుర దాపులగల "ప్రవర్షణ గిరి" అనే పర్వతం వద్దకు తెచ్చి,

తాను పర్వతం ఎక్కుతున్నట్లు నటిస్తాడు. జరాసంధుడా పర్వతం చుట్టూరా మంటలు వేయించి, శ్రీకృష్ణ బలరాములు మరణించి వుంటారని, మరలి పోతాడు శ్రీకృష్ణ బలరాములు క్షేమముగా ద్వారకానగరం చేరుకుంటారు. అసరికి, ధృతరాష్ట్రుని కొలువులో, కుంతి, పాండవుల కష్టాలు పరాకాష్ఠ చేరుకుని వుంటాయి. పాండవుల యోగక్షేమాలు తెలుసుకుని, ధృతరాష్ట్రునికి హితవు చెప్పిరమ్మని ఉద్ధవుని, అక్రూరుని పంపిస్తాడు శ్రీకృష్ణుడు హస్తినా పురానికి అక్రూరుని హితవు వినకుండా "దైవం ఎలా చేస్తే అలా జరుగుతుందని" దాటవేస్తాడు ధృతరాష్ట్రుడు కుంతీదేవి, తన, పాండవుల కష్టాలు కృష్ణునికి విన్నవించమని అక్రూరుని కోరుతుంది.

రాజకీయంగా శ్రీకృష్ణుడిలా ద్వారకా నగరంలో స్థిరపడి, దుష్టశిక్షణ, శిష్టరక్షణభారం వహించాడు.



## రుక్మిణీ కల్యాణం

విదర్భదేశానికి రాజధాని అయిన కుండిన నగరాధీశుడు "భీష్మకుడు" అనే రాజు ఆయనకు రుక్మి, రుక్మిరథ, రుక్మబాహు, రుక్మకేశ, రుక్మమాలి అనే ఐదుగురు కుమారులు, ఆఖరుగా ఒక కుమార్తె "రుక్మిణి" అనే బిడ్డ లున్నారు. భీష్మకుడు, అతని భార్య విష్ణుభక్తులు కాని ఆయన బిడ్డలలో పెద్దవాడైన "రుక్మి"కి శ్రీకృష్ణ ద్వేషం! అకారణ వైరం. చేది వంశజుడైన "శిశుపాలునికి" తన చెల్లెలు రుక్మిణినిచ్చి వివాహం చెయ్యాలని రుక్మి సంకల్పం చేడి, సాళ్వ, మాగధ రాజులందరూ స్నేహితులు. శిశుపాల, దంతవక్త్రి, జరాసంధుడు మొదలైన వారంతా రుక్మికి సన్నిహితులు. భీష్మకునికి ఆయన భార్యకు పెద్దకొడుకు ఈ ఊహ నచ్చకపోయినా, అతనికి అడ్డుచెప్పగల ధైర్యం లేక చూస్తూ వూరుకున్నారు

భాగవతంలో రుక్మిణీ కల్యాణ ఘట్టం అత్యంత ప్రశస్తమైనది ఈ ఘట్టం నిత్యపారాయణం చేస్తారు. శ్రీవైష్ణవుల కుటుంబాలలోని చాలా మంది స్త్రీలు వివాహాలు కానికన్యలకు వివాహాలకు ఆటంకాలు వస్తున్న కన్యలకు ఈ రుక్మిణీ కల్యాణ ఘట్టం నలభై రోజులు (మండలం రోజులు) పారాయణం చేయిస్తుంటారు. తప్పక, త్వరలో చక్కటి సంబంధం కుదురుతుందనే దైవపదమైన ప్రగాఢ విశ్వాసంతో, అలాగే శ్రీకృష్ణుని కోరి, వరించి, తన ప్రేమ సందేశం ఆయనకు పంపి, తనను వివాహం ఆడే ఉపాయం తెలిపిన పౌరాణిక ప్రథమ మహిళ రుక్మిణి! అత్యంత సౌందర్యవతి, శ్రీకృష్ణ భక్తురాలు అయిన రుక్మిణి తన ఆత్మార్పణతో శ్రీకృష్ణుని పట్టమహిషి అయి, శ్రీలక్ష్మిగా కీర్తి, పూజలు అందుకుంది అయితే ఆమె శ్రీకృష్ణుని కోరి వరించి. ఆ స్వామి సాన్నిధ్యంలో "సుగుణ భక్తురాలిగా (రామాయణం లోని లక్ష్మణునిలా) నిలిచిపోయి, ఆయన హృదయంలో కర్పూరంలా కరిగి పోయింది తన భక్తితో, ప్రేమతో; ఆమెను పెళ్లాడిన తర్వాత, వరుసగా శ్రీకృష్ణుడు మరో ఏడుగురు కన్యలను వివాహమాడాడు సాంప్రదాయానుసారం వారందరూ "అష్టభార్యలు" గా ప్రసిద్ధిపొందారు. నరకాసురవధ తర్వాత పదహారు వేల మంది రాజ కన్యలను నరకాసురుని చెరనుండి వదిలించి, వారందరినీ తానే వివాహం చేసుకొని "దక్షిణ నాయకుడి" గా ప్రసిద్ధిపొంది, అందరికి అన్ని రూపాలతో ప్రణయలీలలు సాగించిన మాయామానుష విగ్రహుడాయన.

కానీ రుక్మిణీదేవి ఆయన ఈ వివాహాలకు గానీ, ప్రణయాలకుగానీ, ఏ క్షణంలోనూ అడ్డు చెప్పలేదు తన వ్యక్తిత్వాన్ని, తన భక్తిని తన ప్రణయాన్ని ఆయన పాదాల క్రింద ఆత్మార్పణగా పరచిన అనన్య భక్తురాలామె తన సర్వ జీవితాన్ని శ్రీకష్ణ భక్తికి "పణంగా" ఒడ్డిన మహాసాధ్వి రుక్మిణి!

రుక్మిణి పుట్టినది మొదలు భీష్మకుని ఇల్లు లక్ష్మీ నిలయంలా వెలిగి పోసాగింది! రుక్మిణీ తండ్రి ఇంటికి వచ్చివెళ్లె కొందరు బంధువులు ఆత్మీయులు, అతిథులు అయిన పెద్దలద్వారా శ్రీకృష్ణుని బాల్యలీలలు, పరాక్రమం దైవత్వం, కంసవధ, ద్వారకానగర నిర్మాణం, అజేయ యాదవసామ్రాజ్య

స్థాపనలాటి కథలెన్నో వింటున్నది బాల్యంనుంచి. ఆమె హృదయం శ్రీకృష్ణ రూపం, శ్రీకృష్ణనామం, శ్రీకృష్ణ పాదారవిందములమీద ఆత్మార్పణ భావాలతో నిండిపోయింది. శ్రీకృష్ణుడుకూడా ఆమె రూపలావణ్య, భక్తి విశేషాలు, తెలుసుకొని ఆమెను తాను ఇల్లాలుగా పొందాలని భావిస్తున్నాడు. ఈ సమయంలో రుక్మి, రుక్మిణిని శిశుపాలునికిచ్చి వివాహం చేయతల పెట్టి, వివాహ సన్నాహాలు కూడా పూర్తి చేయించాడు తన స్నేహితులైన, జరాసంధి, సాళ్వ, చేది, దంతవక్త్ర వగైరా ప్రముఖులందరినీ సగౌరవంతో ఆహ్వానించి వారందరికీ ఘనంగా విడిది ఏర్పాటుచేయించాడు. భీష్మకుడు కొడుకు మాట కాదనలేక పెళ్ళి ఏర్పాట్లు చేయించాడు. రుక్మిణి, "అగ్నిద్యోతనుడు" అనే తమ పురోహిత వంశంలోని ఒక వృద్ధబ్రాహ్మణుని రహస్యంగా పిలిపించి, ఆయనచేత తన ప్రేమ సందేశాన్ని శ్రీకృష్ణునికి చెప్పమని రహస్యంగా పంపింది ద్వారకకు. అగ్నిద్యోతనుని, శ్రీకృష్ణుడు ఘనంగా సత్కరించి, వచ్చిన పని ఏమిటని అడిగాడు రుక్మిణీదేవీ గుణశీల, వయోరూప భక్తి విశేషాలు వర్ణించి.

ఉ॥ ఆ ఎలనాగనీకు తగు, నంగనకున్ దగుదీవు. మాయుపా
ధ్యాయుల. యాన! పెండ్లియగు! దప్పదు! జాడ్యములేల! నీవు నీ
తోయపువారి గూడుకొని, తోయరు హానవ దెత్తుగాని, వి
చ్చేయుము, శత్రులన్ మఱుము సేయుము! సేయుము శోభనంబిలన్!"

అని చెప్పేశాడు. రుక్మిణీ సందేశం అమోఘమైనది

సీ॥ ప్రాణేశ! నీమంజుభాషలు వినలేని,
కర్ణ రంధ్రంబుల కలిమియేల?
పురుషరత్నమ! నీవు భోగింపగాలేని,
తనులతవలని సౌందర్యమేల?
భువనమోహన! నినుబొడగానగాలేని,
చక్షురింద్రియముల సత్త్వమేల?
దయిత! నీయధరామృతం బానగాలేని,
జిహ్వకు ఫలరస సిద్ధియేల?

ఆ॥ నీర జాతనయన! నీవనమాలికా
గంధమబ్బలేని, ఘ్రాణమేల?
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మమేల? యెన్ని జన్మములకు!

అంటూ శ్రీకృష్ణునికి ఆత్మార్పణ చేసుకుని, తనని వివాహసమయంలో తమ సాంప్రదాయానుసారం అంతఃపురం నుండి రాచనగరు వెలుపలగల గౌరిదేవి ఆలయానికి పూజకోసం తెస్తారనీ ఆ సమయం, అను వైనదని సూచిస్తూ

ఉ॥ అంకిలి సెప్పలేదు! చతురంగ బలంబుల దోడినెల్లి, యో
పంకజనాభ! నీవు శిశుపాల జరాసుతులన్ జయించి, నా
వంకకువచ్చి, రాక్షస వివాహమునన్‌, భవదీయ శౌర్య, మే,
యుకువజేసి, కృష్ణ! పురుషోత్తమ, చేకొని పొమ్ము వచ్చెదన్!"

అని ఉపాయం చెప్పింది రుక్మిణీదేవి! ఆ సమయంలో అయితే ఆమె చుట్టూరా అంతఃపుర స్త్రీలు, పెద్ద ముత్తైయిదువలు, పరిచారికలు మాత్రమే వుంటారు ఒక వేళ ఆ వేడుక చూడవచ్చిన ఇతర రాకుమారులైనా సరదాగా వియ్యాలవారిగా వస్తారేగానీ శస్త్రాస్త్రధరులై యుద్ధసన్నద్ధులైరారు.

శ్రీకృష్ణుడు సంతోషించి, అగ్నిద్యోతనునికి తప్పక తాను వస్తానని మాట ఇచ్చి, సాదరంగా వీడ్కొలిచ్చి పంపుతాడు. ఆ రాత్రికి రాత్రే తాను, మరి కొద్దిమంది సన్నిహితులతో విదర్భకు పయనమైన వెళ్ళాడు ఇది తెలుసుకున్న బలరాముడు, శ్రీకృష్ణుని అపదవస్తే తాను అండగా వుండాలని ససైన్య సమేతంగావచ్చి, శ్రీకృష్ణుని కలుసుకుంటాడు "కుండిన" లో, భీష్మకుడు శ్రీకృష్ణ బలరాములను సాదరంగా స్వాగత సత్కారాలుచేసి విడిది చేయిస్తాడు ఆయితే ఇక్కడొక విచిత్రమైన సన్నివేశముంది. రేపు రుక్మిణికి శిశుపాలునికి వివాహమని అందరు ప్రజలకు తెలుసు. కానీ శ్రీకృష్ణునిచూచిన క్షణంలో వారందరి హృదయాలలో ఒకేఒక భావం కలిగింది! ఆ భావాన్ని మహాద్భుతంగా పలికించాడు పోతన మహాకవి,

మ॥ తగు నీ చక్రికి విదర్భరాజసుతకున్ దథ్యంబు! వైదర్భియుం
దగునీ చక్రికి నింతమంచిదగునే దాంపత్య మీ యిద్దఱిం
దగులంగట్టిన బ్రహ్మ నేర్పరిగదా? దర్పాహతారాతియై
మగడౌగావుత జక్రి యీ రమణికిన్, మా పుణ్యమూలంబునన్!

"అనుకుంటుంటారు పరస్పర కుండిన ప్రజలు వారందరి హృదయాలలో రుక్మిణీ శ్రీకృష్ణులు భార్యా భర్తలుగా రూపుదాల్చి పోయారేతప్ప శిశుపాలుడు, రుక్మిణికాదు! ఏదో మహాద్భుతం జరగాలనీ శ్రీకృష్ణుడు రుక్మిణీ దంపతులు కావాలనీ వారందరి ఆకాంక్ష ఆరీత్య! అదీ దైవం ఏర్పరచే అనుకూల, అనురూప అనుశీల దాంపత్యాన్ని కూడా అయోధ్య! మిథిల ప్రజలు ఇలాగే ఆమోదించారు. ఆనందించారు. సీతాదేవిని అశోకవనంలో వుండగా, ఆంజనేయుడు శ్రీరామ పత్నిగా ఆమెను గుర్తుపట్టినది కూడా పై విధమైన అనురూప, అనుకూల దాంపత్య లక్షణమైన ఆ దంపతులిద్దరిలోని రూప, శీల, లక్షణ విశేషాలనుబట్టి!

ఈలోగా రుక్మిణి చాలా కలవరపడిపోతుంది అంతఃపురంలో. పోతన మహాకవి. ప్రఖ్యాత పద్యాలలో ఒకటైన (మత్తేభంలో) పద్యంలో

మ॥ ఘనుడా, భూసురుడేగెనో? నడుమ
మార్గశ్రాంతుడై చిక్కెనో?
విని, కృష్ణుండిది తప్పుగా దలచెనో?
విచ్చేసెనో? యీశ్వరుం,
డనుకూలింపదలంచునో? తలపడో?
యార్యా మహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో? యెఱు
గదో? నా భాగ్యమెట్లున్నదో!

కలత చెందుతుంది! అన్యమనస్కంగా! పరిచారికలు, పెద్ద ముత్తైదువలవెంట గౌరీ దేవీ ఆలయానికి వెళ్ళింది!

ఉ॥ సమ్మతినామనంబున! సనాతనులైన యుమామహేశులన్,
మిమ్ముఁబురాణ దంపతులః మేలు భజింతుగదమ్మ! మేటిపె
ద్దమ్మ! దయాంబురాశివి గదమ్మ! హరిం ఒతి సేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నటికి నాశము లేదు గదమ్మ యీశ్వరి!"

అంటూ ఆ జగజ్జననికి శరణాగతి చెందింది నిస్సహాయురాలైన అసూర్యం పశ్య అయిన అంతఃపుర రాజకన్యక అంతకంటే చేయగలిగిందే ముంది మరి! ఆ జగజ్జననికూడా సామాన్యురాలు కాదు: పరమశివుని కోసం సర్వ భోగాలను త్యజించి- తపస్సుతో మెప్పించి అర్ధాంగిఅయి! భర్త పేదరికాన్ని, దిగంబరత్వాన్ని, భోళాతనాన్ని, సర్వాన్ని, తన భక్తి, పాతివ్రత్యాలతో సహించి, సరిపెట్టుకున్న సాధ్వి!

ఆమె గౌరిపూజ చేసి, ఆలయం నుండి బయటకువచ్చి, దూరంగా బారులుతీరి నిల్చుని వేడుక చూస్తున్న వివిధ దేశరాజులనూ ఓరకంట చూస్తూ శ్రీకృష్ణుడు వారిలో వున్నాడా లేడా అని డోలాందోళనతో వుంది అప్పుడే ఆమె

మ॥ కనియెన్ రుక్మిణి, చంద్రమండల ముఖుం, గంభీర వేంద్రావల
గ్ను,నవాంభోజ దళాక్షు! జారుతర వక్షున్: మేఘసంకాశ, దే
హుఁనగరాతి గజేంద్ర హస్తనిభ బాహున్: జక్రి! పీతాంబరస్
ఘన భూషాన్వితు, గంబుకంఠు, విజయో
త్కంఠున్, జగన్మోహనున్!

చూచింది ఆనందంతో, అంగీకార సూచకంగా ఆమె కళ్ళు మెరిశాయి క్షణకాలం: ఆసంకేతం అందుకున్న శ్రీకృష్ణుడామెను సమీపించి, చేతులతో చుట్టి అందరూ నిశ్చేష్టులై చూస్తున్నంతలో, తన రథంలో కూర్చోబెట్టుకుని వాయువేగంగా రథం వెళ్ళేలా రథసారథికి సూచన ఇచ్చాడు. ఆ పుణ్యదంపతులను రథంలో తీసికెళ్ళి ధన్యుడైన సారధి "దారుకుడు!" ఆ రథానికికట్టి జన్మ తరించిన గుఱ్ఱాలు, వాయువేగ, మనోవేగం కలవి, శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప వలాహకము"లనే నాలుగు గుఱ్ఱాలు: చరిత్రలో ఆ రథ సారధి

దారుకుడు ఆ గుఱ్ఱాలు నాలుగు ఎవరికీ తెలియక పోవచ్చు గానీ, శ్రీకృష్ణుని భక్తులలో అవీ వాటి మహాద్భుత పాత్ర నిర్వహించాయి!

అందరూ తేరుకుని, జరాసంధ, శిశుపాల రుక్మి వర్గాలంతా ఆయుధాలు ధరించి కృష్ణుని వెన్నంటారు. బలరాముడు ఆయన సైన్యాలు వారందరినీ చావచితక కొట్టారు. రుక్మి తప్ప, మిగతా వారంతా పారిపోయారు. పారిపోయివచ్చి, బాధపడుతున్న శిశుపాలునితో జరాసంధుడు వేదాంతం, భగవల్లీల కాలమహిమ అద్భుతంగా చెబుతాడు తాను (జరాసంధుడు) స్వయంగా పదిహేడుమార్లు ఎట్లా శ్రీకృష్ణుని ససైన్యంగా ఎదిరించి, సైన్యం చచ్చి ఊరుకున్నదీ, పద్దెనిమిదవమార్లు కాలయవనునితోబాటు వచ్చి, శ్రీకృష్ణుని మధుర నుంచి (ద్వారకా నిర్మాణానికి) తరిమినదీ చెప్పి, "కాలం కలిసివచ్చినప్పుడు మనం జయిద్దాం!" అని వూరడిస్తాడు అంతేకాదు.

ఆ॥ బ్రతకవచ్చు, నొడల బ్రాణంబులుండిన,
బ్రతుకు గలిగెనేని భార్యగలదు!
బ్రతికితీవు! భార్య వట్టుదయ్యె మెఱుంగు!
వగవవలదు చైద్య! వలదు! వలదు!

అని రుక్మిణిలాటి దయ్యపుభార్య – మీద మోహాన్ని కూడా వదిలిస్తాడు! రుక్మి వెన్నంటి వస్తుంటే శ్రీకృష్ణుడాతనిని ఓడించి చంపబోగా, రుక్మిణి అడ్డు పడుతుంది! ఒక మీసం ఒక చెంపగడ్డం, ఒక వైపు తలమీద జుట్టుతీసి కురూపినిచేసి వదిలిపెడతాడు శ్రీకృష్ణుడు రుక్మిని. అతడు అవమానంతో కుండిన నగరంలోకి వెళ్ళక, నగరం బయట అడవిలో వుండిపోతాడు. చాలా కాలం! బలరాముడు రుక్మిణికి ధైర్యంచెప్పి, వూరడిస్తాడు అందరూ ద్వారకానగరం చేరుకుని, ఒక శుభముహూర్తంలో, సకలయాదవ వంశీయులు, ఇతర స్నేహిత ప్రజలు, పెద్దలు అందరి సమక్షంతో సాంప్రదాయానుసారం శ్రీకృష్ణుడు, రుక్మిణిని వివాహం చేసుకుంటాడు!

మ॥ ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె! నిజ చేతోహారిణిన్, మానవై
భవగాంభీర్య విహారిణిన్। నిఖిల సంపత్కారిణిన్। సాధు బాం
ధవ సత్కారిణి, పుణ్యచారిణి, మహాదారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబర ధారిణిన్। గుణవతీ చూడామణిన్। రుక్మిణిన్।

ఆ॥ అనఘ। ఆదిలక్ష్మియైన రుక్మిణితోడ
క్రీడ సలుపుచున్న కృష్ణుజూచి,
పట్టణంబులోన ప్రజలుల్ల సిల్లిరి।
ప్రీతులగుచు ముక్తభీతులగుచు।

అంటూ రుక్మిణీ కల్యాణ ఘట్టంతో దశమస్కంధం మొదటిభాగంపూర్తి చేశాడు పోతన మహాకవి। శ్రీకృష్ణావతారంతో ప్రారంభమయ్యే ఈ దశమస్కంధం ఒక్కటీ పారాయణం చేసినాచాలు, పోతన మహాకవితోబాటు మనమూ, భక్తి భావలహరిలో తేలిపోతాము! అక్షరం అక్షరం శబ్దచమత్కారంతో ఆద్యంత ప్రాసలతో భక్తి భావావేశ కవిత్వ ఝురితో ఇది ఒక సురగంగ। ఆ గంగలోని ఏ ఘట్టంలో మునకవేసినా క్షణ కాలం, మనందరం జన్మ జన్మాంతరాల భవబంధాలను తొలగించుకోగలం-ప్రయత్నిద్దామా!



" మత్స్యావతారం

భగవంతుడు భక్తవశంకరుడు, అలాగే ఏయే సమయాలలో ధర్మానికి ఏయే రాక్షసుల వలన, రాక్షస కృత్యాలవలన హానికలుగుతుందో, సాత్విక భక్తులు ఏయే సమయాలలో ఆపద పొందుతారో, సాత్విక భక్తితో కూడిన అహంకారం సాత్విక భక్తునిలో పొడసూపుతుందో ఆయా సమయాలలో భగవంతుడు తనసతానై వివిధ రూపాలు (అవతారాలు) సృష్టించుకుని, ఆ రాక్షసులనూ, రాక్షస కృత్యాలనూ నిగ్రహించటం. ఆపదలో చిక్కుకున్న తన

భక్తకోటిని రక్షించటం, సాత్విక భక్తునిలో ప్రవేశించిన మోక్షనిరోధకమైన అహంకారాన్ని నిర్మూలించటంలాటి అసాధరణ లీలలుచేసి, యుగయుగాలు భగవంతుని ఉనికినీ, భగవన్నామ మహిమనూ, చాటిచెబుతూ ఋజువు చేస్తుంటాడు ఆ దైవస్వరూపాలూ అన్నీ ఒకటే అయినా, ఎవరికివచ్చిన ఆకృతిని, నామాన్ని; అవతారాన్ని వారు తమ తమ హృదయ సంస్కారానికీ, భక్తి పరిణితికీ అనుగుణంగా పూజించి, జపించి తరిస్తారు. అది కేవలం భగవంతునికీ, నిజమైన భక్తునికీ మాత్రం తెలిసే అనుబంధము రహస్యమూతప్ప తార్కికులకూ, శంకాకూలిత చిత్తులకు, తమకుఅన్నీ తెలుసు నని ఇతరులను కించపరచే అహంకారులకూ బోధపడే విషయంకాదు భాగవతం అంతా ఇలాటి నగ్నసత్యాలను వివిధ కథలరూపాలలో వివిధ అవతారాలు, ఆ అవతార ఆవశ్యకతల వర్ణనలో తెలుపుతుంది. ఎటొచ్చీ మనం ఆ సందేశాలను అందుకోవడానికి కాస్తంత కృషిచెయ్యాలి మహర్షులు పొద్దు పోక కాలక్షేపానికో, ప్రతిఫలాపేక్షతోనో, లాభదృష్టితోనో, అంతలేసి మహా కావ్యాలు వ్రాయలేదని తమ సంకల్ప మాత్రాన సర్వ ఐశ్వర్యభోగాలనూ సమకూర్చుకొనగల తపశ్శక్తి సంపన్నులయిన మహర్షులు, ఏవో అభూత కల్పనలువ్రాసి నాలుగు డబ్బులు చేసుకొందామనో అబద్ధాల, అతిశయోక్తుల, ఆడంబర సంఘటనలు పాత్రలు సృష్టించి భావితరాలను పెడత్రోవ పంట్టిచాలనో అనుకోలేదు. వారికా అవసరమూలేదు అంచేతే వారి ఘంటాలనుంచి జాలువారిన ఆ గ్రంధాలు యుగాల పర్యంతం చిరంజీవత్వం సాధించుకున్నాయి ఆయా పాత్రలూ,సన్నివేశాలూ ఈనాడు మనం పోల్చిచూచుకోవటానికి వీలుగా వున్నాయి.

ద్రవిళదేశపురాజు అయిన సత్యవ్రతుడు మహావిష్ణు భక్తుడు. రాజ్య పాలన పూర్తిచేసి శ్రీహరిమీద మనసు లగ్నంచేసి "కృతమాలిక" అనే ఏటి ఒడ్డున సత్యవ్రతుడు "సలిలాహారుడు" నీరుమాత్రం ఆహారంగా తీసుకుంటూ! శ్రీమన్నారాయణునిగూర్చి తపస్సు చేశాడు ఒక రోజాయన ఆ ఏటిలోని నీటిని దోసిటిలోనికి తీసుకుని, శ్రీమహావిష్ణువును ధ్యానిస్తూ జలతర్పణం చేస్తున్న సమయంలో ఆ దోసిటిలోనికి ఒక చిన్న చేపపిల్ల వచ్చింది నీటితో

బాటుగా రాజు త్రుళ్ళిపడి ఆ చేపపిల్లను నీటిలో విడిచిపెట్టాడు, తానయితే ఆ చిన్న చేపపిల్ల విచిత్రంగా మనుష్యబాషలో "తాను ఈ ఏటిలోనే వుంటే జలచరజాతి ధర్మాననుసరించి పెద్దచేపలో, తిమింగలాలో తనని మ్రింగివేస్తాయనీ, ఒకవేళ వాటిబారినుండి బతికి బయటపడ్డా, జాలరులువచ్చి చేపల వేటకు వలలు విసిరినప్పుడయినా ఆ వలలోచిక్కి మరణిస్తానని, అంచేత శరణుజొచ్చి నీచేతిలోనికి వచ్చానని, ఇలా మరల నీటిలో దిగవిడవటం న్యాయం కాదనీ" చెబుతుంది. ఆశ్చర్యపోయిన ఆ రాజు ఆ చేపపిల్లను తన కమండలంలో వేసుకొని తన పర్ణశాలకు తెచ్చాడు. ఆ రాత్రి తెల్లవారేలోగా కమండలం నిండిపోయిన ఆచేప, తనకక్కడ చోటుచాలటంలేదని రాజుతో మొరపెట్టుకుంది. రాజు చేపను మరోపెద్ద మట్టికుండలో వేశాడు. అదీ నిండిపోయింది. మరల చేప కోర్కెమీద రాజు ఆ చేపను ఒకచిన్న నీటిమడుగులో వేశాడు. మరోనాటికి నీటిమడుగు అంతా ఆవరించుకుందా మీనాకృతి. దానిని మరల మరొపెద్ద జలాశయంలో వేశాడు. ఆ జలాశయము చేప శరీరానికి చిన్నదయి కూర్చుంది చివరగా సముద్రంలో వేశాడు రాజు ఆ మహామీనాన్ని। అది మరల నన్ను సముద్రంలోని పెను మొసళ్లు తినివేస్తాయేమో ఇందాకా కాపాడి ఇప్పుడు నన్నలా వదలివేయకు।" అంటుంది అప్పటికది సాధారణ మీనం కాదని నిర్ధారించుకున్న సత్యవ్రత మహారాజు

సీ॥ ఒక దినంబున శతయోజన మాత్రము
విస్తరించెదు నీవు, వినము, చూడ
మిటువంటి ఝషములనెన్నడు నెఱుగము
మీనజాతులకిట్టి మేమగలదె।
యేమిటి, కెవ్వడ, వీలిల్లది ప్పెదు
కరుణనాపన్నుల గావవేడి
యంభశ్చరంబైన హరివి! నేనెఱిగితి
నవ్యయు। నారాయణాభిధాను।

సీ॥ జననసంస్థితి సంహార చతురచిత్త

దీనులగు భక్తులకు, మాకు దిక్కునీవ!

నీదు మీనావతారంబు నిఖిలభూత

భూతిహేతువు! ప్రొమొక్కెద బురుషవర్య

అంటూ స్తుతిస్తాడు. మీనావతారుడయిన శ్రీమన్నారాయణుడు ఆ భక్తుని స్తోత్రానికి సంతోషించి, "నేను శ్రీహరిని, నేటికి ఏడుదినములకు రాత్రి బ్రహ్మదేవునికి ఒక్క పగలు పూర్తిఅయి రాత్రి వస్తుంది ఆయన నిద్రకు వక్రమిస్తాడు, ఆ సమయంలో అంధకార పూరితమయిన జల ప్రళయంవచ్చి సర్వలోకాలనూ ముంచివేస్తుంది ఆ ప్రళయవేళ. ఆ మహాజల నిధిలో ఒక నావమాత్రం వస్తుంది ఒక పెనుబాము నావత్రాడుగా వుంటుంది. ఆ నావకు నా తలమీద విచిత్రంగావుండే కొమ్ముకు ఆ త్రాడుకట్టి నేను ఓషధ బీజములను, సప్తఋషులను, నిన్ను నావలో ఎక్కించుకుని కాపాడుతాను, తిరిగి ప్రళయం పూర్తయ్యాక పునఃసృష్టి ప్రారంభం కావటానికి నేను, నా నావ దోహదం చేస్తాము. మరో ప్రయోజనంకూడా వుంది. ఇది నా మత్స్యావ తారం" అని చెప్పి అంతర్ధానమౌతాడు. సత్యవ్రతుడు కూడా శ్రీహరినే ధ్యానిస్తూ ఏడురోజులు గడుపుతాడు. ఏడవనాటి రాత్రి సృష్టి చేసిచేసి విసు గెత్తిన బ్రహ్మ అవులించి నిద్రలోనికి జారిపోతాడు. జల ప్రళయం ప్రారంభ మౌతుంది! అప్పుడే నావ వస్తుంది. సత్యవ్రతుడు నావలోకి ఎక్కుతాడు. సప్తర్షులు, ఓషధి బీజాలతోపాటు సత్యవ్రతునితోవున్న నావను శ్రీహరి ఆజ్ఞ ప్రకారం ఆ పెనుబాము త్రాటితో మహా మత్స్యవతారం కొమ్ముకుకట్టి స్థిమి తంగా హరినామ స్మరణచేస్తూ కూర్చుంటాడు సత్యవ్రతుడు మీనాకారం నావను సంచరింపజేస్తోంది. ఆ సమయంలోనే నిదురలోవున్న బ్రహ్మదేవుని ఆత్మ స్వరూపాలయిన వేదాలను హయగ్రీవుడనే రాక్షసుడు దొంగిలించి ఆ జలరాశిలో దాక్కుంటాడు. ఇది కనిపెట్టిన శ్రీహరి. తన మత్స్యావతార జలము, మహిమ ప్రదర్శిస్తూ, ఆ రాక్షసునితో యుద్ధంచేసి వాడిని సంహ రించి, తిరిగి విద్యలనన్నిటినీ, (వేద విద్యలనన్నిటినీ) బ్రహ్మదేవునికి తెచ్చి ఇస్తాడు. అసరికాయన నిద్రమేల్కొంటాడు.

ఈ మహాద్భుత లీలకు మహాపురుషుడైన ఆ మహా మీనావతారమూర్తిని సత్యవ్రతుడిలా స్తోత్రం చేస్తాడు.

క॥ ఇంగలముతోడి సంగతి, బంగారము
వన్నెగలుగు భంగిని, నీసే
వాంగీకృతుల యఘంబులు,
భంగంబులఁబొందు ముక్తిఁ బ్రాపించుహరీ!

మ॥ చెలివై చుట్టమవై మనస్స్థితుడవై చిన్మూర్తివై యాత్మవై
వలనై కోర్కెల పంటవై విభుడవై వర్తిల్లు నిన్నొల్లకే
పలు వెంటంబడి లోకమక్కటా! వృథా బద్ధాశమై పోయెడిన్
నిలువన్నేర్చునె హేమరాశిగనియు న్నిర్భాగ్యుఁడుం భక్తయా!

క॥ ఆలింపుము విన్నపమిదె, వేలుపుగమి తేని నిన్ను వేడికొనియెదన్
నాలోని చిక్కుమాన్చి, నీలోనికి గొంచుపొమ్ము నిఖిలాధీశా!

అంటూ ఆ స్తోత్రం వెనక పోతన మహాకవి విచిత్రాక్షర పదమాలలలో మార్చిన భక్త్యావేశం తొంగిచూస్తోంది గమనించండి. ఈ పద్యాలు హృదయంతో పఠించిన ప్రతివారి హృదయాలూ ఆ శ్రీ పదదాలకు తమ విన్నపాలు విన్నవించుకుంటున్నవే కాదా?

శ్రీహరి అందరికీ అభయమిచ్చి, అందర్నీ ఆశీర్వదించి తన మత్స్యావతారం చాలించి అదృశ్యుడయినాడు. ఆ సత్యవ్రతుడికి శ్రీహరి కరుణతో పాత్రుడవటంవల్ల మత్స్యావతారుడు "సాంఖ్యయోగ క్రియాసహితమైన పురాణసంహిత"ను ఉపదేశిస్తాడు సత్యవ్రతుడు కృతార్థుడౌతాడు ఆ సత్యవ్రతుడే వివస్వంతుడనబడే సూర్యునికి, సంజ్ఞకు "శ్రాద్ధదేవుడనే" పేరుతో జన్మించి వైవస్వతమనువుగా మారి ఏడవమనువు అయ్యాడు.

క॥ హరిజలచరావతారము, పరువడి
ప్రతిదినమును జదువఁ బరమ పదంబున్
వరుడందు, వానికోర్కెలు ధరణీశ్వర,
సిద్ధినొందు దథ్యము సుమ్మీ

అంటూ మత్స్యావతార కథకు ఫలశ్రుతి చెప్పిన వ్యాసమహర్షి అది ఇంత చక్కని చిన్ని పద్యంలో ఇమిడ్చిన పోతన మహాకవి శ్రీమహావిష్ణువు మీద భక్తి ప్రపత్తులు కలిగి వుండటానికి ఏయే అవతార రూపాన్నయినా ఎన్నుకోండి చాలు మిగతా మీ శ్రేయస్సు! వరోక్షంగా ఎన్నిక మన మనసుదే. ఎప్పుడన్నదే మనం త్వరత్వరగా ఆలోచించుకోవాలి, వార్ధక్యమూ, మృత్యువూ మీదపడేలోగా అవునా!



## భక్త అంబరీషుని కథ

శర్యాతిరాజుకు మరల "ఉత్తానబర్హి" "అనర్తుడు" భూరిషేషణుడు" అనే ముగ్గురు కుమారులు కలిగారు.

వారిలో అనర్తునికి "రైవతుడనే" కొడుకు పుట్టాడు. అతడు సముద్ర మధ్యంలో "కుశస్థలిపురం" అనే మహానగరం నిర్మింపజేసి, జనరంజకంగా రాజ్యంచేశాడు రామాయణ కాలంలో లంకానగర నిర్మాణం (ఒకానొక విశ్వకర్మ అయిన మయునిచేత) ఒక మహాద్భుత ఇంజనీరింగ్ ఫీట్‌కి నిదర్శనం. అయితే భాగవతంలోని ఈ రైవతుడు నిర్మించిన కుశస్థలిపురం ఆతర్వాత శ్రీకృష్ణుడు సముద్ర మధ్యంలో నిర్మింపజేసిన "ద్వారకా నగరం" ఆ నాటి ఇంజనీరింగ్ అద్భుతాలకు శాస్త్ర పరిజ్ఞానానికి ఉదాహరణలు, ఆ నాటి వైజ్ఞానిక విజ్ఞానానికి వారసత్వంకాదా! ఈనాటి మన ఆకాశహర్మ్యాలు. సముద్ర గర్భ నగరాలు, ప్లాట్ ఫారమ్‌లు అది చెప్పుకోవటానికి గర్వపడాలిగాని, సిగ్గుపడటమెందుకు? "మన పురాణాల్లో వున్నాయిట" అని వెటకారంచేసే వారికి పై ఉదాహరణలు సవివరంగా హేతుబద్ధంగా ఋజువు చేస్తున్నాయి కాదా?

ఆ రైవతునికి "కకుద్మి" ఆదిగాగల నూరుగురు పుత్రులు "రేవతి" అనే మహాద్భుత సౌందర్య, బల, రూప యవ్వనశాలి అయిన పుత్రిక

జన్మించారు. తన కుమార్తె రేవతికి తగిన వరుడెవరో స్వయంగా తెలుసుకుందామని, రైవతుడు. రేవతిని వెంటబెట్టుకుని ఏకంగా బ్రహ్మలోకం వెళ్ళాడు. ఆ సమయంలో గంధర్వులు, కిన్నెరులు బ్రహ్మదేవుని స్తోత్రం చేస్తూ నృత్యగానాలు చేస్తున్నారు. అవి చూస్తూ మైమరచిన ఒక్క క్షణం, కేవలం ఒక్కక్షణం తను వచ్చినపని మర్చిపోయాడు రైవతుడు. ఆ నృత్యగానాలు పూర్తయ్యాక బ్రహ్మదేవునికి తన కుమార్తెనుచూచి మ్రొక్కి, తను వచ్చినపని చెప్పాడు రైవతుడు. అప్పుడు బ్రహ్మ తన లోక కాలమానం ప్రకారం రైవతుడు గడిపిన కాలంలోగా భూమిమీద ఇరవై ఏడుమార్లు వెంట వెంట నాలుగు యుగాలు ఆరేడుమార్లు గడిచిపోయాయని, ప్రస్తుతం ఆనాడు రేవతి కోసం వూహించిన వరుళ్ళు కారుగదా! వారి వారి గోత్రీకులుకూడా భూమిమీద జీవించలేరనీ, మరల ద్వాపరయుగం జరుగుతోందని శ్రీ మహావిష్ణువు అంశలుగా బలరామకృష్ణులు అవతరించివున్నారని వారిలో బలరాముడు ఈ రేవతి రూపం యవ్వన, బలాలకు వరుడు అని ప్రస్తుతానికి అతనుతప్ప మరెవరు సరిజోడు కాలేరికన్యకు, అని చెబుతాడు

రైవతుడు రేవతితోసహా భూలోకానికి వచ్చి శ్రీకృష్ణ బలరాములలో బలరామునికి రేవతినిచ్చి బ్రహ్మ ఆజ్ఞప్రకారం వివాహము జరిపిస్తాడు. ఈకథ మరల దశమస్కంధంలోని శ్రీకృష్ణ అవతారంలో గుర్తుచేస్తాడు. మహర్షి-రేవతీ బలరాములను పరిచయం చేస్తూ రుక్మిణీకల్యాణ ఘట్టానికి వాడదిగా.

వైవస్వత మనువు కుమారులలో నాలుగవవాడయిన "దిష్టుడు"(శర్యాతి తమ్ముడు) దిష్టుని కుమారుడుఅంబరీషుడు ఈ అంబరీషుడు అప్రమేయ విష్ణుభక్తితత్పరుడు! "ప్రహ్లాద-నారద, పరాశర, పుండరీక, వ్యాసాం, బరీష, శుక, శౌనకబ్రహ్మవాస" ప్రసిద్ధులయిన భాగవతులలో అచంచల విష్ణు భక్తులలో చిరస్థాయి అయినవాడు మరల అంబరీషోపాఖ్యానంలో పోతన మహాకవి ప్రహ్లాద చరిత్రలాగే గజేంద్ర మోక్షణంలానే వామన చరిత్రలానే తన భక్త్యావేశపు అంచులను, హద్దులను దాటిపోయాడు కవిత్వ గంగా ఝరిలో! ప్రతిపద్యం, పద్యం, గద్యం గద్యం అమృతపు భక్తి రసపూరిత ప్రవాహం.

ఆ॥ విష్ణుభక్తులందు, విష్ణువునందు, గ
లంక యెడల, మనసు లంకపెట్టి,
విహిత రాజ్యవృత్తి విడువని వాడునై
యతడు "రాచతపసి" యనగనొప్పె!"

**అదీ** అంబరీషుని "రాజర్షి''తత్వం! ఈ నాడు "రాజర్షుల''మంటూ అరిషడ్వర్గాలలో ఏదీ జయించని ధూర్తరాజర్షులను రోజూ చూస్తున్నాం ఎందరినో.

ఇక అంబరీషుని భక్తి గురించి.

"సీ॥ చిత్తంబు మధురిపు శ్రీపాదముల
యందు, పలుకులు హరిగుణ పఠనమంద!
కరములు విష్ణుమందిర మార్జనములంద!
శ్రవములు హరికథా శ్రవణమంద,
చూపులు గోవింద రూపవీక్షమంద,
శిరము కేశవ నమస్కృతులయంద,
పదములీశ్వరగేహ పరిసర్పణమునంద,
కామంబు చక్రికైంకర్యమంద!

తే॥ సంగ మచ్యుతజనగుణ సంగమంద,
ఘ్రాణమసురారి భక్తాంఘ్రికమలమంద
రసనతులసీదళములంద రతులు పుణ్య
సంగతులయంద, యారాజ చంద్రమునకు

క॥ హరియని సంభాషించును, హరియని
దర్శించు, వంటు, నాఘ్రాణించున్
హరియని రుచిగొన దలచును; హరి
హరి! ఘను నంబరీషు, నలవియె పొగడన్!

ఆహరి భక్తితో తలమునకలుగా మునిగిన భక్తునికి ఇక ఏ ఐహిక సంప దలమీదా వాంఛ వుండదుగాక వుండదు. అంబరీషునిక్కూడా భౌతికంగా, కర్తవ్య పాలనగా రాజ్యపాలన చేస్తున్నారే తప్ప అతనికి ఐహిక వరమైన బంధు, మిత్రి, కళత్ర, పుర, అతఃపుర! ధన కేశీవన వగైరాలన్నిటి మీదా చిక్తుడైన అతని భక్తికిమెచ్చి, శ్రీమహావిష్ణువు తన ఆయుధ శ్రేష్ఠమూ, ఆర్త త్రాణ వరాయణము, దుష్టశిక్షణా సాధనమూ శిష్టరక్షణా వరాయణమూ అయిన సుదర్శన చక్రాన్ని ప్రసాదించాడు, అవసరమైనపుడు అది ఆ భక్తుని రక్షణ భారం వహిస్తుంది! నిస్సంగత్వం, నిర్మోహత్వం ఏర్పడింది. నిరంత రం శ్రీహరి నామస్మరణలోనే ఏకాగ్రతతో అంబరీషుడు. తన సహధర్మచారి ణితో, కార్తీకమాసంలో మూడు రాత్రులు ఉపవాసం చేసి, కాళిందీనదిలో స్నానంచేసి, శ్రీహరిని అభిషేకించి, పాత్రోచిత దానాలతో దక్షిణలతో అతిథు లను సంతృప్తివరచి, "ద్వాదశీ వ్రతం" చేశాడు ఏకాదశి అంతా ఉపవా సంవుండి, ద్వాదశినాడు పారణచేయటానికి సంకల్పించాడు. ఆ సమయంలో కోవమే ఆయుధంగానూ, ఆభరణంగానూ వున్న దుర్వాస మహాముని అతిధిగా వచ్చాడు అంబరీషుని వద్దకు. దుర్వాస మహామునికి ఆయన కోపమూ, శావమూ ఆయన తపస్సును హరించవు. అంచేత ఆయనకెప్పుడూ ముక్కుమీదే వుంటుంది కోపం దానికి వరగర్వమూ, తపశ్శక్తీ తోడై నప్పుడు ఆ మహర్షికి అవగింజంతే కారణమైనా చాలు కోవపడటానికి, ఎదుటివారిని శపించటానికి!

అంబరీషుడు దుర్వాస మహామునిని భక్తి శ్రద్ధలతో పూజించి, ద్వాదశ పారణ సందర్భంగా, సాక్షాత్తు దైవమే అతిధిగా వచ్చినట్లు పొంగిపోయాడు. భోజనానికి రమ్మని ఆహ్వానించాడు ఆప్యాయంగా మహామునికూడా, కాళిం దిలో స్నానంచేసి వస్తానని చెప్పి వెళ్ళాడు అంబరీషుడు ఈ అతిధి రాకకోసం కనిపెట్టుకుని కూర్చునివున్నాడు కానీ స్నానానికి వెళ్ళిన ముని ఎంతకీరాడు! వస్తున్న జాడలేదు! ద్వాదశి గడియలు దాటిపోయాక, తాము మునికంటే ముందుగా ఆహ్వానించివున్న బ్రాహ్మణులకు భోజనం పెట్టకపోవటం, తాను పారణ చేయటంలాటివి జరగకూడదు అంచేత రాజు విద్వాంసులను పిలిపించి

కర్తవ్యం నిర్ణయించమని కోరాడు. వారందరూ శాస్త్రసమ్మతంగా, రాజును హరి సమర్పణంబుగా, జలం ఆహారంగా తీసుకుని ద్వాదశి పారణచేసి, వ్రతం కొనసాగించమని సలహా ఇచ్చారు. ఆ ప్రకారమే చేశాడు రాజు.

అప్పుడు వచ్చాడు దుర్వాసుడు. రాజిలా చేశాడని తెలుసుకున్నాడు.

కోపంతో అగ్గిబుగ్గయిపోయాడు తన తపశ్శక్తి మీద వల్లమాలిన "అహం" ముంచుక వచ్చింది, తన కోపంమీద తగిన గొప్ప ప్రదర్శించుకోవాలని పించింది! తన తపశక్తిని ప్రదర్శించి, కేవలం ఒక్క అంబరీషునికే గాక ముల్లోకాలకూ తన తపోమహిమ, తన కోపమహిమ, తన శాపమహిమ, తన శక్తి మహిమ తెలియజేయాలనిపించిందా మహా మునికి! అంచేత.

సీ॥ యమునలో కృతకృత్యుడై వచ్చి,
రాజుచేసే వితుండై, రాజచేష్టితంబు
బుద్ధిలోనూ హించి, బొమముడి మొగ
ముతో, నదరెడిమేనితో, నాగ్రహించి,
రెట్టించి యాకలి, కొట్టుమిట్టాడంగ,
"నీ సంపదున్మత్తు, నీ నృశంసు,
నీ దురహంకారు, నిందఱుగంటిరే!
విష్ణుభక్తుడుగాడు! వీడు! నమ్మ.

తే॥ గుడువ రమ్మని, మునుముట్ట గుడిచినాడు!
ధర్మభంగంబుసేసి, దుష్కర్ముడయ్యె!
నైన నిప్పుడు సూచెద! వహ్ని దిశల
నేను గోపింప, మాన్పువాడెవ్వ "డనుచు"

అట్లా అహంకరించి ఆ అహంకారం ముప్పిరిగొన్న వేళ, ఎదుటి సాత్త్వికుడు అహంకారిగా కన్పించి, ఆ ముని తన శిగలోని జట ఒకటి పీకి, దానిని "కృత్య" అనే భూతాకృతిగా, ఆయుధపాణిగా మలిచి అంబరీషుని మీదకు ప్రయోగించాడు.

ఈనాడు, కొన్ని మంత్రసిద్ధులు, జపసిద్ధులు సాధించి, వాటిని మోక్షం కోసం కాకుండా, పరోపకారం కోసం కాకుండా, సాధువులను హింసించటానికి ఉపయోగించే క్షుద్ర విద్యాయోగులు, దొంగ సన్యాసులు, దొంగ బాబులు, దొంగ అమ్మవార్లూ ఎందరో, అనాటి ఆ దుర్వాసమునికి వారసులు, అను చరులు! ఆ క్షుద్రత్వం చివరకు వారినే బలితీసుకోవటం చరిత్ర చెప్పేసత్యం! అతి అహంకారం, అత్యున్నత అధికారం, మితిమించిన కోపం వీటిలో ఏ ఒక్కటి అయినా, మూడూ అయినా పరోపకారానికి, నిస్వార్థానికి, ప్రపంచ శ్రేయస్సుకూ ఉపయోగించినంత వరకూ బాధలేదు. అవి స్వార్థానికీ, సాధు హింసకూ ఉపయోగించిన నాడు, అవే యమపాశాలై తీరుతాయి. ఆయా వ్యక్తులకు.

> ఆ॥ ఆ ప్రకారమెఱిగి హరి విశ్వరూపుడు!
> వెఱ్ఱితపసిసేయు వేడ బంబు,
> జక్కబెట్టు మనుచు. చక్రంబు బ్రంచిన
> వచ్చెనదియు, ప్రళయవహ్నిపగిది!"

అది భగవంతునికి భగవంతునిపై గల ప్రేమకు, వాత్సల్యానికి తార్కాణం! సాత్విక భక్తుడైన అంబరీషుడు, తన వద్ద శ్రీ మహావిష్ణువు ఇచ్చిన చక్రాయుధం వుందన్న స్పృహగానీ, అది మరల తన శత్రువుమీదికి ప్రయోగించవచ్చుని గానీ వూహకూడా లేనివాడు! నిర్మల భక్తుడు తనకు బాధ కలిగినా భయం కలిగినా శ్రీహరిదే బాధ్యత అని నమ్మిన నిష్కళంక భక్తుడు సుదర్శన చక్రాన్ని సమంత్రకంగా విష్ణువు ఆయుధంగా పూజించటం వరకే ఆయన చేయగలిగిన, చేస్తున్నపని! అంచేత అలాటి భాగవతుని రక్షించటం భాగవతుని విధి! స్తంభంలోనుంచి ఆవిర్భవించినా, మరల చక్రాయుధాన్ని ఆజ్ఞాపించినా, ఏం చేసినా భక్తుణ్ణి కాపాడి తీరవలసిన బాధ్యత ఆయనదే!



# దుర్వాస గర్వభంగం

## భక్తుని హృదయం - భగవంతుని - నిలయం

ప్రళయకాల మహాగ్నిలా వచ్చిన సుదర్శన చక్రం. ముందస్తుగా, దుర్వాస మహాముని ప్రయోగించిన "కృత్య"ను దహించింది ఇక ముని వెంట పడింది ప్రళయ భీకరంగా! అప్పుడు గానీ దుర్వాస మహామునికి తన తపశ్శక్తి విలువా, భక్తుని భక్తి విలువా, భగవంతునికి భక్తుని పట్లగల వాత్సల్య విలువా తెలిసిరాలేదు మరి! పరుగు తీశాడు మౌని! వెంట పడింది చక్రాయుధం.

"మ॥ భువిదూఱన్ భువిదూఱు, నబ్ధిజొర,
నబ్ధింజొచ్చు, నుద్వేగియై!
దివిప్రాకన్ దివిప్రాకు, దిక్కులకు
బోదిగ్వీధులంబోవు, జి
క్కి వెసన్ గ్రుంగిన గ్రుంగు,
నిల్వనిలుచున్, గేడింపగేడించు, నో
క్కవడిన్ దాపసు వెంటనంటి,
హరిచక్రం బన్యదుర్వక్రమై!"

ఇక దిక్కుతోచలేదు దుర్వాసునికి! బ్రహ్మలోకం పరుగెత్తి బ్రహ్మను శరణువేడాడు విష్ణు చక్రాన్ని వారించమంటూ! కానీ బ్రహ్మదేవుడు స్పష్టంగా చెప్పాడు. "సర్వాంతర్యామి సర్వసృష్టి స్థితిలయలకూ కారణ భూతుడైన శ్రీ మహావిష్ణువుకూ, ఆయన ఆయుధ శ్రేష్టమైన సుదర్శన చక్రానికి ఈముల్లో కాలలో అడ్డేమున్నది? ఆయన ఆజ్ఞ మాకు శిరోధార్యం. ఆయన పాదాలు మాకు శరణ్యం నీవు ఆయననే శరణువేడుకో!" అని! ఇక వైకుంఠానికి పరుగెత్తాడు దుర్వాసుడు. వైకుంఠంలోని శ్రీమన్నారాయణుని అంతఃపురంలో, లక్ష్మీనారాయణ సరస సల్లాపాలలో వున్నారాసమయంలో. దుర్వాసుడు "పాహిమాం" అంటూ శ్రీహరి పాదాలమీద వడ్డాడు.

ఉ॥ నీ మహిమార్ణవంబు తుది నిక్కముగా నెఱుగంగలేక, నీ
ప్రేమకు వచ్చు దాసులకు, గ్రించుదనంబున నెగ్గుసేసితి,
న్నామఱపున్ సహింపుమట నారకుడైన మనంబులో, భవ
న్నామము చింతచేసిన ననంతసుఖస్థితి చెందకుండునే?"

అంటూ శరణాగతి నెందాడు: "నాకోపాగ్ని జ్వాలలకు ముల్లోకాలలో ఎవడడ్డమొస్తాడో చూస్తాను!"అన్న దుర్వాసునికీ, ఈదుర్వాసునికీ పోలికేలేదు! అది అహంకారం, ఇది నిరహంకార స్థితి! అది తన స్వశక్తి ప్రదర్శన! ఇది శరణాగతి! అది భక్తుని హృదయం భగవంతుని మందిరం అని తెలియని అజ్ఞానస్థితి! ఇది భగవంతుని హృదయంలోనే భక్తుడు నిశ్చింతగా నిద్రిస్తుంటాడని తెలుసుకున్న ఆత్మ సాక్షాత్కారం! ఈ స్థితినే దైవం కోరేది! అహంకారికి ఈ స్థితినే భగవంతుడు కల్పించేది, ప్రస్తుతానికి చక్రాన్ని దుర్వాసుని తాకకుండా ఆపినా, ఇంకా ఆతనిలో అహంకారావేశం కూడా పుంచకుండా భగవంతుడు పూనుకున్నాడు

ఆ॥ నాకుమేలుగోరు నా భక్తుడగువాడు,
భక్తజనులకేన పరమగతియు!
భక్తుడెందు జనిన, బఱతెంతు, వెనువెంట!
గోవువెంటఁదగులు, కోడెభంగి!

క॥ సాధుల హృదయము నాయది
సాధుల హృదయంబునేను; జగములనెల్లన్,
సాధులనేనే యెఱుగుదు! సాధులెఱుంగుదురు
నాదుచరితము విప్రా

క॥ అదెపో! బ్రాహ్మణ! నీకును వదయుండు!
నా భాగవతుడు జనవిభుల గుణా
న్విదు డిచ్చు వలయు మాతని మదిసంతస
పఱిచి, వేడుమా, శరణంబున్;

అంటూ అంబరీషుని వద్దకి పంపించాడు దుర్వాస మహామునిని! దుర్వాసుడు అంబరీషుని పాదాలమీద పడ్డాడు తన తపోశక్తి, ఋషిత్వం సర్వం మరచి!

అంబరీషుడు సుదర్శన చక్రాన్ని స్తోత్రం చేశాడు.

ఆ॥ ఏ నమస్కరింతు, నిద్రశాత్రవ ధూమ
కేతువునకు, ధర్మ సేతువునకు,
విమల రూపమునకు, విశ్వ గోపమునకు,
జక్రమునకు, గుప్త శక్రమునకు,

ఆ॥ విహిత ధర్మమందు విహరింతు నేనియు!
నిష్టమైన ద్రవ్యమిత్తునేని
ధరణి సుతుడు మాకు దైవతంబగునేని!
విప్రునకు శుభంబు వెలయుగాక!"

అంటూ సుదర్శన చక్రాన్ని శ్రీహరిని కీర్తించాడు అంబరీషుడు! శ్రీహరి సంప్రీతుడైనాడు. సుదర్శన చక్రం తిరిగి వెళ్ళిపోయింది; దుర్వాస మహామునికి స్వస్థత చేకూరింది! అంబరీషుని, నిండైన మనసుతో అభినందించాడు. ఆయన భక్తిని మెచ్చుతున్నాడు.

ఇక దుర్వాసునిలోనికి పోతన మహాకవి పరకాయ ప్రవేశం చేశాడు.

"ఒక్క మారైనా విష్ణువుపేరు అనుకోకుండా చెవులలో సోకినా చాలు. సర్వపాపాలూ పటాపంచలయి పోతాయి అలాటి మహానుభావుని నిరంతరం ఏకాగ్ర చిత్తంతో ధ్యానంచేసే నిష్కల్మష మూఢభక్తులకు ప్రపంచంలో అడ్డు ఏమున్నది! అసాధ్య మేమున్నది!

నీ మహాభక్తిని కళ్ళారా చూశాను! నీ విష్ణు స్తోత్రాలు కర్ణపేయంగా విన్నాను నీ చేతివంట-మహా ప్రసాదంగా తీసుకున్నాను! సర్వ పుణ్యఫలాలు సంప్రాప్తించాయి నాకు! విష్ణు సుదర్శన చక్ర జ్వాలలనుండి, నా అహం

కార, అజ్ఞాన తిమిరాంధకారం నుండి, నీ సచ్చరిత్రత కారణంగా బయట పడ్డాను. ఇక వెళ్ళొస్తాను. అంబరీషా! ముల్లోక వాసులూ నీ ఈ మహాద్భుత చరిత్ర, సూర్య చంద్రులున్నంత కాలం కీర్తింపగలరు!" అని దీవించి వెళ్ళిపోయాడు.

ఆ తాపసి తిన్న తర్వాత, మిగిలిన శేషాన్నాన్ని నిరహంకారియైన అంబరీషుడు అమృతప్రాయంగా తిన్నాడు, అప్పుడుకూడా మునికి చక్రా యుధ బాధ మాన్పింది శ్రీ మహా విష్ణువేగానీ, తాను కాననే భావించాడా అమోఘ విష్ణు భక్తుడు.

క॥ ఈ యంబరీష చరితము,
తీయంబునవిన్న, జదువ, ధీనంపన్ను
డై యుండును "భోగపరుండై యుండును,
నరుడు పుణ్యుడై యుండు నృపా!"

అని అంబరీషోపాఖ్యానం అనే మహా భక్తుని కథ ముగించాడు, శుక యోగీంద్రుడు పరీక్షిత్తుతో! ఇలా కొన్ని వందల వేల భక్తుల గాథలు, భగవంతుని లీలలు చదవగా చదవగా, వినగా వినగానయినా, భగవంతుని మీద మనసు నిలువగలరేమో మానవులనే ఆశతో వ్రాశారా మహర్షులు ఇంతలేసి కావ్యాలు, కావ్యాలలో కథలూ! అది కట్టుకథలనో, హేతువాదానికి నిలవ్వనో భక్తి అనేది ఒకానొక "మేనియా" లేదా "ఫోబియా" అనో భక్తులనే వారు ఒకానొక మానసిక రోగం తాలూకు రోగులనో నిర్ధారించి, ఆ మేరకు తర్కించే వారిని ఆ మహర్షులూ, వారి కార్యాలికాదు, సాక్షాత్తూ భగవంతుడైనా చేయగలిగిందీ వారికి చెప్పగలిగింది ఏమీలేదు!

పూలమాలలో దారంలా, గాలిలో, మనసుకు మాత్రం అనుభూతి కలిగించే సుగంధంలా, చంద్రునిలో వెన్నెలలా, పసిపాప బోసి నవ్వులోని అనుపమాన సౌందర్యంలా, స్వచ్ఛతలా, అతి చిన్న కీర్తనంలో దాగివున్న

మహావృక్షంలా, సకల ప్రాణి కళ్ళలో వెలిగే జీవకళలా, సర్వత్రా వ్యాపించి వున్న భగవంతుని వివిధ రూపాలతో తెలుసుకోవటమన్నది కష్టంకాదు. కానీ ఎప్పటికప్పుడు మానవుని తర్కం, అజ్ఞానం, ఇన్నిటినీ చూస్తూ "మరుపు" కు లోను కావటలోనే వుంది అజ్ఞానం. అది తొలగించుకోవటానికి ప్రయత్నిస్తే చాలు-భగవంతుని వునికి, భాగవతుల వునికి, విలువా ఎవరి హృదయానికి వారికే తెలుస్తాయి! ఆ ప్రయత్నానికి తొలిమెట్టే కావ్యాలు, పురాణాలు!



## శ్రీకృష్ణ, జాంబవతి, సత్యభామల పరిణయం

రుక్మిణీ కల్యాణం తర్వాత శ్రీకృష్ణునికి, రుక్మిణికి కలిగిన కుమారుడు "ప్రద్యుమ్నుడు" ఈ ప్రద్యుమ్నుడే పూర్వజన్మలో ఈశ్వరునిచేత దగ్ధుడైన మన్మధుడు. శంబరుడనే రాక్షసుడు శ్రీకృష్ణ రుక్మిణీదేవులకు జన్మించేబిడ్డ తనకు మృత్యువని తెలుసుకొని ఆ పురిటికందును తన మాయాబలంతో పార వేయిస్తాడు. అయితే ఆబిడ్డనొక పెద్ద చేప మింగుతుంది, ఆచేపను జాలరులు పట్టి శంబరునికే కానుకగా ఇస్తారు. శంబరుని అంతఃపుర వంటవాళ్ళు చేప కడుపులో బిడ్డనుచూచి ఆశ్చర్యపడతారు. శంబరుని ఇంటనే మన్మధుడు ఇట్లా జన్మించివస్తాడని ఎదురుచూస్తున్న రతీదేవి "మాయావతి" పేరుతో తపోనిష్ఠలో వుంటూ ఈ బిడ్డను చూచి గుర్తించి రహస్యంగా పెంచి పెద్ద చేసింది. నిత్య యవ్వనంగల ఆమె ప్రద్యుమ్నుడు పెరిగి యవ్వనుడయ్యాక తాను తనని భార్యగా చెబుతుంది. ప్రద్యుమ్నుడు మొదట అంగీకరించక తర్వాత రతీదేవి ద్వారా పూర్వజన్మ వృత్తాంతం తెలుసుకుంటాడు శంబరుడుచేసిన కిరాతకము తెలుసుకుంటాడు మాయావతి ప్రద్యుమ్నుడికి "సర్వశత్రుమాయావినాశినీ!" అనే మహా విద్యను ఉపదేశిస్తుంది. ఆ విద్యాసాయంతో ప్రద్యుమ్నుడు శంబరుని వధించి, రతిసమేతుడై గగనగమనంతో ద్వారకకు వస్తాడు. వాళ్ళిద్దరినీ చూచి ద్వారకా ప్రజలు.

క॥ హరియని వెనుచని పిదపను, హరి
బోలెడువాడుకాని, హరికాడమచున్,
హరిమధ్యలల్లిన నల్లన, హరినందనుడాయ
వచ్చి రాశ్చర్యమువన్

ఇక రుక్మిణీదేవి

క॥ పొదలెడిముదమున జిత్తము, గదలెడి
నా ఎడమమూపు, గన్నుల వెంటన్
బొదలెడి వానందాశ్రులు, మెదలెడి
బాలింఢ్లబాలు మేలయ్యేడినో!"

అని వితర్కించుకుంటుంది. ఆనాడు పొత్తిళ్ళలో మాయమై మరణించా డనుకున్న బిడ్డడు ఇంతవాడయి, ఏకంగా కోడలిని వెంటబెట్టుకవచ్చాడని తెలుసుకుని ఆ తల్లి ఆనందానికి అవధులేకుండా పోతాయి,

ఆతర్వాత శ్రీకృష్ణుడొకనాడు కొలువుతీరి వుండగా "సత్రాజిత్తు" అనే వ్యక్తి సూర్యునితో (సూర్యపీఠాలు ఎందరో సూర్యులు మయులు, విశ్వ కర్మలు, ఇంద్రపదవులు ఇంద్రులు, సప్తఋషులు వగయిరాల్లానే) స్నేహం చేస్తాడుగాఢంగా. సూర్యుడాతనికి మహామహిమాన్వితమైన "స్యమంతకమణి" అనేపేరుగల మహాద్భుతమణిని ప్రసాదిస్తాడు కానుకగా ఆ మణి ఎవరి వద్ద వుంటుందో వారికి రోజూ ఎనిమిది బారువుల బంగారం సృష్టించి ఇచ్చే మహిమ కల దైవమణి! దానిని ధరించి సత్రాజిత్తు ద్వారకకు వస్తుందగా చూచిన ప్రజలు ఆయన సాక్షాత్తు సూర్యదేవుడేనని భ్రమపడి శ్రీకృష్ణునికి చెబుతాడు. శ్రీకృష్ణునికి అసలు విషయం తెలునుగనుక అతడు సూర్యుడుకాదనీ, సత్రా జిత్తుఅనీ జనులకు తెలియజెప్పి పంపిస్తాడు. ఆ స్యమంతకమణి ఏరాజు వద్ద వుంటే అది మరింత ప్రకాశిస్తుంది ఆ మణి ప్రభావం గురించి శుకయోగీం ద్రుడు ఇలా చెబుతాడు.

"ఏరాజేలెడు వసుమతి! నా రత్నము పూజ్యమానమగు, నక్కడ, రో గారిష్ట సర్పమాయిక, మారీ దుర్భిక్ష భయము మాను నరేంద్రా!"

శ్రీకృష్ణుడు సత్రాజిత్తును మణి ప్రస్తుతం యాదవ ప్రభువైన వాడివద్ద వుంటే బావుండునని సూచిస్తూ తనకిమ్మంటాడది సత్రాజిత్తు వినిపించుకోకపోగా

క॥ అమ్మణియాదవ విభునకు నిమ్మని
హరియడుగ, నాత, డీక, ధనేచ్ఛన్
"బొమ్మ" ని పలికెను జాక్రిని, "నిమ్మణి
యీకున్న మీదనేమౌ?" ననుచున్॥

అని తలపొగరుగా జవాబిచ్చి వెళతాడు సత్రాజిత్తు. శ్రీకృష్ణుడా అవమానాన్ని మౌనంగా భరిస్తాడు. అయితే సత్రాజిత్తు తమ్ముడు "ప్రసేనుడు" అనేవాడొకనాడా మణిని వేడుకగా మెడలో ధరించి వేటకు వెళతాడు అడవిలోకి సింహం ఒకటి అతనిపై బడి చంపి, ఆ మణినిచూచి ఏదో మాంస ఖండంగా భ్రమసి, నోటకరచుక వెళుతుండగా "జాంబవంతుడనే" రామాయణ కాలం (త్రేతాయుగం) నాటి వృద్ధభల్లూకరాజు ఆ సింహాన్ని చంపి, స్యమంతక మణిని అక్కడే దాపులలో గుహనలో వున్న తన కుమార్తె అయిన జాంబవతికి ఆటబంతిగా ఇస్తాడు. ఈలోగా ద్వారకలో సత్రాజిత్తు తన తమ్ముని మరణ వార్త విని శ్రీకృష్ణుడే మణిమీద ప్రలోభంకొద్దీ తన తమ్ముని చంపి మణి అపహరించాడని నిందాప్రచారం చేస్తాడు. ఆ నిందను నిందగానే ఋజువు చేయవలసిన బాధ్యత వహించి శ్రీకృష్ణుడు అడివికివెళ్ళి ప్రసేనుని అడుగు జాడలు సింహపు అడుగుజాడలు, భల్లూకపు అడుగుజాడలు ఆధారంగా జాంబవంతుని గుహకుచేరి జాంబవంతుని కుమార్తె అయిన జాంబవతి వద్ద ఆ మణినిచూచి, అది తీసుకుపోదామనుకుంటుండగా, జాంబవతి దాసి కేకలు వేస్తుంది. "ఎవరో పరాయి మగవాడు వచ్చా" డంటూ జాంబవంతుడు వస్తాడా కేకలువిని. శ్రీకృష్ణ జాంబవంతుల మధ్య ఇరవై ఎనిమిది అహోరాత్రులు ఘోరమైన యుద్ధం జరుగుతుంది. ఆ పోరాటంలో తన బలం క్షీణించిన జాంబవంతుడు, ఆవచ్చినవాడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అనే స్పృహ తెలుసుకొని, యుద్ధం చాలించి, సాగిలబడి మొక్కతాడు శ్రీకృష్ణునికి. శ్రీరాముని యుద్ధకౌశలం చూచిన జాంబవంతునికి ఆనాడు శ్రీరామునితో ద్వంద్వయుద్ధం చేయాలనీ కోరిక కలుగుతుంది త్రేతాయుగంలో రామరావణ యుద్ధానంతరం. శ్రీరాముడు ఆ కోర్కెను ద్వాపర యుగంలో శ్రీకృష్ణావ

తారంలో తీరుస్తానని మాటఇస్తాడు. పూర్వజన్మ వరస్మృతి కలిగిన జాంబవంతుడు శ్రీకృష్ణునికి మణినిచ్చి తన కుమార్తె జాంబవతినిచ్చి వివాహంచేసి పంపి శ్రీమన్నారాయణుడయిన శ్రీకృష్ణుని స్తుతించి శలవు తీసుకుంటాడు ఇక్కడ ద్వారకలో శ్రీకృష్ణుడాగుహనుంచి బయటకు రాక పన్నెండు రోజులు గడిచిపోవటంతో ఆయన వెంటవెళ్ళిన ఆయన సైనికులు, మిత్రులు ఆవిషయం దేవకీ, వసుదేవులకు, రుక్మిణీ వగయిరాలకు తెలుపుతారు. వాళ్ళంతా ఆందోళనచెంది దుర్గాదేవిని పూజించారు భక్తిశ్రద్ధలతో.

క॥ దుర్గమమగు బిలమున. హరినిర్గతుడయి,
చేరవలయునేడని పౌరుల్
వర్గములై సేవించిరి, 'దుర్గన్' గృత
కుశలమార్గ౧దోషిత భర్గన్॥

క॥ డోలయితమానసులై, జాలింబడి
జనులు గొలువ 'జండిక' బలికెన్
బాలామణితో, మణితో హేలాగతివచ్చు
నంబుజేక్షణుడనుచున్॥

వారంతా స్థిమిత పడ్డారు "చండిక" మాటలు విని. ఈ లోగా శ్రీకృష్ణుడు జాంబవతీ సమేతుడై రానేవచ్చాడు అందరూ సంతోషించారు. సత్రాజిత్తుకు మణిని ఇచ్చేశాడు. సత్రాజిత్తు అట్లు కృష్ణునిపై అకారణ నిందమోపినందుకు ఆయనతో అకారణ వైరం ప్రాప్తించినందుకు చాలా బాధపడి పశ్చాత్తాపంతో

ఆ॥ మణియు గ్రూరమనిచ్చి మాధవు పదముల
బట్టుకొంటనేని బ్రతుకుఁగలదు॥
సంతసించునతడు నదుపాయమగుగాక,
సత్య మితరవృత్తి జక్కఁబడదు

అని ఆలోచిస్తాడు చక్కగా బహుభార్యాత్వం సర్వసాధారణమైన ఆ కాలంలో శ్రీకృష్ణునికి తన అపరాధానికి శిక్షగా కుమార్తెఅయిన "సత్యభామ"

నిచ్చి వివాహం చేశాడు సత్రాజిత్తు అటు రాజకీయంగా శ్రీకృష్ణునిలాంటి బల వంతునితో వైరం లేకుండా ఇటు తన కుమార్తెకు తగిన భర్తగా అయనను అల్లునిగా చేసుకోవటంలోని గొప్పదనం ఆలోచించుకున్న సత్రాజిత్తు. శ్రీకృష్ణునికే మరల స్యమంతకమణిని కూడా ఇవ్వగా, గంభీరంగా తిరస్క రించాడు శ్రీకృష్ణుడు

క॥ 'మణి ఇచ్చినాడు. వాసరమణినీకును,
మాకు గలవు మణులు; కుమారీ
మణి చాలునంచు, కృష్ణుడు మణి సత్రా
జిత్తునకు, మరలగనిచ్చెన్!

కానీ స్యమంతకమణి, తర్వాత మరల శ్రీకృష్ణునివద్దకే వచ్చింది. మరో భయంకర సంఘటన ద్వారా!

కుంతీదేవి, పాండవులు లక్క ఇంట దగ్ధులైనారనే వార్త తెలుస్తుంది. శ్రీకృష్ణునికి వారు దగ్ధంకాలేదనీ, ఉపాయంతరంతో, కుశలంగా హిడింబ వనం చేరుకుని ప్రచ్ఛన్నంగా జీవిస్తున్నారని తెలిసివుండి కూడా! సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు బలరామ సహితుడై హస్తినాపురికివెళ్ళి, అక్కడ పాండవమిత్రులు శ్రీహరి భక్తులుఅయిన విదుర, ద్రోణ, భీష్మ, కృప, గాంధారీ ద్రోణాదులను ఊరడించి, కొద్దికాలం అక్కడ వుంటాడు

ద్వారకలో శతధన్వుడనే రాజకుటుంబీకుడున్నాడు లోగా సత్రాజిత్తు సత్యభామను అతనికిచ్చి వివాహంచేద్దామనుకుని మాటచెప్పి వున్నాడు. కానీ తర్వాత సత్రాజిత్తు, శ్రీకృష్ణునితో వైరానికి వెరచి, శ్రీకృష్ణునికే సత్యభామ నిచ్చి వివాహం చేశాడు. అక్రూరుడు శ్రీకృష్ణభక్తుడే అయినప్పటికీ ఒక్కో సారి భక్తులలో కూడా ఎలాంటి క్రూరత్వం ప్రలోభంవస్తాయో తాత్కాలికంగా అవి వారి నెలా లొంగతీసుకుంటాయో, క్రూరకార్యాలకు ప్రోత్సహిస్తాయో, తెలుపుతుంది స్యమంతకమణి కథ అక్రూరుడు, కృతవర్మ ఇద్దరూ, శత ధన్వుని రెచ్చగొడతాడు మాటలతో, "సత్రాజిత్తు సత్యభామను నీకిస్తానని మాట తప్పడమేగాక, శ్రీకృష్ణునికిచ్చి వివాహంచేసి, ఆమణిని కూడా అయనకే

ఇవ్వబోతున్నాడు! కనీసం ఆ మహాద్భుత మణినైనా, సత్రాజిత్తు నుండి సంపాదించు, సామదాన భేధాలతో" అని ప్రోత్సహిస్తారు. శతధన్వుడు అమణి ప్రలోభం, సత్యభామ తనకు దక్కలేదన్న క్రోధంతో నిద్రిస్తున్న సత్రాజిత్తును క్రూరంగా చంపి, మణిలాక్కుని పారిపోతాడు!

తండ్రి దారుణంగా హత్యచేయబడటంతో సత్యభామ విలపించి తండ్రి కళేబరాన్ని "తైలద్రోణి" (ఆనాడు శవాలు చెడిపోకుండా వుంచే ప్రక్రియ!) లో పెట్టించి, హస్తినాపురికి బయల్దేరి వెళ్ళి, శ్రీకృష్ణునికి తండ్రి మరణవార్త మణి అపహరణవార్త తెలిపి విలపిస్తుంది శ్రీకృష్ణ బలరాములిద్దరూ ఆమెను వూరడించి, ద్వారకకు వస్తారామెను వెంటబెట్టుకుని శతధన్వుడు తనని చంపుతాడని భయపడి, కృతవర్మ ఇంటికివెళతాడు. తనకు సాయంరమ్మని కానీ కృతవర్మ "శ్రీకృష్ణశౌర్య పరాక్రమాలకు ఎదురునిల్వగల వాడెవ్వడు?" అంటూ తాను సాయంరానని చెబుతాడు. ఆ క్రూరినింటికి వెళతాడు శత ధన్వుడు. అక్రూరుడు కూడా శ్రీకృష్ణుని స్తోత్రంచేసి, ఆయన "విశ్వ విభుడు ఆయనతో వైరంనాకొద్దు!" అంటాడు శతధన్వుడు చేసేదిలేక, మణిని అక్రూనివద్ద దాచిపెట్టి, మిథిలానగరం వేపు పారిపోతాడు నిజానికి కూడా కృతవర్మ, అక్రూరులు శతధన్వునికి మణిని లాక్కురమ్మని ప్రోత్సహించారే తప్ప, సత్రాజిత్తువాతడు చంపి, పీకలమీదకు తెచ్చుకుంటాడని వూహించ లేదు. సలహా ఇవ్వలేదు తీరా పథకం ఎదురు తిరిగేసరికి, ఇద్దరూ రంగం లోనుంచి తప్పుకున్నారు. ఈనాడు అన్ని రంగాలలో వున్నారు ఇలాంటి సలహాదారులు ఆ తర్వాత తమది కాదని తప్పుకుపోయే వారూను!

పారిపోతున్న శతధన్వుని రథాలమీద వెంబడించి రథందిగి వాడు ప్రాణభయంతో పరుగెడుతున్నా! వెన్నంటి, శ్రీకృష్ణుడాతనిని క్రూరంగా చంపి వేస్తాడు. అతని వస్త్రాలలో "మణి" కనిపించదు. ఎలాగూ మిథిలానగర దాపులకు వచ్చాంగనుక అక్కడి మిథిలాధిపతి జనక పీఠాధిపతి అయిన జనకుని కలుసుకుని వస్తానని బలరాముడు వెళ్ళగా శ్రీకృష్ణుడు ద్వారకకు చేరుతాడు.

(మిథిలలో జనకుని వద్ద బలరాముడు అతిథిగా వున్నప్పుడే-దుర్యోధనుడు అక్కడికివచ్చి బలరామునివద్ద గదాయుద్ధం" అభ్యసించి, అందులో నైపుణ్యం సాధిస్తాడు)

శ్రీకృష్ణుడు సత్యభామకు శతధన్వుని మరణం, మణి లేకపోవటం చెప్పి వూలడిస్తాడు సత్యభామచేత ఆమె అక్క చెల్లెళ్ళు కలసి (సత్రాజిత్తుకు కొడుకులు లేరు) సత్రాజిత్తు కర్మ క్రతువులు పూర్తిచేయిస్తాడు శ్రీకృష్ణుడు ఈలోగా శతధన్వుని మరణవార్తవిని అక్రూరుడు, కృతవర్మలు, తమనీ శ్రీకృష్ణుడు చంపుతాడని భయపడి దూరదేశాలకు పారిపోతారు. అక్రూరునిలాంటి మౌనభక్తుడు తపస్వి, వెళ్ళిపోవడంతో, ద్వారకలో వర్షాలు కురవవు. వందవృద్ధులు అక్రూరుని మరల ద్వారకకు సగౌరవంగా ఆహ్వానించమని శ్రీకృష్ణునితో చెబుతారు. శ్రీకృష్ణుడు అక్రూరుని పిలిపించి సాదరంగా గౌరవించి (శతధన్వుడు మణి ఈతని వద్ద దాచివుంటాడని వూహించి) "శతధన్వుడు పారిపోయేముందు నీ వద్ద మణి దాచాడని నాకు తెలుసు. సత్రాజిత్తుకు కుమార్తెలు తప్ప, కొడుకులులేరు. సత్రాజిత్తు మరణించాడు గనుక ఆతని సంపద ఋణాలు అన్నీ ఆయన కుమార్తెలు విభజించుకోవాలి ధర్మంగా, కాబట్టి ఆ మణిని నీవుఇస్తే వారు వాటాల ప్రకారం తండ్రి సంపద విభజించుకుంటారు. అని చాలా లౌక్యంగానూ అక్రూరుడు బాధపడకుండానూ, బయపడకుండాను, మణి బయటపడే విధంగానూ మృదు వచనాలతో చెబుతాడు అదీ రాజకీయచతురత,సమర్థత భక్తజన పక్షపాతం. భక్తుని ఒకానొక తాత్కాలిక బలహీనతను భగవంతుడు కన్న తల్లిలా కప్పిపుచ్చి కాపాడేతీరు!

అక్రూరుడు శ్రీకృష్ణునికి మ్రొక్కి, తన వస్త్రాలలోనే దాచివుంచిన మణిని సమర్పించాడు. అంతటితో తాత్కాలికంగా చోటుచేసుకున్న ప్రలోభం శ్రీకృష్ణుని మీద తాత్కాలిక కోపం మటుమాయమైపోయాయి. ఆ తర్వాత అక్రూరుడు శ్రీకృష్ణభక్తి విషయంలో మరి చలించలేదు! శేషజీవితమంతా శ్రీకృష్ణ భక్తిలో, ధ్యానంలో ఆయన ఆజ్ఞాపాలనలో ఆయన బోధలు వినటంలోగడిపి పునీతుడైపోయాడు భక్తునిగా. శ్రీకృష్ణుడు సత్రాజిత్తు బంధువు

లందరూ మణిని చూచేల అమర్చి, ఆ తర్వాత అక్రూరునే తీసుకోమని కోరాడు ఆ మణిని!

కానీ అక్రూరుడి తనలోని మోహం వదావంచలేకోగా, సత్యభామ కిచ్చి, తనలోని ప్రలోభాన్ని వదిలించుకున్నాడు ఆ విధంగా.

ఈ స్యమంతకమణి, జాంబవతీ పరిణయం సత్యభామా పరిణయ కథలను, విఘ్నేశ్వర పూజ సందర్భంగా వినాయక చవితినాడు, భక్తిగా పారాయణం చేస్తారు. భక్తులందరూ! అలాచేస్తే తమకు చవితి చంద్రుని చూడటం వలన (పార్వతీదేవి శాపం వలన) కలిగే అపనిందలు తప్పి పోతాయనే ప్రగాఢ విశ్వాసం వుంది. అలాగే "స్యమంతకమణి" ఇందరి హత్యలకూ, సత్యభామా పరిణయానికీ దారితీయటమేగాక, అక్రూరునిలాటి అకలంక భక్తునిలో సైతం ప్రలోభాన్ని రేకెత్తించింది. ఆ శ్యమంతకమణి ఇచ్చే బంగారం, ఐశ్వర్య గర్వంతోనే సత్యభామ, శ్రీకృష్ణుని తులాభారానికి అంగీకరించిందనే ఒకానొక ఊహాజనిత కథ అందంగా రూపుదిద్దుకుని, "శ్రీకృష్ణ తులాభారం" నాటకాలుగా. వీధి భాగవతాలుగా, హరి కథలుగా, యక్షగానాలుగా, సినిమాలుగా అనన్య సామాన్య ప్రచారంలోకి వచ్చింది. సత్యభామ జడ సత్యభామ అతిశయనం, సత్యభామ ప్రేమ విరహం వగై రాలన్నీ "భామా కలాపం"గా కూచిపూడి నృత్య ప్రాణంగా రూపు సంతరించు కోగా ముక్కు తిమ్మన్న "పారిజాతాపహరణం"లో సత్యభామ శ్రీకృష్ణుని కాలితో తన్నటం అన్నది ఒకానొక అపురూప ఖండకావ్యం గౌరవం సంతరించుకున్నది.

చాలా హిందూ కుటుంబాలలో "స్యమంతకమణి" అనే పేరుగల స్త్రీ లెందరో వున్నారు. ఈనాడూ! ఈనాటి "కోహినూర్ వజ్రం" కళ్యాణకుమారి ముక్కెరలోని వజ్రంలానే— ఆనాడు ఆ "స్యమంతకమణి" ముల్లోకాలలోనూ ప్రసిద్ధి చెందినది ప్రణయాలకూ, ప్రలోభాలకూ, హత్యలకూ కూడా దారి తీయించినదా మణి! సత్యభామ కొక ప్రత్యేక స్థానం కల్పించినది కూడా ఈ స్యమంతకమణే! అవునా!



# శ్రీకృష్ణుని అష్టభార్యలు

## నరకాసుర వధ

ఒకమారు శ్రీకృష్ణుడు పాండవులుంటున్న ఇంద్రప్రస్థ పురానికి, సాత్యకివగైరా తన సన్నిహితులతో వెళతాడు కుంతీదేవి ప్రార్థనతో శ్రీకృష్ణుడు ధర్మాచరణ సంపన్నులైన పాండవుల పక్షం వహించాడు ఆసరికే అటు భగవంతునిగానూ, ఇటు రాజకీయ గురువు, శ్రేయోభిలాషిగానూవారి సర్వస్వం శ్రీకృష్ణుడే అయ్యాడు. శ్రీకృష్ణుడూ అర్జునుడు నరనారాయణాంశ లుగా బావమరదులు, ప్రాణమిత్రులుకూడా అయ్యారు. ఆసరికి పాంచాలి (ద్రౌపది) కొత్త పెళ్ళికూతురు. ఆమె తన అన్నగారి వరసయిన శ్రీకృష్ణుని పాదాభివందనం చేసింది అంతేకాదు అపరిమితమైన అరణ్య అజ్ఞాతవాసాల్లాటి కష్టాలలో, కురుక్షేత్ర సంగ్రామంలోనూ ద్రౌపది శ్రీకృష్ణుని తన అన్నగానూ, భగవంతునిగానూ భావించి మ్రొక్కింది. ద్రౌపది వస్త్రాపహరణ సన్ని వేశంలో ఆమెకు శ్రీకృష్ణుడు తప్ప మరో భగవంతుని శరణాగతి అంటూ స్ఫు రించలేదు మరి!

కుంతీదేవి మేనల్లుని స్తోత్రచేసింది అర్జునుడు, శ్రీకృష్ణుడు సరదాగా యమునానదీ తీరానికి వెళ్ళారు రథంమీద. అక్కడ యమునానదిలో జల క్రీడలాడుతున్న మహాద్భుత సౌందర్య రాశియైన "కాళింది"ని చూచి ఆమె ఎవరో తెలుసుకునిరమ్మని అర్జునుని పంపిస్తాడు ఆ జలకన్యను వివరాలడుగు తాడు అర్జునుడు. అందుకామె

> మ॥ నరవీరోత్తమ యేను సూర్యునిసుతన్ నా పేరు కాళింది! భా
> స్కర సంకల్పిత గేహమందు, నదిలో గుంజాప్తు విష్ణుం! బ్రభున్
> వరుగాగోరి, తపంబుసేయుదు! నొరున్ వాంఛింప!గృష్ణుండు, వ
> న్నరతిన్‌వచ్చి వరించు నంచుబలికెన్ నాతండ్రి, నాతోడుతన్!

అని చెబుతుంది. శ్రీకృష్ణుడామెను తన రథంలో కూర్చోపెట్టుక అర్జు మునితోబాటు మరల ఇంద్రప్రస్థ పురానికి వస్తాడు. అక్కడామెనువుంచి దేవేం ద్రుని "ఖాండవ వనం" అనే వనంలోని వనమూలికలతోగానీ తన ఉదరబాధ

తగ్గదని మొరపెట్టుకున్న అగ్నిదేవుని కోర్కె తీర్చేందుకు శ్రీకృష్ణార్జునులు ఖాండవవన దహనం చేయిస్తారు అగ్నితో. దేవేంద్రుని వర్షంనుంచి కాపాడ తాడు తన శరపరంపర విద్యతో అర్జునుడు అగ్నిని, అలాగే ఆ అగ్నిశిఖలో దగ్ధంకాకుండా "మయుని" రక్షిస్తారు శ్రీకృష్ణార్జునులు అగ్నిదేవుడు సంతో షించి అర్జునునికి అక్షయతూణీరాలుగల "గాండీవం" అనే ధనస్సు, దివ్య రథం తెల్లని అశ్వాలు అభేద్యాకవచం ప్రసాదిస్తాడు. ప్రాణాపాయం తప్పించు కున్న మయునిచేత అత్యద్భుతమైన "మయసభ" నిర్మింపజేస్తాడు పాండ వుల కోసం శ్రీకృష్ణుడు. ఈ మయసభలోనే దుర్యోధనుడు జలస్థల నిర్ణయం చేయలేక పరిహాస పాత్రుడై ద్రౌపది పరిహాసానికి గురయి ప్రతీకారంతో ద్రౌపదీ వస్త్రాపహరణం, మాయాద్యూతం, పాండ వుల అరణ్య అజ్ఞాత వాసాలకు గురిచేస్తాడు. ఆ రంగం అంతా కురుక్షేత్ర యుద్ధానికి దారితీస్తుంది. కాళిందితో వివాహం జరుగుతుందాయనకు అయితే అర్జునుడు సాధించిన ప్రతి మహాత్కార్యంలోనూ శ్రీకృష్ణుని అండ, ఆదేశము ఆజ్ఞ, ఆశీస్సువున్నాయి అణువణువునా! పాండవుల పక్షానసాక్షాత్తు శ్రీమన్నా రాయణుడే శ్రీకృష్ణుడిగా నిలిచి ప్రత్యణువులోను వారిలోనుంటి, వారిచేత అసా ధ్యాలు సుసాధ్యాలుగా చేయించాడు. ఆ రహస్యం భీష్మ, ద్రోణ, కృప వగయిరా కురువృద్ధులందరికీ తెలుసు. కుంతికి తెలుసు ద్రౌపదికి తెలుసు. ధర్మరాజుకు తెలుసు స్నేహం, బంధుత్వ చనువులో గుర్తించనిది అర్జునుడు, భీముడు మాత్రమే! ఎప్పుడోతప్ప వారిద్దరికీ శ్రీకృష్ణుడు దైవం అనిపించలేదు గానీ. బావమరదిచనువుతోనే ధన్యులు, పునీతులు అయిపోయారు.

శ్రీకృష్ణుడు మరో మేనత్త రాజాధిదేవి ఆ రాజాధిదేవి కొడుకులు "విందాను విందులు" అనే వాళ్ళిద్దరూ (అవంతీ దేశాధీశులు) తమ చెల్లెలయిన 'మిత్రవింద'ను దుర్యోధన పక్షులై స్వయంవరం చాటించారు. శ్రీకృష్ణుడు స్వయంవరంలో మిత్రవిందను రుక్మిణీదేవిలానే స్వయంవరంలోనుంచి వీర త్వంతో చేకొనివచ్చి అడ్డువచ్చిన రాజులందరినీ ఓడించి తన బల పౌరష ప్రద ర్శన మరో మారు ప్రదర్శించాడు. కోసలదేశరాజయిన "నాగ్నజిత్తు" అనే రాజకుమార్తె "నాగ్నజితి" ఆమె వీర్యశుల్క. వెండికొండల్లాటి ఏడు మదిం

చిన ఆబోతులను ఒక్కమారు పట్టి బంధించినవానికే నాగ్నజితినిచ్చి వివాహం చేస్తానని నాగ్నజిత్తు ప్రకటించాడు. గోవులను కాయటంలో గోవుల వృషభాలను మచ్చికచేసుకోవటంలో, వృషభాసురుని వధించటంలో బాల్యం లోనే చక్కనా తెలిసివున్న శ్రీకృష్ణుడు సకలరాజులు నిశ్చేష్టులై చూస్తుండగా, ఏడు వృషభాలను తన బల పరాక్రమాలతో లొంగదీసి, కట్టివేసి, నాగ్నజితిని వివాహమాడాడు, బాధపడి అసూయచెందిన రాజులు శ్రీకృష్ణుని మీదకు యుద్ధానికిరాగా వారందరినీ యుద్ధంలో నిర్జించాడు.

శ్రుతకీర్తి అనేరాజు కూతురు తనకు మరదలి వరసఅయ్యే "శ్రుతకీర్తి" అనే కన్యను వివాహమాడాడు శ్రీకృష్ణుడు. మరల కైకేయరాజ పుత్రి అయిన "భద్ర" అనే కన్యను వివాహమాడాడు.! మద్రరాజతనయ అయిన "లక్షణ" అనే కన్యకను మిత్ర విందను తెచ్చినట్లే స్వయంవరంలో రాజు లందరినీ ఓడించి తెచ్చి వివాహమాడాడు శ్రీకృష్ణుడు.

ఇట్లా ఆయన సాంప్రదాయానుసారం శౌర్య ప్రదర్శనతోను పెళ్లాడిన భార్యలు రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ అనే వారు ముఖ్యులు. వీరే శ్రీకృష్ణుని అష్ట భార్యలుగా ప్రఖ్యాతిచెందారు.

ఇక వీరుగాక నరకాసురుని సంహరించి "రోహిణి" మొదలయిన పదహారు వేల మంది కన్యలను వివాహమాడాడు శ్రీకృష్ణుడు.

యజ్ఞవరాహరూపంలో భూదేవిని ఉద్ధరిస్తున్న సమయంలో శ్రీమహా విష్ణువు (యజ్ఞవరాహం) స్వేదబిందువు ధరమీద చిందిపడి ఉద్భవించిన వాడే నరకుడు! భూదేవి అతని (తల్లి) - తండ్రి యజ్ఞ వరాహుడయిన శ్రీమహావిష్ణువు అయితే రాక్షసవధ (హిరణ్యాక్షవధ) సమయంలో జన్మించి నరకుడు జన్మ రీత్యా విష్ణు అంశసంభూతుడే అయినా ప్రవృత్తి రీత్యా రాక్షసుడు కంసునికి స్నేహితుడు.

దేవేంద్రుని ఓడించి నరకుడు అదితియొక్క మహా మహిమాన్వితము

లైన కర్ణ కుండలాలను వరుణుని ఛత్రమును, "మణి పర్వతం" అనే అమరాద్రి స్థానమునులాక్కుంటాడు. ఇంద్రుడు చేసేదిలేక శ్రీకృష్ణుని వద్దకు వచ్చి మొరపెట్టు కుంటాడు.

ఇక శ్రీకృష్ణుడు నరకాసురుని మీదకు గరుడారూఢుడై యుద్ధానికి బయల్దేరుతాడు. ఆ సమయంలో శ్రీకృష్ణుని అష్టభార్యలలో శ్రీకృష్ణునికి ఎక్కువగా ఇష్టురాలూ, చేరువగా వచ్చినదీ అయిన సత్యభామ తానూ యుద్ధానికివస్తానని పట్టుబడుతుంది. శ్రీకృష్ణుడామెకు నచ్చచెబుతాడు. రణభూమి, అంతఃపురంకాదనీ, అక్కడ వీణానాదాలు, చిలక పలుకులుగాక శస్త్రాస్త్రాల పిడుగులు వర్షిస్తుంటాయని. కానీ ఆమె తప్పక వస్తానని పట్టు బట్టడంతోనే ఆయన చూపిన అనేకానేక లీలలలానే ఇదీ ఓలీలగా సత్యభామకు కాస్తంత అతిశయం, గర్వం కలిగేలా సరదాగా పిల్చుక వెళతాడు.

ప్రాగ్జోతిష పురం నరకుని రాజధాని, దుర్గమ దుర్గాప్రాకారాలు, సముద్ర జల ప్రాకారాలు దానికి రక్షా కవచాలు!

మురాసురుడనే ("ముర అనే రాక్షసి కొడుకు) పంచ శిరస్సుల రాక్ష సుడా జల దుర్గంలో శ్రీకృష్ణుని ఎదుర్కొంటాడు. శ్రీకృష్ణుడు అవక్ర పరా క్రమంతో మురాసురుని సంహరించి "మురారి"గా బిరుదు పొందాడు. మురా సురుని కుమారులు తామ్రుడు, అంతరిక్షుడు, శ్రవణుడు, విభావసుడు, వసుడు, నభస్వంతుడు, నరుడు అనే ఏడుగురు శ్రీకృష్ణుని మీదకు యుద్ధానికి వచ్చి, ఆయన చేతిలో మరణిస్తారు.

ఈ విషయం తెలుసుకున్న నరకాసురుడు వరకుండలాలు ధరించి, యుద్ధానికి బయల్దేరి వస్తాడు! ఖగేంద్రవాహారూఢులైన సత్యభామా కృష్ణు లాతనికి ఆకాశంలోని మెరుపుతీగె, మేఘంలా కనిపిస్తారు. సత్యభామ తాను యుద్ధం చేస్తానంటుంది. నరకునితో! సత్యభామ నరకాసురునితో యుద్ధం చేయటమనే ఘట్టం ప్రఖ్యాతమైనది. పోతన మహాకవి శ్రీమాలం కారాలు, శబ్ద, పద, ప్రాసప్రయోగాలు చేస్తూ, అక్షర వాద్యాలు సృష్టించిన ఘట్టం ఇది భాగవతంలో.

శా॥ వేణిం జొల్లెము వెట్టి, సంఘటిత నీవీ బంధయై! భూషణ
శ్రేణిం దాల్చి, ముఖేందుమండల మరీచీజాలముల్ పర్వగా
బాణిం బయ్యెద జక్కగా దుఱిమి, శుంభద్వీర సంరంభయై
యేణీలోచన లేచి, నిల్చె, తన ప్రాణేశాగ్రభాగంబునన్!"

శ్రీకృష్ణుడు నవ్వి, తన చేతి విల్లామెకు అందించాడు. ఆ విల్లందుకొని, ఆ వింటితోబాటు భర్తృతేజో శౌర్య ప్రతాపాల ప్రోత్సాహాన్ని అందుకుని, దైత్యందనలు మూర్ఛిల్లేట్లుగా నారి సారించింది సత్యభామ.

మ॥ "అలినీలాలక చూడనొప్పెసగె! ప్రత్యాలీఢ పాదంబుతో,
నలిక స్వేదవికీర్ణ కాలకలతో, నాకర్ణికానీత స
ల్లలిత, జ్యా, నఖపుంఖ దీధితులతో, లక్ష్యావలోకంబుతో
వలయాకార ధనుర్విముక్త విశిఖ ప్రాతాహతారాతియై!"

ఆ రూపంలోవుండే సత్యభామ రూపం యుగాలపర్యంతం వీరవనితల చిత్రీకరణకు చిరంజీవినిగా చేశాడు పోతన మహాకవి. భర్తృ పరిపూర్ణప్రేమ, భర్తృ వాత్సల్యం, భర్త ప్రోత్సాహం, భర్త సాన్నిధ్యం, భర్తలో సామర్థ్యం వున్న-పొందినస్త్రీ చేయులేని సాహసంగానీ, కళగానీ ఏముంది ప్రపంచంలో? అదే ఋజువు చేస్తుంది సత్యభామ పాత్ర, సత్యభామ యుద్ధం, సత్యభామ శౌర్యసాహసాలు! ఇక భర్త అయిన శ్రీకృష్ణునికీ, శత్రువైన నరకునికి ఆమె ఆ రూపం క్రమాలంకార పద్ధతిలో మహాద్భుతంగానూ. మహా రౌద్రంగానూ కనిపిస్తోంది ఒకే నాణానికిగల బొమ్మ బొరుసులా!

సీ॥ రాకేందు బింబమై, రవిబింబమై యొప్పు,
నీరజాక్షుని నెమ్మొగంబు
కందర్ప కేతువై, ఘన ధూమకేతువై
యలరు పూబోడి చేలాంచలంబు!
భావజు పరిధియై, ప్రళయార్కు
పరిధియై, మెఱయు నాకృష్టమై మేలిచాప
మమృత ప్రవాహమై, యనలసందోహమై,
తనరారు నింతి సందర్శనంబు.

ఆ॥ హర్షదాయియై, మహా రోషదాయియై
పరగు ముద్దరాలి బాణవృష్టి,
హరికి, నరికి (అరికి) జూడనందంద శృంగార
వీరరసము లోలివి స్తరిల్ల!

చివరగా శ్రీకృష్ణుడు ఆమెను సంతోషపరచి, సన్మానించి, తన సుద ర్శన చక్రంతో నరకుని తల తెగవేస్తాడు భూదేవి ప్రత్యక్షమై, జాంబూనది లోని రత్నాలతో పొదిగిన కుండలాలు, "వైజయంతి" అనే వనమాల వరుణ దత్తమైన తెల్లని ఛత్రం! మరో మహారత్నం శ్రీకృష్ణునికి సమర్పించి. ఆయనను స్తోత్రం చేస్తుంది. అయితే భూదేవి స్వయంగా తన మనవడి వరసైన (నరకుడు భూదేవి బిడ్డ కాబట్టి) అయిన (నరకుని కొడుకైన "భగదత్తుడు" అనేవాణ్ణి, తెచ్చి- వీడు నరకుని కొడుకు. నీపట్ల భయభక్తులు కలిగివున్న వాడు ఆర్తుడై, ఆశ్రయహితుడై పితృహీనుడై వున్నాడు. దయతో వీడినికాపాడు" అని, వేడుకొంటుంది. శ్రీకృష్ణుడామె మాట మన్నించి ప్రాగ్జ్యోతిషపురానికి భగదత్తుని రాజుగా చేసి, నరకుడు ఆ నరికి చెఱబట్టివున్న పదహారు వేల మంది రాచకన్యలను చెఱవిడిపించి, వారంతా తనని కోరగా అందరినీ వివాహమాడి, ద్వారకకు చేరుస్తాడు. అందరితో అన్ని రూపాలతో విహరించి, ఆనందింపజేస్తాడు తర్వాత.

ఇక్కడ నరకునివేపునుంచి చూస్తే నరకుడు భూదేవి బిడ్డే! వాడంత మంది కన్యలను కేవలం వివాహేచ్ఛతో చెరపట్టి వుండడు. వాడు దేవి ఉపాసకుడు-వామాచార తంత్రం ఆచరించే రాక్షసుడు. వారందరినీ దేవికి బలికి ఇవ్వటానికి తద్వారా తాను భ్రమపడే క్షుద్రశక్త్యోపాసన త్రిభువన సామ్రాజ్యాధిపత్యం కోరుతాడు. శ్రీకృష్ణుడు వాడిని చంపి ఆ కన్యల చెరవిడి పించాడు. ఇదొక కథ ప్రచారంలో వుంది

ఇక శ్రీకృష్ణుడు-వారినలా వదిలిపెస్తే, అటువారి పుట్టినింటి పేపురానివ్వరు సంఘంలో గౌరవం వుండదు వారికి! వారి జీవితాలు వేశ్యల స్థాయికి దిగ జారిపోయేది. అంచేత శ్రీకృష్ణుడు వారి జీవితాలు అట్లా గాలికి

వదిలివేయబడకుండా, అపారమైన కరుణతో తానే "జారుడు" అనే అపనిందకు తనని తాను గురిచేసుకొని, ఆ స్త్రీలందరినీ వివాహమాడి, శ్రీకృష్ణ భార్యలుగా వారికి సంఘపరమైన గౌరవం, గుర్తింపు, రక్షణ కలుగజేశాడు ఇక శ్రీకృష్ణుడు వారందరి పాలిటి భగవంతుడు కూడా మరి!

అలాగే భాగవతంలో జరాసంధుడు కూడా కొన్ని వేల మంది రాజులను బంధించి వుంచుతాడు తన కోటలో! వాడూ శక్తి వామాచార తాంత్రిక పూజా నియమాలు కలవాడే! శ్రీకృష్ణుడు, భీముడు జరాసంధుని చంపాక, ఆ రాజులను చెర విడిపించే ఘట్టం ఒకటుంది భాగవతంలోనే!

అంచేతే నరకుని తల విష్ణుచక్రంతో తెగిపడే సందర్భంలో

శా॥ "ఇల్లాలం గిటియైన కాలమున, మున్నేనంచు ఘోషింతువో!"
తల్లీ! నిన్నుదలంచియైన, నిచటం దన్నుం గృపన్ వడే!
చెల్లంబో! తలద్రెంచెనంచు, "నిల"వాక్షేపించు చందంబునమున్,
ద్రెళ్ళెం జప్పుడుగాక, భూమిసుతు, డుద్దీప్తాహవక్షోణిపై!"

అనే రసవత్తరమైన పద్యంతో నరకుని మాతృ సంస్మరణ. భూదేవి వచ్చి శ్రీకృష్ణుని స్తోత్రం చేయటంలాటి సందర్భాలు సృష్టించాడేమో వ్యాస మహర్షి! వాటిని తేట తెనుగులో అందించాడు పోతన మహాకవి.

ద్వారకలో, పదహారు వేల మందికి గృహవసతి - గృహోపకరణాల వసతి, సర్వ సౌకర్యాలు కల్పించాడు శ్రీకృష్ణుడు.

పేరుకు "పట్టమహిషి" అయిన రుక్మిణికి ఏదో "అహంకారం" ఇంకా మిగిలివుందేమోనని ఒక రోజు పనిమాలి ఆమెను మాటలతో నొప్పించి, ఆమె వినమ్రంగా, మౌనంగా కన్నీళ్ళు పెట్టుకుంటే, మరల నవ్వి ఓదార్చి, ఆమె స్తోత్రం అందుకుంటాడు శ్రీకృష్ణుడు. తనంత తాను వలచి వచ్చిన రుక్మిణి మిగతా ఏడుగురు ప్రముఖ భార్యలతో, పదహారువేల మంది మిగతా

శ్రీకృష్ణ భార్యలతో - పర్దుకు పోయిందే తప్ప, ఏనాడూ సత్య భామలా ఏదీ కోరలేదు. రామాయణంలోని మానతపస్విని సుమిత్రలాటి పాత్ర రుక్మిణిదైతే, అతిశయానికి మారు రూపం సత్యభామ పాత్రగానిలచి పోయాయి చరిత్రలో శాశ్వతంగా! పెళ్ళికిముందు శ్రీకృష్ణుని ప్రేమించినస్త్రీ, రుక్మిణి అయితే, పెళ్ళితర్వాత శ్రీకృష్ణుని ప్రేమించి, ఆయనచేత ప్రేమింపబడి, తనదైన ఒకానొక ప్రత్యేక వ్యక్తిత్వాన్ని అజరామరంగా నిలుపుకున్నస్త్రీ సత్యభామ! ఆ ఇద్దరూ శ్రీకృష్ణుని సగుణ భక్తులే!



# ఉషా పరిణయం

శ్రీకృష్ణునికి రుక్మిణివలన ప్రద్యుమ్నుడు, చారుధేష్ణుడు, చారుదేషుడు సుచారువు, చారుగుప్తుడు, భద్రచారువు, చారుభద్రుడు, విచారువు, చారువు అనే పేర్లుగల పదిమంది పుత్రులు జన్మించారు. ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధుడు. ఈ ప్రద్యుమ్నుడే "శంబరాసురుని" వలన సముద్రంలో పార వేయించబడి, ఆ అసురునికే జాలరులవలన చేపకడుపులో దొరికి 'మాయావతి' చేత పెంచబడి ఆమెను పెండ్లాడినవాడు. ఈ ప్రద్యుమ్నుడే తన మేనమామ అయిన "రుక్మి" కూతురు "రుక్మవతి"కి స్వయంవరం ఏర్పాటుచేయగా, తండ్రి (శ్రీకృష్ణుడు)లానే ఆ స్వయంవరంచరానికి పిలవని పేరంటంగావెళ్ళి మిగిలిన రాజకుమారులందరినీ ఓడించి "రుక్మవతి"ని రథంలో కూర్చోబెట్టుక ద్వారకకువచ్చి అక్కడామెను వివాహమాడతాడు. అయితే ఎంతోకాలం శ్రీకృష్ణు మీద పగతో రగిలిపోయిన రుక్మి ఈలోగా శ్రీకృష్ణ బలశౌర్యాలు ఒంచిచూచి పున్నవాడవటం వలన తన కూతురు రుక్మవతి వివాహసందర్భంగా విడికి తలవంచి, చెల్లెలయిన రుక్మిణితో, బావ అయిన శ్రీకృష్ణునితో రాజీపడి, బంధుత్వం పునరుద్ధరించు కుంటాడు. అయితే తన మనుమరాలయిన "రుక్మలోచన"ను మరల "అనిరుద్ధుని"కి (ప్రద్యుమ్నుని కుమారుడు- రుక్మిణీ శ్రీకృష్ణుల మనుమడు) ఇచ్చి వివాహం చేయిస్తాడు కానైతే ఆ వివాహానంతరం రుక్మి స్నేహితులయిన కొందరు రాజులు "ఈ సమయంలో

నీవు లోగా అనుభవించిన అవమానం తాలూకు పగదీర్చుకో. బలరాముడు జూదప్రియుడు. అయితే జూదం ఆడటంలో ఆయనకు ఎక్కువ ప్రావీణ్యత లేదు నీవు ఆయనను జూదానికి పిలిచి, ఓడించి నీపగతీర్చుకో!" అని సలహా ఇస్తాడు. విధివంచితుడైన రుక్మి బలరాముని జూదానికి ఆహ్వానిస్తాడు. ఆటలో బలరాముడు ప్రతి పందెం ఓడిపోతుంటాడు. రుక్మి పళ్ళు ఇకిలించి నవ్వుతూ బలరాముని వెక్కిరిస్తుంటాడు చివరగా బలరాముడు ఒక "లక్ష" పణంగా ఒడ్డి ఆ ఆట తాను గెలుస్తాడు కానీ రుక్మి అన్యాయంగా ఆ గెలుపుకూడా తనదేనని బుకాయిస్తాడు. బలరాముడు ఆగ్రహోదగ్రుడయి మిగిలిన రాజులందరినీ నిజంగా గెలుపెవరిదో నిర్ణయించమని కోరుతాడు కాని రుక్మి పక్షపాతులయిన ఆ రాజులు మొహమాటంకొద్దీ బలరాముడు గెలిచాడని నిజం చెప్పక మౌనం వహిస్తారు. బలరాముడు పంచభూతాలను వేడుతాడు న్యాయం చెప్పమని. ఆకాశవాణి బలరాముడే ఆట గెలిచాడని పలుకుతుంది. అప్పుడయినా రుక్మి అంగీకరించడు. ఇక ఓర్చుకోలేని బలరాముడు తన హలాయుధం చేతబూని రుక్మి స్నేహితులయిన రాజులందరినీ చంపితనను వెక్కిరించిన రుక్మి పళ్ళు రాలగొట్టి భయంకరమైన తీరులో రుక్మిని చంపివేస్తాడు. బావమరిది మరణానికి పరోక్ష విధాత అయిన శ్రీకృష్ణుడు మౌనంవహిస్తాడు. రుక్మిణికూడా ఏమి అనదు. అట్లా ఒక శ్రీకృష్ణద్వేషి, అధర్మ వర్తనుడు, అహంకారి అయిన గర్వాంధుడు అవివేకి అయిన రాజు (రుక్మి) తన మరణంతానే కోరితెచ్చుకుంటాడు. అదీ భగవల్లీల అంటే!

ఇక రుక్మలోచనను పెళ్ళాడిన శ్రీకృష్ణుని మనవడు అనిరుద్ధుడు అపమాన సౌందర్యవంతుడు

ప్రహ్లాదుని మనుమడు బలిచక్రవర్తి. బలిచక్రవర్తికి నూరుగురు కుమారులు. వారిలో పెద్దవాడు "బాణుడు" అపరిమిత శైవభక్తుడు. బాణుడు తన సహస్రకరములు (వెయ్యి చేతులు) తో "ఆరజం" అనే వాయిద్యాన్ని శ్రుతిమధురంగా వాయించి, ఈశ్వరుని మెప్పిస్తాడు ఆయన తాండవనృత్య సందర్భంలో సంతోషించిన ఈశ్వరుని తనదయిన అనన్యభక్త్యావేశాలతో

అద్భుతంగా స్తోత్రంచేస్తాడు. మరల ఇక్కడ పోతనమహాకవి భక్త్యావేశ గంగాఝురి ఉరకలు వేసింది అక్షరరూపంలో బాణుని పాత్రలో.

ఉ॥ "శంకర! భక్తమానసవశంకర! దుష్టమదాసురేంద్రనా
శంకర! పాండునీలరుచి సంకరవర్ణ నిజాంగ! భోగిరా
ట్కంకణ! పార్వతీ హృదయ కైరవ! కైరవమిత్ర! యోగిహృ
త్పంకజ, పంకజాప్త! నిజతాండవ ఖేలన! భక్తపాలనా!"

అంటూ వరం కోరుకుంటాడు భోళాశంకరుడు తన సైజం అయిన భక్తవ శంకరతతో! బాణుడు, పార్వతీ పరమేశ్వరులను తన నివాసస్థానమైన "శోణపురం" కోట తలవాకిట కావలాదారులుగావుండి తనను రక్షిస్తుండమని అనుచితము, అహంకారపూరితము అయిన వరంకోరి "బాణాసురుని" అసురత్వం ఋజువుచేసుకుంటాడు తననితాను! ఇదే తామస, అహంకారపూరిత, అసుర లక్షణాలుగల భక్తునికీ, సాత్విక భక్తునికిగల తేడా! సాత్వికభక్తుడు, భగవంతునికి తాను దాసునిగావుండి, ఆయన కరుణలో పునీతుడై తరించాలని కోరుకుంటాడు రాజసభక్తుడు, భగవంతుడు తనకు ఎప్పుడూ అందుబాటులో వుండి, తన ఐహికవాంఛలన్నీ తీరుస్తుండాలనుకుంటాడు. కానీ తామస భక్తుడు, సర్వాంతర్యామి, సర్వాధికారి అయిన భగవంతుడిపై తానే అధికారం చెలాయించాలని కోరుకుంటాడు. అక్కడే వాడి పతనం ప్రారంభమౌతుంది ఎంత భక్తివున్నా! బాణుని విషయంలో అదే జరిగింది. భోళాశంకరుడు పార్వతీ సమేతుడై శోణపురం కోట గుమ్మంవద్ద కావలాదారుగా నిలిచిపోయాడు మరి ఈశ్వరుని ఈ భక్తపరాధీనత అని ఐలహాసతనుండి ఆయనని కాపాడి తిరిగి ఈశ్వర భక్తులందరికీ ఆనందం కలిగేలా ఆయనను కైలాసం చేర్చవలసిన బాధ్యత శ్రీమహావిష్ణువుదే. ఆ సమయం కోసం నిరీక్షిస్తున్నాడు. బాణుడికి అహంకారం పెరిగి ఒకరోజు కోటగుమ్మంవద్ద కాపలావున్న ఈశ్వరునివద్దకు వచ్చి తన సహస్రబాహువులు 'యుద్ధకాంక్ష'తో దురద పెడుతున్నాయనీ, తనతో యుద్ధంచేయగల వీరు లెవరూ ముల్లోకాలలోలేరు గనుక ఈశ్వరుడే తనతో యుద్ధంచేసి తన కోర్కె

తీర్చాలని చెబుతాడు. వాడి అహంకారం విధి ప్రేరితుడై పతనానికి అభిముఖంగా వున్న వాడి పుణ్యం గమనించిన ఈశ్వరుడు తన మనసులో రేగిన కోపాన్ని అణచుకొంటు "

క॥ "విను, మూఢహృదయ! నీకే తన
మెప్పౌ దకారణంబ, ధారుణిపై, గూ
లును, నపుడ నీ భుజావళి తునియగ!
నీయంతవానితో "నని" గల్గున్!"

అని శాపంలాటి వాక్కు పలుకుతాడు మూర్ఖుడైన బాణుడు తనకేతన పతనంకోసం నిరీక్షిస్తున్నాడు!

బాణుని కుమార్తె "ఉష" అసమాన సౌందర్యవతి. ఆమె ఒకరోజు స్వప్నంలో అసమాన సౌందర్యవంతుడయిన "అనిరుద్ధుని" చూచి మోహ పరవశ అవుతుంది! అయితే ఆ పురుషుడెవరో, ఆమెకు తెలియదు.

బాణుని మంత్రి అయిన "కుంభాండుని" కుమార్తె చిత్రరేఖ! ఉషకు ఈమె ఇష్టసఖి! చిత్రరేఖ అణిమాద్యష్టసిద్ధులు సాధించిన దేవీ ఉపాసకురాలు అద్భుత చిత్రలేఖన కళ గల యువతి, పురాణ స్త్రీలలో చిత్రలేఖలో ఒక ప్రత్యేకత, గగన గమనంలాటి యోగ విద్యాపాటవం గల స్త్రీలలో చిత్రలేఖ ఎన్నదగిన పాత్ర. ఈ పాత్ర పరిధి, ప్రయోజనమూ చిన్నదిగానే మలచబడింది భాగవతంలో. కానీ ఈమె అనన్య సామాన్య ప్రతిభ మాత్రం తరతరాల చిత్రకారులకూ, చిత్రకారిణులకూ, యోగసాధకులకూ మార్గదర్శకం, చిరంజీవత్వం కలిగించేది!

ఆమె తన స్నేహితురాలైన "ఉష" మనోవాంఛ గ్రహిస్తుంది. "నీ స్వప్నంలో కలిపించిన పురుషుడెవరో, నేను నర, సుర, కిన్నెర, యక్ష, కింపురుష, నాగ, ఖభశ్చర, సిద్ధ సాధ్యులలోగల అసమాన సుందరులందరి చిత్రపటాలు లిఖించి చూపుతాను-వారిలో గుర్తుపట్టు ఆ తర్వాత ఆ వ్యక్తిని నేను నీ వద్దకు నా యోగ విద్యామహిమతో తీసుకవస్తాను." అని చెబుతుంది.

అలాగే ఆ కాలంలో చిత్రలేఖనానికి ఉపయోగించే పంచవన్నెలు వేరు వేరు బంగారు, వెండి పాత్రలలో వుంచుకొని, వజ్రపు పొడితో మెరుగులు దిద్దిన అద్భుతమైన ధవళ పటము (వస్త్రము) మీద "తూలిక" (కుంచె) తో ముల్లో కాలలోని అందమైన పురుషుల రూపాలు, వారివారి వయో, నామ, గోత్రాలు చిత్రించి ఉష ముందుంచుతుందా చిత్రరేఖ! ఆమె చిత్రించిన పురుషులలో సర్వదేశాధీశులు, లోకాధీశులుతోపాటు, కాళిందుడు, నరకాసురుని కుమారుడైన భగదత్తుడు, కాశీరాజు స్నేహితుడైన పౌండ్రక వాసుదేవుడు, పాండవులు, దుర్యోధనుడు, శ్రీకృష్ణుడు, బలరాముడు, చివరగా శ్రీకృష్ణుని మనుమడైన "అనిరుద్ధుడు" వున్నారు. ఉష - అనిరుద్ధుని చిత్రం చూసి, ఇతడే తనకు స్వప్నంలో కనిపించిన వాడూ, తాను వర్ణించినవాడూ, తన మానసచోరుడూ అని చెబుతుంది! వెంటనే చిత్రరేఖ తన యోగ విద్యా మహిమతో ప్రచ్ఛన్నంగా ద్వారకకువెళ్ళి, రుక్మలోచనతో శయ్యాగృహంలో నిద్రిస్తున్న "అనిరుద్ధుని" అతని నిద్రకుభంగం వాటిల్లని అద్భుత రీతిలో, శోణపురంలోని ఉషా కన్యక అంతఃపురాలలోని ఒకానొక రహస్య సౌధం లోనికి చేర్చింది! ఉష, తన చెలి అద్భుత విద్యకు, సాహసానికి, కళకు ఆశ్చర్యపడి.

తే॥ "గలల దోచిన రూపు గ్రక్కున లిఖించు
వారు నౌనన్న బోట్లెచ్చు వారుగలరె!
నీటిలో జాడ బుట్టించు నేర్పు, నీక
కాక, గల్గునే! మూడు లోకములయందు!"

అని మెచ్చుకుంటుంది! కృతజ్ఞతలు చెప్పుకుంటుంది ఆ తర్వాత ఉషా; అనిరుద్ధుల ప్రణయ పర్యవసానంగా, ఉష గర్భిణీ అవుతుంది. ఆ విషయం తెలిసిన బాణుడు ఉష అంతఃపురానికి వచ్చి,అనిరుద్ధుని చూచి, క్రోధోద్రిక్తుడై యుద్ధకళలో ఆరితేరిన అనిరుద్ధుని అస్త్ర విద్యా ప్రదర్శన గ్రహించి, అతనిని నాగపాశబద్ధుని చేయిస్తాడు. ఆ సమయంలోనే బాణుని కేతనం దాపంతటదే కిందపడుతుంది. ద్వారకలో అనిరుద్ధుని జాడ తెలియక తల్లడిల్లిపోతున్న

శ్రీ కృ ష్ణు డు రుక్మిణి, ప్రద్యుమ్నుడు, రుక్మవతి వగైరాలకు, నారదుడే స్వయంగా వచ్చి, అనిరుద్ధుడు బాణుని అంతఃపురంలో బందీగావున్న విషయం. ఉషా అనిరుద్ధుల గాంధర్వ వివాహం వగైరా వివరాలన్నీ చెబుతాడు.

శ్రీకృష్ణుడు బాణునితో యుద్ధానికి, శైబ్య, సుగ్రీవ, మేఘపుష్పక, వలాహకములనే నాలుగు గుర్రాలు (రుక్మిణీ కల్యాణ ఘట్టంలో కూడా ఇవే గుర్రాలు!) పూన్చిన రథంలో - దారుకుడు రథసారథిగా బయల్దేరుతాడు. ప్రద్యుమ్నుడు, బలరాముడు సాత్యకి వగైరాలంతా పెద్ద సైన్యంతో అనుసరిస్తారాయనను!

బాణుని రక్షించే ప్రయత్నంలో ఈశ్వరుడు-శ్రీకృష్ణునితో యుద్ధానికి తలపడతాడు బాణుడు కూడా శ్రీకృష్ణుని పైకి యుద్ధానికి వస్తాడు శ్రీకృష్ణుని శస్త్రాస్త్రాల దాటికి నిర్వీర్యుడై పోతాడు. ఆ సమయంలో బాణుని తల్లిఅయిన "కోరట" తన బిడ్డను కాపాడుకొనే ఉపాయమేదీ తోచక, వివస్త్రగా, రణభూమికి వస్తుంది! ఆస్థితిలో ఆమెను చూచిన శ్రీ కృ ష్ణు డు యుద్ధం ఆపుతాడు బాణుడు లజ్జ! అవమానం, భీతిపొంది కోటలోనికి పారిపోతాడు. ఈశ్వరుడు కోపించి, శైవజ్వరాన్ని పంపిస్తాడు శ్రీకృష్ణుని పైకి. శ్రీకృష్ణుడు వైష్ణవ" రూప వైష్ణవ జ్వరాన్ని పంపిస్తాడు. వైష్ణవజ్వరదాటికి, శైవజ్వరం నిలువలేక, శ్రీకృష్ణుని శరణాగతి చెంది స్తుతిస్తుంది శ్రీకృష్ణుడు శైవజ్వరానికి అభయం ఇచ్చి, వైష్ణవిని ఉపసంహరిస్తాడు. మరల బాణుడు యుద్ధానికి వస్తాడు శ్రీకృష్ణుడాతని వెయ్యి బాహువులు ఖండించి, "ప్రహ్లాద వంశజులను చంపనని"లోగా తాను ఇచ్చిన వాగ్దానం మేరకు, వాడి అహంకారం హరిస్తాడు. యుద్ధటీట తీరిపోయిన బాణునికి జ్ఞానోదయం అయి, శ్రీకృష్ణుని స్తుతించి, ఈశ్వరునికి క్షమాపణలు చెప్పాకుని, ఉషా, అనిరుద్ధుల వివాహం శాస్త్రోక్తంగా జరిపి, వారిద్దరినీ సగౌరవంగా ద్వారకకు పంపిస్తాడు.

ఈ ఉషా పరిణయగాథ భాగవతంలో చిన్నదిగానే వున్నా, ఇది బహుళ ప్రచారం పొంది, కూచిపూడి, యక్షగాన, వీధి భాగవత, స్టేజినాటకాలు,

సినిమాలుగా అనన్య సామాన్య ప్రచారంపొందిన పౌరాణిక గాథలలో ఒకటిగా నిలిచిపోయింది ఈనాటికీ!

తన వివాహ సమయంలో, శ్రీ కృష్ణుని కి సాయంగా నిలిచిన బల రాముడు, స్వయంగా తన అన్నను (రుక్మిని) చంపిన సమయంలో ఆనాటి బలరాముని సాయం తలచి, తన అన్న అహంకారం గుర్తించి, మౌనంగా వుండిపోయిన మహాసాధ్వి రుక్మిణి! అలాగే తనంతతానుగా వలచి ఆత్మార్పణ చేసుకున్న భర్త. అష్ట భార్యలతో, పదహారు వేలమంది భార్యలతో తన ప్రేమను పంచుకోవాలని పరోక్షంగా సూచించినా, పెదవి విప్పక, మౌనంగా సర్దుకుపోయిన మహా ప్రతివ్రత, భక్తురాలు రుక్మిణి!

కలలో కనిపించిన శ్రీకృష్ణ మనుమడైన అనిరుద్ధుని, అతడు వివాహితుడని తెలిసీ, ఆరాధించి- ఆత్మార్పణ చేసుకొని తామస భక్తుడైన తండ్రి అహంకారాన్ని పరోక్షంగా హరించి, వైకుంఠ దామం అయిన ద్వారకకు, భర్తతో తరలి వెళ్ళిన "ఉషాదేవి" మరో ప్రతివ్రత! భక్తురాలు ఒక పత్నాకారానికి తన యోగవిద్యను చిత్రకళను ఉపయోగించిన భక్తురాలు చిత్రరేఖ! ఇవి భాగవతంలోని కొన్ని మహోన్నత పాత్రలు మాత్రమే! ఈ వివిధ భక్తుల చరిత్ర చిత్రణమే భాగవతం!



## దుష్ట శిక్షణ! శిష్ట రక్షణ!
## నిర్మోహ భక్తుడు - కుచేలుడు

"ద్వారక"లో శ్రీకృష్ణుని సంతతి తామరతంపరగా పెరిగిపోయింది! రుక్మిణి కి పది మంది పుత్రులు! అట్లాగే మిగతా సత్యభామ, జాంబవతి, నాగ్నజితి, మిత్రవింద, భద్ర, లక్షణ (మాద్రి) కాళింది, లకు కూడా పదేసి మంది చొప్పున పుత్రులు కలిగారు! ఆ లెక్కన శ్రీకృష్ణ వంశావళే (లెక్కకు

వచ్చిన భార్యలకు కలిగిన సంతానంమాత్రమే సుమా! పదహారు వేలా ఎనబై మంది అయితే ఇక లెక్కలోకి రాని స్త్రీల ద్వారా కలిగిన సంతానం ఎంతో! కుబ్జకు పుట్టిన "ఉపశ్లోకుడు" లాంటివారు) ఎందరో ఎవరికీ తెలీదు! అలాగే బలరామ, సాత్యకి వగైరా యదు ముఖ్యులు, శ్రీకృష్ణుని స్నేహితులు, శ్రీకృష్ణుని మంత్రులు, సేనా నాయకులు, రాజబంధువులు, సైన్యాధికారులు, సేనలు వగైరాల సంతానం లెక్కించటానికే వీలుకాదు. శ్రీకృష్ణుని పుత్రులు, పౌత్రులు వారి వారి బిడ్డలు ఇలా కేవలం ఆ రాజకుటుంబంలోని బిడ్డలలెక్క తేలదు అందుకే పోతన ఒక చిన్న పద్యంలో చక్కగా చెప్పాడు హాస్యమూ, అద్భుతమూ కలిగించేలా!

తే॥ అటు యదువృష్టి భోజాంధకాది వివిధ
నామధేయాంతరముల నెన్నంగ, నూట
యొక్కటై, చాలవర్ధిల్లె నక్కులంబు
నృపకుమారుల జదివించు, నేర్పుగలుగు,

తే॥ గురు జనంబులు, విను మూడుకోట్ల మీద
నెనుబదివేలపై, నెవగ నూర్గు
రన్న, దద్బాలకావళి నెన్నదరమే!
శూలికైనను, దామర చూలికైన!

అదీ శ్రీకృష్ణుని రాజ్యస్థాపన అనంతరం యదువృష్టి భోజ అంధక వగైరా వంశాల వారంతా, కంసుని భయంతో వివిధ దేశాలలో తలదాచు కుంటున్న వారినంతా, పిలిపించి, వారివారి స్థానాలు. అంతస్తు, అస్తులు- సక్రమంగా కాపాడాడు. వారందరితో వియ్యాలు, నెయ్యాలు, జరిపాడు. రాజ వంశస్తుల పిల్లలకు విద్యనేర్పే గురువుల సంఖ్య మూడుకోట్లు, ఎనబై వేల నూరు (మూడుకోట్లు, 80 వేలు, 100!) అయితే, ఇక విద్యార్థుల సంఖ్య, విద్యాలయాల సంఖ్య ఎంత వుండేదో, ఎవరికెరుక? భూభారం అంటే వేరిగాక మరేమిటి? అలాగే ఆనాటి బహు భార్యాత్వపు సమాజంలో, భూమి అంతా ఇలాగే మనుష్యులతో కిటకిటలాడిపోయి వుండాలి! శ్రీమహావిష్ణువు గాక

ఆభారాన్ని అణచగలవారెవరు? ఆ భూభారాన్ని అదిచే కార్యక్రమంలో భాగం గానే శ్రీకృష్ణుడు ఒక్కో అసురుని, వాడి బలగాలని సంహరించాడు. ఒక్కో దుష్టుడినీ, వాడి అనుచరులనూ సంహరించాడు. జరాసంధుడికివున్న కొన్ని వందల అక్షౌహిణీల సైన్యాన్ని సంహరించటానికి తాను పరాజితుడౌతున్నట్లు నటిస్తూ, ప్రతిసారీ ఆఅక్షౌహిణీల సైన్యాన్ని సంహరించాడు! శ్రీకృష్ణుడు అట్లా పదిహేడుమార్లు సంహరించి, భూభారం తగ్గించటమూ అటుజరాసంధుని బలం తగ్గించటం చేశాడు, జరాసంధునిలో తన ధాటికి శ్రీకృష్ణుడు నిలవలేక పోతున్నాడన్న అహంకారాన్ని తెచ్చాడు శ్రీకృష్ణుడానరికి!

ఒక్కో మహారాజు ఒక మహోన్నత ధ్యేయంతో చరించారు. చిరంజీపులైనారు. వారిలో హరిర్చంద్రుడు, శిబిచక్రవర్తి, బలిచక్రవర్తి వగైరా లున్నారు. ఒక్కొక్క రాక్షసునిలోనూ ఒక్కో బలహీనత వుంది వామన ప్రవృత్తితోబాటు బలిచక్రవర్తికి దానగుణ వ్యసనంలానే జరాసంధునికి కూడా విప్రులు (బ్రాహ్మణులు) ఏదికోరినా కాదనక ఇచ్చే ఔదార్యం వుంది అదే బలహీనతగానూ మారింది.

పాండవులు, కౌరవులచేత హింసింపబడటం, కుంతీదేవి శ్రీకృష్ణుని తన మేనల్లునిగానే గాక, భగవంతునిగా భావించి ఆత్మార్పణ చేసుకోవటం ద్రౌపది కూడా శ్రీకృష్ణుని తన అన్నగారిగానే గాక, తనను రక్షించే దైవంగా భావించి భక్తి గౌరవాలతో పూజించటం, శ్రీకృష్ణుడు పాండవులను ప్రతి కష్ట సమయంలోనూ పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ ఆదుకొని, కాపాడటం, సలహాలివ్వటం లాటి ఘట్టాలన్నీ జరిగిపోతున్నాయి. పాండవులు కురుక్షేత్ర సంగ్రామానికి సారధి శ్రీకృష్ణుడే! ధర్మరాజు చేయిస్తున్న "రాజసూయ యాగానికి" రక్షకునిగా శ్రీకృష్ణుని ఆహ్వానించారు పాండవులు కులోగా శ్రీకృష్ణుని వద్దకు ఒక విప్రుడు దూతగా వచ్చాడు. జరాసంధుడు వేలకొద్ది రాజులను కారాగృహంలో బంధించి వుంచాడనీ, జరాసంధుని నిర్జించి, తమని బంధవిముక్తులను చేయమని ఆ రాజులు శ్రీకృష్ణుని వద్దకు తనను దూతగా పంపారనీ చెబుతాడాయన! శ్రీకృష్ణుడు "ఉద్ధవునికి" పెద్దపీటవేసి సలహా అడుగుతాడు! ఆ సమయంలో "ఉద్ధవుడు" కేవలం శ్రీకృష్ణుడు, చెలికాడుగానే కాకుండా,

రాజకీయ చతురత గలిగిన మంత్రిలా సలహా చెబుతాడు. జరాసంధునికి విప్రుల కోర్కెతీర్చే బలహీనత వుందిగనుక, వెయ్యి ఏనుగుల బలం మల్ల యుద్ధ ప్రావీణ్యత ఇంకా నూరు అక్షౌహిణీల సైన్యం గలిగివున్న జరాసంధుని, యుద్ధరీతితోగాక, ఆతని బలహీనత ద్వారానే ఎదుర్కోవటం మేలనీ ధర్మరాజు రాజసూయాగ సందర్భంగా, విప్రుల వేషంలో భీమార్జునులతో కలిసి, శ్రీకృష్ణుడు జరాసంధుని వద్దకువెళ్ళి, "యుద్ధభిక్ష" వేడి ఆతనికి సమవుజ్జీ అయిన భీమునిచేత అతనిని సంహరించటం రాజనీతి అని చెబుతాడు ఉద్ధవుడు. ఉద్ధవుని ఈ సలహా శ్రీకృష్ణునికి చాలా నచ్చింది. భీమార్జునులతో విప్రవేషంలో జరాసంధుని వద్దకు వెళతాడు శ్రీకృష్ణుడు. దివ్య తేజస్సుతో క్షాత్రంతో వెలిగిపోతున్న ఆ ముగ్గురునీ చూచిన జరాసంధుడు వారు విప్రులుకారని తలుస్తూనే, సహజ బలహీనతతో వారిని వరం కోరుకొమ్మంటాడు. "యుద్ధభిక్ష" కోరుతారు వాళ్ళు. విధిప్రేరితుడైన జరాసంధుడు, వాళ్ళు ముగ్గురూ భీమార్జున శ్రీకృష్ణులుగా తెలుసుకొనికూడా తన వదాన్యత, తన బలంమీద తనకువున్న అతి ఆత్మవిశ్వాసం, అహంకారంతో, భీమునితో మల్లయుద్ధానికి అంగీకరిస్తాడు. శ్రీకృష్ణుడు భీమునికి సలహాలిస్తూ, ఎన్ని విధాలుగానూ చావని జరాసంధుని చంపటానికి ఉపాయంగా, ఒక ఆకును నడుమకుచీల్చి, రెండు ముక్కలు వ్యతిరేక దిశలలో వేయవలసిందిగా సౌంజ్ఞ చేసాడు భీమునికి: భీముడు ఆ ప్రకారమే జరాసంధుని నిలువుగా రెండు ఖండాలుగా చీల్చి ఆ ఖండాలు చెరో దిశగా పారవేస్తాడు. జరాసంధుని కొడుకైన సహదేవుడు" అనేవాడిని, జాలితలచి, మగధరాజుగా అభిషిక్తుని చేసి, జరాసంధుడు బంధించిన రాజులందరినీ చెర విడిపించి, వారి స్తోత్రం అందుకుని, వారికి ధర్మోపదేశం చేసి, సహదేవుని స్తోత్రం అందుకుని, ఇంద్రప్రస్థ పురానికి వస్తాడు శ్రీకృష్ణుడు అక్కడ రాజసూయాగ పరిసమాప్తి చేయించి, అగ్రపూజకు అర్హులెవరన్న వివాదంలో, శ్రీకృష్ణుడే పూజార్హుడని సహదేవుడు (పాండవులలోని ఆఖరువాడు) నిర్ణయించగా శిశుపాలుడు తన సహజ విష్ణుద్వేషాన్ని వెళ్ళగ్రక్కుతాడు సభలో:

శ్రీకృష్ణుడాతనిని తన సుదర్శనచక్రంతో శిరసు ఖండించి, సంహరిస్తాడు

